శ్రీగురుజ్యోతి గ్రంథమాల:— 14

# రత్నపేటిక

(అత్యద్భుతమైన డిటెక్టివ్ నవల)

శ్రీయుత,

మహరాజ గోపాలకృష్ణమూర్తి.

[illegible]



Printed by:- SRI RAMA PRINTING WORKS
BERHAMPUR.

Published by:- **Bh. N. SERMA**

Proprietor, Vegu-Jukka Series,
&
Sri Rama Press,
Pudipeddi vari Street,
**Berhampur,**
(Ganjam Dt.)

1st Edition
1932.



| వెల రు. | ఖద్దరు |
|---|---|
| 1—8—0 | కొనువారే ధరించవలెను |

 *For Copies apply to the publisher*

తోటనో గూఢముగ సంచరింపుచు, తుదకొక యుద్యానవన సమీపమునకు వచ్చెను. అచ్చటి దట్టములగు వృక్షసంఘములు, వానినల్లుకొనియున్న లతాంతములును మఱింత చీకటి జేయుటచే మనుజుని యలుకుడైనను జూచుటకెట్టివారికిని దుర్ఘటముగానుండెను. రమారమి యొకక్రోసు యావరణగల యీవనము నందొకకొలను, జుట్టును బలు తెరగుల పూపొదలు నాచీకటికి మఱింత భయంకర మొసగూర్చుచుండెను. ఈవనమెవ్వరిదో మనకింతవరకు తెలియదుగాని శరచ్చంద్రుడెఱుంగకపోలేదు. తానాపొదలమాటులనుండి సన్నని కాలిబాటగుండా పోయిపోయి యొక సౌధరాజముం జేరెను. అది కొంచెము పాతపడిన యట్లును లోన జనసంచారము లేనియట్లును జూపరకు దాని ప్రాకారభాగముం గాంచిన దోచకమానదు. అందు దీపములు లేవు కావలివాండ్రును లేరు. శరచ్చంద్రుడిపుడు దాని వెనుకభాగమున బోవుచు లోన దెఱచియున్న యొకచిన్న గవాక్షముగుండా గానవచ్చు చిన్న దీపముకడ నెవ్వరోకొన్ని యస్పష్టాలాపము లాడుచుంట విని ఆశ్చర్యమున నిలచి పరికింపసాగెను, లోననొకవ్యక్తి మినుకుమినుకులాడు దీపపుకాంతిలో నల్లని దుస్తులదాల్చి యింకొకనితో మాట్లాడుచున్నట్లాతడు గ్రహించెను ఇంతరాత్రివేళ నీయారామమధ్యమున నీపాడు మేడలో మనుజుల వాక్యోపవాక్యములాలించిన నెట్టివారికిని యనుమానము గలుగకమానదు. అందు బత్తేదారులకట్టి సందేహము కలుగకపోయిన వారెన్నటికి నాపదవికి దగనివారని నాయభిప్రాయము.

శరచ్చంద్రుడట్లు నిలువబడి వారిమాటలు వినరాకుండుటచే వారిని డాయనెంచి కాలిజోడువిడిచి చేతబట్టుకొని మెల్లగ పదములిడుచు చప్పుడుగాకుండ తుప్పలచాటునుండి కిటికీప్రక్కకు జేరెను దానితలుపొకటి మూయబడి రెండవది మాత్రమించుక తెఱువబడియుండెను. లోన స్త్రీలో పురుషులో పోల్చుకొన జాలముగాని యిరువురు జనులుమాత్రము మాట్లాడుచుండిరి. వినియు వినరాకున్న వారి మాటలకొన్ని మాత్రము శరచ్చంద్రుడీగతి వినగల్గెను.

ఒక:—"మధుసూదనా! నామాటలాలింపుము. ఇట్టికార్యములు వేలకొలది నాచేతులపై జరిపించినాడను. ఇది నాకొక లెక్కగాదు. పేరుపొందిన పత్తేదారుల కండ్లలో దుమ్ముగొట్టి కార్యమును సాగించు శక్తిగల యానందయోగి సామాన్యుడుగాడని దలంపుము."

రాజ:—చిత్తము స్వామీ! అన్నిటికిని మీపాదముల నే నాశ్రయించి యున్నాడను. ఈకార్యభారమంతయు మీభుజములపై బెట్టియున్నాడను. అతఁడు నన్ను మోసగించి యూర్మీ చుసి పోయిన దాదిగ నామనము శతభిన్నమై దహించుకొని పోవుచున్నది. కాన దానికి బ్రతికియుండునట్టు నంతదనుక నాకు నిద్రాహారములు సైతము రుచింపవు. ఈకంటకము నెట్లయిన నూడబెరికి నాప్రాణముల గాపాడుభారము తమదే.

ఒక:—ఇంత చెప్పవలయునా? మధుసూదనా! నేపట్టినంతనే యీనారాయణదాసునోట దుమ్ముబడినదని దలంపుము. నేనుసెల-నీకష్టములింతతో గట్టెక్కును. చాలారాత్రియైనది. ఇంకను చేయవలసిన కార్యమంతయు ముందేయున్నది. నేబోయెదను. నీవు మాత్రము నీకార్యముల యందప్రమత్తుడవై యుండుము. పోలీసు వారు సామాన్యులు కారు. మనల వేయికనుల గనిపెట్టుచుందురు. వారికి మనము లక్షమార్గముల ద్రిప్పిచూడవలెను. ఇట్టిరహస్యస్థలమున నింతరాత్రివేళగూడ మనల నెవ్వరో గనిపెట్టుచునేయుందురు. నీవు నీయిష్టమార్గమునబొమ్ము. నేనన్నికార్యముల జక్కజేసికొని మరల నిన్ను రేపుగలసెద బొమ్ము.

అనుచు దానా దీపమార్పివైచి మాయమయ్యెను. శరత్కుమారుడంతయు విని "వీరెవరో? వీరాలోచించు విషయమేమో? ఈ మధుసూదనుడెవడు? యీయానందయోగి యెవడాయని పరిపరి విధముల నాలోచింపుచు మెల్లగమఱలి మార్గమునకుబోవ సమకట్టి వెనుకకు మఱలుతోడనే యెవరో యాతనికంఠముపై జేయివైచి

యింతదనుక స్టేషనువకు రాలేదు. కాన నీసంగతివారెరుంగరు వారికై యింటికిగూడబోయియుంటిని వారందునను లేరు. ఎందేగినదియు నేరికిం దెలియవచ్చుటలే"దని యాతడు బదులుబలికెను.

సూప:—వారుగూడ త్వరలో రాగలరు. మీలోనిద్దరు త్వరితముగబోయి ధర్మహాట్ సర్కిలుఇన్స్పెక్టరుగారిని, డాక్టరుగారిని వెంటనే నామాటగా దీసికొనిరండు. ఇంతలోనే శరశ్చంద్రుడుగూడ రావచ్చును.

అని యిరుప్రురభటులనంపి తానును మిగిలినయిద్దరు రక్షకభటులును హత్యాప్రదేశమును బరిశీలింప నెంచి వారి వెంట జీవనాథుని గూడగొంపోయిరి. పాపము! జీవనాథుడుబడుచు లేచుచు దుఃఖోద్రేక మడచుకొనలేక జేయునది లేక వారి వెంబడినే బోయి మాలతిశయన మందిరమును బ్రవేశించెను. అచ్చటి పరిస్థితులన్నియు సూపరెంటు గారు జూచుచు నడుమనడుమ గొన్ని ప్రశ్నలడుగుచును జీవనాథుడిచ్చు జవాబుల లిఖితరూపక మొనర్చుకొనుచుండెను. మాలతీభాయి శయనమందిర మాసౌధమున రెండవ యంతస్థున నున్నది. ఆగది చక్కగనలంకరింపబడియుండెను. గదిమధ్య నొకపట్టెమంచమును దానిపై మెత్తనిపాన్పును దిండ్లునుగలవు. మాలతిశవమామంచముపై బడియుండెను. దాని యాపాదశిరఃపర్యంత మొక తెల్లనివలువచే గప్పబడియుండెను. మంచమునకొకప్రక్క గోడ కమర్పబడియున్న యినుప మందసము దెఱచియేయున్నది. దానికీవలనొక చక్కనిదంతపు వ్రాతబల్లయు రెండుకుర్చీలును, బల్లపైగొన్ని సంగీతపుస్తకములును మషీపాత్రము—లేఖినియున్నగు వ్రాతపరికరములును గలవు. సూపరెంటుగారన్నియు జూచుచు గదికీవల నొక కుర్చీలో గూర్చొని డాక్టరు మున్నగువారి రాకకెదురు జూచుచుండెను. ఇంతలో క్రిందినుండి పైకి వచ్చు మెట్లపై పదధ్వని వినబడ నాతడు వెనుదిరిగి జూచెను, డాక్టరును మదన్‌సింగు (ధర్మహాలో పోలీసుకర్మచారి) గారును వచ్చియుండిరి. సింగుగారు దొరగారికి సలామొనరించి యొకచో

నాసీనుడాయెను. డాక్టరుగారు గుమ్మముకడ నిలచి హత్యాప్రదేశమును గాంచుచుండిరి.

సూప:—శింగుగారూ! మననగరమున హత్యలు మితిమీరుచున్నవి. ఇట్టిహంతకులనందరి నొక్కసారిగ హతమార్చుకున్న శాంతి నెలకొనునట్లులేదు. రండు. హత్యాప్రదేశమును శవమును బరీక్షింతము. జీవనాధుగారూ! మీరీ సమయమున నాడుదానివలె దుఃఖించుచున్న బ్రయోజనము లేదు. మాకుగావలసిన కొన్ని సంగతుల మీరు దెలుపవలసియున్నది. ఇప్పుడభియోగమంతయు మీయుత్తరములపై నాధారపడియున్నది. మీరెఱిగించు సంగతులబట్టియే హంతకుల విషయమై యాలోచింపవలసియున్నది. గాన శోకముడిగి మాప్రశ్నములకుత్తరములిండు. అనుచునొకభటుని బిలచి శవముపై గప్పినయావస్త్రమును దొలగింప నాజ్ఞాపించిరి. భటుడట్లె వస్త్రాచ్ఛాదనము దొలగించి వైచెను. జీవనాధుడు "అయ్యో! తల్లీ!" యని గట్టిగ కేక వైచి నేలబడిపోయెను. సూపరెంటుగారు డాక్టరుగారు మున్నగు ప్రేక్షకులెల్లరు మహాశ్చర్యమున నట్లె నోటమాటలేక కొంత తడవునిలువబడిపోయిరి "ఏమీ యీయాశ్చర్యము? ఎంతటిఘోర హత్య" యను పలుకు లప్రయత్నముగ వారినోళ్ళ వెలువడెను. వారి యాశ్చర్యకారణమేమి? వారనుదినమిట్టి హత్యలెన్నిటినో గాంచుచు నభియోగముల వారిచేతులపై నడపించుచుండిరే. ఇందెక్కుడగు విచిత్రమేమున్నది?.

లేకపోలేదు. ఈహత్యమాత్రమన్నిటివలెగాక చిత్రాతిచిత్రమహాచిత్రమైయున్నది, శవమునకుశిరము లేదు. హంతకులచే శిరము గొంపోవబడెను. మొండెము మాత్రము మిగిలియుండెను. సూపరెంటుగారు గది నలువంకలగాంచి "డాక్టరుగారూ! మీరీశవమును బరీక్షకుగాను గొనిపోయి సర్వమును బూర్తిగ నిర్ధారణజేయుడు. ఈ గదికిబీగము వైచి యాబీగము శింగుగారి యాధీనమునను౦చుడు. త్వరలో శరశ్చంద్రుడుగూడ రానైయున్నాడు. తఱువాతనన్ని విషయములను

జెప్పంపవచ్చును. జీవనాథుగారు! మీరిపుడు శోకముడిగి యీ డాక్టరుగారి వెంటబోయి శవపరీక్షానంతరము దాని దహనకర్మనొనరించి రేపు యుదయముననే మీరు మాకచేరీకివచ్చి మీవాఙ్మూలమీయవలయును. ఈగదివద్దకుమాత్రమితరుల రానియ్య గూడదు. ఇచటనిద్దరు రక్షకభటులుగూడ గావలియుందురు. రేపుసర్వమును విచారింతమని చెప్పి శవమును డాక్టరుగారి యధీనముగావించి తానును సింగుగారును వెడలిపోయిరి.



3

శరచ్చంద్రునకించుక తెలివివచ్చెను. కనులువిప్పిజూచునప్పటికి తానొకగదిలో బంధింపబడియున్నట్లాతడు దెలిసికొనియెను. ఆగదికి పైనున్న యొకచిన్నకిటికీగుండా సూర్యకాంతులు లోనబ్రసరించుచుండెను. బాటలబోవు మోటారుధ్వనులు ప్రజలకలకలములు, యంత్రశాలలలోని యొకతెగనిశబ్దములుమాత్రముకొంచెమాతని చెవులబడుచుండెను కాని యపుడెంతవేళయైయుండునో దెలిసికొనజాలునంతటి మెలకువమాత్రమాతనికింకనుగలుగలేదు. ఇంతటిమైకమునదనకెట్లుగలిగెనో రాత్రిదానేయవస్థయందిటకు గొనితేబడియెనో, యాతడెఱుంగడు. రాత్రి యీగదిలో మాటలాడుచుండిన యీయిరువురు వ్యక్తులలో నొకడు మధుసూదనుడనియు రెండవవాడానందయోగి యనియు యాతని జ్ఞప్తియందుండెను. కాని వారేవిషయమై మాట్లాడికొనుచుండిరో యామూలాగ్రముగ నాతనికి దెలియలేదు. వారినీవరకెన్నడాతడెఱుంగడు. కాని వారియీస్వల్పసంభాషణమును బట్టియైనను వారెవ్వరో చోరులో లేక నరహంతకులో యైయుందురనియు గాకున్న నంతరాత్రికడ నాపాడుగృహమున వారి రహస్యాలోచనమునకు గారణములేదనియు, మాత్రమాతడుగ్రహించెను. రాత్రివారి

పల్కుల జాడంబట్టి యానందయోగియనువాడే తనకు మత్తుమం దొసంగి దెలివిదప్పించి యిట్లు బాధించియుండనోపునని నిశ్చయించు కొనియెను. కాని యాయానందయోగి యెవఁడో వానిరూపమెట్టిదో యాతఁడింతవఱకు నెఱుఁగఁడు. మైకమంతయుక్రమముగా వదలిపోయెను దాహ బాధమాత్రమెక్కుడగనుండెను. అయినను నటనుండి బయలు బడు మార్గమేమియుగానరాకుండెను. తాను రాత్రియింటికడ బయలు దేరునపుడు దెచ్చినఖడ్గగుప్తమగుదండమిపుడాతనికడ లేదు. తోడనె యాతఁడు తన వస్తువులన్నిటిని జూచుకొనియెను. తనయంగీజేబున నుం డవలసిన కొంచెము ధనమిపుడాతనికడ లేదు. అది దొంగిలింపబడెను. ఇంకొక జేబులో నేదియో దానెఱుంగని కాగితమొకటియుండెను. దానినాతఁడుదీసి విస్మయమున నందలి వ్రాతను కిటికీలోనుండి వచ్చు సన్నని వెలుగుసహాయమున నిట్లు జదువసాగెను అందిట్లున్నది.

పత్తేదారుగారికి,

తమ శ్రేయోభిలాషి వ్రాయు మనవి.

తమరింతరాత్రివేళ జీకటియనక వర్షమనక చలికిగూడ నోర్చి చెప్పులజేతబట్టుకొని మాగూఢచర్యల నవలోకింపదయచేసినందులకు మేమెంతయు కృతజ్ఞులము. ఈ రాత్రి నాయొనర్పంబూనిన కార్యము నిరాఘాటముగ కొనసాగునుగాని నీబోటి యల్పమానవులు కల్పింపబోవు యంతరాయములు దాని నాటంకపఱుప జాలవు. తరువాత నీవెంత ప్రయత్నించినను మాపోకలు గనిపెట్టజాలవు. గాని యధైర్య మొందక మము సామాన్యులుగా నెంచి జరుగనున్న మహాత్యారహస్య మును భేదించుటకై నాయంతవాఁడు లేడనుగర్వబలముచే మమ్ము బట్టుకొన బ్రయత్నింపక మానవు. ఇది నే నెఱుంగనిదిగాదు. ఇట్టి నీబోటులకై జడిసి నాకార్యముల నేవిరమించు వాఁడనని మాత్ర మూహింపవలదు. ఇంక నీసామర్థ్యమును ద్వరలో వెల్లడియగుగాక

వల వృథా బ్రయాసపడియెదవు. రేపటి దినమున గాని నీకు దెలియ రాదు. ఇంతలో మాపనులన్నియు బూర్తిగావించుకొందుము. అపుడు నీకీసంగతులు దెలిసిననేమి? దెలియకున్ననేమి? చేయిగాలినపిదప నాకుల బట్టుకొనుట.

చిత్తగించుము.

ఇట్లు

జగత్సింహుడు.

శరచ్చంద్రుడాయుత్తరమును మఱలమఱలజదివికొని "జగత్సింహుడెవ్వడు? రాత్రి యానందయోగి మధుసూదనులనేగద నేగాంచి యుంటిని. అట్లయిన నీమూడవవ్యక్తి యెచ్చటనున్నాడు? వానిజాడ నేనుగాంచుటలేదా? లేక నీయిరువురిలో నేయొక్కనికో జగత్సింహుడను నింకొక నామముగూడాయున్నదా? అట్లయిన నది యానందయోగి యేమో? లేక వారిరువురును రహస్యాలోచనసేయుచున్నపు డెవ్వరును బయలురాకుండ జూచుటకై వారుగాపునిడిన నింకొక హంతకుడావీడు? అట్లయినను గావచ్చు. వాడు నాకెఱుకలేకయే నన్ను వెంబడించి కడకు నన్నిట్లుగావించియుండవచ్చును. సరే, యెవ్వరైనను దరువాత యోచింపవచ్చును. ముందిచటినుండి తప్పించుకొని లేఖలోని సంగతుల బరీక్షింపవలెను. హత్యజేసెదనని రూఢిగ వ్రాసియున్నాడు. కానిచో నన్నిట్లు బాధించియుండడు. గడచినరాత్రి హత్యజరిగి యుండనోపును" యని యాందోళన బడుచు గదినలు వంకలను బరీక్షింపసాగెను. కాని బయటబడుమార్గము గానరాలేదు. దానికొకప్రక్క మాత్రము చిన్నద్వారముగలదు. అది పైనతాళము వేయబడియుండెను. శరచ్చంద్రుడు రెండుమూడుసార్లు తనబాహుబలమంతయు దానిపై జూపెనుగాని ప్రయోజనమేమియు లేకపోయెను. అంతతోనాతడు విసువుజెందక మఱలమఱల నాతలుపుబగులగొట్ట సాగెను. కొంతతడవునకది బీటలువారసాగెను. ఆనందమున నాతడట్లే

విడువక దానిపై కరచరణప్రహారముల బ్రయోగింపసాగెను. వాని యత్నము ఫలించినది. దైవమాతనికిదోడుచూపినాడు. తుదకాతలుపు రెండుఖండములయ్యెను. చిన్నముక్కయొకటి బగిలిక్రిందబడిపోవుటచే తలదూరునంతటి మార్గమేర్పడియెను. దానివెంబడి మెల్లగదూరి శరచ్చంద్రుడు ప్రాణములతో బయటబడియెను. అదియొకహాలు. అదిమేడపైనున్నది. దానిని దాటి యాతడు మేడదిగి క్రిందతోటలో ప్రవేశించినగాని వీధిబడడు. మేడపైనుండి క్రిందకుదిగు సోపానముల చివరద్వారమునకు బీగము వేయబడి యుండెను. విధిలేక నాతడు మరల పైకిబోవవలసివచ్చెను. కాని దైవసహాయమున్న నెంతటి దుర్ఘటకార్యమైన నవలీల జయింపవచ్చునుగదా! తోటలోని వృక్షములుగొన్ని బాగుగబెరిగి తనుశాఖల మేడపై వాల్చియున్నవి. శరచ్చంద్రుడు హాలుదాటి యీవలవరండాలోనికిరుదెంచి చెట్లకొమ్మ నొకదాని నారోహించి పదిలముగ దోటలోనికిందిగి "బ్రతుకుజీవుడా" యనుచు రాచబాటంబడియెను.

అప్పటికి సూర్యుడు నడిమింటవెలుగుచుండెను. రమారమీ పండ్రెండుగంటలు కావచ్చినది. అతనికి భోజనముపై దృష్టిలేదు. చేరువనున్న నొకయంగడిలో నింతసోడామాత్రము ద్రావి వెంటనే యాతడు కాళీఘాట్ కర్మాలయమునకు బరువెత్తెను అప్పటికచ్చట పహరానిచ్చు నిరువురు రక్షకభటులుమాత్రముండిరి. వారాతనిరాక గాంచి నమస్కరించి "బాబూ! ఉదయాన్నతమకై సూపరెంటుదొర వారు చాలాసేపు వేచియుండిరిగాని తమరెప్పటికిని రాకపోవుటచే యేదేనొకకార్యార్థమై గ్రామాంతరమేగియుంటిరేమోయని దలచిరి" అని చెప్పుచుండగనే "ఏమీ? సూపరెంటుగారా? నాకొరకై వేచి యుండిరా? విశేషములేమియు లేవుగద" యని శరచ్చంద్రుడు తొందరగా బ్రశ్నలవేయసాగెను.

రక్ష:—విశేషమునకేమి? బాబూ! మనకాళీఘటులోని రామాపవగల్లీలో జీవనాథుడను భోగము వాని యేకపుత్రికయగు

మాలతీభాయి గడచిన రాత్రి వధింపబడెను. అది చాలావిచిత్రముగా నున్నది. శవమునకు శిరము లేదు. మొండెము మాత్రము గుడ్డచే గప్పబడి యామె పడకటింటిలోనె పాన్పుపై బడియున్నది. ఉదయముననే రిపోర్టు వచ్చుటచే సూపరెంటుగారు డాక్టరుగారు ధర్మాహాట్ యిన్స్పెక్టరుగారగు మదన్‌శింగు బాబుగారును మేమైదారుగురమును వెళ్ళి హత్యాస్థలమును బరీక్షించితిమి. పిదప సూపరెంటుగారు శవమును పరీక్షార్థమై డాక్టరుగారికప్పగించి హత్యగావింపబడిన యాగదికి బీగము వేయించి యచట నిరువుర రక్షకభటుల గాపుంచి వెడలి పోయిరి. బహుశ వారు తమరాకకై నిరీక్షించుచుందురు." అని చెప్పగనే శరచ్చంద్రుని పాదమస్తకము స్వేదసిక్తమై కంపింపజొచ్చెను. అతనినోటమాటరాక గొంతవడి యేమో యోజించుకొన సాగెను. ఆతనిమొగము గగుర్పొడిచెను. ఒక్కసారిగ భయాశ్చర్య క్రోధములాతని నావరించి మొగము మొద్దువడజేసెను. ఇంక నాతడటనిలువక పహారావాండ్ర జాగ్రతగానుండుడని జెప్పి యొకబండిని మాట్లాడికొని యింటికి భోజనమునకై యరిగెను. మార్గమధ్యమున నాతని కెన్నియో యోచనలభివృద్ధినొంది మనమును గలత బెట్టసాగినవి. మధుసూదనానందయోగులెవరా? యని యాతని తొలితలంపు. కాని యతడు వారివిషయమై త్వరగా గ్రహింపజాలిన యపరబ్రహ్మయే యైనచో మనకథకింతటితో మంగళహారతి నీయవలసినదే. చేసినదే నరహత్య. అందునను దమ్ము వెంబడింపవచ్చిన యపరాధపరిశోధకాగ్రగణ్యుడని పేరొందిన దనంతవానిని—చోరనరహంతక హంతకుడని మేటిబిరుదములదాల్చిన దనంతవానిని—అసమానధైర్యశాలియని విఱ్ఱవీగు దనంతవానిని—కండ్లలో గారముగొట్టి బాధించి, దాజేయు కార్యక్రమమంతయు లేఖామూలమున ముందుగ నెఱిగించి హత్యగావించినహంత సామాన్యుడైయుండునా? అట్టివానిని బట్టుటయే ఖ్యాతి. అట్టిదుర్మదాంధుని పీచమడంచుటయే కీర్తి. కాని యతడు చులకనగ బట్టువడునా? తన కెట్టిపాట్లుగల్పింపవలెను, ఇటులింక నెన్నిపాట్లు తన్ను బాధింపవలెను.

ఇట్టిహత్యలనెన్నిటి నాచరింపవలయును. కుంచము నిండినగాని దిగుగ బడదు. పాపము పండినగాని ఫలముజేకూరదు శరచ్చంద్రునకిట్టి యోచనలచే మది గలతవెాచ్చెను. అతడిల్లుజేరి భోజనమెట్లో యైనదనిపించెను. కార్యాలోచనపరులకు నిద్రాహారములురుచింపవు గదా? తోడనే యాతడు విశ్రమించుటగూడమాని సూపరెంటెండెంటుగారి దర్శనము చేయబోయెను.



౨

కలకత్తాలో ప్రసిద్ధిగన్న రాజవీథులలో బోబజారువీథి యొకటి. ఇచట మిన్నంటు సౌధరాజములు వేలకొలది గలవు. రాజవీథికి రెండు ప్రక్కల వీధులకు బోవుసందులు, అనగా చిన్నచిన్న మార్గముల నేకములు గలవు. ఈవీథియందెల్లప్పుడు రెడ్డు టెక్కబండ్లు, మోటారుకారులు, గుర్రములు మున్నగునవి పరుగిడుచునేయుండును. ఏరాత్రివేళ జూచినను వానికి తీరికయేయుండదు. ఆనగరమున వర్తకములో సగపాలీవీథినే జరుగు చుండును. ప్రతిచోటను స్వదేశవిదేశ వర్తకుల యంగళ్ళు గనబడు చునేయుండును. అంగళ్ళనగా నితర చిన్న పట్టణములలోయున్నవాని బోలికంగాక ఆయిదారంతస్తుల మేడలలో సమర్పబడిన సర్వవస్తు నిలయములు. ఇచ్చట దొరుకని సామగ్రి సాధారణముగా నెయ్యెడ దొరుకదు. బియ్యము నుప్పు నమ్ము జిల్లరదుకాణము మొదలు వజ్ర వైడూర్యములమ్ము రత్నబజారులవరకుగూడ నిందుగలవు. అందుచే గలకత్తాబోయిన ప్రతిమనుజుడు సాధారణముగ బోబజారు జూడని వాడుండడు. దానంజేసి యీమార్గమెల్లప్పుడు ప్రేక్షకజనంబులచే గిక్కిరిసియుండును.

గోపాల్ చందుగారి భవనమీమార్గముననేయున్నది. ఈతనితండ్రి బొంబాయినగరమున బుట్టిపెరిగి కొంతకాలముందే జీవనముజేసి, యచట

తుండెను,

ఆనాఁడు గోపాలచంద్రుఁడు వీడియంగడిలో నినుపబెట్టెకడ కూర్చొనియేమో లెక్కలసరిజూచుకొనుచుండెను. నారాయణచంద్రుఁడు తండ్రికించుక దూరమున ద్వారముకడ గూర్చొని రాజవీధిని దృష్టి నిలిపి యేమో యోజించుచుండెను. అప్పుడొక బాలుఁడు రమారమి పండ్రెండేండ్లవాఁడొకఁడరుదెంచి వీధనిలచి నారాయణచంద్రుని గాంచుచుండెను. కొంతసేపటికి నారాయణచంద్రుఁడాతనిపై దనదృష్టుల నిగుడించి తనకు బూర్వపరిచితుఁడగుటచే గాఁబోలు, వెంటనే తండ్రికడ నిప్పుడేవచ్చెదనని సెలవుగైకొని యాబాలునికడకేగి యాతనివెంట నిడికొని రాజమార్గమున బోవుచు మార్గమున నాబాలుని "యేల వచ్చితివి? ఏమి విశేషము"లని యడిగెను. తోడనే యాతఁడు "బాబూ! జీవనాథుగారు తమకీలేఖనిచ్చి తమ్ము వెంటనే గొనితెర నన్ను బంపి" రనుచు దనకంచుకాంతరమునుండి దీసి యాతనికొక లేఖనందిచ్చెను. చంద్రుఁడు దానినివిప్పి చేరువనున్న యొకయంగడి యరుగుపై గూర్చొని యిట్లు జదువుకొనెను.

కాళీ ఘాట్.

నారాయణచంద్రుగారికి, జీవనాథుఁడు వ్రాయునది

అయ్యా! గడచినరేయి తమరు నన్నువీడి వెడలినపిమ్మట నెవ్వరో హంతకులు వచ్చి, నాయేకపుత్రిక—నాజీవనసర్వస్వము—నాప్రాణమునకు బ్రాణమగు మాలతిని హత్యగావించి యామెశిరమును ఖండించి గొంపోయిరి. ఆమెదాసియగు శ్యామలగూడ నింతవరకు గానవచ్చుటలేదు. నేఁడుదయమున బోలీసువారు హత్యాప్రదేశమును జూచి శవమును బరీక్షించుటకై వైద్యాలయమునకు గొంపోయిరి. నేనుగూడ నచ్చటికే బోవుచున్నాను. తమరీయుత్తరముజూచిన తోడనే యీబాలునివెంటనే రెండువందలరూకలు బట్టుకొని నన్ను వైద్యాలయముకడఁగలిసికొన బ్రార్థింతును. తరువాతసర్వమును విశదముగా ముఖతముగ నెఱుకపరచెదను. జరుగుడు.

చిత్తగించవలెను.

జీవనాథుఁడు,

ఈయుత్తరముఁజూచినతోడనే చంద్రునకు గనులనీరు గాలువగా జొచ్చెను. నోటమాటరాకుండెను. మాటిమాటికతడు వేడినిట్టూర్పుల విడచుచుండెను. కొంతవడికాతడు స్మృతిదప్పి గోడకుజేరబడియుండెను. అప్పటియాతని హృదయపరివేదన నక్షరరూపమున నెఱిగించుట దుస్తరము. అదిపరమేశ్వరునకే యెఱుక. తఱువాత నాతడెట్లో దెలివొంది యాకాలునందే నిలువ నియమించి దానింటికేగి కొలది కాలముననే దిరిగివచ్చి కాలునిగలసి వైద్యాలయమునకు బయనమై పోయెను



౫

శరశ్చంద్రుడట్లు బయలుదేరి సూపరెంటుగారి యింటికిబోవుచుండగా మఱలి డాక్టరుగారు శవపరీక్షబూర్తిగావింపక మునుపే దానిని బరీక్షింపగోరి తోడనేయొకబండి గుదుర్చుకొని వైద్యాలయముఖముగబోయెను. ఆతడందేగునప్పటికి డాక్టరుగారు శవమునుబరీక్షింప నుద్యుక్తులైయుండిరి. హత్యసమాచారమప్పుడేయూరంతయు గ్రమ్ముకొనుటచే ప్రేక్షకులు వేనవేలాబాలగోపాలము నువచ్చి వైద్యశాలం గిక్కిరిసియుండిరి. పోలీసులెంత బ్రయత్నించినను వారి కోలాహలమణపజాలకుండిరి. శరశ్చంద్రుడు వడివడి లోనబ్రవేశింపగనే డాక్టరాతని సన్మానించి జరిగిన యుదంతమామూలాగ్రముగ నెఱిగించి శవమును జూడవలయుననికోరెను. శరశ్చంద్రుడు శవమునొద్దకేగి బాగుగబరీక్షించి "యీశవమునకుయజమానులెవ్వరైననిందుండిరా?" యని ప్రశ్నించెను, డాక్టరుగారాంగ్లభాషలో జనిపోయినయామె జనకుడున్నట్లెఱిగించెను. "సరే! అట్లయిన నింక నేనీశవముజూడ నగత్యములేదు. ఇంక నాయజమానితోగొంత ప్రసంగింపవలసియున్న దాతనినిటకొకపరిరప్పింపు"డనిన తోడనే భటుడొకడు తదాజ్ఞను

సారముగ శోకాపరావశారుడగు జీవనాథుని లోనబ్రవేశబెట్టెను. శరశ్చంద్రుడాతని యాకారమును గొంతవడిగాంచి యొకచోఁ గూర్చొను మనిజెప్పి యిట్లడుగసాగెను. "అయ్యా మరణించినయామె మీకేమగును?"

జీవనాథున కాప్రశ్న భీషణశస్త్రపాతమువలె హృదయ విదారణము గావింపజొచ్చెనుగాబోలు. అతనికన్నులు ఉబికిపోవుచుండెను. బాష్పజలంబులు కాలువలై గండస్థలములదాటి యాతని వస్త్రముల సైతముదడిపి ముద్దజేయుచుండెను. అతనినోట మాటరాకుండెను. తుదకెట్లో నోరుదెరచి యాతడు "ఆమె నా—నా యేకపుత్రిక. నా ప్రాణపదమగు నేకపుత్రిక" యనుచు నాతడు జూచువారగుండెలవియు నట్లు క్రూరుల హృదయపాషాణములు సైతము గరుగునట్లు గోలున నేడ్వసాగెను. దగ్గరనున్న వారెల్ల నాతని నూఱడించినను యాతడా దుఃఖమును దిగమ్రింగజాలకుండెను. పాపమాతడేమి చేయగలడు? లోకమున జనుల పుత్రపుత్రికాశోకముకన్న నెక్కుడగు కష్టమింకెద్ది గలదు?

శరశ్చంద్రుడాతనిగాంచి "అయ్యా! మీరిట్లు దుఃఖించుచుండుట వలన లాభమేమియును లేదు. జరిగినసంగతులకై విచారింప నిది యదనుగాదు. ఇక ముందు జరుగవలయు కార్యక్రమమాలోచింప వలయును. గాన మీరిట్లు దురపిల్లుటవలన లాభమేమి? మేమడుగు ప్రశ్నలకెల్ల మీరలు సావధానముగ బదులీయవలసియున్నది. శాంతింపు"డన నెట్టకేలకు జీవనాథుడించుక ధైర్యమూని యచటనే గోడకుజేరబడి "అయ్యా! తమరడుగదలంచినదెల్లను మాయింటికి దయజేసి హత్యారంగమును స్వయముగ బరీక్షించినపిదప తమకు వలయుసంగతులనెల్లను విశదముగ దెలియబరతును. ఇప్పుడు నా మనమించుకయు స్థిమితముగ లేదు. గాన గరుణించి యీశవమును దహనమొనర్చినపిదప......అయ్యో! పాపపుజన్మమా! నాచేతులతోనే స్వయముగ గన్నకూతుందహించుటయా! "అని పెద్దపెట్టున రోదనమొనర్చుచు నాతడు నేలబడి పోయెను.

డాక్టరుగారు శవమును బరీక్షించుచునే యుండిరి. వారు కావలసిన భాగములన్నియు గోసి జూచి యేమో వ్రాసికొని శవమును దహనమొనర్పవచ్చునని యుత్తరువొసంగిరి. అంత నా శవమును బయటికిఁదెచ్చి జీవనాథుని పరముగావించి "యింక నీవు దీనికగ్ని సంస్కారము గావింపవచ్చునని జెప్పి రక్షకభటులు వెడలిరి. శరచ్చంద్రుఁడుగూడ డాక్టరుగారివద్ద శలవుగొని లోలోన నేమియో యాలోచించుకొనుచు బయట నిలువబడియెను. జీవనాథుఁడేడ్చుచు శవమును బట్టుకొని బోసాగెను. నారాయణచంద్రుఁడుగూడ గంటదడివెట్టుచు లోకులకు దన దుఃఖమొలుకపడకుండ నెట్లో ప్రయత్నముమీఁద డాచికొనుచు శవము ననుసరించి పోవుచుండెను. శరచ్చంద్రుఁడాతనిపై గూడ దృష్టి సారించి యాతని మనోవైకల్యమును గనిపెట్టి "ఈతఁడెవ్వఁడు? యీతనికి నీ చనిపోయిన వారాంగనకును సంబంధమెట్టిది? ఇతని కింత దుఃఖోద్రేకమేల?" మున్నగుప్రశ్నలవైచికొనుచు దనకుదానే సమాధానము జెప్పుకొనుచుండెను. శవముగొంపోబడెను. శరచ్చంద్రుఁడు జీవనాథునియింటికడ హత్యాప్రదేశమున రక్షకభటులుగాపుండుట దలంపునకు రాఁగా నారంగమును జూడఁగోరి యటకు వెడలిపోయెను.



౬

ఆతఁడట్లు జీవనాథుని గృహమునకేఁగి యటగావలియున్న భటునొకనిచే గదితాళము దెప్పించి తలుపుదెరచి లోనబరీక్షింప మొదలిడెను. గదిలో నమర్పబడియున్న మంచముకడకేఁగి యందలి పాన్పును సావధానముగ బరీక్షింపసాగెను. దానిపై రుధిరమందందు గాలువలు గట్టినట్లును జిమ్మినట్లును గానవచ్చుచుండెను. పాన్పుపై బరచియున్న తెల్లని దుప్పటమందందు రక్తవర్ణమయమైయుండెను. అందున్న దిండ్లు రెంటిపై దెగి రక్తపావితములైన కేశఖండములందందు గానబడుచుం

డెను. శరశ్చంద్రుఁడా ఖండములఁ గొన్నిటిదీసి జాగ్రత్తగా బరీక్షించి వాని దన జేబున బొట్లముగట్టియుంచుకొనియెను. తరువాత నాపాన్పు నించుక దొలగించి దానిక్రింద నేట్లున్నదోజూడసాగెను. తల కడ మంచముపై నొక లేఖగానవచ్చెను. అది తలయొత్తిడిచే నలిఁ నలిగి చాలకాలమునాటిదిలాగు గానవచ్చుచుండెను. శరశ్చంద్రుఁడు దానిం గూడ గైకొని యందేమివ్రాసియున్నదో యని కుతూహలమున బరీక్షింపన దిగతించిన యావారకాంతకెవ్వఁడో విటుఁడు వ్రాసినదిగా జూపట్టుటచే దనపనికది సాయపడిన బడవచ్చు నని దలంచి జేబున నిడికొని యెప్పటియట్ల బాన్పును వాల్చి గది నంతయు బరీక్షింపసాగెను.

ఆగదికొకవైపున మాత్రమే ద్వారమును దానికెదురుగ రెండవగోడకొక కిటికీయును గలవు. దానిలో నొకమంచమును, రెండుకుర్చీలును, దంతపుమేజా యొకటియు దానిపై గొన్నిసంగీత బుస్తకములును గలవనియీవరకే జెప్పియుంటిమి. శరశ్చంద్రుఁడు వాని నన్నిటిని గూడ సవిమర్శకరముగ బరీక్షింపుచు, నడుమనడుమ నేమో యాలోచింపుచు, మఱలమఱల బరీక్షకు గడంగుచుండెను. అచ్చట మేజాపైగల సంగీతపొత్తముల బుటల దిరుగవైచిజూడ నొక పత్రమున మోహన్ మాలతీభాయి—రంగూన్—యనియు నింకొక పొత్తమునదొలిపుటను మధుసూధనభగవాన్—రంగూన్ యనియును లిఖింపబడియున్నవి. వానిని గనుజాగ్రతగా జూచి శరశ్చంద్రుఁడేమో యాలోచింపుచు బరధ్యానమనస్కుఁడయ్యెను. అట్లే కొంతదనుక నిలచి మఱల నాగదిగోడలను యింకను మంచముక్రిందను మఱల మఱల బరపునుజూచిన దానినే జూచుచు, దిరుగవైచిన దానినే దిరుగవైచుచుబిచ్చివానివలె నాగదిలోదిరుగాడుచుండెను. ద్వారము కడ నిరువురు రక్షకభటులుమాత్రమట్లే నిలచియుండిరి.

ఈలోన దహనకాండముగించి యాస్థలమున నెవ్వరినో గాపు నిచి జీవనాథుఁడును, యాతనివెనుకనే తీవ్రదుఃఖమును దిగమ్రింగుచు

సానుకంపవచనముల జీవనాథుని ధైర్యముగొల్పుచు నారాయణచం
దును, యిరుగుపొరుగువారలిరవురునుగలసి యటకేతెంచిరి. శరశ్చం
ద్రుడేమో యాలోచించుకొనుచు కరపద్మమున శిరంబువ్రాల్చి
మౌనముద్రాంకితుడై ధ్యానతత్పరుడగు యోగి చందాన నీవలనొక
కుర్చీలో జేరగిలబడెను. జీవనాథుడేడ్చుచు, నబలవోలె శిరము
మోదుకొనుచు నట్లే వీధియరుగుపై బడిపోయెను. తోడవచ్చువారాతని
లేవదీసి ధైర్యముగొల్పుచు వేదాంతవాక్యముల జీవితసారమంతయు
బోధింపుచు లోనబ్రవేశపెట్టిరి. ఆగృహము, నాయుద్యానవనము,
మాలతీకరపరిపోషితపుష్పలతానికరములు, వేయేల దేనింగాంచినను
జీవనాథుని నయనములకివియెల్లను బెనుభూతములగతి గానవచ్చు
చుండెను. అతడు పాషాణములు బగులునట్లేడ్చుచుండెను. ఏమో
పిచ్చివానివలె తారలలెక్కించుచున్న శరశ్చంద్రునకీకలకలము భం
గకారణమగుటచే నాతడు భటునొకనిబిలచి "అదిగో! జీవనాథుడు
వచ్చినట్లున్నది. నీవుబోయి వాని నిచ్చటకు గొనితె"మ్మని బంపెను.
ఆతడుబోయి తోడనే జీవనాథునితో నిందుబ్రవేశించెను. పాపము!
జీవనాథునకిపుడు దనయేకపుత్రిక మరణించిన శయ్యకెదురుగ నిలచి
యుండుటచే లోని శోకరసమంతయు దరంగములై పైకి వెల్లివిరియ
జొచ్చెను. ప్రక్కవారలేవో శాంతవచనముల యథావిధిగ నాతని
నూరడించుచుండిరి. శరశ్చంద్రుడుగూడ నాతనినోదార్చి "అయ్యా!
కడచినదానికై వగలబొగులుచు నబలగతి నురపిల్లుట పురుషలక్షణ
ముగాదు. ఇట్టిపట్టులనే ధైర్యమవలంబింపవలయునుక్షమించి నేనడుగు
వానికెల్లను సరియైన జబాబులీయవలసియుండును. మీరు జెప్పు
యుత్తరములపైననే నీయభియోగమంతయు నాధారపడియుండును.
ఇట్టితరుణమున మీవిచారముల బారద్రోలి స్వస్థతవహింపుడు"
యని బలుక నట్టకేలకు జీవనాథుడించుక శాంతినొంది "బాబూ!
తమరధికారులు. తమరుశెలవిచ్చినట్లు జరుగవలసినదేదో జరిగి
పోయినది. మీరేమియడుగదలచితిరో యడుగవచ్చును. నేనెఱింగి

నాతవఱకు సర్వము నివేదించుకొందును" యని హీనస్వరంబున బలికెను.

శర:—సరే! మీదేయూరు?

జీవ:—అయ్యా! నాది దేయూరు. యీగృహమునాస్వంతము. ఈపట్టణమున నిప్పటికి సుమారెనిమిది, పది, మాసములనుండియు జీవించుచుంటిమి, కాన నిప్పటికిదేయూరని జెప్పుకొనవలసివచ్చినది. ఇంకెందును నాకెట్టి సంపదయును లేదు.

శర:—అయిన నంతకుబూర్వమే యూరనుండెడి వాడవు.

జీవ:—రంగూన్ నంను.

శర:—మీదే కులము.

జీవ:—మేము కళావంతులము.

శర:—ఇపుడు చనిపోయిన యామె నీకేమికావలయును?

జీవ:—అయ్యో! అంతమాత్రమెరుంగరా? బాబూ ఆమెయే నాయేకపుత్రిక. నాభాగ్యదేవత యంతరించిపోయినదికదా? నాకల్ప వృక్షముగాలిపోయెగదా?

శర:—అదిగో—సుఖిల నీవజ్ఞానమున బడిపోవుచున్నావు. ఇక్లేమ్పుచున్న నెట్లు? కథ యంతయు ముందున్నది. ఆమె వయస్సెంత?

జీవ:—క్షమింపుము బాబయ్యా! దుఃఖోద్రేకము బట్టజాలక బోతిని. ఆమెకిపుడు యిరువదిరెండు వత్సరములు.

శర:—మీకు బుత్రిసంతానము లేదా?

జీవ:—లేదు—లేదు నాకింకెవ్వరును లేరు. ఇంకనా పరమేశ్వరుడుదక్క నీజగమున నాకు నా యను వారెవ్వరును లేరుతండ్రి!

శర:—మీభార్యయో?

జీవ:— అయ్యో! నాభార్య నేటికెనిమిదేండ్ల క్రిందటనే గతించినది.

శర:—మీవృత్తియేమి? అనగా మీజీవనమేగతి జేయు

చుంటిరని నా భావము.

జీవ:—అయ్యా! మాకు బూర్వము పెద్దలార్జించిన యాస్తి కొంత యున్నది. దానిచేతను కొంచెము సంగీతవిద్య చేతను జీవించుచుంటిమి.

శర:—మీ అమ్మాయికి వివాహమైనదా?

జీవ:—(ఆలోచించి తల పంకించుచు) లేదు.

శర:—మఱి యేమి జేసితిరి?

జీవ:—మేము కళావంతులమగుట చేతను దగినవరుడు లభింపక బోవుట చేతను మాకులాచారమునే నడుపుకొనుచుంటిమి.

శర:—అనగా?

జీవ:— పెండ్లి మాత్రము లేక గర్హాలగు నెవ్వరినో యొకరిని నమ్మి యుండుటయే

శర:—సరే తెలిసినది. నీయూరు వచ్చినపిదప నిట నెవ్వరి పాలైన జిక్కినదా?

జీవ:—ఊ—చిత్తము...ఏదోనండి.

శర:—వా రెవ్వరో నే నెఱుంగ వచ్చునా?

శరశ్చంద్రుఁడీ ప్రశ్న నైచుసరికేలనో నారాయణచందు తన ముఖ మవ్వలివంకకు ద్రిప్పుకొనియెను. అధికారులముందు దన చరిత్రమింక బయలుపడునని యాతడు లజ్జితుడయ్యెగాబోలు. కాని జీవనాధుడాప్రశ్న కెట్టి యుత్తరమీయక దలవాల్చి యూరకుండెను. శరశ్చంద్రుడాతని యోచన నెఱింగి "సరిలెండు. మీకభ్యంతరమున్నచో జెప్పనక్కఱ లేదు. అది మనకంతయావశ్యక విషయముగూడ గాదు లెండు. నిన్న రాత్రి యీయింట నెవ్వ రెవ్వరు ద్రించియుండిరో జెప్పగలరా? "యని యడిగెను.

జీవ:—నేనును నాసేవకుడు రామోజీయును క్రిందియంతస్తున నిద్రించియున్నాము పైన నీవసారాలో మామాలతి సేవకురాలగు శ్యామలయు నీగదిలో మాలతియు నిద్రించియుండిరి.

శర:—ఇతరు లెవ్వరును లేరా?

ఏలకో జీవనాథుడీ ప్రశ్నమునకుగూడ బదులొసంగక తల వాల్చి మిన్నకుండెను. అదిగాంచి శరశ్చంద్రుడాతడేలనో సందేహించుచున్నాడని గనిపెట్టి యొక్కచిఱునవ్వుమాత్రమునవ్వి మాలతి గదిలో నామె ప్రియుడు గూడనున్నాడని యెఱింగిగాబోలు దల పంకించి కొంతవడి యూరకుండెను. పిదపనాతడు "అయ్యా! ఒక్క సంగతి—మీయమ్మాయి జుట్టుగాని నెఱసియున్నదా" యని ప్రశ్నించి యాంతడేమి జెప్పునో యని యతని ముఖముననే దృష్టినిలిపి యుండెను.

జీవ:— అయ్యో! రామ! రామ! పసికూనబాబూ! ఒక చెంపనుగొట్టిన బాలునొక చెంపగొట్టిన నీరుగారు బాల. దానిజుట్టెట్టి దవ్వరగ నెఱయునెట్లు? యనుచు గంటదడివెట్టుకొనియెను.

శరశ్చంద్రుని ముఖమేలనో వికసించెను. సన్నని యాతని మీసముల క్రింద నధరముపై చిన్న నగవుగూడ గానవచ్చినది: తోడనేయది విద్యుల్లతవోలె మేఘగంభీర సదృశమైన యాతని భీకరాకారమున విలీనమైపోయినది. ఆతడింక నేమియు బలుకలేదు. కొంతతడవేమో యాలోచించుకొని "సరియే! ఇపుడడుగవలసిన యావశ్యక విషయము లింకేమియును లేవు" యని వెడలిపోవుచు మఱల నేలకోదిరిగివచ్చి "అయ్యా! యొక్కవిషయమడుగమరచితిని. మీ శ్యామలకు వయస్సెంత?"యని ప్రశ్నింప జీవనాథుడు "రమా రమి ముప్పదియైయుండునను కొందు" ననియెను. శరశ్చంద్రుడు వెడలిపోయెను.

౭

ప్రాణేశ్వరా! తమరిట్లు దినదినమును నిద్రాహారములుమాని, వ్యాయామమును విడచి కృశించిపోవుటకు గల కారణము నాతో

గొంచెమైనను జెప్పరాదా? తమ శరీరస్థితి గనుగొనుటకు గూడ నాకు సాధ్యము లేదా? మీరెంత నిరాకరించినను, నాపై మీకెంత యసూయతగలిగినను యెన్నటికైనను నేను మీపదదాసినేగద? అట్టియెడ మీరన్యథాభావింపవలదు. అయ్యో! మీరిట్లు మంచము బట్టి యనుదినమును గృశింపుచుండ మిమ్ముజూచుచు నాప్రాణము లెట్లోర్వగల్గు? మిమ్ము విడచి నాకెట్లాహారము నోట బోవును? నాచేతులకు మీకాగ్రహము గల్గినను, నన్ను మీరెంత హేయముగ జూచినను సరే, నేను మాత్రము మీపాదపద్మములవిడచియుండనిమేష మైనను మేన ప్రాణముల నిలుపజాలను. మీశరీరమున గల వ్యాధి యెట్టిదో, మీరుపడు వేదన యెట్టిదో యీదీనురాలికెఱిగింప రాదా? ఎంతటి యప్రియురాలనైనను నేను మీసహధర్మచారిణిని గానా? మిమ్మే నాబహిఃప్రాణముగ జూచికొనుచు నాదినములవెళ్ళ బుచ్చుచుంట మీరెఱుంగరా? అట్టినావద్ద నీదాపరికమేల? నాపై నింత యాగ్రహమేల? మీవ్యాధితోబాటి నామనోవ్యాధిగూడ నేల వృద్ధిజేసెదరు? మీపాదములకిదే నమస్కారము. కరుణదలచి నన్నాద రింపుడు. నామొరలాలింపుడు. నన్ను మన్నింపుడు" అనుచు దుర్గాభాయి ప్రాణేశ్వరుని పాదకమలములపైబడి బాలసూర్యోదయంబున హిమాం బువలగూడియు పద్మినికైవడి సహజసౌందర్య నిలయంబులగు నామె నయనపంకజములనుండి కన్నీటిబొట్టులు గాలువలుగట్టి నునుచెక్కు టద్దముల జాలువార, నాథునిపాదకమల యుగళము దడిపివైచు చుండెను. ఆమె ముఖమెఱ్ఱవడియెను. కనులగాటుకయంతయు గరిగి స్నిగ్ధపరిభాభాసురంబులగు నామె కపోలయుగళంబున కొంతవింత చెలువమును గల్పించెను. పాపమామె పైటచెఱంగున నొకచేతఁగన్నీటి ధారలదుడిచికొనుచు, రెండవచేత ప్రియుని పాదముల గట్టిగనదిమి వక్షమున జేర్చుకొనుచు, మృగీలోచనంబుల నాతని ముఖాంబుజ బము లీక్షింపుచు, రవిరశ్మిచే బెల్లుడికిన సముద్రమువలె పొంగిపొరలి వచ్చు దుఃఖములోన నాపుకొనుచు "ప్రాణేశ్వరా! ఇంకనైన నెల

వీయరా?"యని దీనముగ బలుకునపుడు భీతహారిణోక్తి యనునామము సార్థకపరచుచుండెను.

దుర్గాభాయి నారాయణచంద్రు భార్య. పాపము! నారాయణ చంద్రిపుడు వ్యాధిగ్రస్తుడై మేడపై రెండవయంతస్తున నొక గదిలో మంచముపై బండియుండెను. అతనిపాదములకడ దుర్గ విచారగ్రస్తయై కూర్చొనియుండెను. పాపమామెయుసిన చంద్రునకేలనో యసూయతో ఆమె యెల్లపుడును వ్యాధిగ్రస్త. బలహీనురాలు. ఆకారణముల చేతను, సహజముగ దాను దుస్సహవాసముచే జాఱుపడకుటచేతను, చంద్రునకామె పొందనిన రోత. ఇంతవరకాతడు దనసౌఖ్యపాత్రమును మాలతీభాయి మోహావార్ధిపైనిడి విచ్చలవిడిగ విహరించెనుగాని కొలది దినముల క్రిందటనే యామహాసముద్రము ప్రళయకాలాభీల మహాగ్నిజ్వాలలనింకిపోయెను. అతనికి మనోవ్యాధి యంకురించినది. ప్రియురాలి యకాలమరణమునకు దుఃఖింపని వారెవ్వరు? కాని యాతని యాదుఃఖమంతయు దుదకు వ్యాధిపరిణమించినది. ఇపుడా వ్యాధియాతని మంచమెక్కునంతటి యవస్థకుగూడ దెచ్చినది. భర్తకు దనపై నెంతయసూయతయున్నను, దుర్గాభాయిమాత్రము పతినే దైవసమానునిగాజూచికొనుచునారాధించుచుండెను. ఇపుడామెయెన్ని గతుల ప్రశ్నించుచున్నను భర్త పలుకుటలేదు. సరిగదాతనముఖావలోకనమైనను జేయుటలేదు. పెడమొగముబెట్టుకొని పండుకొనెను. అతడు దన్నెంత నీచముగజూచుచున్నను, దన్నెంత శత్రువుగ దలంచుచుండినను దుర్గమాత్రమాతని సేవలయందెట్టి లోపమును జేయుచుండుటలేదు. ఆమె కవోష్ణభాష్పబిందువులొకటిరెండాతని పాదములపై నులివెచ్చగ బడియెను. ఆతనిశరీరము పులకరించెను. తోడనే యాతడామెవంకదిరిగి "ఏడ్చుచుంటివా?" యని యడిగెను.

దుర్గశోకాశ్రువులు క్షణములో నానందాశ్రువులుగ మారిపోయెను ఆమెయిపుడు శోకమో యానందమో దేని ననుభవించుచుండెనో దెలిసిజాలకపోయెను. పతినేడు దన్ను సాదరముగ బరా

మున్నలనుచుండెను. ఒకసినోట వెలువడిన యాకుశల ప్రశ్నయొక్కటియే యామెకిప్పుడు వెలలేని రత్నాల మూటయయ్యెను. ఆమె మహానంద సాగరమున నీదులాడఁజొచ్చెను.

దుర్గ:— ఏడ్చుచుంటివా? యని యడుగుచుంటిరా? ఏడ్పు గాకున్న నిప్పుడు నవ్వువచ్చునా? మీరెట్టియాతన ననుభవించుచున్నారో తెలుపకున్న నాకేడ్పు వచ్చుచున్నది. దయయుంచియు తమార్తిని జెప్పరాదా?

నారా:— ఇప్పుడు నాకెట్టి బాధయును లేదు. నీవు పొమ్ము.

దుర్గ:— ఎక్కడికిఁ బోవుట? మిమ్ము విడిచిబోవుటకు నాకింకెందు దాపగలదు. నేను మీపాదములకడనే యుండెదను.

నారా:— సరే అయిన నట్లేయుండవచ్చును.

దుర్గ:— అంతేకన్న నాకు గావలసినదేమున్నది? మీశరీరస్థితి యెట్లున్నదో చెప్పరా?

నారా:— (విసుగుతో) చెప్పలేదా? ఇప్పుడేమియును లేదని.

దుర్గ:— ఏమియును లేకున్న ననుదిన మీరు క్షీణించుపోవుట యేమి? ఇట్లు మంచముబట్టి పోవుట యేమి? ఇదంతయు నాకర్మమా?

నారా:— నీకర్మముగాదు. నాగ్రహచార ఫలమిది.

దుర్గ:— అయ్యో! అట్లలబలికెదరు. మీరు నిజముగ దేని చేతనో బాధపడుచుంటిరట నిశ్చయము. నాకడనేల దాచెదరు? మీరు జెప్పకున్నను మీశరీరమే చెప్పుచుండుట లేదా? ఎంత భయంకరాకారము వచ్చినది? ఎంతలో నెంత మార్పు సంఘటిల్లినది? ఆ బాధ యేమో జెప్పరాదా? ఎంతకాలమిందాపరికము. ప్రతివ్యాధికిని మందులుగలవుగదా? ఏదేని యౌషధసేవ జేయకున్న వ్యాధి కుదురుట యెట్లు!

నారా:— మందులు లేకపోలేదు. ఉన్నవిగాని యీమనో వ్యాధికి మాత్రము మందు లేదు.

దుర్గ:— అట్లయిన మీరు మనోవ్యాధిచే బాధపడుచుంటిరా? మీకిట్టి మనోవ్యాధి గల్గునంతటి కారణమేమి వచ్చినది?

నారా:—నేనట్లంటినా? అయినపొరపాటు. అన్నివ్యాధులకును మందులుగలవుగానిమనోవ్యాధికిమాత్రము మందులేదని నాయూహ. అంతేగాని నేనుమనోవ్యాధిచే బాధనొందుచుంటినని కాదు. నాకిపుడే రోగమును లేదు.

దుర్గ:—మీరట్లన్నను నేనుగూడ యోజించునది మీకు మనోవ్యాధి యేమో యని.

నారా:—నీయోచనలతో ప్రయోజనమేమి? నాశరీర స్థితి నీకన్న నేను బాగుగ నెఱుంగుదును.

దుర్గ:—అట్లయిన నా యోచనలతో మీకు పనిలేదు? కష్ట సుఖముల మీకు నేను సహభాగినినిగానా? నాకంతమాత్రము స్వేచ్ఛ నొసంగఁజాలరారా?

నారా:—అబ్బా! నాకాయాసముగనున్నది. ఇంకనన్ను మాట్లాడించకుము.

దుర్గ:—మీకు గావలసినయుపచారములెల్ల జేయుటకు నేను సిద్ధముగానున్నాను. ఏవ్యాధియు లేకున్న నాయాసమేల కలుగును.

నారా:—ఏమియు లేదని యెన్నిసార్లు జెప్పవలయును?

దుర్గ:—మీచిత్తము. మీరు సౌఖ్యముగానుండుట నాకోర్కె.

నారా:—సరే.

దుర్గ:—పోనిండు—మీమనమున నేకోర్కె యున్నదో జెప్పరా?

నారా:—నాకెట్టి కోర్కెలును లేవు. నేను గర్భవతినిగాను.

దుర్గ:—నవ్వుచు "అబ్బా! మీరెట్టి చమత్కార పురుషులండీ? మగవారు గర్భిణులెట్లగుదురో దెలియకున్నది. అది మీకడ నేర్చుకొనవలయును. పోనిండు దానికేమిగాని సాధారణముగ మనోవ్యాధి యేకోర్కెయు, నెట్టిచింతలు లేక బుట్టునుగదా?"

నారా:—అవునుగాని నాకు మనోవ్యాధియని యెవ్వరను చున్నారు?

దుర్గ:—నేననుకొనుచున్నాను.

నారా:—ఎట్లు?

దుర్గ:—మీ నడవడినిబట్టి. మీ మాటలనుబట్టి. మీరొందు శ్రమనుబట్టి. నిద్రాహారములు లేక దినదినమును గృశించుటబట్టి.

నారాయణచంద్రేమియు బలుకక యొక్క నిట్టూర్పుమాత్రము పెదవులు కంపించునట్లు విడచెను. దుర్గ "అదేమో నాతో జెప్పరాదా?" యని మఱల బ్రశ్నించెను.

నారా:—ఇంకేమి చెప్పెను కొలదిదినములలో నేనుకులాసాగా నుండగలను. నాకే వ్యాధియును లేదు.

దుర్గ:—పరమేశ్వరు కృపవలన నట్లే లేకుండుగాక.

ఇంతలో గోడపైనున్న గడియారము "టంగు, టంగు"న బది గంటలగొట్టెను. క్రిందపండుకొనియున్న గోపాల్ చందు మేలుకొని మెట్లపైనుండి పైకరుదెంచి "అమ్మా! దుర్గా! పదికొట్టినట్లున్నది. అబ్బాయికి మందునీయవలయును. ఇప్పుడొక మోతాదునీయవలసినదని వైద్యుడు జెప్పియున్నాడు. అబ్బాయి మేలుకొనియున్నాడా?" యని ప్రశ్నించి తిరిగి తన శయ్యకేగెను. దుర్గ "మేల్కొనియే యున్నా"రని ఆతనికి బదులుజెప్పుచు బల్లపైనున్న సీసాలోనిమందు కాచపాత్రిలోబోసి భర్తకందిచ్చెను. నారాయణచందు "ఇగో వాతము ఉదరశస్త్రము. బాగు, బాగు. అయ్యో! నాకేమందులెందుకు, రామ; రామ!" యనుచు నేమో గొణుగుకొనుచు నెట్లో దానిని నోటబోసికొనెను. క్రిందనుండియే వృద్ధగోపాల్ చందు "అమ్మా! దుర్గా! జాగ్రితగా బండుకొనుము. దీపముజాగ్రత"యని కేకవైచెను.



౮

మఱునాఁడుదయముననే శరశ్చంద్రు డగాధమగు నీకేసును గూర్చి యాలోచించుటకై సూపరింటుగారి బసకేగెను. అంతకు

బూర్వమే మదన్‌శింగుగూడవచ్చి దొరగారికెదురుగ నొక యాసనమలంకరించి యీమరంతమునుగూర్చి వారిరువురు నాలోచించుకొనుచుండిరి. కాని వారికేమియు బోధపడుట లేదు. శరశ్చంద్రునిగాంచి దొరగారు సన్మానపూర్వకముగ నాతనికొక యాసనముంజూపి యందు గూర్చునగోరెను. శరశ్చంద్రుడట్లే యట నాసీనుడై కొండవడికి వారికిట్లు సంభాషణ ప్రారంభమయ్యెను.

సూప:—శరశ్చంద్! పోలీసుకర్మచారులలో నెల్ల నెక్కుడు బ్రఖ్యాతివహించిన నీయట్టిదిట్ట యిట్టిసమయమున నీయూర నుండుటచే మే మెంతయు నదృష్టవంతులము. మేమిరువుర మెంత యాలోచించినను నీకేసు విషయమై మాకేమియు బాలుపోవుట లేదు. ఇందు నీయుద్దేశ్య మేమో దెలిసికొనవలసియున్నది. నిన్నటి శవపరీక్షా సమయమునకు సరిగ నీవు రాకుండుటచే నీవూర లేవేమోయని చింతించితిని. కాని పిదప నీకెల్ల సంగతులును దెలిసియేయుండును. ఇప్పటివరకు నేగాంచిన యభియోగములలో నిట్టి విచిత్ర ప్రదర్శన మెన్నడును గాంచియుండలేను. నీవు హత్యారంగములలో నిట్టివిచిత్ర ప్రదర్శనమెన్నడును గాంచియుండలేవు. నీవు హత్యారంగమును బరీక్షించి యుండుదువని దలంచెదను.

శర:—అయ్యా! తమరు నాయందెల్లపుడును సదభిప్రాయము గలిగియున్నవారలగుటచే నన్నింతగ బ్రశంసించుచుండిరి. అంతియె గాక తక్కుంగల రక్షకభటాధ్యక్షులకన్న నాప్రజ్ఞావిశేషము లెక్కుడుగావని నాయభిప్రాయము. ఎట్లయినను తమవంటి యధికారులకడ బనిజేయుచున్నంతకాలము మేము మాశరీరముల దాచికొనక, యావచ్ఛక్తిని వినియోగించి, ప్రాణములర్పింపవలసివచ్చినను సంశయింపక, యెంతటి విపత్కార్యములనైనను బనిజేయుచుందుము. నిన్నటిశవపరీక్షా సమయమునకు నేను లేకుండుటకు చాలగాధకలదు గాని తఱువాత దైవకృపచే సరిగా నావేళకు వైద్యశాలకేగిశవమును జూడగలిగితిని. పిదప, హత్యనడచిన యాగృహముకూడ బరీక్షించి

యాయింటియజమానికడ వలయుసంగతులెల్లను దెలిసికొంటిని.

సూప:—నీవట్లు చేయుదువని నే నెఱుంగుదును. కానిశవపరీక్షా సమయమునకు నీవురాకుండుట కేదో వింత గలదంటివి. అది యే విషయము?

శర:— ఈహత్యా రహస్యమే.

సూప:—ఏమీ? ఈహత్యవిషయమై నీవంతకు బూర్వమే యెఱుంగుదువా?

శర:— చిత్తము—కొంతవఱకు.

సూప:— ఆశ్చర్యము. నీవుజూడ మహామహునివలె గానవచ్చుచుంటివే అని నిశ్చేష్టుడయ్యెను. ఇంతవఱకును మౌనముద్ర వహించియున్న మదన్‌శింగునకే కడపటి వాక్యములు మేలుకొలుప నాతడు గూడ నాశ్చర్యాంబుధి మునింగిపోయెను.

శరశ్చంద్రుడు దొరగారు దన్నింతగా మెచ్చుకొనుచున్నను గర్వాంధుడుగాక సవినయముగ హత్యజరిగిన నాటిరేయి, తనకును హంతకులకును జరిగిన సమావేశమును, తనబంధమును, పిదప విముక్తియు మున్నగు నంశములెల్లను సవిస్తరముగ నెఱింగించెను. అతడా కథ జెప్పునంతసేపును, దొరవారును, మదన్‌శింగును, భయసంభ్రమంబులతో తదేకదృష్టి నాతనిముఖమండలమువీక్షించుచుండిరి.

శరశ్చంద్రుడు తన కథ నంతయును జెప్పెను. దొరగారొక్క నిట్టూర్పును విడిచి "అట్లయిన మాలతిని జంపినవారు వారేయైయుందురా? లేకున్న వారికిని నీహత్యా రహస్యమునకును సంబంధమేమైన నున్నదా? హత్యవిషయమై నీవేమాలోచించితివి" అని యడిగెను.

శర:—ముఖ్యముగా వారే జంపియుండవలెను. వారేదో హత్యను చేయదలంచుకొనినట్లు వారి సంభాషణమూలమున నే నెఱింగితిని. కాని అది మొట్టమొదట దెలిసికొనలేక పోయితిని.

సూప:— వారి కార్యక్రమమును కొనసాగించుకొనుటకే నిన్ను బాధించియుందురు

శర:—నిశ్చయముగా నందులకే. వారీవరకు నన్వేషించిన వారే యైయుండవలయును గాని వారిని మాత్రము నే నెన్న డెఱుంగను.

సూప:—హత్యాప్రదేశమును మీరు బరీక్షించి తెలిసికొనిన విషయము లేమి?

శర:—మిక్కిలి ఆశ్చర్యకరమగు విషయము నే దెలిసికొంటిని. నేదలచినట్లే నిజమగునెడల నావధింపబడిన యామె మాలతీభాయి గాదని దలంతును.

దొరగారును మదనసింగును గూడ నాశ్చర్యమున బ్రతిమల వలె స్తంభించిపోయిరి. వారినోట మాటరాకుండెను. ఒడలెల్లను చెమ్మటగ్రమ్మెను. దొరగారు వెనుకకు జేరబడి శిరమున రెండు జేతుల నునిచి కనులమూసికొని యాలోచింపసాగిరి. మదనసింగుమాత్రము శరశ్చంద్రుని ముఖముననే దృష్టినిల్పి "ఈతడు పిచ్చివాడు. ఇపుడీతని మతిచలించిపోయినది "యనుచు నేమో యాలోచించుకొనుచుండెను.



౭

కొంతవడికి దప్పిదేరి కనులవిచ్చి దొరగారు శరశ్చంద్రునిజూచి "శరశ్చంద్ర బాబూ! నీవ్యూహము లన్నియు బద్మవ్యూహములు. నీయాలోచనలకంతము లేదు. నీపలుకుల యందలి గూఢార్థమును గ్రహించునంతటి సామర్థ్యము పరమేశ్వరుడు మాకనుగ్రహించియుండ లేదు. నీమేధాశక్తిని బ్రశంసింపమేము సమర్థులముగాము. కాని మాలతిశవమును మేముకనులారగాంచియుంటిమే. ఒకవేళ మేమామె నెఱుంగక పోయినను యామెజనకుడుగూడ కన్నకూతురు జనిపోయె ననిగదా యట్టిదుఃఖసముద్రమున మునిగియున్నాడు. ఆశవమామెదో కాదో యాతడుగూడ గుర్తింపజాలనంతటి మూఢచక్రవర్తి లోకమునగలడా యను ననుమానము. ఏమో నీమాటలు మాకేమియు నర్థ

ములు గాలేదు. అట్లు దలంచుటకు నీకు గలకారణమేమో దెలుప వలయును".

శర:—అయ్యా! ఒకవేళ నేను గూడ బొరపడియున్న బొరపడ వచ్చును. అందు దప్పేమియును లేదు. అన్నివిధముల నాలోచించిననే గాని యభియోగముయొక్క నిజస్థితిదెలిసికొనుటకష్టము. లేకమీరు సెలవిచ్చినట్లులామె తండ్రిమాత్రము పొరబడియుండగూడదా? ఏల నన, శవము దనకుమారిత నిత్యముశయనించుపాన్పుపైననేయున్నది. దానికి శిరము లేదు. శవమునకు గట్టియున్న వస్త్రములు గూడా నాగని తనయవేయని జెప్పుచున్నాడు. అదియునుంగాక నాతడు దుఃఖోద్రేకమున గన్నులైనను బూర్తిగావిచ్చియెరుంగడు. అతనికి జగమంతయు నంధకారబంధురమైయున్నది. పైకారణములబట్టి నిశ్చయముగనా జనిపోయినది తన కూతురనియే యాతడు భావించి యేడ్చుచున్నాడుగాని యాశవము తన తనయదియే యగునో గాదో యని యోజించియుండడు. అట్టి విపత్సమయమున నాతనికట్టి యను మానకరంబగు నాలోచనయుగూడ దట్టియుండదు. ఆతనికేగాదట్టి స్థితిలోనున్న యెట్టిమానిసికైన నట్టి యనుమానము దయింపగారణ ముండదు.

సూప:—అయిన నీవెట్లిపుడు నిశ్చయింపజాలితివి?

శర:—పరీక్షను బట్టి.

సూప:—అది యేవిషయమున?

శరశ్చంద్రుడు దనజేబులోని యొక పొట్లముందీసి దొరగారి చేతబెట్టి "ఇవిగో. ఇవియామరణించిన స్త్రీకేశఖండములు. కత్తివ్రేటున దెగి పరుపుపైబడియుండగా వీనిందిసికొని వచ్చితిని. చూచితిరా? ఇవి సహజముగ శ్వేతములయ్యును రుధిరమునంబడి రక్తవర్ణముందాల్చి యున్నవి. ఇవికొంచెము వయసుమీరిన కాంతవియైయుండవచ్చును. మాలతియే మరణించియున్నచో యీకేశములామెవిమాత్రముగావు. ఆమె వయస్సిఱువది రెండేండ్లనియు, యామె కుంతలము లించుక

తయు నెఱసియుండ లేదనియు యామె తండ్రియే జెప్పియున్నాడు. దీనింబట్టిచూడ వధింపబడిన యామె మాలతిమాత్రము కాదని దెలియు చుండ లేదా?

సూప:—నిమేధాశక్తి వర్ణింపజాలమని యీవరకే జెప్పి యుంటిమి శరశ్చంద్! ఇంతయోచనాపరుడవని యీవరకెన్నడు నే కేసునను గూడ నెఱింగియుండలేదు. నీవచనములన్నియు సప్రమాణ ములుగా గానవచ్చుచున్నవి. అయిన మరణించినయామె యెవరో గ్రహింపగల్గితివా?

శర:—ఆసంగతినే నింకను నిర్థారణజేయజాలనుగాని మాలతి మాత్రము మరణించి యుండలేదని నాయూహ.

సూప:—ఈసంగతి జీవనాథున కెరిగించియుంటివా?

శర:—సుస్థిరమగు సంగతి నేనెఱుగునంతదనుక నెవ్వరికిని జెప్పదలకొనలేదు. నాకీసంగతి దెలిసినట్లెవ్వరెరుంగగూడదు. దాన ననేకానర్థములు ప్రాప్తించును. దీనింగూర్చి యింకను నిదర్శనముల సంపాదింప వలసియున్నది.

అంత మదన్‌శింగు శరశ్చంద్రునుద్దేశించి "అయ్యా మీరు చెప్పినట్లు మాలతియే జంపబడియుండనియెడల, హంతకులింకెవ్వరినో జంపి, మాలతిపాన్పుపై బడవైచుటెందులకు? అయినచో మాలతి యేమైయుండును? నాబుద్ధికాలోచింపగ మీమాటలయందు నాకు సత్యముగోచరించుటలే"దనెను.

శర:— మదన్‌శింగ్! నామాటలు నీకుసత్యము దోపక బోయిన పోనచ్చును. అవిసత్యములని దగినప్రమాణములు దొరకనిదే నేనుగూడనమ్మజాలను. అయినను కార్యక్రమమునకేదేనియొక నిర్థా రణగావించుకొని దానింబట్టిమిగతా కేసునంతటినిబయటికిదీయవలయు నునీవింకను గొత్తవాడవు. అట్లని నేనుగొప్పవాడనని గాదు నాయూహ. ఈయభియోగమున ముఖ్యముగ నాకు నీసహాయమత్యావసరము. మనమందర మేకీభవించిపూర్తిగబనిచేసినగానియిట్టిదుర్ఘటకార్యములు

సాధించుట కష్టతరము.

మదన్:—నేనట్లంటినని మీకు నాపై యాగ్రహము మాత్రము వలదు. మీరు జెప్పినవిషయములబూర్తిగ దర్శించిననేగానిబ్బయలు బడనేరదు. అందుకొఱకై నేనట్లు ప్రశ్నింపవలసియున్నది.

శర:—నాకు కోపమెన్నటికిని లేదు. ఈజన్మములో నెన్నడైన నది యుండబోదు. నీవన్నట్లెన్వరైన నెదురుప్రశ్నల వేయుచుండుటయే మంచిది. అప్పుడుగాని మనకు యథార్థస్థితిగోచరింపదు. అంతవరకెట్టి కార్యమైనను సాధింపనేరము. నీవు జెప్పినట్లు మాలతియేనైనదో మాత్రము నేనింకను జెప్పజాలనుగాని యొకవేళ మాలతిని నెవ్వరో యేకార్యార్థమో హరించి, యింక నెవ్వరామెకై ప్రయత్నించి గనుగొనకుండుటకై వేఱొక్కరిజంపి యామె శయ్యపై బరుండ బెట్టి యుండగూడదా? అందుచే మృతిజెందిన దామెయేయని దలంచి యామెకై వెదుకబోవు వారుండరని వారియూహ. ఇంకొక్కసంగతి. మాలతిని హత్యజేసిన నాటినుండియు నామె సేవకురాలగు శ్యామల గూడ గనబడకున్నదట. ఒకవేళ నాదుర్మార్గులు శ్యామలనే జంపి యిట్లుగావించియుందురేమో? శ్యామల మాలతికన్న వయసున బెద్దదైనను యిరువురు నొకేమాదిరి స్థూలకాయలు నున్నతులై యుందురు. ముఖముల భేదముండుటచేతనే యాదుర్మార్గులు శవమునకు దల లేకుండ గోసియుందురు. ఏమైనను మన మింకను నిశ్చితాభిప్రాయమును వెల్లడిజేయుటకు జాల నిదర్శనముల సంపాదింపవలసియున్నది అభియోగము మాటయెట్లున్నను హంతకుల సమాచారముల బూర్ణముగ నెఱుంగవలసియున్నది. అదేయినన్ను బాధించిన వారికిని యీహత్యకును సంబంధముండి తీరవలయును. వారుజూడగ సామాన్యులవలె గానవచ్చుటలేదు. వారి యీగడ గని పెట్టుటకు ముందు మనము ప్రయత్నింపవలసియున్నది.

మదన్—అయ్యా; మీయాలోచనలేమో నాకించుకంతయు నర్థమగుటలేదు. నేను స్వాతంత్రించి యీకేసున నెట్టి యాలోచన

ము జేయజాలము. కాన మీరే నాకు గురువులై నాచేబసి చేయిం చుకొన వలయును. మీరెట్లాజ్ఞాపించిన నట్లేజేయగలను.

శర:—నీవంటి వాని సహాయమబ్బుటచే నిపుడు నాకెంతో ధైర్యముగలిగినది. ధన్యుడనైతిని. ఇంకనాకు సెలవీయవలయును. మఱలరేపు మిమ్ములగలసికొందును. అని చెప్పి శరశ్చంద్రుడు నూప రెంటుగారి కభివాదనమొనర్చి శలవుగైకొని వెడలిపోయెను. దారగా నాతనియాలోచనములకె తయుమదినలరుచు రాజమార్గమువఱకాతని ననిచి, యెప్పటిసంగతులపుడే దన కెఱిగించుచుండవలయునని జెప్పి మఱలలోనికరిగిరి. పిదప మదనశిందుగూడ నాతనికడ సెలవొంది వెడలి పోయెను.



౧౦

వేడివేలుప పరార్థిని గ్రుంకుచు దనసువర్ణకిరణజాలముల గలకత్తా నగర సౌధరాజములవై బ్రసరింపజేయ నవియెల్లను బంగరుపూత బూసినవైవడి నయనానందకరములై యొప్పుచుండెను. విహగ మిధునంబులు గలకలారావములొనర్చుచు గూండ్లనుచేరుచుండెను. పవలెల్ల బశులబ్రాంతారణ్యసీమలమేపి, యలసిన గోపకులు బశుల మందల నదలింపుచు, నిండ్లజేరుచుండిరి. యత్తనమేవంకజూచినను మందమలయానిలసేవనార్థమై వెలికి జనుధనవంతుల గుఱ్ఱపుబండ్లు పరువులతోను, చిత్రవిచిత్రములగు నంగళ్ళను, సౌధపంక్తులను గాం చుచు, దృశ్యానందమునొందుచున్నవి దేశీయుల యాశ్చర్యభాషణం బులతోను, నిలువ దీరికలేక నొకవీధినుండి యింకొకవీధికి బ్రయాణి కుల మోసికొనిపోవుచు, నిశ్చేష్టులై వింతలజూచుచు ద్రోవనేగు పధికుల గుండెలదరునట్లు "బా. బా." యని యరచు మోటారుబండ్ల తోను, గడుసంకులముగ నుండెను. విపణివీధి నెల్లరును దమకువలయు

సామగ్రుల దీసికొని, యొక్క-మొసంగి, చీకటిబడకమున్నె యిండ్లజేర వలయునను దలంపున వడివడి నడచిబోవుచు, నడుమనడుమదమకడ్డు దగిలి "బాబూ! బాబూ! ఒక్క-రొగిడబ్బుధర్మం—బాబూ" యనుచు వారి వేగమునడంచు భిక్షుకుల గసరికొనుచుబోవుచుండిరి. సూర్యుడు క్రమక్రమంబుగ బశ్చిమసముద్రమున మునింగిపోవుచుండెను.

మదన్‌లాల్ చౌకుగడ, నాల్గుగోష్టుగలియు నొక స్థలమున దీపపుస్థంబముకడ నొకఫకీరు కూర్చుని చేతనున్న కొబ్బరిబుఱ్ఱపై జిలిమిలోని హుంకా—మాటిమాటికి బీల్చుచు, బ్రహ్మానందమునమునిగి దేలుచు, తనకువచ్చిన తత్త్వజ్ఞానమెల్లను శ్రోతకుల వీనుల దిరిస్కరించుచుండెను. అతనికిరమారమిముప్పదియేండ్లుండవచ్చును. పొడగుపాటి గడ్డము—నల్లనిముఖచ్ఛాయ, యెఱ్ఱనిదలగుడ్డయు—బాదములవఱకును వ్రేలాడు పెద్దయంగీయును నాతనిదుస్తులు—తొడక్రింద చింకిగోనె గుడ్డలో బిగువుగ గట్టిన బట్టలమూటయొకటిగలదు. ఆతనితత్త్వములు గొందరి పామరహృదయముల నాకర్షింప వారుగొంతవడి యాతని కడ నిలచి, యతనిగానామృతసాగరమున గొంతవఱకీది యీది, మైమఱచి, వెడలునపుడొక కాసు నాతనికడవైచుచు"మహానుభావుడు. వేదాంతి— గట్టిముండాకొడుకు. గేనం ఎగిరిన పెభువు" యనుచు బలుగతుల నాతని స్తుతించుచుండిరి. కాని యాతడు వారి స్తోత్రపాత్రముల లెక్కింపక, వారికాసులగైకొనక, యర్ధనిమీలితనేత్రుడై గానవర్షమును గురిపించుచునేయుండును. కొందఱాతడెవడో మహాయోగి యనియు, మరికొందరు కానుజాలదుగాబోలు, ఎంతగర్వమనియును, నానావిధ భూషణ దూషణములొనర్చుచుండిరి. వచ్చువారు వచ్చుచునేయుండిరి.పోయెడివారుబోవుచునేయుండిరి. యోగివారిరాకపోకలపై దృష్టి నిలుపక పాడినపాటనే మఱల మఱలబాడుచు, నానందమున మైమరచుచున్నాడు. కాసునకై నిర్బంధములేక బోవుటచే నామార్గమున బోవు ప్రతిమనుజుడును నందు గొంతతడవాగి యాతనిదర్శన భాగ్యమబ్బినదని సంతసింపుచు బోవుచుండిరి. మేకలమందగతి నొకరి

నొకరనుసరించుటయే వారిపని. జనులు గుంపులుగుంపులుగా దన్ను జుట్టుకొనుచున్న కొలది నాఫకీరు తనగాన పర్వమును ఝుంఝామారుతముగా మార్చివైచుచుండెను అతడప్పుడిట్లు బాడుచుండెను.

పాట.

వినురా సదానందయోగీ ముక్తి గనుటకీ తత్వంజెప్పె వైరాగీ ॥ విను.
మాయజీవిని నమ్మబోకు యీ-కాయము స్థిరమన్న గాదనబోకు ॥ విను
పాషాలింగముపూజలేల పరబ్రహ్మమునీలోనా బరికింప వేలా ॥ విను
తల్లిదండ్రియు నీకులేరు నీ-యిల్లాలు బిల్లలు నీవెంటరారూ ॥ విను
ధనము ధాన్యము మనకువద్దు గురు-ధ్యానమే నమ్ముమూ వినురా నాసుద్దు॥ విను
వైకుంఠ మెందున్నదోరి? యిచ్చ వచ్చినట్లెల్లను బల్కరా కోరీ.॥ విను

పాటజాలించి ఫకీరు పెద్దనవ్వొకటి నవ్వెను. ప్రేక్షకులుగూడ పెద్దపెట్టున నవ్వదొడంగిరి. అంత పాటవినుటకై మూగిన జనసంఘమును ద్రోసికొనుచు వచ్చి యొకయువతి యాఫకీరుముందునిలచెను. ఆమె దాల్చిన వసనములు చింకిపేలికలు. చంకనొక చింకిపీలికల మూటయు నొకచిన్నరాగిలోటాయును గలవు. తలకొంచెము నెఱసి యొకచిన్నతుప్పవలె గనబడుచుండెను. వయస్సు రమారమీ నలువదేండ్లుండవచ్చును. మోమున వికటహాసము. ఫకీరుముందుకామెవచ్చి యట్లే యాతనిముఖమున దృష్టినిలిపి పకపక నవ్వసాగెను. ఆమె వెడగునవ్వు—కారణములేని వెడగునవ్వు—గాంచి జనసంఘమంతయు గూడ నవ్వుచుండెను. వారి హాసచంద్రికల నామె యానంద జలధియుప్పొంగి పోయెను. అంతనామె నాట్యముజేయ మొదలిడెను. చేతిమూటను, చెంబును పదిలముగ నాఫకీరుకడ నునిచి ప్రళయ కాలకాళికామూర్తివలె నామె తాండవమాడు చుండెను. ఆమె యున్మత్తయా? ఏమో కావచ్చును? ఈవిచిత్రతాండవము గాంచి దారిపోవువారెల్లరు నందునిలచి వారుగూడ నున్మత్తప్రాయులగు చుండిరి. ఎట్టకేలకామె నవ్వనాపుకొని ఫకీరుదగ్గరగాబోయి యాతని

జనులెల్లరును వెడలిపోయిరి. ఎవ్వరోయొకవ్యక్తి మాత్రమాయిరువురి సంభాషణమాద్యంతమును విని తనలో దానేమో యాలోచించుకొనుచు దలపైముసుగునైచుకొని వారి వెంబడినే బోయెను.



౧౧

రాత్రియైనది. కలకత్తాపట్టణమంతయు దీపకాంతులలో బ్రతిఫలించుచున్నది. మదనలాల్ చౌకుకడనున్న తోటలోని పాడుమందిరమునమాత్రమెవ్వరును దీపములబెట్టియుండలేదు. దానికిపుడెవ్వరును యజమానులులేక నివాసాయోగ్యమై పాడువడియుండుటయే యందులకు కారణము. చవితినాటి చంద్రుడు మాత్రము దనలేవెన్నెలనిగ్గులనాతోటలోనివృక్షములగుండా నామందిరోపరిభాగమున ప్రకాశింపజేయుచుండెను. అరుగులపైని వరకుమునమెఱింగిన యాఫకీరునుయా యున్మత్తయుమాత్రము బండుకొనియుండిరి కాని వారునిద్రించుటమాత్రము లేదు. ఆస్త్రీ బైట మినుకుమినుకుమని మెఱయుగుడ్డివెన్నెలందిలకింపుచు రెప్పవాల్పక యట్లేజూచుచుండెను. అపుడపుడామెతనదృష్టి నాకసమువంక సారించి తారల లెక్కింపుచుండెను. ఇంతలోనెవ్వరో యొక పురుషుడు వారిచాయనరుదెంచుచుంటచే నాతని పదముల సవ్వడి వారి వీనులంబడి వారినిశ్చలతకు భంగముగలిగించెను. తోడనే ఫకీరులేచి కూర్చొని గొంతుకసవరించుకొనుచు "ఎవరా వచ్చెడివా"రని బిగ్గరగ బ్రశ్నించెను. ఆవచ్చువాడాప్రశ్ననాలించి "బాబూ! నేను పాంథుడను. త్రోవతప్పివచ్చినాడను. నాబసయెక్కడనో నేనెరుగను. అయ్యా! తమరు దయయుంచి యీరాత్రి నాకు నిదురింపకొంచెము తావొసంగితిరేని మీకు చాలపుణ్యముండును. ఉదయముననే లేచి నాదారిని బోయెదను" అని దీనముగబల్కెను.

ఫకీ:—మీదేయూరు?

అగ:— బాబూ! మాది గోకులపురము. కాశీయాత్రకై నేనును నాబంధుగులు కొందఱునుబయలుదేరి యీకలకత్తాపురమున విచిత్రములజూచి పోవలెనని నేడిందాగితిమి. కాళికాలయముకడ సత్రమున మేముబసజేసి పట్టణముజూడవలయునని మధ్యాహ్నము బయలుదేరి చీకటిపడుటచే త్రోవదప్పి యిందు జిక్కుకొంటిని. ఎంత బ్రయత్నించినను నావారుగాని, మాబసగాని నాకు గనబడుటలేదు. నాది క్రొత్తయూరగుటచే నీయూరిబాటల నేనెరుంగను. మహాపట్టణము బాబూ! ఈచీకటిలో నెక్కడికి బోగలను? కాన దయయుంచి యీరాత్రికినాకు కొంచెము స్థలముజూపినచో వేకువకడ లేచి వెడలి పోవుదును.

ఫకీ:—అయ్యా! దయ చేయుడు. నేటికి మీరుగూడ నిందే పండుకొనవచ్చును.

అగ:—రక్షించితిరి బాబూ! అయ్యా! అదేమిచోద్యమోగాని యీపట్టనమున నెవ్వరును క్రొత్తవారిని గుమ్మమెక్క నీయరు, ఎక్కడనో మీవంటి ధర్మాత్ములు నూటికొకరుందురు. బాబూ! ఈభవనముమీదా?

ఫకీ:—అయ్యా! నన్ను మీరు బ్రశంసింపనక్కరలేదు. ఈ యింటి యధికారులెవ్వరో నేనెఱుంగను. ఇందురెవ్వరున్నట్టుగపడదు.

అగ:—పోనిండు బాబూ! ఎవ్వరిదైననేమి? ఈరేయి నన్ను రక్షించిన వారలు మీరే అనుచు నొక్క నిట్టూర్పువిడచి యాయాసమపనయించుకొను వానిబోలె నాయరుగుపై నొకమూల జేరగిలబడెను. కొంతవరకెవ్వరును మాట్లాడలేదు. కొంతశ్రమదీర్చుకొని యాగంతకుడు దనభుజముపైనున్న యుత్తరీయమును గ్రిందిబఱచి పండుకొనెను. తరువాత మెల్లగ జేబునుండి నిప్పుపెట్టెను, చుట్టను దీసి. యొకపుల్లగీచి చుట్టవంటించి యావెలుగున నాయిరువురి ముఖములను క్షణమాత్రమాత్రముజూచెను. ఫకీరుగూడ నావెలుగుననే యాగంతకుని వీక్షించెను. పిమ్మట నాపురుషుడుజుట్టగాల్చుచు ఫకీరు

వంకదిరిగి "అయ్యా! తమవంటిమహాత్ములను భగవంతుడీరాత్రి నాకు దోడుచూపినాడు. లేకున్న నాగతియేమయ్యెడిదో నే నెరుంగను." అని కొంతవడి యూరకొని మరల "నయ్యా! తమదేయూరు?" యని మెల్లగ ప్రశ్నించెను.

ఫకీ:—అయ్యా! నేనొక ఫకీరును. నాకొకయూరని లేదు. ఇచ్చవచ్చినట్లెల్లదిరుగుచు తీర్థసేవ జేసికొనుచుందును.

అగ:—చిత్తము. తమరు మహాత్ములు. చాలపుణ్యాత్ములు. తమవంటివారికేమిలోపము? దైవమెల్లప్పుడు తమకుదోడ్పడియుండును. అచట పండుకొన్న వారెవరు స్వామీ?

ఫకీ:—ఆమె యెవ్వతియో నే నెరుంగను. చూడగ బిచ్చదాని వలె గనబడుచున్నది. సాయంత్రమా వీథిలో నాకు గనబడి యంతటి నుండియు బాటల బాడుట నేర్పుమనుచు నన్ను వెంబడింప మొదలిడినది. ఎంతవలదనినను వినక నావెంటబడినది. ఏమి చేయను? ఉన్మత్తులకు యుక్తాయుక్తజ్ఞానముండదుగదా?

ఆగ:—చిత్తము. తమరు సెలవిచ్చినది వాస్తవము......

అనుచుండగనే యాస్త్రీ మేల్కాంచి వారిపల్కులాలించి సత్వరమున లేచి ఫకీరువద్దకరుదెంచి "అయ్యా! నన్నుమాటిమాటికి గనబడిన వారితో నెల్ల బిచ్చిదని చెప్పుచున్నావు. జాగ్రత. నీవేమో గురువవని యాలోచించుచున్నాను. అట్లయిన నాకిప్పుడే పాటల నేర్పుము. లేనిచో నీవు పాడుచుండుము. నేను నాట్యము జేయుదును. ఈతడు మృదంగము వాయించును. అన్నా మృదంగము లేదే. ఎట్లు. సరే. ఏదో వాయించవచ్చును. అక్కడకు మేళము బలేగానుండును. ఏమయ్యా! నీకు మృదంగవాయిద్యము వచ్చునా? హాయి. హాయి. ఏమిమేళము. ఏమిమేళము. ఏదీ? ఫకీర్జిబోలో. ఒక్కగానమ్ బోలో. నేను నాట్యంచేస్తాను. వాయించవయ్యా నువ్వు. అలా అలా మొద్దులాగ చూస్తావేం?" అనుచు నిలువబడి కరముల గానుగ జేర్చి నాము పాదము ముందిడి ఫకీరుముఖమువంక జూచుచుండెను. ఆగంతకుడు

షట్టజాలక పక్కనవున్నాను. ఫకీరుగూడనవ్వి "చూశారండీ! బాబూ! యీమెచర్యలు. పాపము! పాపము! ఎవ్వరోయీమె యిలాగై పోయింది." అనుచు దనసంచిని విప్పి హుక్కాబుడ్డినుదీసి దానిని యథాశాస్త్రముగా దయారుజేసి నిప్పంటించి పీల్చ మొదలిడెను. ఆగంతకుడేమియు బలుకకనిద్రబోసాగెను. కొంతసేపటికాతడు ప్రల యకాలపయోదగంభీరగర్జన సదృశరవంబున నింటికైకప్పారగిబోవు నటులు గుఱ్ఱుగూడబెట్టసాగెను. ఫకీరు హుక్కాసేవజాలించి, తుం కాయ పాత్రను పదిలముగ సంచిలోబెట్టి మూతిబిగించి, సన్నని కంఠముతో కూనిరాగముల దీయుచు "బాబూజీ" పండుకొన్నారా! యని ప్రశ్నించి యుత్తరవుగానక బాటసారిగాఢముగనలసి యుంటచే నిద్రించుచున్నాడనియెంచిమఱలదనరాగలతనుసాగించుకొనుచుండెను ఆస్త్రీ యాతని సన్ననికూనిరాగములవిని "ఫకీర్జీ! మీరు పాడు చున్నారా? బాగాసేపాడగలరు. అయితే నానాట్యంకూడా కనబరు స్తాను జూడు. ఈమొద్దు నిద్దరబోవుచున్నాడేమి? లేపు—లేపు. మద్దిలవాయించుమను. నేను లేపనా? "యనుచు గంతులవేయ సాగెను. ఫకీరు పాటచాలించి "అమ్మా! చాలరాత్రి అయినది. ఇంక నిద్రపో. పాపమీతడు జాలనలసి నిద్రించుచున్నాడు. ఆతని నిద్రకు భంగముజేయగూడదు. తెలిసినదా? మఱలఉదయముననే బజారులో నేను పాడగలను. అపుడు నీవు నాట్యంచేయవచ్చును. ఇంకపండుకో అదిగో!విన్నావాపదకొండుగొట్టుచున్నారుమాట్లాడకు"యనిజెప్పెను.

స్త్రీ:—అయితే సరే. ఉదయాన్నే పాటలు నేర్పుతావా? అలాగైతే పడుక్కుంటాను. కామాక్షి—ఇంకమాట్లాడకు.



౧౨

రాత్రి రెండు యామములైనది. చంద్రుడు పదిగంటలకు బూర్వమే యస్తమించియున్నాడు. జగమంతయు నంధకారావృతమై

భయంకరరూపము దాల్చియుండెను. పోలీసువారు మాత్రము గస్తి దిరుగుచుండిరి. కాని [illegible]కెక్కడను మనుజుల జాడగానవచ్చుటలేదు. ఆకసమున తారలు మాత్రము మినుకుమినుకుమనుచుండెను. అంత మాత్రమున నేమాయె? కటికచీఁటిగోదసీ కుహరమంతయు నావరించియుంటచే నీస్వల్ప నక్షత్రకాంతి దానిని భేదింపజాలకుండెను. అట్టియెడదట్టముగ భూరుహలతాదులచే గిక్కిరిసి గాఢతమంబైన నీవనమధ్య శిథిలసౌధముమాట జెప్పనక్కర లేదు. అరుగుపైనందరును నిద్రించుచుండిరి. అంతయు నిశ్శబ్దమయమైయున్నను బాటసారిగుఱ్ఱములు మాత్రమామందిరమున బ్రతిధ్వనించుచునే యున్నవి. ఫకీరునకు నా స్త్రీకిని యాధ్వనిని నిద్రాభంగకరమైయుండెను. అయినను దానిని లక్ష్యింపక వారు నిద్రించుచున్నట్లున్నది. లేదు, లేదు. అదిగో! ఫకీరు మెల్లగ లేచి దనప్రక్కపైగూర్చొని నలుదెసలగలయజూచుచున్నాడు. కొంతవడి యాతఁడిట్లు తన చుట్టునుజూచి మెల్లగబ్రక్కపై లేచి, బాటసారి కడకేగి వాని ముఖమును తదేకధ్యానమున కొంతవడిజూచి మఱలకొంచెము దూరమేగి, తన యంగీజేబునుండి నిప్పుపెట్టెను దీసి వెలిగించి యావెలుగున బాటసారి ముఖమును మఱలబరీక్షించి వెనుకకు బోయెను స్త్రీకూడ గదలుచుండెను. ఫకీరుమెల్లగ నామె కడకేగి వీపుపైదట్టసాగెను. తోడనే యామె మేలుకాంచి లేచినిలచెను ఫకీరామెదరిజేరి చెవిలోనేమో జెప్పెను. అంతనామె ముందునడువ, ఫకీరు ముందువెనుకలరయుచు సవ్వడి రవంతజేయక బదములిడుచు నామెననుసరించి మందిరమువెనుకకరిగిరి. ఫకీరు మెల్లగ నాయింటి తలుపునొకదానిదెరచి, యామెతోగూడలోనికరిగి మరల దలుపు నెప్పటియట్లుబంధించెను. వారంత వరుసగ రెండుగదులదాటి యొక చిన్నగదిలో బ్రవేశించిరి. ద్వారములన్నియు జక్కగబంధించివైచిరి. అంత ఫకీరచటనున్న దీపపుగంబమందలి యాముదపు దీపమును వెలిగించెను. స్త్రీదన మేలిముసుంగును దీసివైచి కురులసవరించుకొనుచు" ఇది రహస్యస్థలమేగద? ఇందెవ్వరును బ్రవేశింపరను

కొందును” యనుచు మెల్లగ ననియెను.

ఫకీ:—ఆ. ఇందెవ్వడు జోరసాహసించి ప్రాణములతో వెలికి జనగలడు! పాపమీ సాంధుడుమాత్రముడస్సి గుఱ్ఱుల వెట్టి నిద్రించుచున్నాడు. నీవు సందేహింపనక్కర లేదు. మన కేమియును భయము లేదు.

స్త్రీ:—(నవ్వుచు) వాడు తొలుత వచ్చినపుడు మన కార్యక్రమమున కంతరాయముగల్గింపవచ్చిన యమునిగ భావించి వాని నెట్లయిన వెడగొట్టజూచితిని. కాని యట్లు జేయుట యెట్టివారికైన ననుమానాస్పదముగ నుండునని దలంచి మఱల విరమించితిని.

ఫకీ:—మంచిపని జేసితివి. ఒకవేళ నిజముగ నాయముడే వచ్చినను ఈయానందయోగి వానిని సాధారణముగ విడచువాడుగాడు. వానిని మువ్వదివ్వాలు బెట్టి మూడు చెవుపులనీళ్ళను ద్రావించి వాని కండ్లలో దుమ్ముగొట్టకమానడు.

స్త్రీ:—ఇదియేమిది? క్రొత్త క్రొత్త పేరులు సంపాదించుచున్నావే? ఇది యేయూరి పేరా?

ఫకీ:—నవ్వుచు “అపును మఱచియుంటివా? నీకన్ని సంగతులను జాబున వ్రాసియుంటినే.

స్త్రీ:—అవునవును. జ్ఞాపకమువచ్చినది. నీ వేషము చాల బాగుగ నున్నది. సార్థకనాముడ వైతివి.

ఫకీ:—అమ్మా! నీదయయుండవలెను గాని వేషముల కేమి కొదువ. నేను నిన్ను మొదటజూచినపుడించుకంతయు నానవాలుబట్ట జాలకపోయినాను. నీవు నిజముగు పిచ్చిదానవనియే జనులెల్లరును భ్రమించియున్నారు సుమా! వారిమాటకేమి నీతనయుడనగు నేనే తొలుతొలుత చిత్రవిచిత్రములగు బోల్తాలగొట్టినాను.

స్త్రీ:—ఆమాటల కేమిలే. నేను నిశ్చయముగ జగన్మోహనావతారము నే. ఏ వేషమునకు దగినట్లు భాషాచమత్కృతి జూపగలను. బ్రహ్మ కండ్లలోనైనను కారముగొట్టు సామర్థ్యము నాకడనున్నది. సరే గాని మన కార్యము లేమైనవి. పూర్తిగా జెప్పుము. నాకు తొందరగా

వినవలయునను కోర్కెయున్నది.

వీరెవ్వరు? ఇట్టినిశానసమయమున నీ శిథిలభవనమున వీరికి బనియేమి? అయ్యయ్యో! వీరు కాముకులా? వీరిజాడలట్లు గాన వచ్చుట లేదు. జ్ఞప్తి యున్నదా? ఒకనాటి రేయి నీవీధినే, యీశిథిల సౌధాంతరంబున నే హంతకులచర్య లవలోకించుటకై జనుదెంచిన శరశ్చంద్రునితో నాటిందు మనము బ్రవేశించియుండ లేదా? అపుడీయుభయుల సంభాషణమును గూడ మనమాలించియుండ లేదా? నేటివలెనే యప్పుడుగూడ నానందయోగి యను పదమొకని నోట వినుట లేదా? ఆయానందయోగియే యీఫకీరు. ఆమె పిచ్చిదట. లోకమును మోసగించుటకై దాల్చినదా పిచ్చివేసముగాని నిజముగ నామె పిచ్చిదిగాదనుట కిప్పుడీయామె ప్రవర్తనమే సాక్షి. ఆహా! లోకమున నెన్ని వేసములుగలవు? ఎందరు బూటకులుగలరు? ఎందరు హంతకులుగలరు? జగమున నెట్టివానినైనను బైవేసమునుగాంచిలోని హృదయమును దెలిసికొనుట కష్టతరముకదా. పైకిగపడు మాయా వేసములకును లోని మానసంబులకును నెంతో వ్యత్యాసమున్నది. పలుకులు పరమేశ్వరునిగూర్చి. తలపులు తరుణీమణులగూర్చి. ఎంత మాయానాటకము?

మఱల మనపూర్వపుణ్యవశంబున నాభవనమునే జొచ్చితిమి. అదిగో! నానందయోగిగారేమో బల్కుచున్నారు.

ఆన:—అమ్మా! మాధవి నీకృపవలనను, దైవసహాయము చేతను మనకార్యము సానుకూలముగనే జరిగిపోయినది. ఇపుడంత యును మనచేతులలోనే యున్నది.

మాధవియాశ్చర్యానందము లొక్కుమ్మడి గ్రమ్మ బరవశయై కొంతవడి మాట్లాడకుండెను. తరువాత మెల్లగ కంఠము సవరించు కొనుచు "భేష్—షరీఫ్! కాదు. జగత్—కాదు. అబ్బా! యీక్రొత్త నామకరణమున కెంత దడవికొనుచున్నాను. ఆనందా! చాల చులుకుగ బ్రవర్తించితివి. ఇంక నాదిక్కుమాలిన మధూ మన వెంట కుక్కయై

దిరుగక మానడు. అందుల కెట్టి యభ్యంతరమును లేదు. కాని కార్య మెట్లనుకూలించినదో జరిగినదెల్లను వివరముగ దెలుపవలయును.

ఆనం:—జరుగుట కేమున్నది. కాని కార్యము వింతగానె కొనసాగినది. ఆమె యీపట్టణముజేరి యొక మారువాడీ సాంగత్యమవలంబించియున్నది. అదియు మన హితునివలననే గలిగినది. వచ్చిననాలుగైదు దినములు మారు వేసముల దిరుగుచు నామె చరితనంతను బూర్తిగ సంపాదించితిని...ఆగు, మాగుము. ఇపుడే వచ్చుచున్నాను.........

అనుచు నాతడు వడివడి ద్వారముదెరచి నలువంకల బరిశీలించి యేమియునుగానక నెప్పటియట్ల మఠములోన బ్రవేశించెను. మాధవి యాతనింగాంచి "ఏమంతతొందరగ వెడలి పోతివి? విశేషమేమయినగలదా? యని యడిగెను.

ఆన:—నేవినుటపొరపాటైననైయుండవచ్చును. కానిఎవ్వరిదో యూపిరిధ్వని మాత్రమింపు నాచెవులబడినది. శత్రులెవరైన మనలవెన్నాడుచుంటిరేమో యనియనుమానము. ఇదివఱకొక్కడనే నేనును మధురాయును నాలోచనమున మునమునింగి యుండగా పత్తేదారుగారొకరు దను పరిశీలనానైపుణ్యము జూపవచ్చినారు అంత వానికి దగినట్లుగ బుద్ధిజెప్పి నిందె మేడపైగట్టి బడవైచితిని. అందుచే నాటి మొదలెట్టి యనుమానమున్నను నామనమున బలువిధముల నాలోచించి దగిన ప్రతిక్రియ వెంటనే గావించుచుందును.

మాధ:—నిజము—నిజము—అట్టే జాగ్రత్తగానుండవలయును. ఇపుడు నీవు విన్నదాతుంటరి యొకసారి యుచ్ఛ్వాసనిశ్వాసములుగావు కద కొంపదీసి. లోకములో మనల దలదన్నెడివారుగూడగలరు. వారెట్టి వేసములనైన నవలీల దాల్పగలరు.

ఆనం:—నిశ్చయమేగాని యీమొద్దు గాడిదవలె కాళ్ళుచాచి కొనియున్నాడు. నీవజూచి భయపడుట మనకలవాటు, అందరిని మనము సంధేహించుచుందుము. అపును. అట్లే యుండవలయును.

నీవుమాత్రమెవరితోనుఁ జెప్పకుము. వానివలన మనకేమియు రానేరదు. నేనే పొరబడియుండవచ్చును. ఏదైనను మంచిది. ఇంకను దగ్గరగా రమ్ము. నీ చెవిలో సర్వమును జెప్పెదను. గోడలకుగూడ చెవులుండునట"

"నిజమే" యనుచు మాధవి యాతని సమీపించెను. కొంత సేపటివరకు వారాగదియందే యేమేమో మాట్లాడుకొనిరిగాని వారిపలు కొక్కటియైనను మనకువినరాలేదు. చెవిలో మాటిచెప్పుకొని రహస్యముగా జెప్పుకొనువారిమాటలు మనమెట్లు వినగలము? అయినను వారు మాట్లాడుసంగతులేమో? ఎంతయోచించినను తెలియరాకున్నది. ఎట్లయినను యీగ్రహమోహాసక్తులకును, జారచోరులకును సెలవు మరుమాట సెప్పెదము. అంతట మీరెవ్వరో వారంతర్యము దెలిసికొనజాలకున్నాము. ఇంకను వారట్లు మాట్లాడుకొనుచుండిరి. అంతట మాధవి ఆశ్చర్యమున "ఆహా! యిదంతయు నీవలననే జరిగినదా?" యని బిగ్గరగ బ్రశ్నించెను. అందుచే కథలోని రహస్యభాగము బహిర్గతమైనదను కొంటిని.

ఆన:—కారకుడను నేనేగావచ్చును గాని నీవు వ్రాసిన జాబువిజాలవరకు సహాయమొనర్చినది. ఆతడు నన్ను జూడగనే యత్యాదరమున గౌరవించి నాకు వలయు సహాయమంతయు జేయ బాసనొసఁగినాడు. ఈకార్యమున కాతడే జేయూతనిచ్చినవాడు. నిన్నెప్పుడు జూతునా యనుచు నున్నాడు.

మాధ:— అమాయకుడు. పాపమాతనికి నాయందెంతో ప్రేమ. ఏమైననేమి? కాలగతి యీరీతిగ మారిపోయినది.

అనుచు నామెకంటదడివెట్టిపైటచెరంగునకనులుతుడిచికొనుచు "చెప్పుమరచినాను. ఈయూర మనకింకను ముఖ్యుడొకడున్నాడు? ఆతని నేడు నేవచ్చినపుడు మార్గమున జూచియున్నాను. నేనెంత మారిపోయినను నేనంతబోల్చికొనలేకపోలేదు. ఆతడే—ఆతడే—ఆ— నిశ్చయముగ నాతడే. ఈయూర నేదేని యుద్యోగమునున్నట్లున్నది. అతడుగూడ మనకు జాలవఱకు సహాయమొనరింపగలడు. నేనే

యెట్లయిన నాతనిగలిసికొని మనకడకు రప్పింపగలను. అన్నట్లు మన వారి పుడెందు బసజేసియున్నారు?"

ఆన:—అది చాల రహస్యప్రదేశము. తరువాత జెప్పెదను లే. ఎట్లయినను యుదయమున మనముచ్చటికి బోవలయునుగదా?

మాధ:—గృహావసతి బాగుగనున్నదా? అన్ని పనులకు నుపయోగకారిగా నుండవలెను.

ఆన:—చాలవఱకు ననుకూలముగ నేయున్నది. అయినను నీవుజూచినగాని జెప్పజాలను.

మాధ:—బసకుదిరియుండగా నేడు నన్నిందేల దెచ్చితివి? మనముచ్చట నేస్వేచ్ఛగ నెల్లసంగతులనుమాట్లాడుకొనవచ్చునుగదా?

ఆన:—కారణము లేకపోలేదు. ఇది మనపూర్వాశ్రమము. తొలుత క్రొత్తగ మేమీగాయూరు జేరుసరికి పట్టణమెల్లనుగలయ వెదకి తుదకీ నిర్మానుష్యప్రదేశము మాబసగానించుకొంటిమి. అపుడిందు గొన్ని ముఖ్యవస్తువుల భద్రముగ నుంచియుంటిమి. ఈ వేసమున నీరాత్రివేళగాని వానింగొనిపోవవీలులేదు. అందులకే నాబస—నా వేసము.—నీకారీతిగ వ్రాసియుంటిని. ఇపుడవియెల్లనుగొనిపోవలయును

మాధ:—సరే, మంచిపనిజేసితివిగాని మనకార్యమునుకొన్నంత సఫలముగాలేదు. ఏముందువు—నాటక మెల్లనుముందేయున్నది.

ఆన:—అవును. కొంతవరకు జరిగినది. ఇంకతక్కినదిమాత్రి ముండిపోవునా? అన్నియు నీకన్నులయెదుటనే జరుగగలవు. కొంచె మోపిక బట్టుము.

మాధ:—ముఖ్యమగునదే మిగిలియున్నది. ఆపేటికజేరబడు దాక నాకు నిద్దురబట్టదు. అంతతోగాని వాని పొగరణగదు.

ఆన:—నిశ్చయమే. ఆవృద్ధమర్కటమింతవరకును దానిని విక్రయింపకయే యున్నచో మూడునిముసములో దానిని సంపాదించితెచ్చినీయెదుటబెట్టగలను. లేకున్ననించుకశ్రమనొందవలసివచ్చును

మాధ:—అవునదియును నిజమే. కాని యంతనికంత ధైర్య

ముండెను. ఒకవేళనతఁడు దానినిబహిష్కరించిన మఱుక్షణముననే మఱి యామెను బహిష్కరింతును. సరే తక్కినసంగతులు రేపు, మాట్లాడుకొనవచ్చును. ఈదిక్కుమాలిన పాంథుఁడొకవేళ మేలుకొనిన మన మనుమానాస్పదులమగుదుము. ...విను-విను-అది యేమో... పదముల సవ్వడి వలె లేదా?

ఆనందయోగి నిశ్చేష్టుఁడై చెవుల నిక్కించి వినుచుండెను. మాధవియట్లే ద్వారమువంక దనతర్జని జూపుచు శిలాప్రతిమవలె నిలచి యుండెను!



౧౩

ఆనందయోగి దీర్ఘమార్చి యొకక్షణమట్లే నిలచి యేమియును వినరాకుండుటచే నిశ్శబ్దముగ పదములిడుచు నానిశ్శబ్దమాయాంధకారమును చించుకొనుచు తెరువరి నిదురించినకడకేగునప్పటికి అతనిపాదములు వడకుచుండెను మేనెల్ల స్వేదసిక్తమై నోటమాట రాకుండెను. అతఁడు కన్నులు దెసలఁగలయఁజూచుచుండెను. కాని తానెవ్వరి నిగూఢముగ శోధించుచుండెనో యాపథికుఁడాతనికంటఁ నిపుడు బడుటలేదు. అతఁడట్లే రెండునిముసములుజూచి మందిరముచుట్టు నొకపరిదిరిగి మఱల యథాస్థానమును జేరెను. ఎంత వెదకినను యాతఁడు గానవచ్చుటలేదు. అతని మనమున ననేకాలోచనలొక్కత్రుటిలో మెఱసిపోయెను. మాధవికి బదముల సవ్వడివినవచ్చుట, బాటసారి గానరాకుండుట నాతనికి యాశ్చర్యమయ్యెను. ఆందోళనవృద్ధిజెందెను. తమపోకడగాంచ నీవేసమూనిన మాయావి యెవ్వరో రక్షకోద్యోగియేమో యను యోచనమాతనికి గల్గెను. తోడనే యాతనియొడలు ఝల్లుమనియెను. ఒకనాఁడిందే యిట్టి నిశీథముననే పరిశోధకాధికారి యొకఁడు దమ్ము వెంబడించెను. కాని యాతనికి

దగు ప్రాయశ్చిత్తమైనది. ఇపుడానందయోగి కాసంగతి జ్ఞప్తి వచ్చినది అంత కింత కాతనికించుక ధైర్యముగూడ గలిగినది. ఆతనికిదోచిన యుపాయ మొక్కటే. తన్నెవ్వడైన నిష్కారణముగ ననుమానించి వెంటబడిన నాతని కాలుసేతులగలయగట్టి యొకచో బంధించి వైచుట. ఇంకను మించివచ్చినచో జమునిగీమునకనుపుట. ఈయాలోచనలు దట్టినతోడనే యాతనికి సహస్రగజముల బలమొక్కుమ్మడి నావరించినది. "సరే. ఎవ్వడైననేమి. రానిమ్ము నామహాత్మ్యము జూపించువాడనుగాక." యనుచు నాతడొక్కసారి కరముల ఝాడించి మీసలు దులిపికొని వేటకుక్కవలె సంసిద్ధుడయ్యెను. కాని మరల నాతనిట్లు దలపోసెను "క్రిందటిసారి యాతడు నాచే బాధింపబడినవాడై పగగొని యుండవచ్చును. అందుచే నన్ను బట్టుకొననెంచి నానిలయమునందేయని యాతడిట్లో గ్రహించి మారువేసముల ననుదినమాతడిందే దిరుగుచుండవచ్చును. నేడీబాటసారియే యాతడేమో—ఒకవేళ నదియే నిజమైన నాతడీపరి యొక్కడును వచ్చియుండడు. తనసహాయులన్ నెవ్వరినైనఁగొనివచ్చెనేమో? ఇపుడు మాధవివిన్నది వాని పదధ్వనియే మైయుండునా? ఏమో? ఏమైననుసరే. ఈదినమున ముఖాముఖి, బాహాబాహి, యుద్ధముదప్పదు. అపుడుగూడ మించివచ్చినా మా మార్గము మాకుండనే యున్నది. అపుడు నీ నేకాదు బ్రహ్మరుద్రాదులైనను మాతలవెంట్రుకనైనను బట్టుకొనజాలరు. ఎట్లయినను సిద్ధమే. రానిమ్ము." అనుచు నాతడిట్లు మది దలపోయుచు వచ్చివడి మాధవిం జేరెను. ఆతడిప్పటికి రాకుండుటచే నేమి మూసాగిననో యని యామె బెంగగొనుచుండెను. ఇంతలో నాతడు వచ్చి "ఎవ్వరును లేరు. అంతయును వెదకివచ్చితిని. నీవూరకే భయపడితివి. ఎవ్వరైననున్నచో నాకు గానరాకుందురా?" యని బల్కెను.

మాధ:—నేనట్లు వింటిని. ఏమో యెందులకైన మంచిది. మనము త్వరగ నీస్థలమును విడచి జనుట యుత్తమము. ఏమందువు?

ఆన:—ఎందులకంత భయము? అంతగా మించివచ్చిన మనము

దప్పించుకొనుట కనేక మార్గములున్నవి లెమ్ము. అనుమానముతో బోకూడదు. దాని నిజస్థితి బూర్తిగజూచి, వారెవ్వరో గనుగొనవలెను. ఇదిగో ఇటురమ్ము. వచ్చుచుంటివా? పదిలముగరమ్ము. చూచితివా? యీరాతిపలకను దీసివైచితిని. లోననిదేశాదు. యింకను బదిమంది యందున్నను నెవ్వరును గనుగొనజాలరు. నీవిందే యుండుము...... ఆ-ఆ. వింటివా? అదేమింయీలలువినవచ్చుట లేదా? నీవు బొమ్ము. అదేమో నేను జూచివచ్చెదను.

ఇంతలో మదిరప్రాంగణమున దోటలో నెవ్వరోయీలవైచిన ధ్వని స్పష్టముగ వినవచ్చినది. ఇంకొక్క క్షణములో మఱల నదియే వినవచ్చినది. కొంతసేపటికి యొకటి—రెండు—పది—యిట్లు క్షణక్షణమునకును తెలుపైనవి. మనుజుల యలుకుడి విస్పష్టముగా వినవచ్చుచున్నది. పదముల సవ్వడి. తరువాత మాటలధ్వనిగూడ వినిపించినది. ఎవ్వరో యొకమానిసి చేతలాంతరొకటిబట్టికొని నలువంకల వీక్షింపుచు. “వేగముగరండు. కొందరీప్రక్క నేయుండుడు. జాగ్రత”యనుచు తోడివారల హెచ్చరింపుచుముందరు డెంచుచుండెను.

క్రమముగ వారునలుదెసల గలయబడికించి భవనంతర్భాగమున జొచ్చిరి. ఒక ద్వారముచాటుననుండి ఆనందయోగి యీచర్యనంతను గాంచెను. మనుజులయాకారముల దీపపుకాంతిని స్పష్టముగ జూచెను. నాలెందరో గూడ లెక్కించియుండబోలును. వచ్చెడివారొక గదితరువాత నొకగది బరీక్షింపుచు నంతకంతకు దగ్గరబడుచుండిరి. వారుతమకొరకే యట్లువెదకుచుండిరని యోగిగ్రహించెను. శత్రుబలమెంతయున్నదో యాతడుగనులారజూచెను. మించినచ్చినది. ఇంకలాభము లేదనిగాబోలు నాతడు పలాయనసూత్రమునుబఠింపుచు నర నిముషములో నదృశ్యుడయ్యెను.

లోనజొచ్చినవారిలో నొకడు లాంతరుజూప “నటుగాదిటు—ఓరీ? ఎవ్వరును గనబడరే? దుర్మార్గులెందో దాగియున్నారు. ఏదీ? ఇటు లాంతరుతెమ్ము బాబా”యనుచు సంభ్రమంబున మందిరమంత

యు బరీక్షింపుచుండిరి. గాని వారికెవ్వరునునయనపథమునఁబడలేదు. బయట సాయుధులై వేచియున్న కొందరు "వారెప్పుడు వత్తురో? ఏదారినివత్తురో? జాగ్రత" యనుచు వారిలోవారు మెలకువదెలియ జెప్పుకొనుచు వేచియుండిరి. కాని వచ్చువారెవ్వరు? ఆమందిరమున నెవ్వరున్నారు? సరి? యున్నచో నెందుబోయెదరు?.

వారాభవనమంతయు వెదకి వెదకి వేసారిరి. పిమ్మట పైయంతస్తు మరలక్రిందియంతస్తు మరల పైకి, క్రిందికి నాతీరున ననేకతడవలు దిరిగిరి. మూలమూలబరీక్షించిరి. గానియేరీ?అందెవ్వరునుగానరారే? మనుజులే యందింతవఱకును మాట్లాడుచున్నచో సరీ? వారెట్లు మాయమైపోయిరి? వారికి తిరోహితశక్తియున్నాదా? లేక దిరస్కరిణి విద్యాప్రభావమున్నదా? ఏమో యిది చూడ చిత్రవిచిత్రాతి విచిత్రమహావిచిత్రముగా నున్నదే.

భవనమంతయు బరీక్షించుట బూర్తియైనది. ఎంతవెదకినను వారికండ్లకు పెంటపోగులు—గబ్బిలపు పెంట—గబ్బిలములు—యెలుకలు—ఒకటిరెండు పందికొక్కులుదప్ప నింకేమియుగానవచ్చుట లేదు. అవిగూడ స్వేచ్ఛగనింతకాలమును జీవించిన మానోటఁమ్ముగొట్ట నిందీభూతము లేలబ్రవేశించుచున్నవిరాభగవంతుడాయనుచు, కిచకిచ మనుచు-బుసగొట్టుచుపైకెగయుచు,నిచ్చవచ్చినరీతిపరువులిడుచున్నవి.

వారలసిపోయిరి. బైటనిలచిన వారికేసంగతియు. దెలియక వారుగూడ లోన బ్రవేశించిరి. ఇందరును ప్రొద్దు నెవ్వరిని బట్టుకొనవలయును? "బాబూ! తమరు పొరబడియుండలేదు కద?" యని యెట్టకేలకొకరక్షకభటుడు ధైర్యమున శరచ్చంద్రుని బ్రశ్నించెను.

శర:—మీకు మతిపోవుచున్నట్లున్నది. ఒక్కక్షణము వారిని దగ్గఱగటజూచి యంతటి పనిసికి నేబూనుకొనలేదు. సాయంకాలమారు గంటలనుండియు వీరిని నేననుసరించుచున్నాను. వారితోమాట్లాడితిని వారికడనేనిదురించితిని. వారి రహస్యసంభాషణనంతనువాలించితిని. అట్టియెడ నేనుపొరబడుటయా? కల్ల—కల్ల. ఆలోచింపగానీభవనమున

కింకొకమార్గమేమైన నున్నదని నాయూహ. లేకున్న వారదృశ్యులగుట యొక్క విషయము మెచ్చదగియున్నది.. వారు హంతకులే కానిండు. చోరులే గానిండు. దుర్మార్గులే గానిండు. ఎవ్వరైనను మనమింతమంది యుండగనే మనకండ్లదుమ్ముగొట్టి వారెంత చల్లగ దప్పించుకొంటిరో జూచితిరా? అందుచేతనే వారిగృహము నాశ్రయించియున్నారు. కావలదు దైవము వారికనుకూలించుచున్నాడు. ఇట్లెంతకాలము వారియాటలు సాగునో చూచెదను. నేడు గాకున్న రేపైనను నాచేత బడకమానరు. అదినిశ్చయము. ఆశ్చర్యము ఎంత చక్కగ దప్పించుకొంటిరి?

ఒకడు:—బాబో! అయినవారేనా భోగముదానిజంపినయపరాధులా?

శర:—ఇది చెప్పజాలను. ఎవ్వరైనను వారపరాధులనుమాట నిక్కమము. అది వారి యుత్తరప్రత్యుత్తరముల మూలముననే విశదపడుచున్నది. ఆనాడీనీచుడే నన్ను బంధించినవాడని మాత్రము నిశ్చయముగా జెప్పగలను అందుచే నాడాతడు వ్రాసిన లేఖనుబట్టి తానొక హత్యానొనరింపబోవు చున్నట్లు విస్పష్టముగావించియున్నాడు. ఆతడు వ్రాసినట్లుమాలతివధనాటి రేయి యేజరిగియున్నది-ఇంకను నాతడీహంతయనుటకనేకనిదర్శనములున్నవి. సరే ఇకమనముబోదమురండు

ఇంకొకడు:—బాబూ! పాడుపడిన దేవాలయములలోను. ఇండ్లలోను తోటలలోను దయ్యములుండునని మాతాత జెప్పుచుండెడివాడు. అవి చక్కగ మనుజులవలెనే మాట్లాడగలవట. ఆడగలవట. పాడగలవట. వాటికన్నివిద్యలును వచ్చునట. ఒకవేళమీతోమాట్లాడి యీరీతి నాటకమాడించినవాదయ్యములే యేమోయని నాకనుమానముగానున్నది. ఈమేడజూచినప్పటినుండియు నా......

అనుచుండగనే యాతని మాటలకడ్డువచ్చి శరశ్చంద్రుడు "! ఛీ ఛీ! నోరుమూయుము. ఇట్టిపిరికిపందలు పోలీసు యుద్యోగమునకు గూడ నర్హులా? అప్రతిష్ఠ—ఛీ ఛీ" యని గట్టిగ జీవాట్లు బెట్టెను. అందరును కిలకిల నవ్వదొడంగిరి.

ప్రథమఖండము సంపూర్ణము.

# రత్నపేటిక

## ద్వితీయ ఖండము.



### పూర్వ చరిత్ర.



వర్తకస్థలములలో బూర్మామునుండియు నెన్నికగన్న మహా పట్టణములలో రంగూన్ యొకటి. దీనినే రంగమందురు. నాటికిని నేటికిని గూడ నీపట్టణము దరిద్రులపాలిటి ధనరంగము. ఏయెడజూచిన వేల కొలది యంత్రశాలలు నిత్యమును లక్షలకొలది పేదల బోషించు చుండును. వర్తకసంఘముల నేకములిందుగలవు. ఒక్కప్రక్క సముద్రము నిరుప్రక్కల రెండు నదులునుగలసి యీపట్టణము చిన్నద్వీపము వలెనే జూపరకానందదాయకముగనుండును. ఇంక సముద్రవ్యాపార మునకు మితిలేదు. హిందూదేశమునందేమూలకైనను సర్వసాధారణ ముగ నన్నిసరకులును మూడుపాళ్ళురంగమునుండియే వచ్చుచుండును. వింత వింత వస్తువులకెల్లను రంగము పుట్టినిల్లు.

నేటికిని మనదేశమున నిలువనీడలేక. తినగూడును, గట్టవస్త్రములును లేక మలమలమాడిపోవుచున్న పేదకుటుంబముల నేకములు రంగముజేరి, కూలినాలి జేసియో, విద్యయున్న నేయుద్యోగమైనను జేసియో, కొలదిగ వ్రాయనుజదువను, మాత్రమే నేర్చియున్న తుదకు తపాలాకచేరీకడనిలచిపరులయుత్తరముల వ్రాయనుజదువనుజేసియో యె[illegible]మోవిధముల తమజీవితము లతిసౌఖ్యప్రదములుగా గడపు

[illegible]టమెల్లరును నెఱింగినవిషయమే. రంగముబోయియదృష్టవశమున [illegible]కొలది ధనమార్జించి మున్ను బేరుప్రతిష్టలు లేక చెడిన ఫకీరు[illegible]దో దయనామములఁజగద్విఖ్యాతిగావించిన వారలనేకులుగలరు. అయిన నావిత్తమారంగముననున్నంతవఱకే నిలచును. అది శాపముగాబోలు. ఎట్లయినను నీరోజువరకును జనులలో "చెడినరంగము చేరికొందుము. రంగంపడవనెక్కాలి—బంగరుపల్లకీ నెక్కాలి" యను సామెతలు సామాన్యములై యొప్పుచున్నవి.

ఆకాలమున బొంబాయి నగరమున, ప్లేగుచే మాతాపితలను సుగుణవతియగు భార్యను, గోలుపోయి, దీనుడై, పంచవర్షప్రాయుడగు సుతునిమాత్రము దోడనిడికొని, సామాన్యస్థితిపరుడగుట;యున్న రొక్కమెల్ల జేతబెట్టి, రఘునాథపండితుడు ప్రాణభయమువాపుకొన రంగము జేరెను. కులమున గుజరాతీ బ్రాహ్మణుడు. అంతగా చదువు లేకపోయినను రఘునాథునకు పండితశబ్దాంతనామముకులాచారమై, వంశపారంపరముగా వచ్చుచున్నది. అందుచేనీతడుగూడ పాండిత్యము లేని పండితుడాయెను.

రఘునాథపండితుని యేకపుత్రుడు మధుసూదన పండితుడు. ఈతడు బాలుడగుటచేతను, రఘునాథుడంత ధనవంతుడుగాకపోవుటచేతను, నాతడింక ద్వితీయకళత్రవాంఛ వదలుకొని, తనకుమారుని భావిసౌఖ్యమునకై పాటుబడసాగెను. ఈ తెగవారిలో నన్నేకులు ప్రఖ్యాతివహించిన రత్నవర్తకులు. రఘునాథుడుగూడ న్నదేనియొక వ్యాపారము జేయుచుండినగాని, తనవద్దనున్న స్వల్పవిత్తమెంత కాలము సరిపోవును? కూర్చునిదినినచో గొండలుదఱిగిపోవునని యాతడెఱింగిన విషయమే. అయినను కొంతకాలమాతడు నిర్వ్యాపారమున బ్రవర్తించుటంజేసి వ్యయమైన రొక్కముబోను మిగిలిన స్వల్పము నేయాతడు మూలధనమొనరించి దొలుత్తొల్త ముత్యాలవర్తకము బ్రారంభించెను. వర్తకపుజిక్కులన్నియు నాతడీదివరకే కొలదిగ నెఱింగియు[illegible]ను దాన నాతడి[illegible]ను ప్రారంభించిన యీవ్యాపారమాతనికంతకష్టముగ

దోచుటలేదు. కొలదిమాసముల కాతనికా యూరనన్నిక పెద్దవర్తకుల స్నేహమబ్బెను. నలుపురి పెద్దలతోబాటు ప్రజలెల్లరును రఘునాధుని పేరుగూడ జెప్పుకొన మొదలిడిరి. శ్రీకటాక్షవీక్షణ లేశంబు లేనరుని యందు బ్రసరించునో యాతనికడ యశశ్శ్రీ వసించుట కేమికొదువ.

ఇట్లు నాల్గువత్సరములు గడచి పోయెను. రఘునాథుని యశోలతలాతని వాణిజ్యముతోబాటు మిన్నంట జొచ్చినది. ఏప్రక్క జూచినను రఘునాథపండితుని నామసంకీర్తనములే. ఏవంక నాలించిన నాతని సుగుణసంపత్తిని గీర్తించుపదములే వీనులబడుచున్నవి. ఐశ్వర్యమున్నందుకు దోడు సుగుణగణములు, వినయము, వితరణము, దైవభక్తి, ఇంకను నాతని యశోలతకు దోహదమేమిగావలయును? అంతదనయిచ్చవచ్చిన తెలుగున మంజులలతాంతసుమఫలభరితంబై త్రిభువనములను బ్రాకిపోవుచున్నది,

ఇప్పుడాతడు ముత్యాలవర్తకుడుగాడు. రాజాధిరాజమకుటాంగదవిరాజమానదివ్య రత్నవాణిజ్యమిప్పుడాతనికి ఊతిక లేకుండ జేయుచున్నది. ఉదయమాదిగ క్రయవిక్రయములకై జనుదెంచు నరజనులశకటముల నేకములిప్పుడాతని సౌధముకడనిలచుచున్నవి. గుమస్తాలనేకులు ప్రతినిముషమునందును లెక్కలనుగుచు నేయుచున్నారు. వేలకొలదిగ రొక్కమునునుమాటో యుచు లెక్కలజూపుచున్నారు. చింకి పేలికల ధరించి, దక్షిణహస్తముజూపి "తల్లీ! మాపూర్వపుణ్యవశమున నీదర్శనభాగ్యము మాకబ్బినది. ఇంక మాదారిద్ర్యదేవత వదలిపోయినది." యని పలుగతుల కీర్తించుచు ప్రభువుముఖంబుల నెదుట నిలచు బిక్షుకుల లెక్క నెవరుచెప్పగలరు. అహా! కాలచక్ర పరివర్తన మెట్లుండునో?

తల్లీ! పద్మాలయా! నీలీలలత్యాశ్చర్యకరములు నీచేష్టలత్యద్భుతములు నీయునికియత్యద్భుతము. నీకటాక్ష వీక్షణమాలికలత్యద్భుతములు- వేల్పుల నీ బింబాధరంబున చిరునవ్వులయుండు, నీదివ్యానయనంబు జగంబులక్షణమాత్రమే దీనునిజూచునేని, యామనుజుని జీవనపరివర్త

నమే మహాద్భుతము-నీచర్యల బ్రహ్మాదిదేవతలే గనగొన జాలరు న్నారు. నీవున్నదే స్వర్గము—హా! నీకొక నమస్కారము.

మధుసూదనునకిప్పుడు దశవర్షారంభమైనది. ఆ బాలుడు దివ్యతేజోవిరాజమానుండై మన్మథునిపాలిటి మన్మథుడగుచుండె ను. నునుజెక్కుటద్దముల గులాబీ పుష్పించుచుండెను. మేనెల్లను జక్కని బాలుగారుచుండెను. పెక్కుమాటలేల? నాతడు సౌందర్య నిధి. సౌందర్యమే యాతని సొత్తైయుండెను.

ఆతనికి విద్యాప్రదానము గావించుటకు రఘునాథుడొక యాచార్యుని నియమించెను. కుబేరుని యాశ్రితమునుండ సిగ్గుగింపని వాడెవడు? ఆచార్యుడు నిత్యమును దనయావచ్ఛక్తిని వినియోగించి బాలునకు విద్యగఱపుచుండెను. అదేమిచోద్యమో? అత్తగోడండ్రా కళావున నిలువ నిచ్చగింపరుగదా. వారికి స్వభావవిరోధము. జీవములతోగూడ వారి విరోధమును విధాతయే తలపోయుచుండును. అయ్యది దేవతలకుగాదు వారి పితామహులకైనను తప్పనిది.

అట్లే మధుసూదనుని గమల మోదప్రీతితో జూచికొనుచుం డెనో భారతియాతయసూయతో జూపుచుండెను. అట్టి ధనాఢ్యులకు విద్య రాకున్న నష్టమేమి? కాని రఘునాథుడీసంగతిని దలచుకొన్నపుడు మాత్రమొకటి రెండు భాష్పబిందువుల రాల్పకపోయెడివాడుగాదు. ఇంతకును విధివిధానమెట్లున్న నట్లగాక తప్పదని యూరకుండెను.

విధి మొక్కటియు నృపు మొక్కటియునగునా? విద్యయంతగా రాకున్నను రఘునాథుడు మాత్రము తన యేకపుత్రుని బ్రాణముల కన్న నెక్కుడు మచ్చికతో జూచుకొనుచుండెను. ఆతనికి సంపదలకు గొదువ లేదు. కాని యీతియాతయు జూచి సంతసించుటకాతని జననీజనకులు పరలోకగతులైరి. పరలోకగతులైరి సరేకదా, సుగుణాగనిధానయు, సుందరియునగు భార్యగూడ లేబ్రాయముననే గతించెను. ఈదుఃఖా గ్నిమాత్రమాతని ననేకగతుల దహించుచునుండెడిది. కాని చేయునదే మున్నది? ఆతనికిపుడు నలుబదివత్సరముల వయస్సు మఱలవివాహ

మూడుట కాతని మనముంగీకరించుటలేదు. ఏలనన బుత్త్రునకీడు వచ్చుచున్నది. అల్పకాలమున నాతడు యౌవనుడగును. ఇంక దనగృహమభివృద్ధి నొందగలదు. ఇప్పుడాతడు బెండ్లాడిన దనకుమారుని భావిసౌఖ్యములకెన్నియో యంతరాయములు గలుగవచ్చును. ఆకారణమున నాతడు దనవివాహవిషయిక ఆశాలతలనన్నిటి నొకేసారిగ ద్రెంచివైచెను. నలువదివత్సరములున్నను యాతడు యౌవనునిగన్న సుదృఢముగానుండెను. మునుపటివలె బేదవాడుగాడు. మహైశ్వర్యసంపన్నుడు. నిత్యభోగియగుట నాతనికింకను భార్యయందలి వైరాగ్యముగలుగలేదు. తనసతికాపురమునకరుదెంచిన యచిరకాలములోనే యీ సూనునిగాంచి త్వరలోనె దన్నువీడిచనెను. అప్పటికాతడు సంసారాబ్ధిని సంపూర్ణముగమధించియాదలిదివ్యామృతమునించుకైనను గ్రోలియుండడు. ఇంతలోనె జేతికవ్వమూడియడుగుబట్టిపోయినది. మఱల దానిని బైకెత్తుతెరగెద్ది? ఇంక సంసారసుధాపానమెట్లబ్బును.

అందుననే కానర్థములు వాటిల్లునని యాతనికి బూర్ణముగా దోచెను. ఈ యాలోచనము లాతని సంతతమును గలంచివైచుచుండెను. ఏమిజేయుట కాతనికిదోచకుండెను. ఎంతయైశ్వర్యమున్న నేమి? "లేబరముగాదె గృహలక్ష్మిలేనిబ్రదుకు" అను పెద్దలవాక్యము సత్యమా?

ఇట్టియాలోచనలతో నాతడిపుడు బిచ్చివాడైపోవునా యేమి? ఏమో? భావిగతియెట్లున్నదో యెవ్వరెఱుంగుదురు?



౨

సూర్యుడపరాద్రిగ్రుంకుచుండెను. సంజకెంజాయలు దిశలెల్లనలుముకొనికాలాంగనరక్తాంబరధారిణియై. రక్తారక్తమాలాలంకృతయై

క్షులభువి నెల్లడిలకించుచున్నట్లుండెను. వివిధ కుసుమపరాగ సౌరభంబుల మెల్లన మోచుకొనుచు, మందమలయసమీర కుమారకుసుమందమందగ మనంబుల జనుదెంచుచు, నసముదాయంబుల కమందానంద మొనగూర్చుచుండెను. శకుంతసంతానంబులుదరుకోటరంబుల జేరి, ప్రియాగమనంబులకై నిరీక్షింపుచు, శ్రావ్యకంఠముల మధురగీతముల బాడుచుండెను. జగమెల్లను మధురరసార్ణవంబున మునిగిదేలుచుండెను. బాహ్యోద్యానముల వివిధతరులతాగుల్మములు మధురతరసుగంధము లీనుచుండెను.

జనులెల్లను జీవనోపాధికై శరీరవ్యాయామ మొనర్చి, పలువిధముల కష్టమునొంది పేదసాదలెల్లరును, బురబాహ్య ప్రదేశముల జేరి, విలాసపురుషులు, ధనయౌవనమదోన్మత్తులు, నిత్యానంద మయజీవులు, నడచియు, శకటారోహణము లొనర్చియు, బలు తెఱంగుల మిత్రవర్గములగూడి వనవిహారముల దమ విలాసములినుమడింప జేయుచుండిరి. సంతతానంద వికసితనయనారవిందులగుచు శ్రీకృష్ణాపరావతారులగు గోపబాలురు మెల్లనమురళి మ్రోయింపుచు, తాళానురూపముగ నృత్యమొనర్చుచు గోవులనదలింపుచు బసుగణంబుల నిండ్లకుమరల్చుచుండిరి. జగముసర్వము నానందమయమై గాన్పించుచుండెను.

అట్టియెడ పవనజవనతురంగద్వయము బూన్చిన శకటారోహణమొనర్చి యెలప్రాయంపురమణీలలామయొకర్తు చేటివనున్న వేరెండు చెలితో ముచ్చటింపుచు, దరస్మితవదనాంబుజము ప్రేక్షకులకుగానరాకుండ మేలిముసుంగువైచికొనియు, మాటిమాటికి జలదవిముక్త శీతకరుని బోల్కి మోమెడలించియే మోగకటమునుండి బరికింపుచు, రంగముపట్టణపు దక్షిణదిశయందున్న మధువనముం బ్రవేశించుచుండెను.

ఈ మధువనము గిర్ద్రిశేషుడగు గోహరలాల్ సర్వజనులకు నానందదాయకముగా నిర్మించి, పురజనుల విహారార్థమై

కానుకగా దనపేరున నొసంగియుండెను. ఇందు విహరించుట కెల్లరకును సమానాధికారములుగలవు. వనమధ్యమున రమ్యహర్మ్యమును, హర్మ్యమునకొకప్రక్క శంకరదేవాలయమును, దేవాలయమున కెదుట జిన్నతటాకమునుగలవు. తటాకముచుట్టును వివిధజాతుల ఫలవృక్షములుగలవు. వనమంతయు బలురకముల పూపొదరిండ్లతో నిండియుండెను. మల్లె, సంపంగి, సన్నజాజి, గులాబీ, మాలతీ మున్నగు ననేక జాతుల పూమొక్కలు నయనానందకరముగా బుష్పించి మనములకెంతయు హాయిగొల్పుచుండెను. అందువనమాలి యొకడు సంతతముగాచుచు, దరుసంరక్షణమొనర్చు చుండుటచే నందలి ఫలవృక్షముల ఫలముల గోయనెవ్వరికిని వీలుగాదు. ప్రజల కట్టి స్వాతంత్ర్యమే యిచ్చియున్న యెడల నీసరికామధువనము మరుభూమిగ మారియుండవలసినదే. ఇచటి సౌఖ్యమెల్లరెరింగిన వారే గావున విహారేచ్ఛగల స్త్రీపురుషులెల్లరును నిత్యము నీవనమునకే నరుదెంచుచుందురు. వనమందెల్లడలను రాతిబలకలతో నాసనములమర్పబడియుంటచే హాయిగగూర్చొనిమలయానిలసౌరభములెల్లరును జూరగొనుచుందురు.

ఆవచ్చిన శకటము వనప్రవేశ మొనరించి యొకవృక్షముకడ నాగినతోడనే యందుండిన యువతులిద్దరును దిగిరి. వారిలో నొకతె ప్రాయంపుమిఠారి. ఇంకొకతె వయోధికయగు ప్రౌఢవలె జూపట్టుచుండెను ఆజవ్వని సన్నని బట్టలంగానొకదానిఁగట్టి దానిపై నీలివర్ణపుజరీయుత్తరీయమును వల్లెవాటుగ వేసికొనియెను. ముకమలు కంచుకము మోచేతులవఱకును వ్రేలాడుచుండెను. తలపై సన్నని మేలిముసుంగు గీలించియుండెను. శరీరము గాంతివంతమై సౌవర చ్ఛాయల ధిక్కరించుచుండెనుముఖము షోడశకళాపరిపూర్ణసుధాకరు నోడించుచు, జూచుటకు షోడశవర్షప్రాయమై గన్పట్టుచుండెను. ఆలావణ్యవతి వేషభాషాభూషణంబులజూడ యవనస్త్రీ రత్నమని దోచుచుండెను. ఎవ్వతెయైనను జగదేక సుందరియని మాత్రము

జెప్పకదప్పదు.

రెండవయామె సామాన్యవేషభూషలం దాల్చి యుంటచే యామెయొక సామాన్యయువనకాంతవలెజూపఱుకుగాన్పించుచుండెను ఆమె వయస్సు ముప్పదివత్సరములకించుక మించియుండును. వారు శకటావరోహణముగావించి, బండివాని నచ్చటనే యుండనియమించి, వనవిహారమునకై వెడలిరి. వారట్లు కొంతవరకా వనమధ్యమున దిరిగి తిరిగి తుదకు తటాకతీరమున నొకతరుచ్ఛాయనాసీనులై యటునిటు జూచుచు నిట్లు బ్రసంగించుకొనుచుండిరి—

సుందరి:—అమ్మా! పొద్దుబోవుచున్నది గదా! ఆతడీసరికి వచ్చియుండడు నేమో?

రెండవ:—వచ్చిన మనకంటబడకుండునా? ఇంకను వచ్చుటకు జాలతడవున్నది. ఎల్లపుడు నాతడీదేవాలయమునకు రానిదే యెందును బోడు. అది నే నెఱింగిన విషయమే.

సుందరి:—ఏమో? నీవాతని గాంచిన నానవాలు బట్టగలవో లేనో యని సందేహించుచున్నాను.

రెండవ:— మిహిరా! ఎంత వెఱ్ఱి మాటాడితివి? ఆతని నేను బోల్చికొనలేకపోవుటయా? చాలు చాలు. ఏ తమాట? ఈవరకే నే నాతనితో నెంతో బరిచయముగావించియుంటిని. లేకున్న నీతో నంత నిశ్చయముగ నిట్లు జెప్పగలను. అనుచుండగనే వెనుకనొక శకటము ఱొదచేయు ధ్వనియగుట నామె వెనుదిరిగి చూచి యానందమున "మిహిరా! అదిగో! అదిగో! వచ్చుచున్నాడు. అదును ఆబండియే. నేను బాగుగ నెఱుంగుదును. వాడే" యనుచు లేచి నిలువబడెను.

ఆజవ్వని పేరు మిహిరాబీబీ. ఆమెగూడ నొందరగ లేచి నిలువఁ బడి దుస్తులనొకపరిసవరించుకొనెను. అంతలో నాబండినుండి యొక పురుషుడు, రమారమి నలువది వత్సరముల ప్రాయంపువాడు దిగి, తటాకము దరికేగి, యందు పాదప్రక్షాళనము గావించుకొని యాలయము జెసబోసాగెను. పోవుచు బోవుచు నేలకో నాతడొకపరి

నీయువతీద్వయముఖావలోకనమ్మొనర్చి కొంతదూరమరిగి మఱల జూచి యాలయమున కేగెను. అట నాతడు బ్రదక్షిణమొనర్చి దేవునకు భక్తిశ్రద్ధలుదొలుకాడ సాష్టాంగనమస్కారముగావించి, కొంతవడి యాతని బ్రార్థించి వాయుసేవనమునకై యావలకరుదెంచెను. తటాక తీరమున నాతడు బ్రవేశించుసరికాతని నయనపథమున దొలకరి మెఱుపువలె నొక్కత్రుటికాలమాసుందరి ముఖాంబుజము మెరసి పోయెను. తోడనే యాతనిగనుల జీకటులుగ్రమ్మ, దిగ్భ్రమనొందిన వానిభంగి నాతడెందేగుటకును దోచక నాతీరముననే యొకవృక్షము నాశ్రయించెను. అంత నాముదుసలికాంత వానికడకరుదెంచి సవినయముగ నమస్కరించెను. పురుషుడామెంగాంచియావలకేతెంచియుంటచే గాబోలు యథావిధి గుశలప్రశ్న మొనర్చెను.



౨

స్త్రీ:—అయ్యా! తమరీదినమున నింతయాలస్యముగ దయ చేసితి రేల?

పురు:—కొన్ని తొందర వ్యవహారములుంటచే వేగముగ రావీలులేక బోయినది.

స్త్రీ:—"చిత్త"మనుచు దానుగూడ నాతనికిగొంతదూరమున నాసీనయయ్యెను. కొంతవడి వారిరువురును. మౌనముద్రాంకితులై యుండిరి. అంతనామెనిలచి "అయ్యా! నాకింక సెలవొసంగుడు. నేనిక నింటికి నాతనయతో బోవలయును. చీకటిబడుచున్నది. ఆమె నీతనయ మిహిరయా? ఆమె నేడిట్లేల వచ్చినది?" యని ప్రశ్నించెను.

మాధవి:—నేడామె శరీరమందస్వస్థతగానుంటచే వాయు సేవనమునకై యిట్లరుదెంచియున్నది.

పురుషుడు:—మాధవీ! నిన్న నేదో మాటల సందర్భమున

మిహిర నాతనయయని జెప్పితివిగాని యపుడే సిన్నడుగమఱచితిని. మిహిర పాత్రియెవ్వఁడు? వాడుజాతివాడు? ఆమెజననీజనకు లెవ్వరు?

మాధవి యాతనికేమియు బ్రత్యుత్తరమీయక దలవాల్చి బాటన వ్రేల నేల వ్రాయుచుండెను.

పురు:—నా ప్రశ్నలకుత్తర మిచ్చుటకు నీకేమైన సంశయ మున్నచో జెప్పనక్కర లేదు. నీవేమో యాలోచించుచున్నట్లున్నది.

మాధవి:—(నగుచు) అయ్యా! తమరు దారశీలురు. మహాను భావులు, తమకడ నామె విషాదపూరితదినచరిత్రి చెప్పుటకై సంశ యించుచున్నమాట వాస్తవమే. అదియే నాయాలోచన.

పురు:—ఏమీ? ఆమెచరిత్ర కడు దీనమా? నేవినుటకెట్టి సందేహమును నీకు లేనియెడల జెప్పినచో, నందునాసహాయమేమైన నుపకారియగునెడల నేనవశ్యము దోడ్పడియెదను,

మాధవి:—తమవంటి వారామెచరితము వినుటయే యామెకు శ్రేయస్కరముగాన మనవిజేయుచున్నాను. వినుడు. మిహిర జననీ జనకుల కేకపుత్రిక, వారే దేశమువారో, యేజాతివారో నేనెఱుంగను పదిసంవత్సరములకు బూర్వమొకనాడు పంచవర్ష ప్రాయయగు నీకన్యను, బారెండువత్సరముల బాలుడగు నీమెపినతల్లి కుమారుని దీసికొని యీయామె జననీజనకులీయూరేదో కార్యార్థమై వచ్చి, యింటికై తిరుగుచుండుటచే, నాటిబసకై నాయింటనొకభాగము వారికిచ్చి యుంటిని. వారును సంతుష్టాంతరంగులై యానాడచ్చటనే వంటజేసి భుజించిరి, మఱునాడుదయమున నేబిల్లలనిఱువురనింటికి నిలిపి భార్యా భర్తలిఱువురును సముద్రస్నానమునకై బోయియుండిరి. కాని నాటి మొదలు నేటివఱకును వారేమైరో వారిజాడ యించుకంతయును దెలియదయ్యెను. వారికొరకై యెంతయూ వెదికించి యుంటినిగాని నాప్రయత్నములన్నియు వ్యర్థములయ్యెను. అంతదలిదండ్రులు గానక మిగుల దుఃఖించుచు నీపసిగూనల నేనుజేరదీసి నేటివరకును పెంచుచుచుంటిని. వారిజననీజనకులు బోవునపుడు వారిసామానులతో

సహా పదిహేను వేలరూప్యముల రొక్కమును గొంత బంగారమును గూడనుండెను. ఇట్లుండ నాకెవ్వరును గావలసిన యాత్మీయులుగాని, బిల్లలుగాని లేకపోవుటచే, వీరినే నావారిగ నెంచి పెంచుచుంటిని. నాకేమియు నాస్తి లేదు. ఇపుడుగల సర్వస్వమును వారిదేగాని నాకేమియుహక్కు లేదు. తరువాత గొంచెము లోకజ్ఞానమెఱింగిన యీబాలుని విచారింపగ వారుయవనులనియును, పిఠాపురవాస్తవ్యులనియును దెలియ వచ్చినది.

పురు:—వారు యవనులా? అట్లయిన నీవు వారినేరీతి జేరదీసి పెంచుచుంటివి. నీవు హిందూయువతివి గదా?

మాధవియాతనిప్రశ్నకేమియుత్తరము నొసంగక చిఱునగవున దలవాల్చి నిలచియుండెను. పూరుషుడామె బలుకకుండుటగాంచి కొంతబడి కిట్లనియెను "మాధవీ నీదయాగుణంబులు గడుంగడు శ్లాఘాపాత్రములు. నీచరిత్ర మమానుషముగ గానవచ్చుచున్నది. హిందూవంశ సంభూతవయ్యును, మతభేదమనియైన విచారింపక, యనదలగు పసికూనల జేరదీసి సంరక్షించియుంటివి. ఇట్టి నీసచ్ఛీలంబును గొనియాడెదరు. దేవతలభినందించెదరు. నీకు సర్వదామంగళకరంబగుగాక—"

మాధవి తలవాల్చియే హీనస్వరంబున "అయ్యా! నేను హిందూయువతినిగా"నని మెల్లగబల్కెను. పురుషుడదరిపడియెను. "ఏమీ నీవు హిందూవంశమున జన్మింపలేదా" యనుచు నాతడు బలికి తలనిగిడ్చి [illegible] ముఖము నిరీక్షించెను.

మాధవి:—జన్మము హిందూవంశముననే.

పురు:—అట్లయిన నీవుమతాంతరమును స్వీకరించియుందువా?

మాధవి:—తండ్రీ! నన్నుక్షమింపుము. నాజన్మమా శోకము. నాచరిత్రయంతయు శోకము. నేనుశోకాపరావతారను. శోకమే నేను నేనే శోకముగ మెలంగుచుంటిని కాని యీయనదల సహవాస మబ్బిన నాటనుండియు నించుక సంతోష మనుభవించుచుంటిని.

తత్పూర్వమీ ప్రపంచసౌఖ్యముల నెల్లవిడచి మృత్యువునకై మొగము జూచుచుంటిని. కాని మీరల నన్ను సుఖమార్గమున బెట్టి యైహిక చింతల బాలుసేయుటకే పసికూనలే కారకులైరి.

అనుచు నామె కనులనీరు బెట్టుకొనసాగెను. పురుషుని మన మేలనో నీరైపోయెను. దయాళుడగు నాతని కనులగూడ భాష్పబిందువులలముకొనియెను. ఆతడు మెల్లగ "అమ్మా! గతించినదానికై విచారింపవలదు. కష్టసుఖములెల్లరకును సమానములే. నీదీనాలాపము లాలించుచున్న నెంతటి శాంతిగుండెయైనను గరుగక దీరదు. విచారింపకుము. కాని యొక్క సంగతి. అమ్మా నీవు మహమ్మదీయమత మేల స్వీకరించితివి? అది నేనడుగవచ్చునా?" యని దీనముగ బ్రశ్నించెను.

మాధవి యింక దుఃఖము నాపుకొనజాలకపోయెను. ఆమె కనుకొలకులనుండి యవిరళాశ్రుధారలు ప్రవహించుచుండెను. జగమంతయు నంధకారబంధురమైపోయెను. ఆమె కనుల దుడిచికొనుచు మెల్లగ నిట్లని జెప్పదొడంగెను.

"బాబా! నన్ను క్షమింపుము. నే మహాపాపురాలను. నా పాపములు క్షమింపరానివి. నేనెట్టిపాపపుముహూర్తమున నీభూమిపై బడితినోగాని బాల్యమందే జననిగతించెను. పదేండ్లువచ్చుసరికి జనకుడు కాలధర్మమందెను. అప్పటికే నాకు హిందూమతాను సారముగ వివాహమయ్యెను. నాభర్తకూడ దిక్కులేనియొక్క పక్షి. ఆతనికి వారసత్వగ్రామముగు రాధానగరమున బిత్రార్జితముగు ధనమంతగ లేకుంటచే జీవనమునకై నన్ను వెంటనిడుకొని యీయూరు జేరెను. ఇచట జేరిన యొకవత్సరమునకే నేను యువతినై కాపురము జేయ గడంగితిని. అప్పటికి నాపాపములెల్లను ఫలించినవి. నాభర్త యొకయాత్రిమధ్యమున బడి దుర్మరణమొందెను" అనుచు నామె కనులనీరు కాల్వలుగట్ట నేడ్వసాగెను. పురుషుడు "హరి-హరి" యనుచు జెవులమూసికొనియెను. కొంతవడి కామె కన్నీళ్ళుదుడిచి మరల నిట్లని జెప్పసాగెను. "అయ్యా! అంత నేను దిక్కుమాలిన

పక్కనై జేయునది లేకగోలున నేడ్వసాగితిని. స్త్రీనబలను. అప్పటికింకను నాకు సంపూర్ణజ్ఞానమలవడి యుండలేదు. నాదీనచరిత్రనంతయును గనులారగాంచుచుండిన మాపొరుగుమహమ్మదీయ యువకుడొకడు నన్ను దయతో జూడసాగెను. కొన్నిదినములాతని ప్రేమసంరక్షణచే సుఖమయజీవనమొనర్చియుంటిని. ఇట్లుండ" యనుచునామె మోమున చిఱునగవంకురింప సిగ్గున దలవాల్చి కొనియెను. పురుషుడదిగాంచి "ఏమైనది? చెప్పుము. భయమేల?"ననిపల్క నామె "యిట్లుండ మా ప్రేమకొన్నిదినములకు ప్రణయముగా మాఱిపోయినది. హితాహిత జ్ఞానశూన్యనగు నే నదియంతగా బాటించియుండలేదు, ఇట్లు రమారమి పదిసంవత్సరములాతని ప్రేమరాజ్యమున ప్రేమసూత్రముచే బంధింప బడియుంటిని తరువాత నొకయుద్ధము రేయి నాతడు నన్నువిడచి గ్రామాంతరమున కేగి మరల నింతవఱకును నానయనపథంబున బడి యుండలేదు నాకష్టచరిత్ర మీరీతిగడచిపోయినది" అనుచు నామె మరల నేడ్వదొడంగినది. పూరుషుడామెదానోర్చి "నీవింక విచారింప వలదు. నీవు పశ్చాత్తాపమున పావనమైతివి. పరమేశ్వరుడు నిన్ను క్షమించియున్నాడు. ఇంకజీకటులలముకొనుచున్నవి. బాహ్యోద్యాన ములనింతవరకుంచుట తగనిపని. "ఇంటికేగ మఱలుద"మని యూత డందుండి లేచెను. మాధవియునిలచి "మహాత్మా! రఘునాధపండితా! ఈమాదీనచరిత్రనంతను తమ చెవిని వేసియుంటిమి. నీవుదయార్ద్ర హృదయుడవై మమ్మాలించితివి. ఇంక మేము ధన్యులమైతిమి. మీ కృపమాపైయున్నదియే పదివేలు" అనుచు నామె దూరముననున్న మిహిరను బిలచి యాపూరుషుని వెంటనేనడువసాగెను. రఘునాధుడు ముందుబోవుచు నేలొకో మరల మరల వెనుదిరిగి జూచుచు బో సాగెను. మిహిరయాతనిసమీపముననే వెనుకంబోవుచు మాధవితో

మెల్లగ నేమో మాట్లాడుచుండెను.



౮

కామపిశాచమావరించిన మానవునకు లోకజ్ఞానము శూన్యమగు నను మాట నిక్కువము. మోహావేశపరుడగు నరుడు యుక్తాయుక్త విచక్షణలరయఁడు. జననీజనకులఁ గానఁడు. స్వపరవ్యత్యాసముల గనుగొనఁ జేరఁడు. ధనమును జిల్లిగవ్వకన్న నధమముగ నెంచి. వెచ్చింప వెనుదీయఁడు. మానమును గాసుకమ్ముకొనుచుండును. ప్రాణముల దృణప్రాయముగ నెంచుచుండును. మోహపాశబద్ధుడగు నరుని నయనయుగళికి జగమంతయు నంధకారబంధురమై దోచుచుండును. రేయింబవళ్లాతనికి సమానములు. మానావమానములు సమదృశ్యములు. మరుభూములాతనికి విలాసస్థానములు. ప్రళయాగ్ని కీలలాతనికి జాదనశీతలములు. కఠోరభయదనిర్ఘాత పాతంబులాతనికి బుష్పవర్షములు. ప్రళయమార్భటీ ఝంఝామారుతములాతనికి మలయానిలములు. అహో! మోహపిశాచమా! నీవెందరెందరి మహానుభావులనావరించి యసినీతిపరులఁగావించి యధఃపతన మొనరించుచున్నావు. ఎందఱిజ్ఞానశూన్యులుగాను, చైతన్యవిహీనులుగను జేయుచున్నావు. ఎందఱి మహాగ్నిజ్వాలామధ్యముననైనను నుఱికి నాశము నొందునట్లొనర్చుచున్నావు. ఎందఱిరాజాధిరాజుల మహైశ్వర్యముల క్షణమాత్రమున మ్రింగి ఆజన్మాంత భిక్షకులుగాఁ జేయుచున్నావు. సర్వలక్షణలక్షితులు ద్వితీయమన్మథులనందగు నెందఱి సుందరుల నిముసమాత్రమున చిత్రరూపులుగా నొనర్చుచున్నావు. ఎందఱిదీర్ఘాయుష్మంతుల నకాలమృత్యువువాతఁగూలఁద్రోయుచున్నావు. ఓ కామమా. నీలీలలత్యద్భుతములు. నీచర్యలమానుషములు. నీశక్తిని వర్ణింప నాదిశేషునకైన దరము గాదు. అట్టియెడ బుద్ధిశూన్యయగు నాయీలేఖిని నిన్నెంచఁబోలు

మహాదేవతామహాత్మ్యమును వర్ణింపసిద్ధపడి యేమాత్రము జయ మందగలను? అదిగల్లు. దేవేంద్రాదులనే నీవలలోన వైకొంటివి. సర్వ లోకములకును సృష్టిస్థితిలయకారుడును, సర్వగీర్వాణవందితుడసు విరించిగు కృష్ణునంత వానినే జేజిక్కించుకొని, వాడవాడలద్రిప్పి, వనములకుం దోలి, ముప్పతిప్పలబెట్టి, మూడుచెరువుల నీరుం ద్రావించి, నీపదదాసుగా జేసినావు. అట్టిచో మముబోలు వచోవిహీనులౌ గవులు నిన్నుం దలబెట్టుటకైన నసమర్థులు. తల్లీ! నీకొక జోహారు.

రఘునాథపండితునకిప్పుడు బూర్తిగ కామపిశాచమావరించి తలపై దాండవమాడుచు ధనసంపూర్ణాధికారమును జెలాయించుచున్నది. అతడిప్పుడు వెఱ్ఱివానికంటెకూడ వెఱ్ఱివానింబోలె గానవచ్చుచున్నాడు. రేయింబవళ్ళాతని కేనిముసమందు జూచినను యేతద్విషయక చింతలే ప్రత్యక్షీకరించుచున్నవి. ఆతని వ్యవహారమిప్పుడు బూర్వమునవలె సాగుచుండుట లేదు. పరులకాతని దర్శనమే యరుదైపోయెను. ఆతడిప్పుడు మంచముదిగి ఈవలనొక యడుగైనను బెట్టుట లేదు. ఆతనిరత్నపేటిక బీగముతుప్పుబట్టుచుండెను. ఆతని మహాదానమున నిత్యమును బరితృప్తులైన బేదలిప్పుడు దిక్కుమాలి వీధుల వెంబడిని దిరుగుచున్నారు. దాసదాసీజనుల సపర్యలిప్పుడాతని కనగత్యములాయెను. ఏమూడు జాములకో బహుకష్టముపై గది విడచి స్నానము జేసియో, జేయకయో, యింతకూడు నోటవైచికొని యాతడు మరల గది బ్రవేశించి, దీర్ఘాలోచనలతో బ్రొద్దులుబుచ్చుచుండును. లెక్కలు జూడవచ్చిన గుమస్తాలకైనను యాతనిదర్శనము దుర్లభమగుచుండెను. "ఏమోనమ్మా! బాబుగారి మనస్సంతయు మారిపోయినది. ఆతడు గంటికే కనబడడు. పిల్లవాని నేగన్నులారజూచుట లేదు. మనకంటబడుటకూడనా? ఐశ్వర్యాలకేంలోటమ్మా? ఇంతకూ వయసులోనున్నవారు. పాపము! భార్యలేదు. పెళ్ళాడమంటె యిష్టం లేదంటారు. ఏమన్నాళ్ళసి? యీడున్న భోగాలకే రోకలివంటిది చిగిరిస్తుంది. అదే బాబుగారివికారమేమో? ఈలాగు యికకొన్నాళ్ళుప్పుంటే

దివాణాం చెడి పోతుందమ్మా." అనుచు నీమొదలగు ననేక ప్రసంగములు దొలుత నింటదాసీజనంబులలోను, పిమ్మట నంత కంతకు గ్రామమంతటను బ్రాకజొచ్చెను. నిజమే. కామాగ్నికీలల శలభము వలె దగుల్కొని ప్రాణములతో బైటబడిన నరుడెవ్వడు? మోహకూపమున మునింగి తీరము జేరిన మానవుడెవ్వడు? అట్టి యదృష్టవంతులు లోకమున బహుస్వల్పము.

ఇప్పుడు రఘునాథుని మనోధన మపహరించిన మానవతి యెవ్వరు? అతనినిరంతరాలోచనాసాగరమునకు కారమెవ్వరి? ఎవతెయో యొక మోహనాంగిపై మఱులుగొననిది మోహ మంకురించుట దుర్లభము. అట్టి యంకురము సాధారణముగ యౌవనారంభవేళగాని మానవునకులభింపదు, ఒకవేళ నంకురించిన నది యౌవనవికారముగ బొడసూపి, మానవుడు గుర్తించుటకు దుర్లభముగనుండును. కాని యది యట్టిదిగాదు.

రఘునాథునకు మోహానురాగంబుల సంపూర్ణానుభవంబు గలదు. ఆతడీవఱకే సుతునిగాంచి జనకుడాయెను. ఆతని నెఱజవ్వన కాలముగూడ చాలవఱకు గడచిపోయెను. అయిన నిప్పుడాతని మోహనబాణమున కెఱయైన బాలికామణి యెవ్వరు? కుసుమము వికసించిన బరిమళముమాత్రము దాగునా?



౫

ఆమ్మా! ఏమైనది? కార్యమెంతవఱకు వచ్చినది?

మిహిరాభాయియు, మాధవియు, గృహాంతర్భాగమున శయన మందిరమున శయ్యపై మిహిరయు, ప్రక్కనే మాధవియు గూర్చొని సవిలాసముగా మాట్లాడుకొనుచుండిరి. ఎదుట పంజరమున నజిలుక ముద్దుపల్కులు బల్కుచు, నస్పష్టాలాపము లాడుచుండెను. కాని వానిని

వినువారెవ్వరు? శయనమందిరము రమ్యముగా నలంకరింపబడియుం డెను. పందిరిమంచమున దోమతెర సగమువఱకును వ్రేలాడుచుండెను కుడ్యపంక్తులు నూతనముగా వెలవేయబడి నిర్మలకాంతి పుంజము లీనుచుండెను. అందందు గోడలపై రమ్యములగు చిత్తరువులు వ్రేలాడ గట్టబడియుండెను. గదికి మధ్యస్థముగా దూలమునుండి క్రిందకు నాకుబచ్చని కాచపాత్రి వ్రేలాడుచుండెను. మంచమునకీవలనొకప్రక్క చక్కని మేజాయొకటి యమర్చబడి దానిపై తెల్లని వస్త్రమొకటి పరచియుండెను. ఆదానిపై గొన్ని పుస్తకములును, వ్రాతపరికరములును యుండెను. మేజాపై భాగమున కుడ్యమున విలువగల యద్దమొకటి వ్రేలాడుచుండెను. మంచముపై మెత్తని బాన్పును, రెండుమూడు దిండ్లనుగలవు. ఒకదిండుపై మిహిరదలవాల్చి యొరగాశయనించి మాధవితో ముచ్చటలాడుచు, మధ్యమధ్యతత్మలము సేవించుచుం డెను. మాధవి దంతపు బిడిగల చక్కని విసనజేతబూని తనకుదానే యొయ్యారముగ వీచుకొనుచుండెను. మిహిర సవిలాసముగ మాట్లా డుచున్నప్పటికి, ఆమె మనమున నెద్దియో యొండు దీర్ఘాలోచన మొనరించుచునేయుండెను. నడుమనడుమ నేవియో కొన్ని ప్రశ్నల నడుగుచు మాధవియొసంగు ప్రత్యుత్తరముల కామె సంతసింపుచుం డెను. వారిప్రసంగమేమో ఘనకార్య నిర్వహణార్థమని స్ఫురించు చున్నది. ఆయనబర్యవసానమేమో గనుగొందుముగాక. మిహిర మఱల "నమ్మా! కార్యమెంతవఱకు వచ్చిన" దని యత్యాతురతతో బ్రశ్నించెను.

మాధవి:—మిహిరా! ఎంతవఱకు వచ్చినదని యడుగనేల? నీవుగనులారజూచుచునేయుంటివిగదా. పిట్టవలలోజిక్కినట్టియున్నది. మఱల నేడు నేబోయి చక్కగ జక్కెరలొలుకునటుల ముచ్చటించి వచ్చితిని. ఆశ్చర్యము. నేబోవుసరికాతడు శయనాగారమున మంచముపై బండుకొని యేమోదీర్ఘాలోచనాపరుడైయుండెను. వానినిగాంచియు నేనుసరిగబోల్చుకొనజాలకబోతిని. అతడు కడుకృశించియున్నాడు.

కారణమేమో తెలియదు, కాని నాతో మాత్రము సంపూర్ణవాత్సల్యముననే మాట్లాడినాడు ఆతడిప్పుడు సరిగ వ్యాపారవిషయములనైన జూడకున్నాడనువదంతి. ఆతనికి గల విచారమేమైయుండునా యని నేను కొంతవరకాలోచించితిని. కాని నాకొక్కటి దోచుచున్నది. భాగ్యభోగ్యములకు లోపమేమియును లేదుకద. సుకులాచారుడగు కుమారుడు గలడు. ఇంకనాతనికి కొఱంతయేమున్నది? మనమను కొన్నట్లే గావలయును. అదియే నిక్కువమైన పరమేశ్వరుడు మనల నొకకంటజూచిన నింకమనకష్టములు గట్టెక్కినవన్న మాటయే.

మిహిరః:—అమ్మా! నీవు జాలసంగతులను గ్రహించితివే. నీఋణము నేనెట్లుదీర్పగలను నాకై నీవుబహుశ్రమలకన్నారగాంచుచు నేయున్నాను. చెవులార వినుచునేయున్నాను. పూర్వజన్మమున నీవు నాకెంతఋణపడియుంటివో యెఱుంగనుగాని కన్నతల్లికన్న నెక్కుడు సాదరమున బెంచి నన్ను బెద్దదానింజేసితివి. ఇప్పటికిని జేయుచున్నావు ఇక ముందింతకంటెను నత్యుత్తమమగు మార్గమును జూపనుంటివి. అమ్మా! నీఋణమేడుజన్మములకైన దీర్పగలనా?

మాధవి:—బిడ్డా! నీమనమున నట్టివిచారములెన్నడును బెట్టుకొనకుము. నీవుమహదైశ్వర్యవంతురాలవై పరిపూర్ణసుఖనిధానమవై యుండుటే నాయిచ్ఛ, నేనుగాకున్న గన్నబిడ్డకింకెవ్వరు జేతురు? తల్లీ! నీజననీ జనకులేమైరో, వారెట్టివారో నేను బాగుగనే యెఱుంగను. ఒక్కనాడుమాత్రమే వారి స్వల్పపరిచయమును గావించి యుంటిని. వారెడబాసినది మొదలు నేనే మీకు గన్నతల్లిని. దిక్కుమాలినపక్కినై మృత్యుముఖమునబడనుంకించు నన్ను మీరుబునరుద్ధరించి నామేన బ్రాణములనిల్పితిరి. కనిపెంచని గొడ్రాలినైనను నాకు మఱల బుత్రిపుత్రికావాత్సల్యమొనగూర్చి మాతాసౌఖ్యమును జవిజూపి యుంటిరి. వెఱ్ఱితల్లీ! నాకింతకన్న నేమి గావలయును? మీయానందమే నాయానందము. మీసౌఖ్యమే నాసౌఖ్యము. ఈనాశరీరము మీయది. ధనవిహీననైనతటి మీసాంగత్యమున్నంజేసి, మీ

యర్థమున నామెను పెంచియుంటిని. దీనిని మీయుచ్చవచ్చినట్లు విని యోగించుకొనవచ్చును. ఈసకలసౌభాగ్యములును మీయవి. అందుచే దల్లీ! యొజ్జ-మీజననీ జనకులను మాత్రము దెచ్చి యొసంగజాలనుగాని, తక్కుంగల సర్వసౌఖ్యములను మీకొనగూర్చి, యమితానందవార్ధినోలలాడెదను. ఇంతకన్నను నాకేమిగావలయును బిడ్డా! అంతకును మీరు నాజెప్పుచేతలలో బెరిగి నామాటలవినుచుంటచే సర్వమును మనకనుకూలింపక దప్పదు.

అనుచు నామె గంటదడివెట్టుకొని, చేలాంచలమున కనుగొలుకుల జాలువారు యశ్రుకణంబుల దుడిచికొనియెను. మిహిర గూడ దుఃఖము నాపుకొనజాలక నోటమాటలేక యెట్లో "అమ్మా!" యని యామె యొడిలో దలనిడుకొని రెండుచేతులనామెంబిగ్గకవుంగలించుకొని వెక్కి వెక్కి యేడువసాగెను. పాపము. మాధవి యామెం జేరదీసికొని మఱింత విలపింపసాగెను.

ఇంతలో వీధితలుపు నెవ్వరో ద్రోసికొనికాలిజెప్పుల "టక్కు-టక్కు"మని చప్పుడుజేయుచు, "అమ్మా! జీ అమ్మా! పలుకవేమే అమా?" యని బిగ్గరగ గొంతెత్తి యరచుచు, లోనబ్రవేసించి, పాపము మాతాసుతల పవిత్రశోక సమాధికిభంగము గలిగించెను. ఆగంతకునిజూచినతోడనె మాధవి యొడినుండి మిహిర లేచి, కనుల చీరచెరంగున దుడిచికొనుచుండెను. కాని అంతమాత్రమున నామె దుఃఖముపశమింపలేదు. మాధవియు తోడనే మంచముడిగ్గి వచ్చిన యాతనింగాంచి "నాయనా! ఎందుబోయితివి తండ్రీ? నీకొఱకై కంచమున నన్నము బెట్టి ఎంతసేపైనదిరా? వ్యర్థముగా నింతవిఱకూరనేల దిరిగెదవు? అన్నముపై నీగలు ముసురుచున్నవి. రా. వేగము. రా" యనుచు నామె పాకశాలకు ముందునడువ సాగెను.

ఈతడు మిహిరకు బినతల్లికుమారుడు. ఈతని జననీజనకులు బసితనముననే గతించుటంజేసి తన జ్యేష్ఠమాతకడ చినతనమాదిగ బెరిగియుండెను. కానిపాపమాదంపతులు నాడుసముద్రస్నానార్థమేగి

[illegible] విహారితో బాటీతనిని గూడ మాధవి యల్లారు ముద్దుగ బెంచుచుండెను. ఈతని జననీ జనకులీతనికి షరీఫ్ ఖానను నామముంచిరి. అయిననది మహమ్మదీయనామ మగుటంజేసి మాధవికి రుచింపకగాబోలు దాబెంచిననాటనుండియు జగత్సింహుడని యాతని ముద్దుగబిలచుచున్నది. ఈతడు నిశ్చయముగ జగత్సింహుడే—మహా బలశాలి. కడుముష్కరుడు. విద్యావిహీనుడుగాని లోకజ్ఞానమందు నను—అల్లరిచేష్టలయందును రంగమున నీతనికీడు వచ్చువారు లేరు ఆపురమీతనికి బరిచయమైననాటగోలెనీతడు ప్రతిదినమునను ద్వంద యుద్ధములు జేయని దినములేదు. ఎక్కడనో యొకచోట, నెవరితో నైనను సరియే యీతడు జగడమాడనిది యాదినమునీతనికి నిద్రా హారములు రుచింపవు. ఇంటిపైబడిన బలవంతుల నేరీతినో మాధవి సరిజెప్పి బంపుమంట యామెకు నిత్యములవాటైపోయినది. పోలీసు కర్మాగారములుగూడ నొకటిరెండుసార్లు జగత్సింహుని పాదధూళిచే బావనములైనవి. క్రొత్తక్రొత్తగ త్రాగుట—జూదమాడుటయు నీతడు నేర్చినవిద్యలు. ఈతనిమృదులహస్తమున చపేటాలంకారములొందిన పోలీసుకర్మచారులొకరిద్దరు రంగమున గలరను వదంతి.

తల్లి యన్నమునకు బిలచుచుండినను యాతడద్దానిని సరకు జేయక వెఱ్ఱివానివలె నెషగునవ్వునవ్వుచు "అమ్మా! ఏమే? నువ్వు చెల్లాయి ఏడుస్తూన్నారు. నేను ఇంకా అన్నంతిన్నానుకాననా? చెప్పే-చెప్పే—ఇదిగో-మీరు చెప్పకపోతే యిపుడేవెళ్ళిపోతాను. కాశీకి—కాదు—కాదు—ఢిల్లీకి. నేను చెడిపోతున్నాననా ఏడుస్తున్నారు. కాదు. మీరునన్ను తమాషాచెయ్యాలనియిలా చేస్తున్నారు! నాకు తెలుసునులే. ఈసంగతితెలిసింది-తెలిసింది. ఇదిగో చెల్లాయి. జీ చెల్లమ్మ—జీ చెల్లమ్మగారూ! మంచిమాచి బలేబలే పాటఒకటి పాడ తాను నేర్చుకుంటావ్? నువ్వునేర్చుకొంటే అదికో అదేంటదీ? ఆదీ-అదీ ఆనూర్జహానులావుంటావు. నూడుపాడ్తాను. ఆ"యనుచు దీర్ఘము దీయమొదలిడెను. ఈపల్కులాలించు సరికి మిహిర [illegible]లేని

నవ్వొక్కపదిరా నామె పక్కన నవ్వుచు కోపమభినయించి "ఒరే జగత్! ఇదే చెప్పడం. నీవు నేటినుండీ నాముందరకు రాకు. నాకళ్ళకు గనపడకు. ఛీ! నీముఖంచూస్తే నాకుకోపం" యనిబలికెను, జగత్సింహు డాపల్కులకు బిగ్గరగ నవ్వుచుండెను. ఇంతలో వీధితలుపు నెవ్వరో గొప్పధ్వనిచేయుచు గుద్దుచుండిరి. మాధవిబోయి తలుపు దెఱచి చూచునంతలో నెవ్వరో ముష్కరతురుష్కులిద్దరు వీధి గుమ్మము కడ నిలచి "ఏడమ్మా! మీ వాడు? నాకుకొంతడబ్బు నీయవలెను" యని మేఘగంభీరవాక్కుల నామె నడిగెను. మాధవి వారెవ్వ రెరుంగదు. "అయ్యా! మీకాతడు ధనమేలనీయవలయును? ఎంత నీయవలయును? కొంచెము నిమ్మళముగా జెప్పుడి" యనిసవినయముగా నడిగెను. ఆయిరువురిలో నొకడు ముఖమెఱ్ఱజేసికొని "ఎంతయోనా? నాకు నాలుగురూకలు నీతనికి రెండునుయీయవలయును. నేడాడిన పేకాటలో మాకు బాకీపడియున్నాడు. ఇదిగో. ఇవాళ నా సొమ్మీయకపోతే నేమవుతుందో చూడండీ" యని సకోపముగ బలికెను. మాధవి వారింగాంచి "బాబూ! కోపపడకండి. ఏమో? కుర్రకుంక. వాడిని ఈపిమ్మట మీయాటలోనికి జేరనీయకండి. మీడబ్బు వానితో నేడు జెప్పి యిప్పిస్తాను" అనుచు నెమ్మదిగ బల్కుచుండగనే జగత్సింహుడు కీచకునిగతి గంభీరముగ భూమిబగుల్చురీతి నడుగులిడుచు దల్లినియొకచేతద్రోసివైచి వీధిలోనికరిగి "ఎవడురా మీకు డబ్బివ్వాలి? ఎందుకింతగడబిడ చేస్తున్నారు? చూడండి, యీసారి యీగుమ్మం త్రొక్కితే సేనవడనో యెరుగుదురా? దేఖో తమాషా" యనుచు నూగుమీసముల నులివెట్టుచు వారింజేరబోవుచుండ మాధవి వాని చేయిబట్టి లోనికీడ్చికొనిబోయెను. వారును జేయునదిలేక "సరే ఇంక మాకంటబడకుందువా?" యని వెడలిపోయిరి. అనుదినమిట్టి కుకృ[illegible]లెన్నియో యింటిపై బడుచుంటచే పాపము వానికి

సమాధానములిచ్చుచుంటకు మాధవికి దీరుబడియే లేకుండెను.



౬

నాథా! నిశ్చయముగా నన్ను విడువరా? నేను నమ్మను. ఏమో? మగవారి కెప్పటికే బుద్ధి పుట్టునో? అట్లయిన నాపైనొట్టు పెట్టుకొనుడు.

రాత్రి తొలిజాము దాటి రెండవ యామము ప్రవేశించుచున్నది. బహుళపంచమియగుటం జేసి చుక్కల రేడప్పుడే జగమెల్ల నాక్రమించుకొనియున్న తమోరాశి నడంచి వెండితీగెల బారులం బోలు దన చల్లని కిరణజాలంబుల బరపి లోకమంతటిని గాంతివంతముగా జేయుచుండెను. సరోవరాంతరముకుద సంచయంబు మందహాసంబున బ్రియు నెదుర్కొనుచుండెను. చకోర దంపతులు దక్క తదితర పక్షిగమి యెల్లను దరుశాఖాంతరాళంబుల హాయిగ నిద్రించుచుండెను. ప్రియవిరహార్తులయి నటునిటు పొరలుచు నిదుర జనింపమి విసువునొందుచు, ములుకుల బోలె సుధామరీచికలు మెయిసోక విరహులు గళానాధునిపై దమపరుషవాక్ప్రయోగము లొనరించుచుండిరి. భోగవతులు మనోహరులగూడి యలసిన నెమ్మనుల బులకరింప జిగిహెచ్చు బండు వెన్నెలల బయటమందస్మితవదనారవిందవై కౌగిటి బిగువుల సడలింపక విహరించుచుండిరి. ఉదధి పొడికొండల బారుల దలపించు కెరటంబు లెగయుచు సంతోషరసమ్ము వెలిజిమ్ముచుండెను. సుపుత్రోదయమెవ్వని కానందమొసగదు? మొలకువ వచ్చుచుంటచే గ్రాబోలొక్కొక తఱి విరహుల గుండెలకు గురిపెట్టి గాల్చి సశతఘ్నిరవంబును ధిక్కరించుచు గండుకోయిల రసాలసాలాగ్రభాగమున గో యని కూయుచుండెను. మస్తకంబుల సన్నని మేలిముసుంగుల గీలించి పజులకంబడకుండ జారశిఖామణులు నియమిత స్థానంబుల జేరుకొనుచుండిరి. కుజనపోషితాలయంబగు దమోరాజ్యము నడంచి సజ్జనావనుడగు

కువలయాధిపుండు ధరణినలంకరింపజేయుటం జేసి చోరుల మనస్తాపంబునకు మేఱలేకపోయె. జనమెల్లను బిండియారబోసిన క్రియబండు వెన్నెల జూపరహృదయంబులకుం దోచుచుండెను.

రంగూను పట్టణమంతయును జాల వఱకు నిద్రాముద్రితమయ్యెను. ఎల్లడను శాంతిదేవత తన నిరంకుశ ప్రభుత్వమును గొనసాగించుచుండె. యంత్రశాలల గమనములాగియుండెను. తీరిక లేక నటునిటు ప్రయాణమొనరించు బండ్లు సద్దణంగెను. సర్వమును శాంతియుతమై జూపట్టుచుండెను.

ఈపండువెన్నెల కాంతి పుంజములో మిహిర యావాసంబతి శోభనీయంబై పూర్వముకన్న నెక్కుడు విలాసమున వెలింగిపోవుచుండెను. సౌధోపరిభాగంబున వీధివైపున గవాక్షమొకటి తెరువబడియే యుండెను. అయ్యది శయనాగారము. లోన కాచపాత్రయందునిచిన రెండుదీపములత్యున్నతోజ్వలములై దేదీప్యమానములై వెలింగిపోవుచుండెను. ఆవెలుంగున కుడ్యోపరిభాగములందమర్పబడిన చిత్రపటములు నయనానంద దాయకములై సజీవములట్లు భ్రమగొల్పుచుండెను. మేజాపై రజతపాత్రములందమర్పబడిన కాలాగరుధూపములు సుసౌరభోన్నతములై చిన్న మేఘమాలికల వలె నిరుగుబొరుగిండ్లనుగూడ నాక్రమించి సర్వజననాసికానందదాయకములగుచుండెను. మంచమునందలి పాన్పుపూర్వముకన్న మృదులతరమై తెల్లగ క్షీరాబ్ధిని దలంపునకు దెచ్చుచుండెను. అందు క్షీరసాగరశయనుని మఱపించు విలాసపురుషుడొకండు వామహస్తము శిరమునకు పదానంబుగా దక్షిణకరంబున మిహిర ముఖంబును బుణుకుచు, సవిలాసమందస్మితవదనారవిందంబున నాయువతి ముఖాంబుజంబు జేర్చి ముద్దాడుచుండెను. మిహిర చేరువనున్న వెండిపళ్ళెరమునుండి తములపు మాకుల మడపులందుకొనుచు, నొకటిదననోటను, నింకొకటి ప్రియునోటను బెట్టుచు, ముచ్చటలార నేమియో ముచ్చటించుచుండెను.

మిహిరకు ప్రియుడెవ్వడు? ఆమెకింకను వివాహము గాలేదే.

ఇంతలో నామె మానధనమపహరించి, యౌవనక్షీరవారాశినడుమ నీదులాడుచున్న యౌవనసుకుమారమారాకారు డెవ్వడై యుండును? చూడజూడ నాకాముడు నవయౌవనాంగుడుగాక నించుక వార్ధక దశనందిన వానివలె గన్పట్టుచున్నాడే. అతని బడుగుదేహమించుక సడలి యుండుట లేదా?

హా! తెలిసినది. ఏసుందరాంగిని నిరంతరంబును మనంబున నిల్పి రాజకీయవ్యాపారంబుల కెవ్వడుస్వస్తి జెప్పెనో, యేలతాతన్వి గాఢపరిష్వంగ సౌఖ్యమునకై సంతత మనోవ్యాధిపీడితుడై యెవ్వడు మంచముబట్టెనో, ఏమనోహారిచంచలనయన విముక్తశీతలకటాక్ష మాలికా ప్రసారంబునకై యెవ్వాడుమనోజాగ్నికీలాళికి శలభప్రాయు డయ్యెనో, యేకుసుమగాత్రి ప్రేమభిక్షకై యెవ్వాడు నిజమాన మర్యాదల సహితము ద్యజించి, కేవల కామాంధుడై తుదకు వెఱ్ఱి వాడాయెనో, యాహితాహితజ్ఞానశూన్యుడు, ఆడాంబిక ప్రేమ పాశాబద్ధుడు— యాతయౌవనుడగు రఘునాథపండితుడే యాతడు.

“నాథా నిశ్చయముగా నన్ను మీరు విడువరా? నేను నమ్మ జాలను. ఏమో? మగవారికెపుడేబుద్ధి బుట్టునో? అట్లయిన నాపై నొట్టుబెట్టుకొను”డనుచు మిహిర నాతని గాఢాలింగ సౌఖ్యంబున బారవశ్యనిగావించి యడుగగనే నాతడున్మాదునింబోలె “హా-హా హా” యని పెద్దపెట్టుననవ్వుచు, బిక్కనుండియొక్క యుదుటన లేచి “చెలీ! ఎంత చెలవు? నన్ను నమ్మజాలకున్నావా? అట్లయిన నిన్ని దినములనుండియు నెంతయో దపమొనరించి యతిప్రయత్నలబ్ధమగు మనయమూల్య ప్రేమకిదియా ఫలము? అట్లయిన నాపలుకులయందు నీకిసుమంతయు నమ్మకము జనింపనే లేదా? ఇదియా .........”యని యేమేమో బల్కుచుండ నాతని మాటలకడ్డువచ్చి మిహిర “అయ్యో! ఎంతమాట? ప్రాణేశ్వరా! మీయందు నాకు నమ్మకము లేకగాదు. ఏమో? విలాసముగా నాపై మీకెంత మక్కువగలదో పరీక్షింతమని నేనట్లంటినిగాని మీమనసు నే నెఱుంగనా అంతమాత్రము గ్రహింపజాలని

మూఢురాలినిగా నన్ను దలంచితిరా? ఇదిగో నిశ్చయముగా బల్కు-
చున్నాను. వినుడు. ఈశరీరము మీయది. దీనిని మీ రెట్లువినియోగించు
కొనినను సరేగాని యీమేన బ్రాణములుండునంతవఱకు మాత్రము
మిహిర మీపాదములను విడచునదిగాదు. నాకనునిత్యమును మీ
పదములే గతి. నాకు వేఱొక్క శరణు లేదు. ధనమునకుగాని, సౌంద
ర్యమునకుగాని నాయీసౌందర్యము యాచించునదిగాదు. మీపవిత్ర
ప్రేమ, మీవినిర్మల హృదయము, గాంచి యీదీనురాలు మీపద
సేవలొనరింప నిశ్చయించుకొన్నది. ఇంతకును దైవము నాయందను
కూలుడుగా నున్నాడు. లేకున్న నాయట్టి నిర్భాగ్యురాలికి మిము
[illegible]లు రత్నములభించునా? "అనుచు నామె యాతనిపదయుగళము
[illegible] రెండుచేతుల బిగ్గ గవుంగిలించుకొని, శిరమున దాల్చుచు, గనుల
నద్దుకొనునప్పటికి వేడికన్నీటి బిందువులు రెండాతని పాదములపై
బడియెను. తోడనే యాతడామెను లేవదీసి, యక్కునజేర్చి, చెదరిన
ముంగురుల సవరింపుచు, లలాటము ముద్దుబెట్టుకొనియెను. దాన
వారి ప్రేమపాశము మఱింతదృఢతరమైపోయెను. వారి బాహ్యప్రపం
చమునే మఱచిపోయిరనవింతగాదు. అట్లు వారెంతసేపు వివశులై
యుండిరో, ఎట్టిభోగార్ణవంబున దేలియాడిరో యెఱుంగజాలముగాని
"బాబా! బాబా! అమా! మిహిరా! లెండు—లెండు. కోడికూసినది"
యనుచు దలుపుపై దట్టుచున్న మాధవిపల్కులు మాత్రము మనకు
వినవచ్చినవి.

పరమేశ్వరుని లీలలెఱుంగ దరముగాదు. కర్మసూత్రమెవ్వ
రెవ్వరి నేరీతి బాధించి వైచునో చెప్పలేము.

---

౭

సంవత్సరములు బది గడచిపోయెను. మధుసూదను డిప్పుడు
వింశతివర్షప్రాయు డయ్యెను. అతనికి విద్యాగంధమంతగా నలవడి

యుండలేదు. కాని లోకజ్ఞాన మంతదాతకు మేటియయ్యెను. కష్టసుఖం బుల బాగుగనెఱుంగు నేర్పువచ్చినది. హితాహితజ్ఞానముగలిగినది. రఘునాధుని జీవన మంతయును మిహిరా ప్రణయసూత్రముననే బాధింపబడిపోయెను. ఆతడే వేళజూచినను ఆమెరూపమున ముగ్ధుడై యొక్క నిముసమూ మెనెడబాటున కోర్వజాలకుండెను. పరులెవ్వ రాతనిజూడవలసి వచ్చినను వాని దర్శనము సాధారణముగా వారికి మిహిరగృహంబుననే లభించుచుండెడిది. ఆతని వ్యాపారములిప్పుడం తగా సాగుచుండుట లేదు. ఆతనియాదాయముగూడనిప్పుడు బూర[illegible] కన్న చాలవరకు క్షీణించిపోయెను. కాని వ్యయమునకు [illegible] కుండెను. అను నిత్యమును విలాసము లభివృద్ధిగాజొచ్చెను. మ[illegible] కుటుంబపోషణమంతయు నాతనిమూలముననే జరుగుచుండెను. కుటుం బమన్న సాంసారికధర్మముల ననుసరించి కొనసాగుకుటుంబముగాదు. సౌఖ్యముల కాలవాలము. విలాసమునకు నిధి. భోగములకు బుట్టి నిల్లుగా వెలుంగుచున్న కుటుంబము. రఘునాధుడించుక వృద్ధుడై నప్పటికిని నూతనవరుడు. మిహిర చక్కని యౌవనాంగి. ఆమె సంపూర్ణముగ నాతనికన్న మిక్కుటముగ నాతనిధనమునే ప్రేమించి యుండెను. అదియే యామె యాశయము. అదియే మాధవి సదుప దేశము. ఇంకభోగముల కేమికొదువ.

రఘునాధుడిప్పుడు సంపూర్ణముగ మిహిరచేతి కీలు బొమ్మ యయ్యెను. ఆతడు గలనైనను నామె మాటలకెదురాడియెరుంగడు. ఒక్క మిహిరయాజ్ఞలకేగాక నాతడాయింటి సేవకులకుగూడ సేవ కుడై వారి చిత్తమురంజిల్లురీతిని మెలంగుచుండెను. పట్టణమందాతని పేరు క్రమక్రమంబుగా మాసిపోవుచుండెను. మహాధనికులచే సహి తము మన్ననలందు నాతడిప్పుడు గౌరవభ్రష్టుడై నీతిబాహ్యుడై పోయెను. ఆతని బుద్ధిబలముగూడ క్రమక్రమంబుగా క్షీణించిపోవు చుండెను. సంపూర్ణయౌవనోదయుడైయున్న కుమారుని భావిగతుల గూర్చి యాతడించుకంతయు విచారించినట్లు కనబడదు.

ఆహా! మోహాబ్ధిలో సంపూర్ణముగా మునింగిన మానవుని చేష్టలిట్లు మారుటకేమి హేతువో గదా? కామపంజరమున దగుల్వడిన నరుని జీవనమొక్క త్రుటిలో నింద్యమైపోవుట కేమి కారణమో గదా? ఎవ్వని భావిసౌఖ్యభంగమునకై వెరచి తాను ద్వితీయకళత్రమును సైతము స్వీకరింపనిచ్ఛగింపకుండెనో, యెవ్వని యానందమే తనయానందమని యెంచి కంటికి రెప్పవలె నహోరాత్రములు దానుగాచి కొనుచుండెనో, యెవ్వని మోమొక్క నిముసము గనులబడకున్న మితిలేని శోకమున నశ్రుకణంబులగూడ రాల్చుచుండెడివాడో, అట్టి ప్రియతనూజాతుడు, అట్టివంశైకవృక్షము, సుకుమారమనోహరమూర్తియగు మధుసూదనుడిప్పుడు తనతలంపునైన బారకుండెగదా? ఆహా! కాలమహిమ. మిహిరా! నీవు రఘునాథున కేమైనమందుబెట్టియుంటివా? కాదుకాదు. కామార్తి చే గుందుచు, మదనపిశాచమావరించియున్నయొక్కయల్పమానవునిలో గొనుగుటకు మందులుగూడ గావలెనా? నీయతిలోకసౌందర్యమే వానిపాలిటి మహౌషధము. నీజగద్విఖ్యాతంబగు రామణీయకమే వానికి వలపుమందు. చిఱునవ్వుమోమునదోలుకాడ నొక్కసారి నీ క్రీగంటి ప్రసాదవర్షముల నెవ్వనిపై బరపెదవో, యాతడు జన్మజన్మములకైన నీపాదదాసుడుగాకుండుట కలలోని వార్త.

మధుసూదనుడీయవస్థను గుర్తెఱుంగకుండలేదు. దాసదాసీజనంబులాతనికుండునను వెనుకను, జూసియు, జూడకయు, గూఢముగను విశదముగను నెన్నిరీతులాతని జనకుని వృత్తాంతమాతని కెఱిగించుచుండిరి. ఆతడుగూడ దన పరిపూర్ణానుభవంబున దృశ్యాదృశ్యముగ నాతనితండ్రి వర్తనముల బరికించుచునేయుండెను. వినియాతడు చేయునదేమి? జనకుడు దైవసమానుడని యాతని నమ్మిక. అట్టితండ్రి కెదురాడ నాతడుగలనైన నిచ్ఛగింపడు. అట్లయిన నింకజేయునదేమి? తండ్రి యాతని సంపూర్ణముగ మఱచియుండెగదే. పూర్వమువలె నొక్కనాడైన నిపుడాతడు దన్నుజేరదీసి, ముద్దులొలుకు బలుకుల నమృత

వర్షముగురియ బ్రేమమై దన్నుఁ గాఁటజేర్చలేదే. పోనిమ్మనను పెద్ద
యగుటచే నెల్లజరిగించినను బ్రశ్నించుట కాతనికధికారము లేదు. కాని
తనకును వయసు మీఱుచున్నదే. సంపదల కాలోపము లేదు. ఇట్టి
యెడ నాతఁడు విచారించి తనకు బెండ్లిజేయు భారమాతనిపై నున్నది.
ఈసంగతి కెన్నఁడైనను నాతఁడాలోచించినట్లు గనబడదు. ఎవ్వరితో
నైనను నీప్రసంగమే యొనరించినట్లు గనబడదు.

ఇట్టియోచనలే మధుసూదనుని హృదయకుహరమున ది
దినాభివృద్ధి గాంచుచుండెను. తక్కినసంగతు లెట్లున్నను ఆత్మ
వివాహవిషయమై యిప్పుడాతనికి మిక్కిలి చింతవొడమసాగెను. పె
ద్దయగు జనకుఁడుండ నిట్టికార్యమాతఁడు స్వతంత్రించి చేయునదిగాదే.
అట్లయిన నిపుడు జేయవలయునదేమి? ఈవిషయములాతఁడు పెక్కు
మాఱ్లు దనకు మిక్కిలి నమ్మికయై, జనకునిదరువాత జనకుఁడంతవాఁడై,
యెల్లగతుల దన్నుఁగడు గారాబమున జూచుచున్న తనతండ్రిగారి
ఖజానాదారునితో నాలోచించి యుండెను. కాని యాతని ప్రత్యు
త్తరములు దనకంత సంతుష్టికరములుగాక పోయెను. పాపమాతఁడును
దినమిట్టియోచనలచే బిచ్చివాఁడై పోవుచుండెను. జనకుని ప్రవర్తన
ములు, నాతని విలాసములు నానాటికిని మితిమీఱి పోవుచుండెనే
గాని యణుమాత్రమైనను దగ్గుట లేదు. భోజనసమయములందు దక్క
నాతని దర్శనమే తనకు గాకుండెను. ఒకటి రెండుసారులీవిషయముల
నాతఁడు దండ్రియెదుటనే బ్రశ్నింపఁజూచెను గాని యాతనికంత ధైర్యము
గలుగక పోయెను. "అయ్యో! నాజనకుఁడేనన్నధఃపతనముఁగాంచునా
యేమి? అట్లయిన నేఁజేయవలసిన దేమున్నది?" అనుచు నాతఁడు
బలుగతుల దలపోయఁ జొచ్చెను.

౮

శ్యామలా! శ్యామలా! సెజ్జ నలంకరించుట మైనదా? ఆహా! ఏమో నీచాతుర్యము! శయనాగార మీదినమున నెంతయందముగా నున్నదే? నిత్యమును చూచుచున్న నాకనులకే నిది క్రొత్తగ గాన్పించు చున్నదే. ఆహా! ఆపటము లెంత చక్కగనమర్చితివే? యీదీపపు గాంతిలోన సజీవులైనట్లు దోచుచున్నవి గదా. ఎంత నిపుణరాలవే? నిన్ను మెచ్చి నీకేమీయవలయునో గోరుకొనుము.

శ్యామల:—చెలీ: మాలతీ యిందు నానేర్పేమిగలదే? ఇన్ని దినములును లేని క్రొత్త యీదినమున మాత్ర మేమిదెచ్చిపెట్టితిని? నెక్కడనున్న వస్తుసమదాయ మక్కడనే యున్నచో గది శోభామానముగ గానవచ్చును. అంతకన్న మనముచేయు నలంకారము లేమున్నవి? అంతియేగాని తలమానికము జెప్పున నమర్చిన సొగసుగ నుండునా? ఇపుడెట్లయినను నీవు క్రొత్తప్రియురాలివిగాన నీకీలోకమే క్రొత్తగ గానవచ్చును. అందులకు సందేహమేమి? నిత్యమును నీవు శయనించుచున్న గదియిపుడు నీకే క్రొత్తయయినదా? ఇందలి వస్తువులెల్లను నీకు క్రొత్తగ గానవచ్చుచున్నవా? ఎంతచమత్కారిణివే నిజమే. ఇంకొక్కనిముషమున కింతకన్నను క్రొత్తవస్తువీగది నలంకరించును. అపుడు నీకండ్లకిది మఱింత క్రొత్తగను, మఱింతశోభాయమానముగను గానవచ్చునుగాబోలు? ఈమాత్రపుటందమునకే నీవు నాకు బహుమానమీయదలంచుకొన్నచో, యపుడేమి బహుమానమొసంగెదవో జూచెదను గదా.

మాలతి శ్యామల చెక్కిలిగొట్టుచు "చాలును లే. నీయసమానపాండిత్య ప్రభావమంతయు నిపుడే వెళ్ళబోయుచున్నావు. నాకడనే నీయాశుధారావిశేషము. పిచ్చుకపై చంద్రాయుధము. వల్లేరుపై బండి. ఓహో! ఎంతమాటకారివే? ఎవ్వరైనను విన్న నవ్వి

పోదురు. ఇంకను నేమికొత్త వస్తువులు దెచ్చిపెట్టెదవే యీగదియందు" అని యొయ్యారముదొలు కాడ బ్రశ్నించెను.

శ్యామల:—అది నేదెచ్చిపెట్టినది కాదు. నీవే స్వయముగా బ్రియముగా దెచ్చుకొనుచున్నావు. కాని నేదెచ్చునదేమున్నది. భగవంతుడంతటి సామర్థ్యము నాకొసంగియుండలేదు.

మాలతి:—ఆబ్బా! యింకను మానవుగదా. నీపరిహాసములు. నీవు కోరినదేదో యిచ్చుకొందును. తల్లీ! యింకనైనను నన్నువిడచిపెట్టుదు. నిన్ను బ్రతిమాలుకొనెదను.

శ్యామల:—అబ్బో! ఇంకను వేళకానిదే విడచిపెట్టుటెట్లు? ఉయుపెమ్మట నాతలపై నొంటరిగా శయనించు వాతవ్రాయనేవా యున్నది. ఈయొక్క నిముషమైనా సకడనుండగూడదా? అదిగో ఎవ్వరోతలుపుదోసిన చప్పుడైనట్లున్నది. దేవుడాయింక నాకు విడాకులే గాబోలు.

మాలతి:—చాలునులేవే. ఎంతజెప్పినా నీపెంకితనమే నీది.

శ్యామల:— మఱినాపెంకెతనము, నాగడుసుదనము, నా చమత్కారితనము నేనెవ్వరివద్దజూపను. నీగడుసుపోకడలు జూచి యానందించువారు నీకున్నారుగాని, ఆనందించినను కోపగించినను నాకుమాత్రము నీవేగతి. ఏమన్ననుసరే నిన్నుమాత్రము నే విడుచుదానను గాను.

"విడువకున్న బహుమానమందజాలవు సుమా" యని వెనుక నుండి యెవ్వరోమెల్లగననిరి. ఆపలుకులయందెట్టి మంత్రిబలమున్నదో గాని యంతవఱకును సరసాలాపముల మునింగి తేలుచున్న మాలతీ శ్యామలలిద్దరును చిత్రప్రతిమలవలె నిలచిపోయిరి. వారికంఠము లొక్కసారిగ రుద్ధములైపోయెను. వారిచూపులట్లేనిలచిపోయెను. అట్లుకొంతవడి వారుమావముద్రాంకితులైపోయిరి. వెనుకనుండియట్లు వచించిన పురుషుడు వారిని శ్చేష్టతకు నబ్బురమందుచు మాల్లాడక వారిమధ్యనుండియే బోయి గదింబ్రవేసించి యొక యాసనమలంక

రించెను. మాలతీశ్యామలలు వారి సంభాషణ నాతఁడాలించియుండెనని గాబోలు పాపము సిగ్గుచేనాదలలవాల్చి కొంతవడినిలచియుండిరి.

కొంతవడికి శ్యామల యించుక ధైర్యమూని, మాలతిని యాతనికింగానరాకుండ జాటుగ బిలిచి "మాలతీ! మనమనుకొనినట్లే యాతఁడు వేళకేవచ్చియున్నాఁడు. పాపము! పెద్దమనుష్యు నొక్కనిని విడిచి మనమిందుండరాదు. నీవుపోయి యాతని కుశలప్రశ్న జేయుచుండుము. లేకున్న బాగుగనుండదు. తగుమనుష్యులకు, ఇంటికరుదెంచిన యతిథులకు నిట్లే మర్యాదలొనరింతురా? సాటివనితలెవ్వరైన విన్నచో నగుబాట్లుగాదా? లెమ్ము. వేగమాతనికడకు బోయి పలుకరింపుము.

మాలతివాల్చినదల నెత్తకుండెను. కొంతవడికామె శ్యామలం జూచి "నామాటవిను శ్యామలా! ఆపనికైమాత్రము నన్ను నియోగింపవలదు సుమా. వారి ముఖముజూచుటయే నాకు భయముగానున్నది. ఏలనో మాటలు దొట్రుబడుచున్నవి. కాళ్ళుతడబడుచున్నవి. ముందుగా నేమని మాటాడవలెనో యెఱుంగజాలకున్నాను. అమ్మవుగావు. నిన్నుబ్రతిమాలుకొనెదను తొలుతనీవేపోయి యాతనితో సంభాషింపవే. ఈమాత్రపు టుపకారము జేయవే. తల్లి—తల్లీ! నీ ఋణమెట్లయినను దీర్చుకొనెదనులే. అంతమాత్రము మరచిపోనులే. వేగము వెళ్ళు మఱి బాగుండదు.

శ్యామల:—ఎంతగడుసుదానవే. వాని మొగముజూచినంతనే దీనికి భయమట- పాపము. ఎంత నంగనాచివే? ఇంకనొక్కగంట పోయిన నెట్లు మెలంగుదువో గద. హార. హార. నేను ముందుగా రాయబారముజేయువలెనట. రేపటినుండియు నీముఖదర్శనమేమాకు కరవగును. చూతునుగదా. ఈకండ్లకీరెప్పలు దూరము గావులే. ప్రియుని విడచి యొక్కనిముషము మాతో మాటాడుటకైనను నీకు తీరికయుండునా యను సందేహము. అబ్బా! ఎంతటి వేసకత్తెవే?

మాలతి:— చాలింపవే యిఁక. ఎంత బ్రతిమాలినను నీ

ధోరణియే స్త్రీగాని, యెవటివారి ప్రశంసనీయచుకింతయు గనిపెట్టను. పొస్సలేవే. ఎంతజాగ్రైపోవుచున్నదే? శ్యామలా! శ్యామలా! నామాట వినవుకదూ. నాతల్లివిశావూ? నిన్ను బ్రతిమాలుకొనుచున్నానుసుమా.

శ్యామల ముసిముసినగవుల గ్రుమ్మరింపుచు హస్తముల చిత్రగతి నభినయింపుచు "అబ్బా! అప్పుడే శ్రమబడుచున్నావా? అంతయు ముంచ్చుకొయున్నదిలే. పోవుచున్నాను. నీవునావెకనే రా" యనుచు నామె గదింబ్రవేసించి, యాసీనుడైయున్న పురుషు నవలోకించి, మోమున చిఱునగవంకురింప, ముఖమటునిటు ద్రిప్పికొనుచు "ఓహో! బాబుగారు! చాలాదినములకు మాగృహ పావనము జేసినారు. ఈ రోజున దారిదప్పిబోతిరిగాబోలు, పాపము" యని యొయ్యారముగ బలికెను. పురుషుడేలనో మోమువాల్చికొనియేయుండెను. ఎదుట నున్న దీపపుకాంతులాతని ముఖమున బడుచునేయుండెను. ఆకాంతులలో నాతని సువిశాలనేత్రములు చలించిపోవుచుండెను. కొంతవడి కాతడేమియు బలుకక గదినలుమూలల బరికింపుచుండెను. పిదప నెట్టకేలో ముఖమెత్తి తనతో మాట్లాడవచ్చిన యాయువతి మొగము విలాసమునించుక బరికించెను, ఆమెజగన్మోహినిగాకున్నను సామాన్య సుందరియని మాత్రమాతడు గ్రహించెను. ప్రాయమున యౌవన మధ్యస్థయైయుండెను. ఆతని మనోభావముల కామె పరిచారికవలె గానవచ్చుటచే గాబోలు మొగమోటమువిడచి యాతడు నిర్భయముగ నామెతో మాట్లాడసాగెను.

పురు:—ఏమీ? చాలాదినములకు వచ్చితినంటివి. ఈ వఱకు నన్నెపుడైట జూచి యుంటివా?

శ్యామల దలద్రిప్పుకొనుచు. "ఇచట జూడకున్ననేమి? నిత్యమును తమదర్శనము జేయుచునే యుంటిని. తమకీర్తిని వినుచునే యుంటిమి. ఒకటి రెండు తడవులు మధువనమునగూడ తమదర్శన భాగ్యము మాకులభించియున్నది.

పురు:—అట్లయిన నయియుండవచ్చును సరే. నీకే కొన్వరు

మాలతి నీకేమగును?

శ్యామల:—మాలతి నాకు చెలి. కాదు కాదు. నేనే యామెకు చెలికత్తెను. నన్ను శ్యామలయని లోకము పిలుచుచుండును.

పురు:—పాపము! మాటలు తడబడుచున్నవి. అయినను మాలతికన్న నీవెక్కుడు మాటకారివివలె గన్పట్టుచున్నావే?

శ్యామల:—అట్లయిన తమరు మామాలతిమాట లీవఱకే విని యుంటిరా?

పురు:—నేను స్వయముగా వినకున్నను, లోకమాడు మాట లెవ్వరికి దెలియకుండును?

ఇంతలో ద్వారముకడ నడుగుల సవ్వడివినవచ్చెను. ఇరువురును వెనుదిరిగిజూచిరి. ద్వారముకడనే నిలచిపోయిల మాలతి ముఖమున దీపపుగాంతులు బ్రసరించెను. అంతనామె వెనుకకు రెండడుగులు గదలిపోయెను. కాని యామె యాలస్యమునకై తత్తరమందుచున్న శ్యామల మాత్రమామెను విడువలేదు, "మాలతీ! మాలతీ! వెనుదిరిగిపోయెదవేల? ఇక్కడకొ్రొత్తవారెవ్వరును లేరులే. మన వారేబుగారే. లోపలకురా" యనుచు నాపురుషుని జూచి "పాపము! మామాలతికెంతయో సిగ్గు. అది పరులుగొందరు గర్వమని భావింతురుగాని, తమవంటి పెద్దలామె గుణాగుణములగనిపెట్టియే యుందురు. అది నిశ్చయముగ మాకులమందు బుట్టవలసినదిగాదు. ఇంతకును ముంజేతికంకణమున కద్దమేల? తమరే బరీక్షించి చూతురుగదా. మాపూర్వపుణ్యావశమున తమవంటియుదారస్వభావుల సాంగత్యము మాకులభించినది" అనుచు నామె గడిదాటి వెలుపలికరుదెంచి, యాశాపాశములు ముందునకును, లజ్జాభయములు వెనుకకును నీడ్చుచుండ యోచనాధీనయై నిలువంబడియున్న మాలతి కరముబట్టి, మఱల గది జొచ్చెను. తోడనే మాలతి లజ్జావినయములొక్కుమ్మడి బెనగొన సవినయముగా నాపురుషునకు నమస్కరించెను. పురుషుడట్లే చైతన్యవిహీనుడైపోయెను. అతని తల తిరిగిపోవుచుండెను.

ఇపుడాతడేమన్నయు నెఱుంగజాలకుండె. శ్యామల మనోహర వాక్యామృతప్రవాహ మాతనికి సంపూర్ణముగ నైకము గలుగజేసెను. ఆతడు కనులవిచ్చి జూచుచుండెనేగాని యెదుట నేమున్నదియు గ్రహింపజాలకుండెను. కొంతవడికాతనికి బాహ్యజ్ఞానము గలిగెను. "అయ్యో! నమస్కరించిన యీకాంతకేమియు బదులు వలుకకున్న, నను నీ కేమని భావింతునో కదా?" యను జ్ఞానమాతనికపుడు గలిగెను. అయిన నేమని ప్రత్యుత్తరమీయవలయునో యాతనికిం దోచుటలేదు. తోడనే యాతడు బ్రకంపితాధరముతో "చెలీ! మాలతీ! సౌఖ్యమా?" యని మాత్రము బలుకగలిగెను.

అహో! ప్రథమసమాగమము కాముకీ కాముకుల కెంతటి లజ్జాభయంబుల నాపాదించును.

ఇపుడు బదులాడుపని మాలతి తలపై బడియెను. ఆమె పూర్వమే కడుంగడు లజ్జాన్వితయైయుండెను. కాని శ్యామల ధైర్యోపదేశమున నెట్లో సేదదేరి యింతవఱకును సాహసించెను. మఱల నిపుడాపురుషుని ముఖావలోకన సౌఖ్యమనుభవించినదాదిగ, భీతహరిణింబోలె నామె నయనయుగళంబు మఱింత జలించిపోవుచుండెను. శ్యామల యామె భుజపంజరమున జేయివైచి ధైర్యమూను మని హెచ్చరిక జేయుటకై నఖాంకురముల మెల్లనగోకుచుండెను. కాని యెవ్వరును మాట్లాడుటలేదు. శ్యామల దానింక నుండుట రసభంగమని దలంచి గాబోలు "బాబూ! మఱలనిపుడే దర్శనమొసగు" మని మెల్లగ నావలకుంజారెను. పురుషుడు కొంత దలపై భారమెల్లను నొక్కసారిగ దగ్గినట్లయ్యెను. మాలతిగూడ జేయునది లేక నించుక ధైర్యము వహించెను.

ఔరా! నూతనప్రణయ మెంత యానందకరము. ఎంతటి సౌఖ్యదాయకము. ఇట్టి సమాగమముల వర్ణింపనేగదా కాళిదాసాది మహాకవులుగూడ సృష్టింగల శబ్దజాలమెల్లను వినియోగించియు సఫలురుగాలేకపోయిరి. అట్టియెడ శబ్దార్థవిహీనుడు, జ్ఞానశూన్య

బగు నాయీలేఖపని యిమ్మహోద్యోగంబునకుఁ బురిగొల్పుట నా వెఱ్ఱితనముగాక వేఱున్నదే?

పురుషుఁడు మాలతిని కనులఁగని యప్రదీప్తిఁగాంచెను. మాలతిగూడ నించుక దలనెత్తెను. ఇట్టునట్టుఁజూచెను. ఎవ్వఁడును లేఁడు. ఎట్టయెదుట దనమనోమోహన విగ్రహము. తన ప్రణయారాధిత దివ్యదేవత సాక్షాత్కరించియున్నది. చంచలనయనంబుల నిశితశరజాలంబులాతని మోమున నొక్కుమ్మడి నాఁటగ్రుచ్చెను. ఆతఁడు వివశుఁడై పోఁజొచ్చెను. ఇంక నొక్క త్రుటిలో బానిసయమేనైన లభింపకున్న నిలచునట్లు లేదు. ఆతఁడు లేచి నిలువంబడియెను మాలతియుంచుక వెనుకకరిగెను. పురుషుఁడామె కరంబుఁబట్టి దగ్గరఁజేర్చికొని, బిగ్గఁగవుంగిలించి, పిపాసాధికుఁడగుటవలనయధరపానమొనర్చెను. మాలతి లజ్జయాత్తస్వాంతయై పోయెను. అంతనామె యాతనిమెడిని వ్రాలి, కంఠమిఱుకేలంగవుంగిలించి"నామనోధనమా! నాజీవనసర్వస్వమా! నవమోహనా! మధుసూదనా! ఇన్నిదినములకా! యీదీనురాలిపై తమకు బ్రేమకలిగినది" యనుచు నామె వచోసుధారసంబున నాతని నానందసాగరమున ముంచివైచెను.

ఏమీ? మధుసూదనా!"యని మాలతి యాపురుషుని సంబోధించుచున్నది. రఘునాధుని పుత్రుఁడగు మధుసూదనుఁడా యాతఁడు. జారశిఖామణియని లోకమున నపకీర్తిగాంచిన యీరఘునాధుని కుమారుఁడైననుగావచ్చును. నిందాశ్చర్యమేమున్నది? విత్తనమొక్కటియు వృక్షమొక్కటియునా? తండ్రితన్ను నిరసించుటంజేసి యాతఁడిపుడు వేశ్యాకులభూషణంబగు మాలతి చరణసమాశ్రయంబు గల్పించుకొని యుండనచ్చును. ఇందు దప్పేమున్నది? అయిన నాతఁడెవ్వఁడైనదియు వారి బల్కులసాంతముగవిన్న నెఱుంగజాలకుందుమా? అయ్యో! ద్వారముబంధించి యున్నదే. ఇంకవారి ప్రసంగములు మనకు వినవచ్చునట్లు లేదు. అయిననేమి కొఱంత? ఉదయమగుసరికి గ్రామమున నెల్లెడలను మనమీవార్త నాలింపకుందుమా?



# ద్వితీయ ఖండము.

కాలమొక్కరీతి గడువఁబోదు" యను పెద్దలు వచించు నార్యోక్తి యెన్నఁటికిని వృథాగాదు. కష్టసుఖములు కావడికుండలు. కాలచక్ర మొక్కరీతిగ దిరుగనేరదు. మనుజుని జీవితము క్రిందుమీఁదగుచుండుట సహజము. రాజాధిరాజైనను సరే కష్టసుఖముల రెంటిని సమముగ ననుభవింపక తీరదు. తొలిజన్మమున దాఁజేసిన పాపపుణ్యముల ఫలము మీఁది జన్మమున బ్రతినరుఁడును యనుభవించి దీరవలయును. మన మెఱుంగకున్నను జగత్కర్త వాటిని మనకై నిర్ధారణజేసియే యుంచును.

రఘునాథుని కాయము జాలశుష్కించి పోయెను. ఆతనికి వ్యసనములు మెండయ్యెను. విలాసములు తఱుచయ్యెను. భోగములు మితిమీఱిపోయెను. అసలే వృద్ధుఁడు. అందున నాతఁడిప్పుడు సంతతి మోహాసక్తియై కాయము గాసునకు నెచ్చించెను. తుచ్ఛములగు భోగముల నాసించి యూతఁడు జ్ఞానాజ్ఞానశూన్యుఁడై పోయెను. ఆపాప ఫలమిపుడాతఁడనుభవించుచుండెను. ఆతఁడు క్రమముగ మంచముబట్టి పోయెను. తనకుమారుని ప్రవర్తనముగూడ నాతనికి సంపూర్ణముగ దెలియవచ్చినది. దాన నాతని వక్షము శతధాభిన్నమైపోవుచుండెను. ఆతనికే ప్రపంచమంతయు దిరిగిపోవుచున్నట్లుండెను. ఆతఁడు నిలువున గూలిపోవుచుండెను. ఇపుడాతనికి దీవ్రజ్వరమంకురించినది. నిరంతరము వైద్యశిఖామణులచే మిహిర గృహము నిండిపోవుచున్నది. ఇపుడాతఁడందే సంపూర్ణముగ దన నివాసమేర్పరచుకొనియెను. మాధవీమిహిరలాతని కెడఁబెగక యుపచారముల గావించుచునే యుండిరి. ధనము తృణముకన్న నధమముగా వ్యయమగుచున్నది. వైద్యులు పోయుమందులతో నాతని గర్భగోళము పూర్ణీభవించి పోవుచుండెను.

మధుసూదనునకిపుడు జనకుని దర్శనము సంపూర్ణముగ గఱవై

పోయెను. ఆతడుగూడ తండ్రిని జూచుట కభిలషించుటలేదు. మాలతీ ప్రేమ పాశాబద్ధుడై యాతడామె శిరముగ దలదాచికొని యెను. ఆమె ప్రేమ భిక్షుకై నిరంతరమాతడు దనకరయుగ్మమును జాచి వేచుచుండెను. దినములు—వారములు—నెలలు—తుదకు వత్సర ములుగూడ నాతనికిపుడుత్రుటిమైయగడిచిపోవుచున్నట్లుండెను. ఇప్పు డాతడామె మందిరమున పాన్పుపై శయనించి, యామె యూరువునుప ధానముగావించికొని యామె ముఖము దనముఖమున జేర్చుకొనుచు సరసవాక్యాలను గుర్తుస్మరించుచుండెను. పాపమాతని గృహమున నాభీలాగ్ని దహించుచున్నదని యాతడించుకంతయు యోజించి నట్లు గనబడదు. ఆతని భావిసౌఖ్యపర్వతము బ్రద్దలైపోవుచున్నదని యాతడెఱుంగడు. ఎట్లెరుంగును? ఆతని యోచనాశక్తి యానాడే భస్మీభూతమైపోయినది. ఆతని మేధాబలమంతయు నాడే హరించి పోయినది. ఇంకనాతనికిట్టి యాలోచన లేల బొడముమను!

మాలతీ మధుసూదనుల సౌఖ్యవాహిని కష్టము గంభీర ధరముచాప్పున వెలుపలనుండి"తలుపు—తలుపు-వేగముగ దలుపు ము"డను వాక్కులు గృహమంతటను బ్రతిధ్వనించి పోయెను. మాలతి సత్వరగమనయై వెడలి ద్వారముదెరచెను. ఆవచ్చిన భీకరా కారుడు మాలతి ముఖమునైనజూడక "మధుసూదనపండితుడెక్కడ? మధుసూదనపండితుడెక్కడ?"యని గొంతెత్తి బిగ్గరగా నరచుచు సాధారోహణమొనర్చెను. మాలతి కాతనిప్రవర్తనమందాగ్రహము జనించెనుగాని నడగొండవలె గదలి బోవుచున్న యాభీకర పద్రుశుని వారించుటకా కుసుమగాత్రిదరమౌనా? ఆతడు మేడపై గదులనన్ని టిని బరికింపుచు తుదకు మధుసూదనుని కడ జేరెను.

ఆతడెవ్వడు? జగద్విఖ్యాతవర్తనుడగు జగత్సింహుడే. ఆతడు మధుసూదనునిడాయంజని, యాయాసమున మేనెల్ల జెమ్మటలుగ్రమ్మ "బాబూ! మీరేనా రఘునాథపండితుని కుమారుడు మధుసూదన పండితులు. అటయిన వేగముగ నాతోరండు. ఆలస్యమొనరింపకుడు

లేదు. మీరు వేగమే పయనమునకుండుడు. ఒక్కమాట పాపమా వృద్ధునకటనున్న సపర్యలు సరిగాజరుగనేరవు. అదినేనెఱుంగుదును. కాన, తక్షణమే వారిని మీస్వగృహంబునకు దీసికొనిపొండు. ఇదే నేనుగూడ శ్యామలాసహితముగ మీజనకుని వెంటనిడికొని మీయింటి కరుదెంచి జన్మముపావనము గావించుకొందును. ఇంక మీరు వేగముగ బొండు"ని యాతని సాగనంపెను.

మధుసూదనుడామె పల్కులయందలితీయందనమునకుప్పొంగి "చెలీ నీవు మాత్రము నేరమ్మని వార్త నంపుదనుక రావలదుసుమా. నేబోయి యచటి స్థితిగతుల బరిశీలించి వెంటనే సంగతులెల్లను నీకు విశదముగ దెలియజేసెద నంతవరకు నీవిట నేయుండుము. పోయివత్తు" నని, భుజమున యుత్తరీయమైనను దాల్పక వడివడివీథిం బ్రవేశించెను. జగత్సింహుడామెపలుకుల కాగ్రహోన్మాదియై, చురచుర నామెం జూచెను "ఏమీ నాయింటికడనా మాబావగారికుపచారములు జరుగకుండుట. ధనమునకాశించి, శరీరమమ్ముకొను భోగము తొత్తువు, నీవా యాతని సేవజేయుట. సరే—సరే. ఇపుడు నేను తొందరగబోవు చున్నాను. తరువాత నీసంగతి నాలోచింతును లె"మ్మని వడి వడి నితడు మధుసూదను ననుసరించెను. మాలతి మృగేంద్రముంగాంచిన కురంగశాబకమువలె, యాభయంకరాకారుని మేఘగంభీరభయంకరాలాపములాలించి, గడగడవడంకుచు, త్వరితముగ ద్వారముబంధించుకొని లోనికేగెను.



## ౧౧

హాతండ్రీ! నీకెంతగతివచ్చినది? ఇంతలో నిట్టిఘోరసంకటము నాకొనగూర్తువని కలనైనను నేనుదలంచి యెఱుంగనుగదా. అయ్యో! ఇంకమమ్మెల్లరవిడచిపోయెదవా? తండ్రీ! నీతో నన్నుగూడ దీసికొని పోరాదా" యంతలో బ్రతుని నభినా యును వెగనొసితివి తండ్రీ! నాకింక నేదిక్కు నాయనా? ఇంటి,

నీవు లేని యీయరణ్యమున నింక నేనెట్లు నివసింపగలను. హా హా! నాతల్లి గతించిననాటనుండియు, గంటికి ఱెప్పవోలె నన్నుగాపాడి, మహా దైశ్వర్యవంతునిగా నొనర్చి, యల్లారుముద్దుగ బెంచితివే. నీవు లేని యీ భాగ్యభోగ్యములు నాకేలగాల్పనా? తండ్రీ! పలుకకున్నావేమి! అయ్యో! అయ్యో!" యనుచు గోలుగోలున నేడ్చుచు, మధుసూదనుడు తండ్రికడగూర్చుని యాతని మొగమున నశ్రువర్షమును గురిపించుచుం డెను. పాదములకడ మిహిర యాసీనయై సన్నని కన్నీటి కాలువలు పలుచని చెక్కిళ్లమీదుగ బ్రవహించుచుండ, పదసంవాహన మొనర్చు చుండెను. మాధవి యొకమూలగూర్చుని కుంపటి నిప్పుజేసి యౌషధ కషాయముల గాచుచుండెను. జగత్సింహుఁ డెందునను గానరాలేదు. బహుశ యాతఁడు లోన గదుల జక్కబెట్టుచుండెనుగాబోలు. వైద్యుఁడు మాటిమాటికిని రోగి నాడిని బరీక్షించుచు, సంచిలోనిమందులన్నిటిని యనుక్షణమును మార్చుచు, బోయుచుండెను. దాసదాసీజనంబు లిరుగుపొరుగువారును గదినిండియుండిరి. రోగికి సంపూర్ణవిశ్రాంతి కావలయుననియు, ద్వారములకడ్డుగ నెవ్వరుండగూడదనియు జెప్పుచు వైద్యుఁడు వారి నావలకు పంప బ్రయత్నించుచుండెను. కాని విఫలు డగుచుండెను. చుట్టును జేరిన ప్రేక్షకులెల్లరును గన్నీటి బిందువుల నాగదినంతను దడిపివైచుచుండిరి. పాపమెంత యపనీతిపరుడైనను, మహదైశ్వర్యవంతుడును, కీర్తిశాలియునగు రఘునాథుని యీదీనా వస్థగాంచి దుఃఖ మొందనివారెవ్వరు? దుశ్శీలురును, దుర్మార్గులును నగు సామాన్యమానవుల సహితము నవస్థాదశయందు గాంచిన నెట్టి ఱాతిగుండెయైనను జాలినొంది ద్రవించకుండునా? అక్కట! యతఁడు జగద్వి ఖ్యాత దాత. అభినవకుబేరుడని పేరొందిన రఘునాథుడు! అయ్యో యింద్రియవాంఛాపరుడై, స్త్రీలోలుడైనంత మాత్రమున నాతని మరణకాలమంతటి కఠినమనమున్నైన నిముసములో గరగింపకుండుట దుర్లభము.

రఘునాథుని మిత్రమండలియెల్ల నలుదెసల చేరియుండెను. కాని

పాపమట్టి కష్టసమయమునన్నైన నాతనిగనవచ్చుబంధుగుఁడొక్కఁడైనను లేఁడు కదా. ఉన్నచో రాకయుండునా? వచ్చిన వారెల్లరును మధుసూదనునిపై జాలిగొని యాతని జనకున కెవ్విధమగు నపాయమును వాటిల్ల నేరదనియు, నందులకై యాతనిదుఃఖించవలదనియు, కొలది దినముల నాతఁడు సంపూర్ణారోగ్యవంతుఁడుగాఁగలఁడనియు బలువిధముల ధైర్యముగొలుపుచుండిరి. కాని కనులార జనకునిదుస్థితిఁగాంచుచున్న మధుసూదనునకు మాత్రము ధైర్యమాఁగకుండెను. ఆతఁడు కంటికి మంటికి నేకధారగ నేడ్చుచునే యుండెను.

నాఁడు బహుళదశమి. కటికచీకటిరోద సీకుహరమంతయు బూర్ణీభవించియుండెను. ఆకసంబున దారలందందు పథికులకు మార్గదర్శినులగు చుండెను. దశదిశలును దమోమయములై యెదుటి మానిసినిసైతముగాంచవీలు లేకుండెను. భువనభయంకరముగ తమోనాయికి గంభీరకాలచక్రమూని యేకచ్ఛత్రాధిపత్యమున బుడమిని బాలించుచుండెను. దుష్టపరిపాలనమెవ్వరికానందప్రదము? వారి రాజ్యమెన్నిదినంబులు గొనసాగును? కుంచమునిండిన దిరుగబడకుండునా? రాత్రిమూడవ యామమును గడువనున్నది. శిష్టజనులమొర లాలించి తమోసురవినాశనమునకై భావకునాజ్ఞ నొదలదాల్చి శీతమయూఖుఁడు బూర్వదిగ్గిరిగజాధిరూఢుండై, కిరణసహస్రశూలంబుల తమోవక్షవిదారముగావించుచుండెను. తారకావళి, పతిజయశ్రీకరశ్రమహాంప్రాప్తికై పరంతర తేజోవిరాజితములై, పలుతెఱంగులనాతని కర్జంబునకుందోడ్పడుచుండెను. కామవర్తనులు, పరమార్గచరులు, కపటశేఖరునగు మాయావులు, శౌర్యధైర్యనిలయులు, జగద్విఖ్యాతయశోధనులునగు రాజుల నెదిర్చి పోరకోర్చువారలా? శశి యించుక గిరిశిఖరంబుల ధరణీంబరపెనో లేదో, తోడసకుచితయు, సుమార్గగామినులునగు తమోవధూటి ససైన్యబుగ, బుట్టల, భూగృహంబుల, గుహల దలదాచికొన, గాలికొలది బరువులిడసాగెను. దాంభికుల చర్యలిట్టే యుండునుగాబోలు.

రఘునాథుని యింట నిపుడు జనసంఘము క్రమముగ బలుచ బడియెను. వచ్చినవారిలో నత్యంతప్రియులగు నలుపురేవురుదక్క తక్కినతరులెల్లరును, యెవరియిండ్లకు వారేగిరి. రఘునాథునికింకను స్వస్థతగలుగలేదు. ఇంకేటిస్వస్థత? ఆతడు బరలోకయాత్రకై సర్వమును సంసిద్ధముగావించుకొనియే యుండెను. వైద్యుడు నిరాశసూచించు ముఖమున గనులు దేలవైచి, యేమియుందోచకగాబోలు వెర్రివానిగతి నటునిటు జూచుచుండెను. ఈవరకాతడెన్నియోసార్లు రోగి నోటమాదు బోయువాడిపుడు రెండుఘడియల నుండియు నాసంగతినే దలపెట్టకుండెను. అదిగాంచిన మధుసూదనునకు మఱింత నిరాశ్యగా, దుఃఖము బొరలిపొరలి వచ్చుచుండెను. ఆతడుశోకమాపుకొనజాలక వైద్యునిపాదములపైబడి "వైద్యశిఖామణీ! తండ్రీ! దయదలచి నా జనకుని బ్రదికింపజాలరా? నీవేనా దైవమవు. బాబూ! నీపాదములకి వేవనమస్కారములు. నాకు గల సర్వసంపద నిపుడే మీయధీనము గావింతును. ధనమునకై వెనుదీయక యెట్టియౌషధరాజమైనను విని యోగించి. నాతండ్రికి జీవముబోయుము. నన్నురక్షింపుము. అయ్యో! అట్లూరకజూచెదరేమి? నాతండ్రిని బ్రదికింపజాలు మందులు మీకడ లేవా? అట్లయిననింక నాతనినిలుపుకొను భాగ్యము నాకు లేదా? మాఱు పలుకకున్నారేమి? అయ్యో! ఇంకేమార్గమును లేదా? హా"యనుచు నాతడు చైతన్యవిహీనుడై మూర్ఛాసాగరమున మునింగిపోయెను. మాధవి యాతని సేదదేర్చుచుండెను. ఇంతలో రఘునాథుడు మెల్లగ కన్నులవిచ్చి "తండ్రీ! మధూ! ఏడీ? నామధుసూదనుడు. ఒక్కసారి యిటకుండీసికొనిరండు బాబూ!" యని సన్నపుటెలుంగున బలికెను. జనకుని పలుకులు చెవిసోకినంతనే మధుసూదనుడు దెలివొంది తండ్రి కడ కేగెను. పాపమాదృశ్యమును గాంచు ప్రేక్షకులకెల్లను గన్నుల నవిరళాశ్రుధారలు బ్రవహింపజెచ్చెను. వారి మనములు కరగి నీరై పోయెను. శరీరములు ఘర్మజలప్రపూరితము లయ్యెను.

"తండ్రీ! మధూ! పాపుడనగు నాయంత్యవాక్యములు శ్రద్ధతో

నాలింపుము. దైవవశమున......"యని రఘునాథుడేమో బల్కుచుండగనే మధుసూదనుడు దుఃఖమాపుకొనజాలక "అయ్యో! తండ్రీ" యని యాతని మోమున దనమోము జేర్చి విలపింపసాగెను. రఘునాథు డాతని జాలిమై గనుగొనుచు "తండ్రీ! మధూ! యేడ్వకుము. ఏడ్చిన నింకలాభము లేదు. నేనెక్కువమాటలాడజాలను. వినుము. కడచిన దానికై విచారింపకుము. నేనెట్లు చెడినను నీజనకుడనగుట జేసి నా పలుకులాలించి, యభిమానముంచి నీవింక పరస్త్రీ విముఖుడవుగమ్ము. ఇందుగల యావదాస్తియు నింక నీయది. నీవి సౌధముగూడ విక్రయించి రొక్కమంత బట్టుకొని, యింక మనదేశమేగి యటమనకులము వారితో గలసి గృహస్థువగుము. ఇపుడిందు రమారమి యెనిమిది లక్షలవిలువగల యాస్తి యున్నది. అందు నాల్గులక్షలు కలకత్తా "బేంకు"లో నున్నవి. విలువగల రత్నములెన్నో విక్రయింపబడక నట్టేయున్నవి. అన్నియు నీయధీనములు కాని నా కడపటికోర్కెమన్నించి యొక్కటి జేయవలయును. పాపము! మిహిరకు నేనుచాలగ ఋణపడియుంటిని. ఆమె ఋణమీజన్మమున దీర్పజాలకపోతిని. జ్ఞానముననో, యజ్ఞానముననో, దైవికముగ నాకామెతోడి సాంగత్యము లభించినది. కాన పితృభక్తిగలవాడవై నామాట త్రోసివేయక, యేబది వేల రొక్కమామె పరమొనర్పుము. ఇదియే నాకోర్కె. ఇంకను దయదలచితివేని, యీయూర నాచిహ్నముగ స్వల్పధనమును మాత్రము వెచ్చించి నాపేరును ధర్మశాల నొకటినెలకొల్పుము. అంతియే యీదీనుడు నిన్ను వేడునది. ఇంక.....నాయాసము...మిక్కుటమగు...చున్నది. పలుక...జాలను. రత్న...ములు...జాగ్రత...తాళ...ము...లు."అనుచునింక మాటలాడజాలక నాతడు గనులమూసికొనియెను. మధుసూదనుడును దక్కంగలవారు నపరిమితశోకమున మునింగిపోయిరి, మాధవీ మిహిరలొక గదిలోనికేగి యేమోయాలోచించుకొనుచుండిరి. రఘునాథుడింకొకసారి మాత్రము నయనగోళములదెరచి యస్పష్టస్వరమున "మి..హి..రా..రా"యని బలికెను. ఆ

పలుకులాలించి మిహిర మాధవిని విడచి, త్వరితగమనమై యాతని ముఖమున కెదురుగ నిలచెను. ఆతడొక్కసారిమాత్రమామె ముఖముచు గాంచి, యేమో బలుకనెంచి పాపము! మాటరాకుండుటచే నట్లేకనులమూసికొనియెను. అదియే యాతనికడపటి చూపు. మఱల నాతడీపాపపులోకమును దనకన్నుగవవిచ్చి జూచియుండలేదు. ఆతడీ స్థూలదేహమును విడచి యూర్ధ్వలోకగమనుడై సూక్ష్మతర దేహము నారోహించి వెడలిపోయెను. మధుసూదనుడా కట్టెం గౌగిలించుకొని భోరున విలపింపజొచ్చెను. గృహమంతయు నొక్కసారిగ శోక వార్ధిలో గ్రుంగిపోయెను.



౧౧

జనకునిగూర్చి కొంతవడి మధుసూదనుడేడ్చి యేడ్చి కనుల విచ్చిజూచెను. తండ్రిహితులిరువురుమాత్రమచట గూర్చునియుండిరి. జగత్సింహుడుగాని మాధవీ మిహిరలుగాని యాతని కంటబడియుండ లేదు. వారులోన దుఃఖించుచుందురని దలచి వారికడ కాతడులోని కేగిచూచెను, గృహాంతర్భాగమున నొకగదియందు మిహిర యేమో మెల్లగ మాధవితో ముచ్చటింపుచుండెను. ఆతడాగది బ్రవేశింపుచు నొకసారి మాధవినోటహాసశబ్దముగూడవినియెను. ఆతనియొడలెల్లను గంపించిపోవుచుండెను. ఏమో? తాను వినిన హాసము తనపొరపాటై యుండవచ్చునని మఱలనాతడు ధైర్యముగొని గదిబ్రవేశించిచూచెను. వారిరువురి ముఖములను శోకచిహ్నము లాతడావంతయైనను గాంచి యుండలేదు. తనరాకగాంచి మాధవినవ్వుసమాళించుకొనుచున్నట్లాతడు గనుగొనెను. తోడనే వానిమనోభావములెల్లనుమాఱిపోయెను. ఇట్లు వారిరువురును వేఱుగజేరి చేయుమంతనమెట్టిది? జగత్సింహుడెందున్నవాడు? వారిట్టి కష్టసమయమున నవ్వుచుండగతమేమైయుం

డున? ఇట్లని వానిమనంబున నన్నేకాలోచన లొక్కసారిగ మెఱసి పోయెను. అతని కేమియుందోచుట లేదు.

అతని రాకంగాంచినతోడనే మిహిరామాధవు లొక్కసారిగ మోమున వస్త్రములఁ జేసుకొని పసిపాపలవలె వెక్కి వెక్కి యేడువ దొడంగిరి. మధుసూదనునకు మఱల దుఃఖమువచ్చెను. కొంతవడికి మాధవిశోకముపశమింప "తండ్రీ! మధుసూదనా! పాపము నీవింకను బాలుడవు. ఇంతచిన్నతనముననే యీపాపిష్ఠిదైవము జూడజాలక నీ జనకు నెడబాపెను. అయినదేమో అయినది. గతించినదానికై శోకించిన కార్యము లేదు. ప్రతిమనుజునకును జావునిత్యము. ఇట్టియాపత్సమయమున నీవు దుఃఖించుచుగూరుచుండిన నింక ధైర్యము జెప్పువారెవరు? నాయనా! ఇంకనన్నిటికిని నీవే పెద్దవుగాన వేగమపోయి యచ్చటనున్న నీ జనకుని హితులతో ముందుకార్యము లాలోచింపుము. మేమాడువారము. ఇంటినుండి మాటల జెప్పువారమే గాని వీధినిలచి కార్యముల గొనసాగింపనేరము గదా. పొమ్ము నాయనా. ముందు సంగతులాలోచింపుము." యని పలుకుల మధురరసముట్టిపడ వాని నోదార్చెను. మధుసూదనుడామె మాటలకును నామె ప్రేమాభినయమునకును మనమునగొంతసంతసించెనేగాని వారి మంతనములు మాత్రమాతని మనమున మిక్కిలి బాధింపుచునేయుండెను. "అయ్యో! జనకుడు గతించెనని విచారంబున నొకమూల గ్రుంగిపోవుచుండ నీ పాపపు యువతుల చర్యలత్యద్భుతములు గొల్పుచున్నవే. వీరావంతయు నాతండ్రిమృతికై విచారించుచున్నట్లగనబడదు. అవును. యేల విచారింతురు? వారికి నావలెనే శోకింపగారణమేమి? ఋణానుబంధమున ముడివడిన ప్రేమపాశమంతటనే దెగిపోయినదిగదా. ఇంకవారికి విచారమేల? ఇంతకును నాతండ్రి వారి గళమున సూత్రమును బంధించిన ప్రియుడుగాడే. ఒక్కొకవేళ నట్టిమనోనాయకుడు మృతి నొందినను విలపింపని కులటలెందరీ ధరలేరు. అట్టియెడ తుచ్ఛశరీర సౌఖ్యములకై, ధనమునకై, యొండొరుల బ్రేమించిన ప్రియుని

నిర్యాణమునకై వీరుశోకింతురా? అయ్యయో! శోకింపకున్న బోను గాని యిట్టియెడ వీరి రహస్యాలోచనముల కర్థమేమి? వీరిమంతనము లేమి? వీరేమైనా కుట్రలు బన్నుచుండిరా? అట్లయిన దేనింగూర్చి వారికుట్రలు. ఎంతకని—చాటున నిలచి వినకుంటినే. యెంతమంద బుద్ధిని. ఓహో! తెలియవచ్చినది. ఒకవేళవీరు నాజనకుని సంబంధ మగు చరాస్తులెల్ల నీసమయమున హరింపజూచుచుండిరా? ఏమో? మాధవిపలుకులత్యాదరణీయములుగా గానవచ్చుచున్నవే. అట్లని మాత్రమెట్లు నమ్మగలము? ఏపుట్టనే బామున్నదో యెవ్వరెరుంగుదురు? ఎట్లయినను నేను మాత్రమీతరుణమున గడుజాగరూకుడనై యుండ వలయును.” ఇట్లనుచు మధుసూదనుడు దనమనంబున నెన్నియో యోచనలజేయుచుండెను. మాధవి యాతనింగాంచిమఱల“నాయనా! యేల విచారించెదవు? ఎంతవిచారించినను లాభమేమైన నున్నదా? జరుగవలసినదేమో జరిగిపోయినది. తెల్లవారవచ్చుచున్నది. నీవింక బోయి సేయవలసిన బ్రయత్నముల జేయుము. అయ్యో పాపము! నిద్రలేక నీకనులెట్లున్నవిరా బాబూ! ఆమాలదైవమెంతటి కష్టము దెచ్చిపెట్టెను. తండ్రీ! ఏల విచారించెదవు? పొమ్ము.” అని దీనముగ బలికెను. కాని యీసారి యామె వాక్కులు మధుసూదనున కంత మధురతరములుగ గానవచ్చుట లేదు. ఆతని మనస్సంతయు ననుమాన పిశాచగ్రస్తమైపోయెను. అతడేమియు జకులాడక దలవాల్చికొనియే గదివీడి యీవలకరుదెంచెను. కాని యీతనికొకచో నిలుకడగుదుర లేదు. ఇటువచ్చిన నెట్టయెదుట నాతనితండ్రి ప్రేతమాతని గుండెల బగులజేయుచుండెను. అడవారి రహస్యప్రవర్తనములాతని హృదయ విదారము గావించుచుండెను. ఆతనికేమియు దోచకుండెను.

కొంతవడి కాతనికేమిజ్ఞప్తివచ్చెనోగాని పరుగునబోయి తండ్రి దాళపుచెవులకై దడవిజూచెను. రఘునాధుడు జీవించియున్నంతకాల మును ముఖ్యమగు ఖజానాపెట్టెల తాళములు, నిత్యమును విక్రయ మునకై సిద్ధముగనున్న రత్నమందసపు బీగములును మాత్రమొక

వెండిగొలుసున నమర్పబడి యాతని మొలను వ్రేలాడుచుండెడివి. ఇపుడు మధుసూదనుడు వాటినిమిత్తమే తనతండ్రి శవమును బరీక్షించెను కాని యాతని యాశ నిష్ఫలమైనది. తండ్రి మొలనిప్పుడా తాళములలో నొక్కటియు గానవచ్చుటలేదు. ఆతడింకెందుంచియుండును. ఆతని యంత్యవాక్యములలో గూడ చిట్టచివర "తాళములు" యని మాత్రము బలికి పాపమింకమాటరాక నావాక్యము బూర్తి జేయజాలడయ్యె. "ఆతని యుద్దేశ్యమేమై యుండవచ్చునో? తాళము లెందుంచెనో యా స్థలమును జెప్పుటకా? ఆతడొకవేళ నుంచిన నీసౌధమున నెందును నాకెఱుక లేక నుంచజాలడే, ఇచట కాతని నిన్ననే గదా దీసికొనివచ్చినది. ఒకవేళ నాతాళముల మిహిరయంతఃపురమున నే యుంచియుండునా? అట్లయిన నది వారికెఱుక లేకయే జరిగియుండదు. లేకున్న నాతడు మిహిర చేతికే యొసంగియుండునేమో? ఆరీతి నిచ్చియున్న వారది నాకెఱిగింపకుందురా? ఒకవేళ నాపత్న భయమగుటచే నిపుడు జెప్పకుంటిరేమో? వారి సౌధమున నాతాళములతో నేమియు దీయజాలరు గదా?"

ఇట్లనుచు నాతడనేకవిధముల నాబీగములగూర్చియాలోచింపసాగెనుకాని వానికేమియు దోచుటలేదు. "ఈసంగతి మాధవీమిహిరలెఱిగియుందురనుమాటసత్యము. పోయి వారినిప్పుడే యడిగి వత్తునా" యనుచు దటాలున నాతడు మాధవికడకేగజూచి మరల నేలనో వెనుదిరిగివచ్చి యట్రపేటికకడ గాచికొని కునికిపాట్లబడుచున్న తన జనకుని మిత్రులగాంచి "బాబూ? క్షమించిమీరలిటకొంతవడి జాగరూకులరై జూచుచుండుడు. నేనిపుడే లోనికేగి మఱల క్షణములో రాగలను. బాబా! మీరే నాకింక జనకులు. బాలుడనగు నన్ను మీరే యింక రక్షింపవలయును, దయయుంచియీద్వారమునమాత్రమెవ్వరిని నేను వచ్చుదనుక బయటికేగనీయకుడు. తదుపరి నెల్లసంగతులను విశదీకరించువాడ"నని తాను లోనికేగెను. అట్లేగునపుడు మిహిరామాధవులున్న గదిగుండాబోక ప్రక్కదిరిగి యింకొక త్రోవను

పైయంతస్తునకేగెను. మెట్లమీఁదుగ సౌధోపరిభాగమునకేగిన తోడనే రెండుచిన్నగదుల దాటిన వెనుక నొకపెద్దకచేరి సావడిగలదు. గది గడచి రెండుగదులదాటిన మూఁడవగది చాలపెద్దది. అదియే రఘునాథుని స్వార్జితధనాగారము. అందు మూఁడినుపమందసములు గోడల కమర్పబడియున్నవి. ఇంకనుజిన్న చిన్నపెట్టెలునాలుగైదుక్రిందనున్నవి. అన్నిటియందును మిక్కిలి రొక్కమును, విలువగలవెండి బంగారునగలును, నెల్లప్పుడు నిండియుండును. రఘునాథుడు మిహిరకరగతుఁడైనదాదిగ వ్యాపారమంతగ శ్రద్ధతోజరుపకుండుటజేసి గోడకమర్పబడియున్న మూఁడు మందసములలో నొకటిమాత్రమిపుడు వాడుక లేక చాలవరకు తుప్పుబట్టియున్నది. అదియే రఘునాథునిపెన్నిధి. అందే నిత్యమును క్రయవిక్రయములకుసిద్ధములైనయమూల్యమణులుండును ఇపుడు మధుసూదనునకు దాని బీగములు గానరాకుండుట, మాధవీ మిహిరలు రహస్యాలోచనలగావించుచుండుట, బైపై హంతకాగ్రేసరుఁడగు జగత్సింహుఁడు జనకుని మరణమాదిగ కండ్లబడకుండుట యను మూఁడుకారణములయ్యెను. ఆతఁడొకసారి యీధనాగారమును జూచి పోవుటకైవచ్చియుండెను. తండ్రికడనున్న బీగములకుసరియైనబీగముల జతనే దనవద్దగూడ నుంచుకొనుటకై రఘునాథుఁడీవరకే యాతని కొసంగియుండెను. కాన ఇపుడాబీగములుగతించునను మధుసూదనున కంతవిచారము లేదు. అందులకు వలయుబీగములాతనికడ నున్నవని యాతఁడు జ్ఞప్తిదెచ్చుకొనియెను. కాని యిపుడాతని ముఖ్యమగు సందేహమంతయు జగత్సింహునియందేయున్నది. ఒకవేళ నాతఁడంతరి తన యక్కడ బీగములగొని, యిదియే యదనని ధనాగారము ప్రవేశించెనేమో?

ఆతఁడిట్లుమేడపైకరిగి యటనున్న లాంతరునొకదాని చేతఁగొని ధనాగారముచెంతకరిగెను. దాని తలుపొకటి తెరచియే యుండెను. ఆతనిగుండె ఝల్లుమనియెను. ఒకవేళ దానిని మూయుట దానే మఱచెనోమో యని ధైర్యమున నాతఁడందు ప్రవేశించెను. లాంతరు

వెలుంగుగాంచినతోడనే యందుననేయున్న జగత్సింహుడచటిపెట్టెలపై గాళ్ళుజాచుకొని గుఱ్ఱుపెట్టినిద్రించుచుండెను. మధుసూదనునకు మేన బ్రాణములునిలుచుటలేదు. అతనికాళ్ళువడకిపోవుచుండెను. శరీరము కంపించిపోవుచుండెను. "ఏమీ? నాయాలోచనమే నిజమైనదా?" యనుపలుకు లప్రయత్నముగ నాతనినోట వెలువడియెను.

జగత్సింహుడు గదలలేదు. ఆతడు సౌధమంతయు గంపించుగతి గుఱ్ఱుపెట్టుచునేయుండెను. ఇంతరాత్రికడనాతడందేమి జేయుచుండెను? ఏమో? ఎవ్వరెరుంగుదురు.

మధుసూదనుడు ధైర్యముగొని మెల్లగనాతనికడకేగి "జగత్సింహా! జగత్సింహా"యని వీపుదట్టుచు లేపెను, కొంతవడికాతడు "ఆ" యని పెద్దకేకవైచి మేలుకొనికూర్చొనెను. మధుసూదనుడాతనిగాంచి "జగత్! ఇందు నిద్రించుచుంటివేమి? నీకొఱకై మేమిల్లంతయు వెదకుచుంటిమి. నడువు. నాయనా! మీయమ్మ నీకొఱకై జూచుచున్నది. యని మెల్లగ ననెను.

"ఆ—ఆ—అమ్మా—అక్కా? ఏరీ? ఏరీ నేనెక్కడనున్నాను? ఆ—ఆ—"యనుచు, పెద్దయావులింతలదీయుచు వెఱ్ఱివానిగతి నాతడు వడివడి సోపానావరోహణమొనర్చి క్రిందికి దిగిపోయెను.

మధుసూదనుడు గదినంతను బాగుగబరీక్షించి యందేయున్న తనబీగములదీసికొనియెను. ఎక్కడివస్తువులక్కడనేయున్నవి. కాని "జగత్సింహుడీ గది నేల ప్రవేశించెను? ఆతడిందు నిజముగ నిద్రించుచుండెనా? అతడు నిద్రింపదలచిన నాతనికి స్థలమే లేకపోయెనా? ఇందురాబనియేమి? ఈద్వారము నాతడే తెరచెనేమో? నేవచ్చుసరికాతడు నిద్రించుచున్నట్లు నటింపరాదా? నిశ్చయముగ నిందేదో మోసమున్నది"యని దలపోయుచు దెరచియున్న కవాటమెప్పటిగతి బంధించి,కొంతదూరమరుదెంచి, మఱలనేమియాలోచించుకొనియెనో గాని తిరిగియాతడు ధనాగారముబ్రవేశించి, రత్ననిలయమగు మందసముందెరచి, యందు మణులతోనిండియున్న యొక యమూల్య

పేటికను జేకొని యీవలకువచ్చి ద్వారమును జాగ్రతగా బంధించెను. రఘునాథుడు విక్రయార్థము దెచ్చిన మణులన్నియు నందే యున్నవి. మాపునకు చిన్నపెట్టెయేగాని యందు మూడునాల్గు లక్షలరూపాయములకు దక్కువ మణులుండవు.

అతడాపెట్టెనుజంకనిడికొని, యుత్తరీయాంచలమునపదిలముగ దానింగప్పి, దీపమార్పివైచి యాచీకటిలోనెందో యదృశ్యుడాయెను.

జగత్సింహుడు మాధవీమిహిరలకడకరుదెంచివారిమంతనముల దాలాల్గోసియెను. మధుసూదనుడెందేగెనోగాని మఱల నొక్కయర గంట కాలమునకే గృహమునకుందిరిగి వచ్చి "బాబూ! క్షమింపుడు. కొంచెమాలసించితిని. నాకేమియుదోచకున్నది. నామతిపరిభ్రమించుచున్నది. నన్ను మీరే రక్షింపవలయు"నని యచటి పెద్దమనుష్యుల వేడుకొనజొచ్చెను.

మాధవీ మిహిరల రహస్యాలోచనములట్లే సాగుచున్నవి. జగత్సింహుడు వారిరువురకునుబదులు జెప్పజాలక వినవికొనుచుండెను.



౧౭

శ్యామలా! శ్యామలా! ఇదిగో. ఇటు. నీవు వేగముగపోయి మాలతినొక్కసారియిటకుదీసికొనిరమ్ము. వేగమురావలయునుసుమా.

శ్యామల వడివడి సౌధోపరిభాగమునకేగెను. మాలతిశయ్యాగృహమున మంచముపై మేనువాల్చి, యేమియుందోచక నటునిటు గదలుచుండెను. ఆమె యేలనో దీర్ఘాలోచనమునపరాధీనమనస్కయై యుండెను. శ్యామలయడుగుల సవ్వడిగూడ నామెచెవిని బడుటలేదు. "మాలతీ! మాలతీ! బాబా నీకొఱకై క్రింద నెదురుజూచుచున్నారు. వేగముగరమ్ము"యని బిగ్గరగా శ్యామలబలికినంతనే యులికిపడి యామె మంచముపైనుండిలేచి నిలువబడియెను. శ్యామల మఱల

"రావమ్మా వేగంతీసికొని రమ్మనమన్నారు"యనియెను.

మాలతి:—శ్యామలా! ఏలనే యంతతొందర? ఎవ్వరైనను బాబావద్దనున్నారా? లేకనాతడొక్కరే యున్నారా?

శ్యామల:—ఎవ్వరును లేరమ్మ వారొక్కరే క్రిందవసారాలో పచారుచేయుచు నాదారినే వచ్చుచున్న నన్నుబిలచి నిన్ను వేగముగ తోడ్కొని రమ్మన్నారు.

మాలతి:—ఏమే? అంతతొందరేల వచ్చినదే? వారివద్దనుండి విశేషములేమియును దెలియుటలేదుకద? ఏమోనే? వారు వెళ్ళినది మొదలు యింతవరకును వారి సంగతులే మనకు దెలియుటలేదు. ఏమో ఎట్లున్నదోగదా? ఏమియు దోచకున్నదే.

శ్యామల:—అబ్బా! నీప్రశ్నలన్నియు విచిత్రముగానున్నవే. గుర్రిక్కిత్రిప్పకుండా నెన్నిప్రశ్నల గుప్పించినావే. వీటికెల్లను బదులుజెప్పగల శక్తి నావద్దనేయున్నచో నీవుబాబావద్దకేల పోవలయును? వారు నిన్నేల బిలవలయును? నీముఖమును జూచి, నీ యొయ్యారముజూచిసంతోషించుటకా? చాలుజాలు. నడువు త్వరగా.

మాలితి:—ఎప్పుడూ నీజవాబులిట్లేయున్నవే. నీ మాటలకై సంతోషింపనా, యేడ్వనా? పడ్చెడివారినైననునిముసములో నవ్వించ గలశక్తి నీకడనున్నదే. నడువుమటే. బాబాకేమైన వారిసంగతి తెలిసి యుండవచ్చును. లేకున్న నింతత్వరగ బిలువనంపరు.

వడివడిగా మాలతీశ్యామలలుసౌధావరోహణమొనర్చి, క్రింద వసారాలో నటునిటు దలవాల్చి పచారుజేయుచున్న యొకవృద్ధుని జేరిరి. ఆముసలి బచారుచేయుటమాన యటనున్న యొకయాసనముపై నధిష్ఠించెను. మాలతి వానికడ న్లనిలువబడియుండెను. శ్యామల వారికి కొంచెమెడముగ నిలచి వీధినివచ్చుచుబోవుచున్నవారి నెల్ల జూచుచు నానందించుచుండెను.

మాలతి:— ఏల బిలపించితిరి? వారిసమాచార మేమైనా దెలిసినదా?

వృద్ధుడు:—అమ్మా! నిన్నిపుడు బిలువనంపుటకొక ముఖ్యావసరముగలదు. ఇపుడు నీతో కొన్నివిషయముల రహస్యముగ మాట్లాడవలయును— రమ్ము. ఆవలిగదిలోనికేగి మనమాసంగతి విచారింతము.

ఇట్లనుచు నావృద్ధుడు ముందు మార్గముజూప, వెనుకమాలతి హృదయమూవేగమునడంచుకొనుచు, మెల్లగ నడవజొచ్చెను. అట్లువారు రెండుగదులదాటి రమ్యమగు నింకొకగదిలోనికేగి, ద్వారములబంధించికొని, యొకకిటికీ మాత్రిముదెరచిపెట్టి, చెరియొకయాసనమలంకరించి యిట్లు మాట్లాడజొచ్చిరి.

వృద్ధుడు:—అమ్మా! నకిపుడొక యగత్యకార్యమును దెలుపుచు, నందు నీయుద్దేశ మేమైయుండునో గనుగొనుటకైయింతత్వరగా బిలచితిని. నీవు స్వస్థచిత్తవై యాలోచింపుము.

మాలతి:—బాబా! మీరేమనుచున్నారో నాకించుకంతయు దెలియరాకున్నది. చిన్నదాననగునాయాలోచన యేమీకంత యగత్యమగుట వింతగనున్నది. అయినను నేనెరుంగునంతవఱకు నాతోచిన రీతిని జెప్పగలను సెలవిండు.

ఈవృద్ధుడు మాలతిజనకుడగు జీవనాధుడు. ఇపుడు వీరి యాలోచనలేమో విందము.

జీవ:—అమ్మా! మధుసూదనుని తండ్రి నిన్నరేయి రెండుమూడుగంటలకాలమున గతించినాడు ఆతడు........

అనునంతలో మాలతి"హారహరా! ఎంతమాట వింటిని. నాకీ సంగతి దెలియనేలేదు. బాబయూ! మీకిది యెట్లు దెలియవచ్చినది? పాపమాతడింక దిక్కులేనివాడైపోయెనే. అయ్యయో!" యనుచు వామె యొక్కమ్మడి గనులనీరు కాలువలుగట్టవాపోవసాగెను.

జీవ:—అమ్మా! నీవేలనిట్లు విలపించెదవు. జరుగవలసినదేదియో జరిగిపోయినది. కాని నాయాలోచనవినుము. ఇంక రెండుదినములలో మనమీయూరువిడచికలకత్తాకుబోవలయుననిసంకల్పించు

కొంటిని గాన నీవు ప్రయాణసన్నాహమంతయు ద్వరలో జేయవల యును. ఇందు నీయాలోచనయేమి?

మాలతిగుండెలు గొట్టుకొనుచుండెను. ఆమెనోట మాటరా కుండెను. జనకుడు వచించిన పలుకొక్కటియు నామెచెవికెక్కినట్లు లేదు. ఎట్టకేలకామె కనులనీరొత్తుకొనుచు "బాబా! గోరుచుట్టుపై రోకటిపోటనునట్లు ఇంతత్వరగా మనమీయూరు నేలవిడువవలసి వచ్చెను? మధుసూదనుడుగూడ కలకత్తాబోవ సమకట్టియుండునా? వారిని మీరెప్పుడుజూచియుంటిరి" యని ప్రశ్నించెను.

జీవ:—లేదు—లేదు. వారుకూడనీయూరువిడచిరాదు. మనమే పోవలయును. అట్లుబోవుటలో మనమాలసింపక ద్వరలో బోవల యును. వ్యవహారపు చిక్కులుగొన్ని యట్లుతటస్థించినవి.

మాలతి:—బాబా! మీరుచెప్పునది నాకేమియు బోధపడుట లేదు. ఇన్నిదినములులేని యాచిక్కులు యిపుడేమి మనకు తటస్థిం చినవి? వారు మీకు గనబడియుండిరా? వారికీసమాచార మెఱుం గ జేసితిరా?

జీవ:—వారినిజూచియుంటినిగాని మనయీ ప్రయాణముం గూర్చి వారికెఱుక జేయు సమయముదటస్థించియుండలేదు. కాకున్న ను వారికివియెల్లనుజెప్పు నగత్యమగుపడుటలేదు.

మాలతి:—అట్లయిన వారు మీకు గనబడియే యుండిరా? నాతో మీరుజెప్పనేలేదు. ఎప్పుడు వారింజూచియుండిరి?

జీవ:—నిన్న రేయి నాలుగు గంటలప్పుడు.

మాలతి:—తండ్రీ! మీపలుకులు వింతగనున్నవే. నిన్నరాత్రి యేగద వారి జనకుడు గతించెనని చెప్పియుండిరి. అట్లయిన నట్టికష్ట సమయమున వారిందేల వచ్చిరి?

జీవ:—మనకాసంగతి నెఱిగించి చనుటకే యాతడు వచ్చి యుండును. మీరెల్లను నిద్రించుచుంటచే క్రిందనున్న నన్ను మేలు కొలిపి, క్లుప్తముగ నెల్లసంగతులునుజెప్పి తడయుటకింక వీలులేదని

వెడలిపోయెను.

**మాలతి:**—మఱల నెపుడు వచ్చెదరంటిరి.

జీవ:—ఆసంగతి వారు జెప్పుటలేదు, నేనడుగుటయు లేదు. ఎట్లయినను నీతొందరలెల్ల గడచినగాని రాజాలననుకొందును.

**మాలతి:**—సరియేగాని మనమిపుడీయూరువిడచి పోవుటకు గారణము జెప్పరైరి.

జీవ:—అదియే యిపుడు నేజెప్పబోవునది. నిన్నటి రేయి యీనగరికి రుదెంచునపుడొక పేటికనుగొనితెచ్చి మనకిచ్చి పోయి యున్నాడు. దానిని నిపుడొకసారి జూడవలసియున్నది.

**మాలతి:**—ఏమీ, రాత్రివేళ నొక పేటికనుగూడ దెచ్చెనా? అందేమి యున్నవి?

జీవ:—చెప్పనెందులకు? నీవొకపరిజూచినచో సర్వమును గ్రహింప గలుగుదువు. వెలుపల నెవ్వరును లేకుండ జూచిరమ్ము. ఎవ్వరరుదెంచినను వెలుపలనే యుంచుమని శ్యామలకుంగూడ జెప్పిరమ్ము. త్వరగా రమ్ము.

**మాలతి** వెడలిపోయెను. ఆమెకీగాధయావంతయు బోధపడుట లేదు. తనజనకుడే తనకిట్టి వింతకధను జెప్పుచుండుటకామెయాశ్చర్య భయసంభ్రమంబులబడి కొట్టుకొనుచుండెను. "ఇంతత్వరలో నీగ్రామ మేలవిడువవలయును? అంతయగత్యమేమివచ్చినది. నేనెరింగినవఱకెట్టి వ్యవహారపు జిక్కులును మాకులేవే! మాసంసారము జలగగొన సాగుచున్నదే. అట్టియెడ నింతటితొందర గలుగుజేయు వ్యాపార మెట్టిదోగద. ఒకవేళ మాకెట్టి యపాయమును దటస్థించియుండదు గద. రాత్రివారువచ్చి పేటికనేలయిచ్చిరో? ఆశ్చర్యము. ఆవలతండ్రి మృతశరీరమటబడియుండగ నీవల నాతడు మాగొఱకై పేటిక నేల దెచ్చియుండునో? ఇందు నందేమియున్నది? ఎంత యోచించినను నేమియుదోచుట లేదు" ఇట్లనుచు నామెపలుగతుల మదిందలపోయుచు పరధ్యానముగ శ్యామలకడకుంబోక, దొడ్డిగుమ్మముకడకేగి మఱల

వెనుదిరిగివచ్చి శ్యామలంజేరి యామెకు జాగ్రతబోధించి, తిరిగి జనకునిదరి కేగెను. ఆమెలోనబ్రవేసింపగనేయధారూపమునకవాటము బాధించి, జీవనాథుడామెనొక బీరువాకడకుంగొనిపోయి, తనరొండి నున్న బీగములతో దానిందెరచి యందుండియొక చిన్న పేటికనుదీసెను. అయ్యది జూపునకు జిన్నదియైనను, కడుంగడు రమ్యముగను, పనితనముగను జేయబడి యమూల్యమణినిలయమువలె గన్పట్టుచుండెను. నిశ్చయముగ నది మణినిలయమే. జీవనాథుడు వేరొండుబీగమున దానిందెరచుచు "అమ్మా! ఇందేమియున్నదియో జూచితివా? వ్వా-హ్వా"యని నగుచు యామెకు దానికప్పుదెరచి జూపెను.

మాలతి కనులొక్కసారిగ జీకట్లుగ్రమ్మ మూర్ఛవడియెను. ఆమె కదియెల్లనుగలవలెగానవచ్చుచుండెను. నిజముగనామె స్వప్న వస్తుయన్నట్టువలెనే సించుకైనను చలింపక మేన దెలివిదప్పి కొయ్యవారిపోయెను. కొంతవడికామె మఱలకనులదెరచి చూచెను. ఎదుట నెప్పటివలెనే పేటిక దెరువబడియేయుండెను జీవనాథుడద్దానిపైకప్పున జేయిడి "ఏలనమ్మా యట్లు వెఱ్ఱిదానివలె జూచుచున్నావు?" యని హెచ్చరికంగలుగ జేసెను. మాలతి యించుక దెలివిదెచ్చికొని నిదానించి పెట్టెలోనజూచెను. అందేమున్నవి? ఆమె భ్రమపడియుండలేదు. వజ్రవైడూర్యాది నవరత్నములా పేటికయందు నింపబడియున్నవి. పలుతెఱంగుల రంగులన్నియుంగలసి యఖండజ్యోతిగానాగదినంతను వెలింగించుచున్నవి. అత్యధిక తేజస్ఫూర్తిచే నాగదియంతయు జీకటులలముకొన్నగతి దోచుచుండెను. నిశ్చయమే. మనుజుని నయన గోళములింత వెలుంగును మాత్రమే జూడగలవను కొలతయున్నది ఆకొలతకుమించి ప్రకాశించు వస్తువెద్దియైనను నరుని యక్షువులను గానజాలవు. ఆతనికడ్డుగా ప్రభాపుంజము తమఃపటమువలె దోచును అందుచేత నెమనమొల్లరము నత్యధికతేజోశాలియగు మార్తాండుని పైన కనులవిచ్చి గనుగొనజాలము.

మాలతికింకను గలయను భ్రాంతి విడువలేదు. ఎట్లో యామె

యించుక దెలివిదాల్చి "బాబా! యీరత్నములెవ్వరివి? అతఁడే! యమూల్యమణుల మనకేలనిచ్చెను." అని మాత్రము ప్రశ్నించెను. పాపమామె ఇంతవఱకెన్నఁడును జననమాదిగ నిట్టిరత్న నికరమొక్క-సారిగ గాంచియుండలేదు. ఆమె శరీరమంతయు స్వేదసిక్తమై కంపించిపోవుచుండెను. జీవనాథుఁడు పెట్టెనెప్పటియట్లు మూసి బీగమువైచి, యథాస్థానముననుంచి, యామె మేనజేయిడి నిమురుచు నొక యాసనమున నామెనధిష్ఠింపజేసి, పక్కనే దానును గూర్చుని యిట్లని జెప్పసాగెను.

"అమ్మా! నీవన్నేల భయమున నవశంకిపోవుచుంటివి? ఇవి మన మెవరివద్ద నపహరించి దెచ్చియుంచలేదు. నిన్నటిరేయి నాతఁడువచ్చి రఘునాథుని ప్రేయసి మిహిరయు, మాధవీ జగత్సింహులును నిప్పుడానగరి యింటనేయుండి యేమోరహస్యాలోచనల జేయుచుంటిరనియు వారియాలోచనలఫలమేవిధముగ బరిణమించునోయను భయమున నాతఁడే ముఖ్యధనమగు రత్నపేటికను దెచ్చి, నాచేతనిడి, దానిని రక్షింపగోరి వెడలిపోయెను. అందుచే నిది మనకడనున్నది. ఇందు నీయాలోచనమేమన, బాగుగవినుము. మధుసూదనుఁడింతవరకును మనకొక కాసునైన నిచ్చియుండలేదు. ఇంక నాతని ద్రవ్యమున జాల భాగము రఘునాథునియుంపుడుకత్తెపాలగును. ఈవరకే జగత్సింహుని సహాయమున మాధవి చాలవఱకు ధనమపహరించియుండును. ఆమె సామాన్యురాలుగాదు. అదిగాక రఘునాథుఁడు జీవించియుండగనే వారికికొంతయాస్తి జెందునట్లేర్పాటుగావించియుండెనట. ఇంక మన మెంత దన్నుకొన్నను, యెన్నివేలయేండ్లు దపస్సుజేసినను, యింత ధనమొక్క-సారిగ మనచేతబడనేఱదు. ఇప్పట్టున మనము దీనిని విడచితిమా మరల నాపెన్నిధి యాజన్మాంతమును మనలవిడచునది కాదు. అదిగాక మనవృత్తియేదోకొలది నాలుగు డబ్బుల సంపాదించుకొనుటయేగాన మనమీపైకమును హస్తగతముగావించుకొనుటయే మంచిది. ఇది పోయినంత మాత్రమున మధుసూదనుఁడన్న దరిద్రు

హీనుడు గాఁ జేరడు. అతనికింకను లోక్కములజాలగ గలదు అతని సమ్మతినిఁ బడసి యింతధనమును మనము పుచ్చుకొందుమన్న నాతఁడొక్క కాసైనను మనల జెందనీయఁడు. పరస్త్రీలోలురగు వారికి న్యాయాన్యాయములెక్కడ? కాన నామాటగాదనక నీరహస్యమెచ్చటను బయలుపడనీయక, తండ్రిని, వృద్ధుడనునగు నాయందు కరుణబూని సత్వరముగ మన ప్రయాణ సన్నాహము గావింపుము. ఇదియే నాకోర్కె—"

ఇట్లనుచు నాతఁడు బుసబుసరికి మాలతిప్రాణము లొక్కొక్కటిగ నెగసిపోవుచున్నట్లుండెను. ఆమె చెమ్మటచే దడసి మూర్ఛయై పోయెను. ఆమె కూర్చునియున్న యాసనముతో గూడ గంపించిపోవు చుండెను. ఆమె కనులకీ భూమ్యాకాశములు రెండును మహాయంత్ర చక్రద్వయమునవలెనే దిరిగిపోవుచున్నట్లుండెను. నోట మాట రాకుండెను. కనులవిచ్చి తండ్రిముఖము తదేకదృష్టినై జూచుచునేయుండెను గాని యామె కేమియు గానవచ్చుట లేదు.

కొంతవడికామె మూర్ఛదేరినది. జనకుడు వచించిన ప్రతి యక్షరమును నిప్పుడామె కర్ణకుహరమున ప్రతిధ్వనించు చున్నది. ఆమె యాతని హితోపదేశమును పలుతడవులు స్మరించుకొనినది. "ఏమిచేయవలయును? జనకుని కెదురాడవలయునా? ఆతడు జెప్పిన దంతయును న్యాయముగనే గవబడుచున్నది. నికృష్టమును, హైన్యాతిహైన్యంబును నగు నీచకులవృత్తి యంతయు నెందులకు? ఈశరీర మమ్మికొని జీవించుమని గదా దేవుడు మాతలవ్రాసియుండెను, అట్టి ధనము స్వీకరించుటకింక సంశయమేల? అదృష్టరేఖలు భిన్నగలేని కాలమున స్వల్పధనమునకే మానమానము గోలుపోవుదుము గదా? పరమేశ్వరు కృపచే నొక్కొకవేళనిట్టి సంఘటనములు దటస్థించు చుండును. అట్టియెడ వేలు, లక్షలు. గోట్లు సహితము జేజిక్కించుకొన్న వారెందరు లేరు? వ్రతము చెడినను ఫలమైనను దక్కవలయును గాన నాతండ్రి పలుకులే సత్యములని దోచుచున్నవి. అయినచో నమ్మిన

వానిని మోసగించుట న్యాయమా? దాచబెట్టిన దోచుకొందురను సామెత నిక్కువమా? అందుల బాపము సంభవింపదా? పాపమాతడు గలకాలము దీనికై దుఃఖింపడా? ఆదుఃఖఫలము మమ్మెన్నటికైనను గట్టికుడుపకుండునా? అయ్యో! ఏమినావెఱ్ఱి? మాజన్మమే పాపము. మావృత్తి పాపము. మాజీవనము పాపము. నిత్యమును మేము భుజించు నదియే పాపపుముద్ద. ఆపాదశిరఃపర్యంతమును మేము పాపమును వడిగట్టి దేర్చిన నిగ్గులము. అట్టియెడ నీధనమపహరించినను, లేకున్నను, నేడో, రేపో యెప్పుడో యొకప్పుడు దప్పక నాపాపఫలమనుభవించి తీరవలసినదే. కాన దీనికై విచారమొందులకు. తండ్రితో నేకీభవించుటయే సర్వోత్తమము. జననమాదిగ బెంచినవాడాతడుగాని యీతడు నామనోనాయకుడుగాడే. కాన జనకుని వాక్యములామోదములే." యనుచు నామె చాలవఱకు బాపపుణ్యవిచక్షణసలిపిసలిపి, పశ్చాత్తాపముల గల్పించుకొని తుదకాన్యాయ్యమైకవిచారమీక్రిందితీర్మానమునకువచ్చెను. "బాబా! నీవుజెప్పినదంతయు బూర్తిగావిచారించుకొంటిని. చినతనమాదిగ నాకష్టసుఖములనరసి యెన్నోశ్రమలనొంది నాకొఱకై పలుబాములకులోనై నన్నిట్లువృద్ధిలోనికి నీవేదెచ్చి యుంటివి. ఇట్టియెడ నీపల్కులకు వ్యతిరేకభావములజూపి నీమనమును నొప్పింపజాలను. పాపమైనను బుణ్యమైనను, మంచిదైనను జెడ్డదైనను, సర్వమునకును నీవేదిక్కు. కాన దప్పక నీయాజ్ఞలననుసరించి త్వరలో బ్రయాణసన్నాహ మొనర్చు చున్నాను గాన నీవింక విచారింప వల"దనియెను.

జీవనాథుడు దనయనుదగ్గరజేర్చికొని మేనునిమురుచు, శిరము మూర్కొనుచు "అమ్మా యింక నాకష్టములు ఫలించిన"వనియెను.



౧౩

అయ్యో! మిహిరా! మిహిరా! అయ్యయో! ఎంతలోనా కొంపనంతయు నొక్కసారిగ నట్టేటముంచిపోతివే తల్లీ! ఇంతటి

యన్యాయమొనరించి పోయెదవని కలనైనను దలంపలేదే తల్లీ! లోకమున దమ్ముఁగట్టుకొనియున్న భర్తలసహితమెడబాసియుండిన కాంతలు లేరా? ప్రాణపదముగ నొకరినొకరుజూచుకొనుచు మేనులు రెండైనను ప్రాణమొక్కటిగనే దలంచుచు, కలకాలము బూసలలోని దారము వలె మెలంగుదంపతులు సహితము ఋణానుబంధము దెగిన నొకరి నొకరు బాసిచనుటలేదా? అట్టియెడ నామమాత్ర మనోహరుఁడైన యావృద్ధఘుటము గతించినంతమాత్రమున నీవింతటిసాహస మొనర్చి యింతయన్యాయమొనర్తువా? తల్లీ! ఇంక నాకీజగమునదిక్కెవ్వరు? కనియుండకపోయినను, ఏనాఁడు నినుదరిజేర్చి బెంచ మొదలిడితినో నాటి నుండియు నీవే నాబహిఃప్రాణమవనియు, నాపాలి కల్పవృక్షమవనియు, కామధేనువవనియు, నెన్నెన్నో రీతుల నల్లారుముద్దుగ బెంచి దలంచి యుంటినే. అట్టియెడ నాకేమి గతిగల్పించితివి తల్లీ? నాతోనించుకంతయు జెప్పియుండక నింతటిక్రూరమునకొడిగట్టితివా? ఇంక నాకీలోకమున నెవ్వరుగలరు! ఎవ్వరింగాంచి నేనింక నామేనప్రాణములనిల్పి కొందును? ఈసర్వసంపదలెవ్వరివి? నీవులేని యీసౌధములు నీధనధాన్యములింకెవ్వరికి? మున్ముందురానున్న యీధనమంతయు నెవ్వరి కొఱకుదల్లీ! ఎంతటిదారుణమున కొడిగట్టితివే ఆవృద్ధునిసాంగత్యము తుదకీరీతిని బరిణమించెనా? అయ్యో! ఇంచుకంతయు నీసంగతి గనజాలకుంటినే అమ్మా! ఆతనితోసరిగ బ్రాణములసహితము బాపుకొనునంతటి ప్రేమవతివని యొక్కనాఁడైనను నెఱుఁగకుంటినే. ఏమోవిధి, కృతమున నాతని బ్రాపుగలిగిన త్లీయది దెగిపోయినదనుకొంటినిగాని దానిప్రతిఫలమీరీతిగ బరిణమించునని గలనైనను గాంచకపోతినే. అయ్యో! ఎంతమందమతినైపోతిని. ఎల్లవేళలను నొక్కక్షణికమైనను నినుబాసిచనక, గంటికిరెప్పవోలెగాచుకొనుచు-నిన్నన నేల? అంతమత్తెక్కియొకపరినైనను నినుగాంచకుంటినే తల్లీ! శయనాగారమునమంచముపైనిదురించుచున్న, నేమోబహుదినసాంగత్యమునంజేసి నాథునిగూర్చి వలవంతగుందుచుంటివనిదలంచితినిగాని, యింతటిద్రోహచింత దలబెట్టి

యుంటివని యెఱుంగకబోతినిగదా. నాయాలోచనలెల్ల నీకెఱింగించి నీ మనోభావమెట్టిదని యడుగునప్పుడెల్లను చిరునగవున నాకు బ్రత్యుత్తరము లొసంగుచుంటచే, విచారముదక్కి యుంటివనుకొంటినిగాని నీ మనమింతటిదుఃఖపూర్ణమైయున్నదని యీవంతయు గ్రహింపజాలక బోతినే. ఈవఱకే మృత్యుహతంబడనున్న నన్ను దైవమనుకూలించి మీయిరువురను బ్రసాదించుటంజేసి యింతవరకును హాయిగ మేన జీవములనిల్పియుంటినిగాని లేకున్న నాకీజీవనమేల? సరే, నీవొక ప్రేమమూర్తినై మదినిల్పి యనాయాసముగ జీవములవిడచిన, నిన్నే నా ప్రేమైకనిధానముగ దలచి యుప్పొంగుచుండిన నేనింక నిదే నీ కొఱకె మేనువదలుచున్నాను. తల్లీ! భయపడకుము. సహాయముగ నిదే నేనుగూడ నీవెనువెంటనే వచ్చుచున్నాను. నిన్నుగూడియెక్కడ నున్న నాకక్కడనే స్వర్గము. నాగృహలక్ష్మివగు నీవు బోయిన నాకింక నిందెవ్వరున్నారు? జగత్సింహుడా? అతడు పురుషుడు. అతని గూడ నీతో సమముగనే బెంచియున్నను, యేలనో నీయందుగల వాత్సల్యమాతనిపై నాకుగలుగుటలేదు, కాకున్నను స్త్రీనగుటనిన్నే కడుంగడు బ్రేమించి యెన్నో యాశలకు జిక్కియుంటిని. అయినను నీవు నిముసములో నాయాశాపాశము లన్నియును ద్రెంచి వైచితివి. ఇంకజగత్సింహునకై నాకు విచారములేదు. అతడిప్పుడు సంపూర్ణయౌవనుడు సర్వసంపదలకధికారి. వానివివాహవిషయమా? అతడే యెదో దగినకాంతను జేపట్టును. ధనవంతునెవ్వరువరింపరు? ఎంతదుర్మార్గుడైనను, లక్ష్మీకటాక్షమున్న నాతడుమాననీయుడే. ఇంక నాకే విచారమును లేదు. అదిగాక నేనిపుడు మృత్యువునకు దగు వయసునందేయుంటిని. ఇంక జీవించియుండుట నిరర్థకము. గాన తల్లీ! ఇదే నీవెనువెంట నిముసములో వచ్చుచున్నాను. పరమేశ్వరా! రక్షింపుము. మాతల్లికటాక్షముల మఱల నాపై బ్రసరింపజేయుము. నీకిదే నమస్కారము"

ఇట్లనుచు బిగ్గరగ నిరుగుపొరుగువారి హృదయములు గరగి

నీరగునట్లు గడుంగడు దుఃఖింపుచు మాధవితనగృహమున వీధి వాకిలి బంధించి యొకగదిలో నొక్కతెయు చాలతడవు నిలచియుండెను. దుఃఖోద్రేకమున నింకమాటరామి కాబోలామెకొంతవడి యాయాస మపనయింప నొకయాసనమధిష్ఠించియుంచుక కనులమూసికొనియెను. ఎంత తడవట్లుగెనో యామెయెఱుంగదు. కానిదెలివొంది కనుల దెరచి చూచుసరికి సూర్యుడపరాంబుధి మునుంగనుండెను. ఎకట జగము తయు శోకార్ణవంబుగ మునింగిపోవుచున్నట్లామెకు బొడకట్టుచుండెను. గడచినరేయి మిహిర ప్రియుడు గతించుటచేకాబోలు, యామె విష పానమొనర్చి విగతప్రాణయయ్యెనని కొందరును, యేదో మాట పట్టింపున దెల్లవారువఱకును, మాధవి ఆమెతో గలహించి తుదకీ రీతి విషప్రయోగమున జంపెనని గొందరును పలువిధముల పురజనులు జెప్పుకొనుచుండిరి. ఎట్లయినను మాధవి మాత్రము రక్షకభటుల దాడికై వెరచి మిహిరకు గతరెండుదినములనుండియు జ్వరము వచ్చు చున్నదనియు, నాటిరేయి నావిషజ్వరము సంధిగామారి తన కూతుం బొట్టబెట్టుకొనెననియు వచించి, తగు ధనవ్యయమొనరించి, యెట్లో వారి దాడినుండి బ్రతికి యీవలబడియెను. నిజమామె యెఱుంగక పోలేదుగాని యట్లనిసత్యము జెప్పినదాసేగాక పాపము జగత్ప్రింపటుడు గూడ నీవలలో దగుల్కొనవలసివచ్చునని యామె వారి మాతుల గట్టివైచెను. దహనమెప్పుడే రేరీతిగావించిరో మాత్రమేరికిం దెలియదు.

పాపము! మాధవిశోకముంగాంచిన గరుగని రాతిగుండెయుండ దని మానమ్మకము. అందలిసత్యాసత్యములు పరమేశ్వరుడే యెఱుంగ వలయును. పాపమామె నోదార్చువారెవ్వరు? ఇంటినేవస్తువుంగాంచి నను మిహిర ప్రతిబింబమామెకు బొడకట్టుచునే యుండెను. పుత్ర పుత్రికాశోకమెట్టివారికైనను దగనిశిక్ష. అందునను మాధవిజన్మమున కలభ్యమగు పుత్రపుత్రికాపరిరక్షణ లభించియుంటచే, చిరకాలప్రేమ పాశమొక్కసారిగ శతభిన్నమై పోవుట నామెకీజీవితముపై రోత జనింపజేసెను. ఆమె ఎంత ఏడ్చినను బారము గనజాలక బోయెను.

త్రికరణశుద్ధిగ నామె మృత్యుదేవి నుపాశించుచున్నుండెను.

ఇంట నెవ్వరును లేరు. జగత్సింహుడెచ్చటికేగియుండెనో నాతడింతవఱకును గృహాభిముఖుడుగా లేడు. ఆతడుగూడ సోదరీవియోగానలదగ్ధమానసుండై, పిచ్చివాడై యెందుడిరుగాడుచుండెనో?

మాధవి మరలనొకసారి వీధిగుమ్మముకడకేగి ద్వారముందెరచి చూచెను. జగమంతయు నంధకారబంధురము. చటాలున నామె గుమ్మటివలెనె ద్వారముబంధించి, తనగది బ్రవేశించి, పొడుగైనత్రాటి నొకదూలమునకు బ్రేలగట్టి, యురి యమర్చుకొనియెను. క్రిందనొక యెత్తుగుబల్లనిడి దానిపై నామెనిలచి చేతులరెంట నాయురిపాశమును బట్టుకొనియెను. తోడనే యామె కనుకొలకుల నవిరళాశ్రుధారలు బ్రవహింపసాగెను. ఇంకనామె వానిందుడుచుకొనలేదు. అట్లుజేయు దలంపైనను ఆమెకుగలిగినట్లులేదు. ఒక్కసారియామె రెండుచేతుల జోడించి దేవునకు నమస్కరించి కాలపాశమున దలదూర్చెను. ఒక్కకాలితోపున క్రిందనిలువబడినబల్ల దూరమునబడిపోయెను. పాశము కంఠమున బిగిసికొని పోవుచుండెను.

హా! హా! ఎంతసాహస మెంతసాహసము? స్త్రీలెంతకైనను సమర్థలు. నిన్నసీయింటనేగదయొక కాంతామణి, ప్రియుమరణమునకై విలపించి, విలపించి, ప్రాణముల దృణప్రాయముగ నర్జించియుండెను. నేడిచ్చటనే సుతవియోగంబునగుందు యోషారత్నమొండు, నిందు ప్రాణముల గ్రుడ్డిగవ్వకన్న నధమముగనెంచి విసర్జించుచున్నది. ఆహా స్త్రీల ప్రాణములెంతటి సాహసకృత్యములకైనను వెనుదీయవుగదా—

మాధవి విలవిలదన్నుకొనుచుండెను. ఆమె యాబాధకోర్వజాలక రెండుచేతుల నాత్రాటిని ద్రెంపబ్రయత్నించుచుండెను. కాని యురినిదలదూర్చినటుల దప్పించుకొనుట యెంతవారికిని దుస్సాధ్యము గదా. ఆమె యట్లే వ్రేలబడిపోయెను. తొలుతముఖమును గ్రమక్రమంబుగ శరీరమంతయు నల్లవారుచుండెను.

ఇంతలో వీధితలుపెవ్వరో బగులగొట్టు శబ్దము వినవచ్చెను.

మాట్లాడుకొనుచుండిరి.

ఒకడు:—ఏమో? నీవెంత జెప్పినను నేను మాత్రము నమ్మ జాలను. నీపలుకులత్యాశ్చర్యకరములుగనున్నవి. ఎంతయత్నించినను నీతో నేనేకీభవింపజాలకున్నాను.

రెండవ:—నీవమాయకుడవు. నీమనో ఫలకము స్నిగ్ధమగు నద్దమువలెనే యెదుటివస్తువుల నిర్మలాకారములనే ప్రతిఫలించు చుండును. నిగూఢములు, నింద్యములునగు వ్యాపారములనీవూహింప జాలవు. అది నేనెఱుంగుదును. కాని నా వాక్యములు మాత్రము సత్య ములు. లోకమునసిట్టివెన్నియో నేనుజూచియున్నాను. అక్కా' ఎత పతివ్రత? ఎంత ప్రేమవతి? చాలు—చాలు. కట్టిపెట్టుము. ఎవ్వరైనను విన్నచో నవ్విపోదురు. అయ్యో! వెర్రివాడా! ఈసంగతి యెంతవ్యతి రేకముగను, యెంతయసందర్భముగను గనబడుచున్నదో నీవెఱుంగక పోతివే? ఎంతమూర్ఖుడవు? బాలుడైనను నీకథవిశ్వసించునా? మూడు జన్మలెత్తినను నీవు విశ్వసింపజేయుగలవా?కల్ల-కల్ల. ధనముసకాసించి వలపుగొన్న కాంతయట, పతిపోయినంతనే, "ఛీ! యింకేటికీబ్రదుకు? అంతటి నాథుడేబోవ నాతుచ్ఛజీవనము లేల? యీభోగము లేల"నని విరాగియై, నిండుప్రాణముల గడ్డిపోచకన్న నధముగ ద్యజించినదట— ఋణానుబంధమున, కాసుదగ్గర లేనితరి, ధనముతోగూడ దొరకిన బిల్లల పెంచినంతమాత్రమున—పాపము! కూతురు బోయిన తోడనే తల్లిగూడ యురిబోసికొని జీవముల బాయ సిద్ధపడినదట—ఓరి! పిచ్చి వాడా? యీకథ నెంతయసంధర్భములుగ నున్నవో యించుకైనను గ్రహించితివా? ఈరెండు కథలును యొకదానికొకటి ప్రత్యక్షసంబం ధములు గలిగియున్నవని యూహించితివా?అవును, నీవేకాదు నిర్మల దృష్టిని వీక్షించు నేమానవుసకైనను యది గన్పట్టును. నిశ్చయమే.

మొదటివాడు—ఏలనీయుపన్యాసము. కట్టిపెట్టుము. లేని సంబంధమునుగల్పించివ్యవహారమంతయు దలక్రిందు జేసివైచుచున్నావు గాని యొక్క సంగతి గనిపెట్టితివా? నేచెప్పునది సంపూర్ణముగ

నాలింపుము. పిదప నీవిమర్శక ప్రభావమంతయు వెల్లడింపవచ్చును. మిహిర యవివాహిత. పంచవర్షప్రాయయగుతరినే మాధవింజేరినది. తలిదండ్రుల గోల్పోయినది. మాధవిచెప్పు చేతలలో బెరిగినది. ఆమె ప్రేమామృతమును బూర్తిగ గ్రోలినది. ఆమెయాజ్ఞనే రఘునాథుని వరించినది. అట్లు వరించుటలో ధనాశయని జెప్పితివే యది మాధవికి గాని యమాయకయగు మిహిరకుగాదు. ధనాశమూలమున మాధవి రఘునాథునకు మిహిరనంటగట్టినది గాని ప్రేమైకస్వరూపిణియగు మిహిరమాత్రము రఘునాథుని ప్రేమైకదృక్కులనే గాంచినది...

రెండవ:—అది యే నీవు జెప్పజాలవు. అక్కడనే నీవును, నీవలెనే యీవెఱ్ఱిలోకమునుగూడ పొరబడుచున్నది.

మొదటి:—ఆగుము. నాపల్కుల సాంతముగ వినువఱకును నీవేమియు జెప్పవలదు. మిహిర రఘునాథుని మోహవార్ధిని రాజహంసగతి నిచ్చవచ్చినతీరున విహరించినది. ఆమె పూర్ణముగ నాతని మోహపాశబద్ధయైనది. కాలవశమున నాతడు గతించినాడు. అతని తోడిదేలోకమని నమ్మిచరించిన బేలయగు మిహిర—యనఘయగు మిహిర, ఆగతానాగతము లెరుంగని మిహిర—ప్రియుడు మృత్యువాతంబడినతోడనే శోకమున శుష్కించి, జీర్ణించి, ప్రాణముల తృణప్రాయముగ నెంచి విషపానమొనరించెనన నాశ్చర్యమా? అట్టి మానవతు లెందరీలోకమున లేరు? ప్రేమ లేకుండుటకామె వెలయాలిగాదే? ధనముపై నామెకాస లేదే. మనోవాక్కాయ కర్మముల రఘునాథుని వరించినది. ప్రేమించినది. తుదకాతనికే దనమేనర్పించివైచినది. అందాశ్చర్యమేమి? ఇంక మాధవిసంగతి విచారింతుము. ఆమె సంతానవిహీనయగు గొడ్రాలు. కాసునకు గతిలేని కాంత. దైవవశమున నీపిల్లలతోడి సంబంధమామెకు గలిగినది. వారింజేరదీసి త్రికరణశుద్ధిగ బెంచినది. పెద్దలజేసినది. తుచ్ఛమగు ధనాశచేతనే కోటీశ్వరుడగు రఘునాథుడు వృద్ధుడనియైన నెంచక నాతనికీ నవసుకుమారకుమారిని యర్పించివైచినది. తుదకు దైవహితమెట్లో యట్లే జరిగి

పోయినది. పురుషసుఖ మెరుంగని మిహిరకు రఘునాథు నెట్టి ప్రేమాస్పదుడో, సంతానసౌఖ్య మెరుంగుని మాధవికి మిహిరయట్టి ప్రేమాస్పదయే. ఈవిషయమున స్త్రీలహృదయములు నవనీత మృదులము లని మాత్రము జ్ఞప్తియందుంచుకొనుము. అయినజగత్సింహుడు లేడా యని బ్రశ్నింతు లేమో? స్త్రీలకుపుత్రికలయందు వాత్సల్యముమెండు. పెంచి పద్దజేసిన కుమారి యీరీతిని యుసురుల బాసినది. మాధవికి హృదయవిదారకమైనది. ఆమె యాదుఃఖమున కోర్వజాలకనే యుగులంబడి చావసంసిద్ధమైనది. ఇది సహజముగాదా? ఇందు విపరీత మేమున్నది.

రెండవ:—ఉన్నది. నీకాద్యంతములు దెలియవు. లోకమైనను దానినెరుంగజాలరు. అది నిగూఢతర రహస్యము. దానిని లోక మెన్నటికిని నెరుంగజాలదు. నీవు పైకగపడుదానినే యధారూపమున వర్ణించితివిగాని యించుకైనను విమర్శించియుండ లేదు. కాని జరిగిన యుదంతమంతయు వేఱు. నిన్నరేయి మూడుగంటలకాలమువఱకును మాధవీ మిహిరా, జగత్సింహులకు వాదోపవాదములు జరుగుచునే యున్నవి. అవి ధనవిషయకములు. మాధవీ జగత్సింహుల దొక యోచన. మిహిర వారివచనములామోదించి యుండ లేదు. తుదకు జగసింహుడామెను భయపెట్టెను. అంతకును నామెసమ్మతించియుండ లేదు. ఈవిచిత్రనాటకాంత మెట్లుండునో యని నేనాదగ్గరనే వేచి యుంటిని. కొంతవడికా సద్దణంగెను. మఱల నొకగంటవరకును నెట్టి మాటలును వినరా లేదు. రమారమి నాలుగుగంటలు కావచ్చినదను కొందును. అప్పటికి వారి వాదములు పూర్తిగజల్లారినవి. నేనే నా దారిని బోయియుంటిని. రేయెల్లను నిదుర లేమి నేనుదయము తొమ్మిది గంటలవఱకును మేల్కాంచియుండ లేదు. ఆశ్చర్యము. నేను లేచు సరికి పట్టణమంతయును మిహిర మృత్యు కథనముతో నిండియుండెను నామనము పరిపరి విధాలోచనలకు లోనయ్యెను. వెంటనే వారింటి కేగి యుంటినిగాని శవమంతకుబూర్వమే దహనమొనర్పబడియెనని

విని యందేదో నిగూఢతర రహస్యముండకబోదని గ్రహించి వెనుకకు మఱలితిని. కాని నాకాద్యంతములు బోధపడలేదు. గాన నాయను సంధానమునకించుక యాటంకము గలిగినది. మఱల సాయంత్రము మాధవి యొనర్చిన సాహసిక కార్యమును గాంచిన లోకముతో బాటు నేనుగూడ ద్వివిధాలోచనకులోనైతిని. మాధవి మాసాహసము మాత్రమామె సంపూర్ణపుత్రికా వాత్సల్యమును బహిరంగపరచు చున్నదనుట వాస్తవము. అదియే యామెకోరినది. అట్లే లోకము గూడ నమ్మినది. ఒక్క విషయము. ఇందాశ్చర్యమేమన నిత్యమును రాత్రి పదిగంటలకైననునింటికిరాని జగన్మోహనుడు సరిగ నావేళకే మధుసూదనునితోగూడ కవాటము బ్రద్దలుగొట్టి యామెంగాపాడుట మధుసూదనునితో బాటు జనులెందరో మాధవినిష్కళంక పుత్రికా ప్రేమను గాంచి సాక్షులైరి. ఇంకననుమానమునకెడ మెక్కడనున్నది? అందువు. ఇపుడీ కథనంతను వింటివిగదా. ఇంక నీబుద్ధిసూక్ష్మత నుపయోగించి యిందలిసత్యాసత్యముల నెఱిగింపుము. ఇట్లిరువుర మును రెండుపక్షముల వాదించుటయే సత్యాన్వేషణమునకు మార్గ దర్శి కాగలదు.........ఆ! విను—విను. ఎవ్వరోయొంటిమనిషి ఇందు సన్నపుటెలుంగున మూల్గుచున్నట్లు వినరాలేదా?ఉండు ముందుము... ...అదిగో—జాగ్రతగావినుము...ఆ!...అదియే-అదియే—ఆదెస-

ఇరువురును నిశ్శబ్దముగ వినుచుండిరి. వారిమనోబలమంతయు వీనుల నేకీంద్రీకరించి వినవచ్చిరి. చీమప్రాకు శబ్దమైనను వారాలించు చుండిరి. నడుమ నడుమ గీచురాల నిస్వనంబులు మాత్రము వారి నిశ్శబ్దతకు భంగము గలిగించుచుండెను. వారట్లువినుచుండిరి. నిశ్చ యముగ నొకవ్యక్తి హీనస్వరంబున "ఊం" యని మూల్గుచున్నట్లు వారు వినగల్గిరి. ఇరువురు నాసవ్వడివచ్చు దెసనరిగిరి. కటికచీకటి వారి పథమున కాటంకము గల్గించుచున్నను వారు లెక్కింపలేదు. వారట్లుబోవుచుండిరి. కొంతదూరమేగు సరికి వారి వామభాగంబున స్వల్పదూరముననే మఱల వారాధ్వని వినగల్గిరి. రెండవవాడు జేబు

నుండి నిప్పుబెట్టెందీసి యొక పుల్లంగీచి చూచెను. అంతమాత్రమున వారికేమిగానవచ్చును? ధ్వని ననుకరించుచు వారట్లే కొంతదవ్వరిగిరి.

ఇపుడాధ్వని జేరువ నేవినన య్యెను. అది యొక మానవకంఠమని వారు గ్రహింపగల్గిరి. నలుదెసల భయమువీడి వెనుక జొచ్చిరి. తుదకు గుజ్జుగ బెరిగిన యొక పొదనుండి యాశబ్దమువచ్చుచుండుట వారు గ్రహించి, దానిందరియాజని, నిప్పుపుల్ల వెలుంగున నందుజూచిరి.

భయమున వారించుక గంపించిరి. అందేమున్నది. ఒకవ్యక్తి మృతప్రాయమై యందుబడియున్నది. కొంచెము తలదప్ప శేషావయవ శ్రేణియంతయు నాకులతోడను, గొమ్మలతోడను గప్పబడియున్నది. ఆశరీరమునుండియే వారువిన్న ధ్వని బయలు వెడలుచున్నది. మొదటి పూరుషుడచటి యెండుటాకులగొన్నిటి ప్రోవుచేసి వానికి నిప్పంటించెను. ఆవెలుంగున వారు ధైర్యముగొని యాశరీరమును వాగు బైటకుందీసిరి.

అది యొక స్త్రీమూర్తి. విగతజీవికాదు. ఉచ్ఛ్వాసనిశ్వాసములు ధారాళముగ వెడలుచునే యున్నవి. మఱికొన్ని యాకులను జిమ్ముకులను ప్రోవు జేసి వారామె శరీరమును బాగుగ గాచిరి. ఆమెకు పూర్ణముగ దెలివి వచ్చినది. కాని మాట్లాడ నేరకుండెను. దాహమని సన్న జేసెను. అందొకడు పరుగిడి యాచీకటిలో నెందేగెనోగాని, యొక్క యరగంటకాలమునకు దనయుత్తరీయముందడిపి దెచ్చి యామె నోటకొంచెము జలముబోసి, మోమెల్ల నీటందుడిచి వైచెను. ఆసన్ననివెలుంగున జూచుసరికామె కంఠనాళము నెల్లను బొంగి యుబ్బెత్తుగ వాచియుండెను. మెడలొక్క ప్రక్కకు వ్రేలాడి యుండెను. దురాత్ములెవ్వరో యామె కంఠము నులిమి జంప బ్రయత్నించిరేమో? ఏమియుందెలియదు. ఆపురుషులామెంగుర్తించిరా? ఆమె యెవ్వరు?

కొంతవడికామెకు వారట్లుపచారములొనరించి "చూచితివా? ఇపుడైనను నీకీ కథ బోధపడుచున్నాదా? ఉదయమగు సరికెల్ల

సంగతులను మనము యథారూపమున దెలిసికొనగలము. ఇపుడీమెను భద్రముగ గొంపోయి ప్రాణాపాయము వాటిల్లకుండగా పాడవలయును. బహుశః రెండుమూడుదినములవరకీమె సేద తేరునట్లుగపడదు. ఏమైనను సరే. మనమిపుడీమెను మోసికొనిపోయి సంరక్షణ జేయకతప్పదు. గమ్మున. ఆలసించిన గార్యము లే"దనుచు ఇరువురాయబలను భుజముల బెట్టుకొని యాగాఢాంధకారమున నదృశ్యులైరి.



౧౫

మధుసూదనుడు సౌధోపరిభాగమున నొక శయ్యపై బడియుండెను. ఆతనిమోము కళావిహీనమై వివర్ణము జెందియుండెను. ఆతడు మిక్కిలి దుఃఖితునివలె గాన్పట్టుచుండెను. ప్రక్కనే జగత్సింహుడు దీర్ఘాలోచనపరుడై యొక యాసనమున కూర్చునియుండెను. ఆతడధోముఖుడై వామహస్తమున శిరము జేర్చి, తీవ్రముగా దేనిం గూర్చియో యోచించుచుండెను. మధుసూదనునికనులశ్రుపూరితములయ్యెను. ఆతడు గతించినజనకునిగూర్చి దుఃఖించుచుండెనా? కాదు, కాదు. ఆతడానాడే దండ్రిని మఱచియుండెను. అయిన నిప్పుడాతని విచారమెవ్వరినిగూర్చి. ఏమో? వారి ప్రసంగమువినినగాని తెలియదు. ఇరువురును చాలవఱకట్లే మౌనవ్రతులైయుండిరి. కాని మధుసూదనుడు మాత్రమూరకొనక సాగించుచునేయుండెను. కొంతవడికాతడు చేలాంచలమున గనుల దుడిచికొనుచు "జగత్సింహా! అట్లయిన నింకేడియు మార్గము లేనేలేదా?"యని గద్గదస్వరమున బల్కెను.

జగ:—మధూ! పాపము! నీకష్టములకంతము లేకున్నవి. నిన్ను జూచి నాకు జాలిజాలిగొల్పుచున్నయది. నీబంధువులెల్లరును నశించిపోయిరి, నమ్మినవారెల్లరును నిన్ను నాశనమొనర్చిరి. అయినదేదో యైపోయినది. కాని యిప్పటికింకను సమయము మించియుండలేదు.

ఇప్పటికైనను నీవు మా చెప్పుచేతలకులోఁగి, మా సహాయమున సంపూర్ణవిశ్వాసముంతువేని, సర్వమనుకూలింపవచ్చును. కాన గతము నకుఁజింతిలిక, ప్రస్తుత కార్యసాధనమాలోచింపుము. ఇందులకు నీవను మతించినచో, నాయావచ్ఛక్తి నిధారపోసి, నీ భాగ్యదేవత నీపై ప్రసన్న దృష్టిసారించునట్లు జేయగలను. ఏమనెదవు?

మధుసూదను డేమియు బదులాడ లేదు. కొంతవడి కాతఁడు నిశ్శబ్దముగా, నిరాఘాటము లైన యవిరళాశ్రుధారా పాతముననే జగన్మోహినకు ప్రత్యుత్తర మొసంగుచుండెను. కాని జగన్మోహిని యు మాత్రమద్దానినవలోకింపక, మహానిలసంక్షుభిత సాగర తరంగము వలెనే దనయూహాపరంపరల మనోవీధి నోలికింపుచు, బాహ్యజ్ఞాన శూన్యుండై, శిలాప్రతిమంబోలి యూర్ధ్వ ముఖుండై, యాసీనుడై యుండెను.

గభీరకాళరాత్రి భూతలమంతయు నేకచ్ఛత్రాధిపత్యమున బరిపాలింపుచుండెను. దుష్టపాలనంబునుగనులజూడవెరచి, జనమెల్లను నిద్రాముద్రాభిరామమై, ముకుళిత నేత్రపద్మయుగ్మలతో వక్షస్థితకరకమలములతో, బగద్బంధు వియోగమనమునకై నిశ్చల నియతిం దపం బొనరించుచుండెను. దుర్వ్యాపారులు, దురూహాపరులు, దుశ్శీలురునగు దుర్జనసంఘంబులు స్వేచ్ఛమెయి విహరింపుచుండెను. నీలాంజనసన్నిభయు, నీలాంబరధారిణియునగు తమోదేవి, భీమాకృతిందాల్చి, వివృతాననయై, కరాళదంష్ట్రాంతంబుల దిగంతంబుల సహితమెక్కు పెట్టునగబలించి భీమాట్టహాసమొనరించుచుండెను. ఆగంభీర నిశా మధ్యంబున, మధుసూదనుని ప్రాకారాంతర్భాగమున, వారున్నగది దూరమున, దమోదేవి ప్రళయాట్టహాసంబునకుం బ్రతిధ్వనిగా బ్రళయ కాలావిర్భవ కాళికాసదృశమూర్తి యొక్క గభీరహాసధ్వని వారి చెవు లంబడి, పులకితగాత్రులుగా జేసివైచెను. తోడనే యొక స్త్రీమూర్తి, యించుక నోరగా వైచిన యాద్వారముం దెరచుకొని లోన బ్రవేశించి యుబ్బి నొక భీకరాట్టహాసంబొనరించెను. మధుసూదనుడు చకితుడై

శోకముందిగమ్రింగి లేచి నిలువబడియెను. కాని యామెదేవీమూర్తి ప్రసన్నాననయై పలుకకయే జేసన్నచే వాని నాసీనుంగమ్మని యాజ్ఞాపించెను, ఆతడు నిశ్చేష్టుడై యాసనంబున గూలబడెను.

అంతనామె యించుక గొంతుకసవరించుకొని" మధుబాబూ! ఇంతరాత్రివేళ నీమహామందిరాంతర్భాగమున మీరిద్దరుమాత్రమే మేలుకొని చేసెడిదీర్ఘాలోచనమేమి? నీవేల శోకాకులచిత్తుడవై యున్నావు! సంగతినాకుగూడ నెరింగింతువా?"యని సమధురంబుగ బ్రశ్నించెను. మధుసూదనుడు దయ్యముబట్టినవానివలెనే యామెం జూచుచుండెనుగాని యామె పలుకుల కేమియు బదులాడసాహసింప లేడు. జగన్మోహనుడీయంతయుంగాంచి తొలుదొల్త నాశ్చర్యమగ్నుండైనను, క్రమముగా దెలివిగొని యామెతో నిట్లు భాషింప మొదలిడెను.

"అమ్మా! నమ్మెంతభయావహముగా నొనర్చితివి? నీవీచీకటి వేళ నిలువెడలి యిక్కడికివచ్చియుంటివి? వచ్చియు, లోనికిరాక నట్లేల వెలుపలనుండియే బిగ్గరగ నవ్వుచుంటివి? చూడగా నీవు మాసంభాషణమంతయు వినియేయుందువని తోచుచున్నది! ఎట్లయినను నీతో జెప్పవలసిన యంశములేయవి. సరియే, కూర్చుండుము. ఇపుడు మాట్లాడవలసినవి చాలసంగతులు గలవు. మధుసూదనుని తెలివి తక్కువచే సర్వనాశనమైనది. మనకు బకీరాయసమయమును దెచ్చినది. ఇదియెట్లుపరిణమించునో దెలియదు. నీవు స్థిరముగ నాసీనవైనచో సర్వమును నివేదింతును."

అనుచు నటనున్న యొక కుర్చీని ముందునకీడ్చి, యందామె నాసీనంజేసెను. ఆమె యందుపవసించి మధుసూదనునిముఖమునదీక్ష దృష్టిపాత మొనరించుచుండెను. జగన్మోహనుడంత "అమ్మా! మీరిందే యుండుడు. నేను క్రిందకేగిద్వారములన్నియు జక్కగబంధించి వచ్చెదను. లేకున్న నీవలెనే యింకెవ్వరైనను నిందు బ్రవేశింపవచ్చును.

పిమ్మట నెల్లసంగతులను ముచ్చటించుకొనవచ్చు"నని యాతడు వడి వడి సోపానావరోహణ మొనర్చి క్రిందికేగెను..........



౧౬

స్త్రీ:—మధుసూదనా! నాయాగమనమిప్పటివేళ నీకాశ్చర్యము గొలుపవచ్చునుగాని, యందువిశేషమేమియును లేదు. మాజగత్ యీదినమంతయు నింటికిరాకుంటచే, మీయింటనుండునుగదా యని, నాకింటికడ నేమియుందోచక యిటువచ్చియుంటిని. అంతియేగాని విశేషమేమియును లేదు. ఇచ్చట జరిగిన విశేషములేమి? ఇప్పుడు వచ్చిన యనర్థకమేమి? మాజగత్ యెప్పుడూ గోరంతతానిసికొండంత జేసి చెప్పుతూఉంటాడు. జరిగినసంగతియేమి? నాయనా! చెప్పు. నావద్ద నీకు దాపరిక మెందులకు.

మధు:—అమ్మా! దాచుటకింకేమున్నది. జగత్సింహుడు జెప్పినట్లుగానే సర్వనాశనమైపోయినది. ఆపాడుముండనన్ను బడబాగ్నిలో త్రోసింది. అమ్మా! అడిగో. జగత్సింహుడువస్తున్నాడు. వానినోటనే నీవా కథ విని మీరిరువురే నన్నేలాగునైనను రక్షించాలి. ఇంక మీరేమి చెయ్యమంటే అదే చేస్తాను.

ఇంతలో జగత్సింహుడు క్రింది తలుపులన్నిటిని జాగ్రత్తగా బంధించి, మఱల పైకివచ్చి, తన యాసనమున నాసీనుడయ్యెను.

జగ:—అమ్మా—ఏమది? అప్పుడే ప్రశ్నలమీద ప్రశ్నలగుమ్మరించేస్తున్నావు. ఏమిమధూ? ఎంతమట్టుకు చెప్పేవు కథ?

మధు:—నాయనా! ఇంక నేను చెప్పవలసినదేమున్నది? చెప్పుటకు నాకేమియు నోరాడకున్నది. ఇంక సర్వమును మన అమ్మగారితో నీవే చెప్పి, ముందుసంగతి మీరే ఆలోచించాలిగాని, నాకేమియు దోచకుండా యున్నది. ఇంకనాభారముసర్వమూ మీభుజములపై

బడసెను. తరువాత మీ యిష్టము.

జగ:—అమ్మా! విన్నావా? ఇప్పుడు. అంతా సర్వనాశనమై పోయింది. పాపము! మధుసూదనుడు దాను తీసికొన్న గోతులో దానే పడిపోయేను. హా. హా.

ఈవచ్చిన యామె మనకు పూర్వపరిచితయగు మాధవి. ఆమె కృష్ణవసనధారిణియై చూపరకతిభయంకరముగ గానవచ్చుచుండెను. మేన నలంకారములంతట లేకున్నను సామాన్యస్త్రీకుండదగిన వస్తువులుమాత్రము లేకపోలేదు. ఈయర్ధరాత్రమున, నికరాళభీకర నిశాసమయంబున, నీమె యొంటరియై యిలువిడచి, యిట్లుబురసంచారమేల జేయబూనెనో దెలియదు. కాని, మార్గమధ్యమున నకాళికాసదృశమూర్తిగనే పాంథునికంటబడినను, యామె భీకరాకారమును, కృష్ణవసనధారణంబునుగనుగొని, పురపాలక శక్తియేమోనని గుండెలవియ భీతిల్లని ధైర్యశాలురుండరని మానమ్మకము. ఆమహాసౌధోపరిభాగమున-నానిశామధ్యమున, నానిశ్శబ్దకాలసాగరము ఘూర్ణిల్లునట్లుగ మాధవి యొక్క భీకరాట్టహాసమొనర్చి "జగత్! నీవు జెప్పినదేమి? నాకేమియు నర్థమగుటలేదు. తొందరగా సర్వమెఱిగింపుము" యనుచు మఱలనొక వికటాట్టహాసమొనర్చెను. అట్టితఱినాభయంకర హాసవదన మపరిచితులైన గనుగొన్న దప్పక వెఱగొందక మానరు.

మధుసూదనుడు దలవాల్చి కుర్చీపై జేరగిలబడియుండెను. పుత్రసమానుడగు జగత్సింహుడుమాత్రమామెకు బరిచితుడుగాన నించుకేనియు జలింపక "అమ్మా! చెప్పవలసినగాథ చాలగలదు. సావధానవై వినుము. పాపము! మధుసూదనుడు దన తండ్రి గతించుటకు కొలదిదినములక్రిందటనుండియు నొకభోగముదాని చెలిమియొనర్చి యున్నాడని మనమెఱింగిన విషయమే గద."

మాధవి:—అవునవును. ఆసంగతి నేనెఱుంగుదును. ఆమె జీవనాథుని తనయ. చక్కదనాలచుక్క. చదువుల సరస్వతి. వలపుల బరణి. యింకా—యింకా—చాలవర్ణనయున్నదిగాని ముందు నీకథ

వినాలి. అవును. దానిని మధుసూదనబాబుగారు కాదు—కాదు అదే, మనబాబుగారిని యుంచుకొన్నదని విన్నాము. అయిన నిపుడేమి మునిగినది?

జగ:—వినుము. తఱువాతనీవికటప్రసంగముసాగించవచ్చును. అయితే, అదే యిప్పుడు-వీనికొంపదీసినది.

మాధవి:—ఆ! ఆ. ఏలాగు? ఏమికథ? నాకేమి బోధపడకుండ ఉంది.

జగ:—అదే చెప్పుచున్నాను కదూ—వినుమఱీ—ఆరాత్రి—అనగా మధుతండ్రి రఘునాథపండితుడు చనపోయిన తరువాత, మనమిక్కడనుండగనే, మధుయెందుచేతనోగాని యొకరత్నపేటికను దసికొనిపోయి జీవనాథుని చేతికిచ్చి, దానిని తనవద్దనే భద్రముగను చ[illegible]లెననియు మఱినాడెల్లవిషయములను దనతో జెప్పెదననియు, [illegible]తిగివచ్చినాడు. అయితే—ఇపుడాజీవనాథుడు......

అనుచుండగనే మాధవి వాని మాటలకడ్డువచ్చి "ఏమి? ఆతడిపుడు దానిని లేదనుచున్నాడు. నీవెవరో నీపేటికయెట్టిదో నేనెరుగననుచున్నాడు. ఇంతియేనా నీవుచెప్పునది. సరే-అట్లయిన వెంటనే వానిని పాతాళమున కణచివైచి నీపేటికనుదెచ్చి నీపాదములకడ నిముసములోనుంతును. మధూ! ఇంతమాత్రమునకేనా నీవిచారము." యనియెను—

జగ:—అదికాదమ్మా. నీధోరణిసీది. విను నా[illegible]బూరిగా. కథంతావినకుండా అప్పుడే యెందులకీ ప్రగ[illegible] కాస్త నిదానించు మఱి.

మాధవి:—ఆ! ఆ! సరే—సరే—చెప్పు—చెప్పు

జగ:—ఆజీవనాథుడిప్పుడు తనకూతురు[illegible]లతోను, సర్వసామానులతోను, రత్నపేటికతోనుగూడ య[illegible]నో యేమైపోయేడు.

మాధవి:—అయ్యో! అయ్యో! ఎంతపని జరిగిపోయింది?

అనుచు నామె యధోముఖియై, చెక్కిట జేయి జేర్చుకొని కొంత వరకాలోచింపసాగెను. పిమ్మట నామె "సఖీ—జగత్! జీవనాథుడు మంచి మాయయే చేసినాడు. అవునొక్కసారిగి నాలుగైదు లక్షల రొక్కము చేతబడునపుడెవ్వనికి చేదు? అయినను, ఆమాయ లాడి మాలతిని పుట్టినప్పటినుండియు నేనెరుగుదును. ఇదంతయు దాని ప్రతాపమే కాని, పాపము, జీవనాథుడ వట్టి అమాయకుడు. ఆడారి నాడు. వాడివల్ల యింతపని యెన్నడూ కానేరదు ఇదంతా దాని ప్రేరేపణమే. అయితే, మధూ! ఆరాత్రివేళ, ఆపెట్టె పట్టికెళ్ళి దాని యెదాన్న యెందుకు కొట్టేవు? మేము యిక్కడనే యున్నాముగదా? మాతో కొంచెమైనా ఆలోచిస్తే తప్పా? మేము నీకు పైవాళ్ళమా? నీవు చెడిపోకూడదాయని మాకుసంతోషమా? ఇంతకూ అప్పుడాపెట్టెను జరుపవలసినంత పుట్టిం మునిగిందినీకు? మేమేమైనా ద్రోహంచేసా మని నీకు తోచిందా? కాదు—కాదు—మీ నాన్నగారు పోయే[illegible] మతికూడా పోయింది. ఒకవేళ మేమే నీకు ద్రోహంతలిస్తే [illegible] తండ్రీ! అదంతా పట్టికెళ్ళి యెవరికిపెట్టను నాయనా? నారత్నమే నాశనమైపోయింది ఇంకనీరత్నాలుపట్టికెళ్ళి యెవ్వరికివ్వను బాబూ?" అనుచు నామె పాపము వెక్కివెక్కి యేడువసాగెను. మధుసూదను డామె దీనాననముగాంచి నీరవృత్తై "అమ్మా! మాధవీ! నీవెందుకలా యేడుస్తావు? జరిగినదేమో జరిగిపోయింది. ఎన్ని ప్రయత్నాలుచేసినా ఒకవేళ [illegible]త్నాలుదొరుకుతాయేమోగాని, మనరత్నం, మిహిర మరి కళ్ళబ[illegible]దా? నీవు చెప్పినట్లుగనే మాబాబయ్యపోగానే, నామతి కూడా [illegible]ది. ఇంక నేమంటే యేం లాభం? చెయి కాలిన తరువాత ఆకులు[illegible]వడం. కాని యింకముందు యేం చెయ్యవలసి ఉంటుందో మీ[illegible]చించాలి. మీరేమి చెయ్యమంటే అది నేను చేస్తాను. నీకు జ[illegible] ఒక[illegible]నొకటి కాదుగదా? ఇంక నీయిష్టము" యనుచు దీనముగ బల్కెను.

మాధవి:—అయ్యో! నాయనా! ఎంతమాట? తప్పక మా

ప్రియత్నంఅంతా చేసి, మామహిమ అంతాచూపిస్తాము. చూడు మా తడాఖా-ఒక్క సంగతి—నీవుమాత్రం మాచెప్పుచేతలలో ఉండాలి.

మధు:—అయ్యో అందుకభ్యంతర మేమిటమ్మా? ఏలాగైనా నన్ను ఒడ్డుకుజేర్చే భారం మీాది.

అనుచు నాతిడు కడుదీనముగ నామెను బ్రార్థించుచు నామె పాదములపైబడి యశ్రుజలముల ప్రక్షాళన మొనర్చసాగెను. మాధవి యాతని కరముల నెత్తి "మధూ! నీవంతభయపడవలసిన అవసరం లేదు. అయితే, జగత్! మీారు వాళ్ళయింటికివెళ్ళి యేమైనా సంగతి సందర్భాలు కనుక్కున్నారా? ఎక్కడికి వెళ్ళిపోయి ఉంటారంటావు?" యని ప్రశ్నించెను.

జగ:—ఆహా! నాకీసంగతి తెలిసినవెంటనే, ఆయింటికి వెళ్ళి [illegible]వగా, ఆయింటి ప్రక్కనేయున్న యొకడు వారు యిప్పుడు [illegible]గ్రామంలో లేరనిన్నీ, గడచినరాత్రియెక్కడికో వెళ్ళిపోయి నారనిన్నీ, ఎక్కడకు వెళ్ళిఉంటారో తనకు తెలియదనిన్నీ, ఆయింట వారి సామానులేమి లేవనిన్నీ చెప్పేడు. అంతతో మేము తిరిగి వచ్చేము. అట్లు వచ్చినప్పుడే నీకీసంగతి చెప్పవలెనని మనయింటికి వచ్చేసరికే నీసంగతిఅంతా ఆఖరుదశలోయున్నది. అందుచే చెప్ప [illegible]నికి వీలులేకపోయింది. దైవము నిన్ను మరల యీాకార్యం కొరకే బ్రతికించేడనుకుంటాను.

మాధవి:—దైవం బ్రతికించడమేమిటి? మనము [illegible] కార్యం కొరకుతానే నన్ను బ్రతికించుకున్నాడు. సరే, మధూ! [illegible] చూడుం మన నాటకం ప్రారంభిద్దాం. అప్పుడు చూడు నాత[illegible] కొద్ది రోజులల్లో నీరత్నపేటికను మాలతితో సహా తీసుకు[illegible] నీకాళ్ళ దగ్గర పెట్టకపోతే నన్ని పేరున పిలవకు. సరేనా! జగత్! నీతో చాలాసంగతులు మాట్లాడాలి. ఇటురా. మనం [illegible]దాం. మధూ! నీవుమాత్రం భయపడకు. నీవుమాత్రం చీకటితోనే స్టీమరు సద్ధంగా ఉండాలి. నీవున్ను జగత్ న్ను కలసి ఉదయాన్నే కలత్తాకు ప్రయా

ణం అయిపోవాలి. ఇంతే నీతో చెప్పవలసినది. జాగ్రత-జగత్ రా– చాలా రాత్రి అయింది. ఇంకా మనం చాలా యేర్పాటులు చెయ్యాలి.

అంత వారిరువురును బయలు వెడలి, మార్గమున ననేక రహస్యాలోచన జేయుచు నిలుసేరిరి. అపుడపుడు జగత్సింహుడు మాత్రి మామెతో "అమ్మా! ఏమిటి? యీవాళ డోస్ పూర్తిగా పడినట్లున్నదే? చాలా చాలా ష్వు." యని బలుకుచుండెడివాడు.



# ద్వితీయ ఖండము.

## సంపూర్ణము.



# రత్నపేటిక

## తృతీయ ఖండము.



### ప్రతిద్వంది.



అరుణుఁడస్తాద్రి జేరుట కింకెంతయో దవ్వు లేదు. విహంగసంచయంబు గూండ్ల జేరుచు, బవలెల్ల నాహారార్థమెడబాసిన, తమ ప్రియులై నిరీక్షింపుచు, వానిం జేరఁబిల్చుచుండెనో యన దమసహజమధురకంఠంబుల బైకెత్తి పలువిధంబుల గూయుచు, జనులకాహ్లాదముం గూర్చుచుండెను. అచ్చటచ్చట నంబరమున నొకటిరెండు తారలు బొడసూపసాగెను. గోవత్సము లంబా యని యరచుచు, నెమరు వేయుచు నింటికిజను దల్లుల ననుకరించుచున్నవి. సంతతోత్సాహులగు గోపకులు, జెమటనూడ్చి జీవనముసేయు కృషీవలులును, హాయిగ బాడుకొనుచు, వెంటనరుదెంచు మందగమనలతో ముచ్చటలాడుకొనుచు నిండ్లదరి జేరుచుండిరి. ఆహా! దినమునందెల్లను ప్రాతస్సాయంసమయములు ప్రతిజీవికిని సంతతానందదాయకములుగదా!

మనకథాకాలమున గలకత్తానగరంబునంగల "పీపిల్సుపార్కు" యిపుడున్నంత నయనానందదాయకముగ నపుడు లేకున్నను, మొత్తముపైని జూపరకది యనన్యసామాన్య సౌందర్యాలవాలమై యొప్పుచునే యుండెను. పరమేశ్వర సృష్టింగల వివిధ విచిత్ర జంతుసమూహంబులు, ననేక సుందరవస్తునిచయంబును, వింతవింత వృక్షజాతులును నందు సేకరింపబడియుండ నది యెవ్వాని మనమురంజింప జేయనేరదు?

పలురకముల పూదోటలు, సుమవిశాలమగు బాటలు, నందందు ప్రేక్షకులాసీనులగుటకు చిత్రశిలాసనములు, నచ్చనచ్చట నవవికసిత పద్మరాజాబులలో గనులపండువొనర్చు పద్మాకరంబులు గలిగి నందనంబువలె నావనమెంతయు మనోహరమై యొప్పుటంజేసి కలకత్తా నగరంబునంగల ప్రజలాబాలగోపాలమును నిత్యమునునందు విహరింప గోరెదరు. సంతతపల్లవిత, కుసుమిత, ఫలభరిత వృక్షరాజములనుండి సుగంధబాధురంబగు మందమలయానిలంబరుదెంచి, యచటి జనుల తాపముబాపుచు, మనోల్లాసంబుగలిగించుచుండును. దానంజేసి ప్రతి మానవుడును దీరికగలయట్టి సాయంసమయమున దప్పకనందు జేరుట వింతకాదు. పవలెల్లదమతమ వ్యాపారంబులంబడలి, చల్లగాలికై చనుదెంతురు. కొందరచటి వింతలరయుటకై వత్తురు. స్త్రీలు జంకబిడ్డల నిడికొని మృగాలోకన కౌతూహలంబున జనుదెంతురు. కొందరట్లు వచ్చు ప్రేక్షకులజూడగోరి యరుదెంతురు. ప్రతిదినమును నన్యదేశములనుండి కలకత్తానగరపుసొంపు విలోకింపవచ్చిన జనులు వేనకువేలటజేరి, యచటివింతలన్నిటిని నబ్బురంబుగ చూచుచు, మఱలి తమ యూరేగునపుడచట గలకత్తాయెన్నడెరుంగని తమవారలకీ చిత్రములన్నియు జిత్రకథలగా నెరిగించుటకై ప్రతిచిన్నసంగతినిగూడ బరిశీలనదృష్టిని విలోకించి మననము జేయుచుందురు. ఇది మానవుని సహజగుణము.

ఒకవంక చీకట్లు గ్రమ్ముచున్నవి. బహుళనవమి యగుటంజేసి యిఱులుదట్టముగ గ్రమ్ముకొనివచ్చుచున్నవి. ఆవనమందందు దీపములుంచబడియున్నను, మొత్తముపైని జీకటి గాఢముగనే యున్నది. విహారజనసంఘమంతయు బలుచబడిపోవుచున్నది. గృహమున నాజ్ఞబెట్టువారు లేనివిద్యార్థులును. సంసారబంధంబుల నింకనుజిక్కుపడని బ్రహ్మచారులును, నాటిరేయి దా మొనరింపవలసిన ఘనకార్యక్రమమెన్నుకొననిలచిన దుర్జనసంఘంబునుదక్క నెల్లరు నావనమునువిడచి జనిరి. క్రమముగ రాత్రిపదిగంటలుకావచ్చుచున్నది. ఇంకనావనమున

నెవ్వరునుండగూడదు. అట్లున్నవారిని వనపాలకులుబట్టి దండింతురు. ఇయ్యది యచటి కఠినమగు నాజ్ఞ. దానంజేసి వనమంతయు క్రమముగ నిర్జనమయ్యెను.

మృగశాలకు బశ్చిమమున దట్టమగు రసాలవనమొకటిగలదు. అందలి వృక్షములెల్లను బెద్దమ్రాకులగుటచేతను, దగ్గరదగ్గరగ నాటబడి యుండుటచేతను, ప్రేక్షకులకందు జూడదగిన వింతలేమియును లేకుండుటజేతను, యయ్యది సామాన్యముగ జనసంచారములేక, దట్టముగ నల్లికొని చిన్నయడవివలెనుండును. అచ్చటదీపములుంచుట కావశ్యకతగూడ లేదు. నేడంతరాత్రికడ నావనమధ్యమున, గుబురుగ బెరిగిన యొకమావి మ్రాకక్రింద నెవ్వరో యిరువురు సంచరించు బదములసవ్వడివినవచ్చుచున్నది. వారు స్త్రీలో, బురుషులో మనము జెప్పజాలముగాని, యాచీకటిలో నాతమోనిలయంబున, నాజన సంచారశూన్యంబగు వనమధ్యంబున వారికేమిపని? వారు వనపాలకులా? అట్లయిన వారిందేలనుందురు? వారు నివసించుటకు వనద్వారముననే చక్కనియిండ్లు వారికింగలవే అయినచో వారు దొంగలో, లేక పరదారరతులో— యెవ్వరైనను రహస్యాలోచనాపరులును, నిగూఢవర్తనులుగావలయు, గాక ఇంకెవ్వరికిందు బనియుండును? ఎట్లయినను వారిచర్యల మనముగనిపెట్టి, వారిసంభాషణమాలించినగాని మనమెద్దియు నిర్ధారణజేయజాలము,కాన పాఠకా! శ్రమయనక నాతోడనేరమ్ము. మనకు జొరరాని చోట్లులేవు కదా.

ఇరువురును నల్లని దుస్తులనే దాల్చియున్నారు. అందొకనికి దలపాగయుగూడ గలదు వానియాకారమును, వానినిడుద గడ్డమును జూడ నాతడొక మహమ్మదీయ హంతకునివలె గానవచ్చుచున్నాడు. వారేమొబల్కుచున్నారు. వినుము.

ఒకడు:—భాయీ! ఇచ్చటమనము కూర్చునిమాట్లాడుకొనవచ్చును. ఏదీ? యీమూడుదినముల కథను జెప్పుము. వింతలేమైన నున్నవా? వారి ప్రయత్నములెట్లున్నవి?

రెండవ:—అబ్బో! పదికావొచ్చిందే. దర్వాజా బనాయించేస్తారు. కావలివాళ్లు చూస్తే మన ప్రాణంమీదికి రాదుగదా?

మొదటి:—ఓహాం! కూర్చోవోయ్. పదికాదు—పదిహేను కొట్టితే మనకేమిటి? నేనంతా బందోబస్తుచేశాను. అంత తెలివిలేదనుకున్నావా యేమి? ఏదీ కథ మొదలుపెట్టు.

రెండవ:—సరే-కూర్చో—చెప్తాను.

అనివారిరువురునా యంధకారమున నామావి క్రిందనాసీనులైరి.

రెండవ:—స్వామీ! మీయాజ్ఞ ప్రకారమీ మూడు దినములును రాత్రింబవళ్ళు విడువక వారినే యనుసరించుచుంటిని. పాపము శరశ్చంద్రబాబుగారు యింతవఱకూ యేమీ కూపీదీయలేక, బోనులోని పులివలె కొట్టుకుపోతున్నాడు కాని వానికేమీ అంతు తెలియకున్నట్టున్నది. చూడగా వాడు మిక్కిలి అసాధ్యునివలె గనబడుచున్నాడు, రాత్రివేళల భిక్షకరూపమున నూరంతయు ద్రిమ్మరి, తిరిగి వానియింటి యరుగుపైననే పండుకొనుచు, నాయింటికి వచ్చుచు బోవువారినెల్లరను పరిశీలనా దృష్టితోడనే జూచుచుంటిని. మొన్నటి దినమున మదన్‌శింగుమాత్రమాతని యింటికరుదెంచి, లోపల శరశ్చంద్రునితో నేమో కొంతవడి మాట్లాడినపిదప నిరువురును గలసి బజారున కొంతవడి దిరిగి, మరల నెవరి తెన్నునవారుబోయిరి. చూడగా వారియాలోచనలన్నియు నీకేసువిషయమైనతప్ప నన్యములుగావు. మనము మాత్రము మిక్కిలి జాగరూకతతో మెలంగవలయును, నాపని నేను యథావిధిగ నెరవేర్చుచు నెప్పటిసంగతినప్పుడే మీకు నివేదించు చుందును. అన్నట్లడుగ మరచినాను. అమ్మగారు వచ్చినారా?

మొదటి:—ఆ! మొన్నరాత్రికే యామె వచ్చినది. సంగతులన్నియు నామె కెరింగింప నత్యాశ్చర్యమున నన్నుజూచినది. నీసంగతిని, నీసహాయమును పూర్తిగా నామెకు జెప్పియున్నాను. నిన్ను మరల గలిసికొనుటచే నామె సంతోషమున కంతము లేకున్నది.

రెండవ:—స్వామీ! ఆమెకు నాపై చాలదయ. నీవింకను

యెరుంగవుగాని మనయూరమే మిఱువురమును గలసి చేసిన మహా ద్భుతము లిప్పటికిని నాకెంతో యాశ్చర్యకరములుగా గాన వచ్చు చున్నవి. కారణాంతరములచే మేమెడబాసిపోతిమి. నాబుద్ధియే దానికి గారణము. అదియొక దుఃఖగాథ. తలచిన నిపుడేడ్పువచ్చును. కాని, అబ్బా! నాటిమొదలు నేటివరకును మాబుద్ధిని వినియోగింప నదనే దొరకకపోయెను. ఇపుడు నీవుగూడ మాకు దోడ్పడి నీతలినిమరపింప గల వాడవైతివి. ఇంకమననాటకము పూర్తిగారక్తికట్టుటకే యభ్యంత రమును లేదు. [illegible]వతియెట్లున్నది? దాని నింద్రాదులైనను గను గొనజాలరు. అట్లనిమాత్రమే మరియుండకుడు. మధూ యెట్లున్నాడు? ఇంక మనకు దాసుడేగద? కాని వానిపొగరు కొంతయణగినిది.

మొదటి:—ఖాన్! కొంతయననేల? వానికావరము పూర్తిగ నడగిపోయినది. వాడిపుడు మనకు దాసానుదాసుడు. కాని మనబం దీని జూచుటకై వాడు మిక్కిలి తొందరపడుచున్నాడు. మాయమ్మ మాత్రమందుల కియ్యకొనక, యిపుడామెను జూడవలనుగాదనియు, జూచిన ముత్పు వాటిల్లుననియు, జెప్పుచు నాతని బెదరించుచుంటచే వా[illegible]పోవుచున్నాడు.

ఖాన్:—అదియును నిశ్చయమే. వాడామెనుజూచిన వారిఱు వురును బూర్వస్నేహితులగుటంజేసి, యిపుడు గలసిన, వాని వల్లనే తనకిట్టిదుస్థితి సంభవించినదని, యెట్లయినను వానిని లోబరచుకొని మనకెంతో నష్టముగలిగింపకమానరు. కాన వారివిషయమైమాత్రము మెలకువగా బ్రవర్తింపుము. అమ్మగారికి సర్వమును దెలియును. మన మేమియు జెప్పనక్కరలేదు.

మొదటి:—అది నిశ్చయమే. ఆమె యీవిషయమున జాల తెలివిగనే బ్రవర్తించుచున్నది.

ఇంతలో చేరువనేయున్న దత్తుగారిమేడలో పదునొకండు గం టలు కొట్టినధ్వని వినవచ్చినది. తోడనే యొకవ్యక్తి నల్లనియంగినొక దానిని దొడిగికొని, చేతనొక పెద్దకర్రబూని, యీయిరువురను నిలచి

యున్న రంగమున కరుదెంచుచు, మాటిమాటికి దన చేతికర్ర క్రింద గొట్టుచు, రానిదగ్గు నభినయించుచుండెను. వీరిరువురును వానింగాంచిరో లేదోగాని, చలింపక నిశ్చలురైయుండిరి. ధ్వనియొనర్చుచు వచ్చు వానింజూడకుండుటయు నసంభవము, గాని వారి ధైర్యమేమో? ఈతడుగూడ వారిలో జేరినవాడా? లేక వనపాలకుడా? వాడింతలో వారిరువురను సమీపించెను. కాని వారు చలింపకట్లే నిలచియుండిరి. అంత నాగంతకుడు "స్వామీ! పదకొండయి పోయినది. నేను దోట విడచి యింటికేగుచున్నాను. రెండవవంతుదారు నరుదెంచును. ఇంక మీరు బోయెదరా?"యని సవినయముగ బలికెను. మొదటివాడు "సరియే"యని వానిచేత నేమోయిడి, చెవిలో నేమో జెప్పి, నెమ్మదిగ దనహేతునిగలసి, యాగాఢాంధకారమున దృష్టిపథమును దాటి పోయెను.

వీరెవ్వరైయుందురు? ఆమూడవవ్యక్తి పలుకులంజూడ నాతడు వనపాలకుడని దోచుచున్నది. ఆయిద్దరిలో నొకని"ఖాను"యనియును రెండవ వానిని "స్వామీ"యనియును సంబోధించుకొనుచున్నారు. ఈఖానెవ్వడీస్వామి యెవ్వడు? వీరిరహస్యాలోచనము లేమి? ఏమియును బోధపడకున్నవి.



౨

నారాయణచందున కింకను వ్యాధికుదుర లేదు. సుప్రసిద్ధవైద్యశిఖామణులనెల్లను గోపాల్ చందురావించి, తనయుని వ్యాధి మాన్పబ్రయత్నించుచునేయుండెను. కాని ఫలితము మాత్రము సున్నయగుచుండెను. పాపము! అబలయగు దుర్గాభాయి నిరంతరమును కంటికి మంటికి నేకధారగా నేడ్చుచు, బ్రాణేశ్వరునకెట్టిలోపమును రానీక సంరక్షణజేయుచునే యుండెను. దినదినమును నమృతతుల్యములగు

నౌషధములాతని యుదరమున జీర్ణించిపోవుచు నేయుండెను. ఇప్పటి కయ్యౌషధరాజములనన్నిటినొక తాతిగంబమునకు బోసినను నయ్యది చిగురించియే యుండెడిదిగాని నిర్భాగ్యుడగు చందునకవి యణుమాత్ర మైనను గుణమొసంగజాలకుండెను. దైవవిధి తప్పింప నెవ్వరి తరము? లోకమున రాజాధిరాజులు సైతము మందులు లేకనే మృతినొందు చున్నారా?

ఇంతవఱకును నారాయణచంద్రెట్టి వ్యాధిచేబీడితుడగుచున్నాడో నేవైద్యుడును నిరూపింపజాలకుండెను. అతనికి యాహారమిసుమంతయును దగ్గుటలేదు. వైద్యుడు జెప్పు పథ్యపానములనైన నాతడు లక్ష్యంపక సర్వవస్తువులను దినుచునేయుండెను. అపుడపుడు తండ్రితోను, భార్యతోను, మనసారమాటలాడుచు, కష్టసుఖము లెఱిగించుచునే యుండెను. కాని యొక్కొకవేళ మాత్ర మాతడొంటరిగ శయ్యపైగూర్చుని, యర్థరాహిత్యములును, సంబంధములేనివియునగు వృథాలాపములాడుచుండును. శరీరము రక్తవిహీనమై, కాంతి విరహితమై, శుష్కించి పాలలోని బల్లివలెనే దెల్లవడిపోయెను. ఇదియే యాతని రోగము. ఇది యెట్లంకురించినదో, దీనికి బ్రతిక్రియయేమో మాత్రి మెవ్వరెఱింగింపకుండిరి. ఇదియే యాతని దౌర్భాగ్యము.

నేడుదయముననే నారాయణచంద్ యథావిధిగ, మేడపై వీధి కెదురుగనున్న గవాక్షము జెంత బడక కుర్చీలో జేరబడియుండెను. సుగంధబంధురంబులగు బ్రాతఃకాలపవనాంకురము లల్లనల్లన జను దెంచుచు, నాతనికి మనోల్లాసము గలిగించుచుండెను. దుర్గాభాయి ప్రక్కనున్న బల్లపై నాసీనయయి, గూటియందలిమందు సీసాలోని మందు నొకకాచపాత్రలోబోసి, ముఖమున జిరునవ్వొలయ గ్రేగంటి ప్రసారముల నాథునవలోకింపుచు, నొక చేత నౌషధపాత్రిబూని, రెండవహస్తముల నాతని చుబుకము బుడుకుచు, జంటిబిడ్డనుబుజ్జగించు విధాన నాతనిముందు బుచ్చుకొనుడనుచు దీనముగ బ్రార్థింపుచుండెను.

వచ్చుచుండెను. ఆతనివెంట దెల్లనిదుస్తులదాల్చి, చేత దంతపుబిడిగల కఱ్ఱబూని యింకొక పెద్దమనుష్యుడుగూడ వచ్చుచుండెను. వారెవరో గొప్ప వైద్యశిఖామణులని దుర్గాభాయి పక్కగదిలోనికిం బోయి, తన భర్తగూర్చి యేమి చెప్పునోయని యాతురతో దలుపుచాటున నుండి చూచుచుండెను,

"అబ్బాయీ! నీశరీరంలో యీరోజున నేలాగుననున్నది? మందు పుచ్చుకొన్నావా?"యని గోపాల్ చంద్ తనయుని బ్రశ్నించి, తానొక కుర్చీలో జేరబడి, పక్కనున్న నింకొకయాసన మతిథికిజూప నాతడందుపవసించెను. "అబ్బాయీ! యేలాగున్నదన మాట్లాడవేరా?" యని గోపాలచంద్ తనయునింకొకసారి హెచ్చరించెను.

నారా:—ఏలాగున నున్నదని చెప్పను? నాకేరోగమును లేదని యీవరకే జెప్పియుంటిని. అట్టియెడ నిష్కారణముగా సీపాడు మందు లన్నియుదెచ్చినానోటబోయుచు వైద్యుండనని పేరుబెట్టుకొనిన ప్రతివానికిని సొమ్ము దిమ్మరించుచున్నారు. ఎందులకీ యనవసర వ్యయము? నాకిపుడే రోగమును లేదు. నాశరీరము చాల తేలికగా నున్నది......బాబా! ఈమహానుభావులెవరు? అడుగమరచినాను.

గోపాల్:—అబ్బాయీ! వీరీయూరనొక ధనికులట, ఏమో నీతో కొంత మాట్లాడవలసిన పనియుండుటచే వచ్చియున్నారట. కొంతవడి వారితో మాట్లాడగలవా? నీకుగూడా కొంతయుబుసు పోగలదు......అని యాగంతకుని దెస దిరిగి "బాబూ! వీడే నా యేకపుత్రుడు నారాయణచంద్. వీనికి రమారమీ గతనెలదినముల నుండియు శరీరమస్వస్థతగానున్నది. ఈయూరగల వైద్యశేఖరులెందరెందరో పరీక్షించి మందుల నిచ్చుచున్నారుగాని యింత వఱకును వాని వ్యాధియేమో కనిపెట్టి చెప్పగలవారొక్కరును లేరు. ధనవిషయమున లోపమేమియును జేయక వ్యయమొనర్చుచునేయున్నాను. ఇంతకును మాయదృష్టదినములు గలసిరాకున్నవి. ఇంక నీతని భార్య శ్రీమతిదుర్గాంబ నిరంతరరోగపీడిత. ఆమెకు బుట్టిననాటనుండియు

నేటివరకును కూడ నేదోయొక రోగమంకురించుచునే యుండెను. ఎల్లప్పుడు నామె యేదోనొక మందు దినుచునే యుండును. పత్యపానములలోనే యామె యాయువు వ్యయమై పోవుచున్నది, బాబూ! మాగృహపరిస్థితులీరీతినియున్నవి పరమేశ్వరునికృప మాపై నెపుడు వచ్చునో దెలియదు." అనుచు నాముసలి తన గృహవిషయముల జిలువల బలవలను బెట్టుచు, నేమో ప్రశ్నించుచునే యుండెను. గాని, యాగంతకునకీప్రసంగమెంతమాత్రము నిష్టములేకున్నట్లాతని ముఖమున ముడుతలే సూచించుచున్నవి. అట్లని యాతడు విసుపుజెందక తలనాడించుచునే యుండెను. అంత గోపాల్ చంద్ "బాబూ! నేనింక నంగడికి బోవలయును. ఇప్పటికే చాలాప్రొద్దెక్కినది. నాకొ[illegible] యనేకులు వేచియుందురు. మీకు గావలసిన యంశముల స్వేచ్ఛ మీరీతనితో మాట్లాడవచ్చును. అబ్బాయీ! నీవుమాత్రము మందింతతో విడచిపెట్టకు. నేడే వైద్యునడగి నీశరీరస్థితి బాగుగ పరీక్షించి యాతడెట్లు చెప్పిన నట్లే చేయవచ్చును. తొందరేమియును లేదు. బాబూ! ఇంక నాకు శలవు దయచేతురా?" యని యాతడు మేడ దిగి క్రిందికిం బోయెను. ఆగంతకుడుమిక్కిలిసంతసించినవానివలె నొక్క వేడినిట్టూర్పువిడచి, కొంచెముసద్దుకొని కూర్చొండెను.



3

ఆగంతకుడు:—అయ్యా! తమ పేరేనా నారాయణచంద్ గారు? తమకుగలవ్యాధి యేమి? ఇపుడు తమ శరీరములో నెట్లున్నది?

నారా:—చిత్తము. అయ్యా! నేనే నారాయణచందును" ఈవృద్ధుడే నాజనకుడు. ఈమధ్యను నాశరీరము కొంచెము దుర్బలమైపోయినది. ఎందుచేతనో చెప్పజాలను. కాని యిపుడించుక స్వస్థతగనే యున్నది. బాబూ! తమ పేరేమి? ఏపనిమీద తమరిందు దయ

చేసి యున్నారు. అడుగ వచ్చునా?

ఆగం:— చిత్తము. అంతయు జెప్పుటకే వచ్చియున్నాను. మిమ్మిపుడొక నిగూఢతరమగు హత్యావిషయమున కొన్ని ప్రశ్నలడుగ వచ్చినాను. దయచేసి నాప్రశ్నలకెల్లను సమాధానము లీయగలరా?

నారాయణచంద్ర నిర్విణ్ణుడైపోయెను. ఆతనికి ప్రపంచమంతయు దిరిగిపోవుచున్నట్లుండెను. వెఱ్ఱివానివలె నాతడు రెండుచేతులను బైకెత్తి విస్మయముగా దలపైనిడికొనియెను. ఆతని తల గిరగిర దిరిగి పోవుచుండె. ఒక్కసారి వేయి ఫిరంగి యంత్రములప్పు [illegible]తని చెవుల[illegible] ధ్వని యొసగుచున్నట్లుండెను ముఖమొక్క[illegible]ణములో గాంతి విహీనమైపోయెను. చూచుచుండగనే యాతని నేత్రములశ్రుజలపూరితములై దృష్టికవరోధము గలిగించెను. "అయ్యో! మీరు పోలీసువారా" యని మాత్రమాతడరచి కుర్చీవెనుకకు జేరగిల పడిపోయెను.

ఆగంతకుడీవిచిత్ర ప్రదర్శనముగాంచుచునే యుండెను. ఆలోచింపగ నీపరివర్తనమున కంతయు గారణమాతడెఱింగినవానిగతి గిస్పట్టుచుండెను. "అయ్యా! చంద్రుగారూ! మీరింతగా భీతిల్లనవసరమిసుమంతయును లేదు. ఏవిధముననైనను మీకు హానిజేయుతలంపున నేనిందు రాలేదు. మీరు నిశ్చితిగ మెలంగవచ్చును. విధిలేక యొకానొక కారణంబున మిమ్ము గొన్నిప్రశ్నలడిగి నాసందేహ నివృత్తి జేసికొన దలచి వచ్చినాడను. అంతమాత్రమున మీరునన్ను సందేహింప నవసరములేదు. ఈహత్యకాండ మీకు సంబంధించి యుండదని నేనే సంపూర్ణముగ నెరుంగుదును. కాని యందు మీరు కొంతవిషయము నెరింగిన వారలగుట మీవద్దకు రావలసివచ్చినది గాని వేఱుకాదు. ఇంకదయచేసి మీరు నాప్రశ్నలకు నిశ్చితిగ నుత్తరము లొసంగ వచ్చును." యనుచు నాతడు చం[illegible]గోక్తుల గరపసాగెను.

నారాయణచంద్రు డప్రతిభుడైనను కొంతవడికి ధైర్యముగొని, యాగంతకుని ముఖమున దృష్టిసారించి తదేకధ్యాన[illegible]న జూడ

సాగెను. ఇంకను నాతడు దన్ననుమానించుచున్నాడని యానారేనుడు గ్రహించి "అయ్యా! మీకు భయమువలదని తొలుదొల్తనే జెప్పి యుంటిని. మీరింకను నట్లేల సందేహించెద?"రని యాతని బుజ్జగించెను.

నారాయణచందించుక మేల్కని, కన్నులగారు నీటిబిందువుల జేలాంచలమున దుడిచికొని తనస్థితికొంతయుదానే లజ్జించెను. అతని కెద్దియో బూర్వచరిత్రస్మృతి పథమున బడియుండబోలు. ఏదియో యననేల? అగంతకుడు తాను హత్యావిషయమున బ్రశ్నించునపుడే దనకు బరిచితయగు మాలతి హత్యయని యాతడప్పుడే దెలిసి కొని యెను. తోడనే యాతని హృదయాంతరాళమున మెరపు మెరసి నట్లయ్యెను. దానవాతడు సంపూర్ణముగ జలించిపోయెను. వచ్చిన యాతడే యభియోగమున దన్నుబరీక్షింపనేతెంచిన రక్షకోద్యోగి యని యాతడు గ్రహించుకొనియెను. ఆతనికి దనచరిత్రయంతయు దెలిసియుండుననియు, నింక నాతడెట్లయినను దన్ను విడువడనియు, తలయునెడనాతడు దన్ను హంతకునిగ బరిగణించుననియు మున్నగు నాలోచనలతో నాతని మనము దృటిలోనిండిపోయెను. సత్యాసత్యములు గ్రహించుటకు బోలీసువారు మాత్రము దేవతలా? అభియోగము సంపూర్తిగావించుటకై నొకవేళ దన్నేహంతకునిగ నిరూపింప జూచిన నట్లే జేయగలశక్తి వారికడగలదు. ఈకడపటి యాలోచన మాతనికిందోచినతోడనె యాతనిదలపై బిడుగుబడినట్లయ్యెను. "హా! పరమేశ్వరా!"యనుచు నాతడు మంచల వెనుకకు జేరగిలబడిపోయెను.

అగ:— చందుగారూ! ధైర్యమవలంబింపుడు. ఇంకను నేజూడ వలసినపనులనేకములుగలవు. ఇట్లు తమరాలసించిన లాభమేమి? ముఖ్యములనిదోచిన విషయములొకటిరెండుమాత్రమే బ్రశ్నింతును. దయయుంచి తమరెరింగినదే జెప్పవచ్చును.

నారాయణచంద్ర తుట్టతుదకెట్లయినను నింకజెప్పక దప్పదని యెంచి"అయ్యా, శలవీయుడు. నేడు నాశరీరస్థితియంతగా బాగులేదు"

యనియెను.

ఆగ:—సరే—వినుడు—కొన్నిదినములకుబూర్వము కాశీఘాట్ లోని జీవనాధునను భోగమువాని తనయ మాలతియను నామె వధింపబడెను. ఆసంగతి తమరేమైనను వినియుంటిరా?

నారాయణచంద్ వెఱ్ఱివానివలెనే కుర్చీనుండి లేచి నిలచి, కరయుగమున దల దడవికొనుచు, మఱలనాసీనుడై "ఆ! మాలతియా హత్యయా—లేదు లేదు, నేనెఱుంగను" యనియెను.

ఆగ:—అయ్యా! మీరు హత్యజేయుట నెఱుగరా లేదా యని కాదు. నాప్రశ్న-హత్య జరిగినదని వినియుంటిరా?

నారా:—ఆ—ఆ—విన్నట్లు జ్ఞాపకము. నాకీరోగ మారంభింపక పూర్వమొకనాడీవార్త కర్ణాకర్ణిగా వినియుంటిని. అవును. ఇప్పుడంత మాత్రమున నావలన మీకేమి కావలయును.

ఆగ:—చంద్రసూరూ! మీరుగూడ నావార్త నలువురివలెనే కర్ణాకర్ణిగ వినియున్నవారే యైనచో [illegible]డకు నేరావలసిన యగత్యమే యుండకపోవును. మిమ్ముగూడ [illegible]వలెనే జూచియుందును అపుడు మీనామమైనను దెలిసికొనను నాక[illegible]మే లేకుండెడిది. అట్లు గాక తమకీవిషయము నలువురికన్న నించుక దెలియునను నమ్మికతో నీగతి మీవద్దకు రావలసి వచ్చినది.

నారా:—అయ్యా! నాకెక్కువ యేమి దెలియును? మాలతి వధింపబడినదను వార్తదక్క యితరమేమియు నెఱుంగనే.

ఆగ:—అయ్యా! మీరు వృధా కా[illegible]షన మొనరించుచున్నారు. మీరెఱింగినదేమో నాకీవరకే దెలియునుగాని యందలి సత్యాసత్యములు గ్రహించుటకై మీనోటసరముగ మునువినదలచి వచ్చియున్నాను. దయయుంచి నామార్గము సుగమము గావింపుడు.

నారా:—అట్లయిన మీరెఱింగిన యీనావిషయమసత్యమని దెలిపిన నన్ను విశ్వసింతురా? ఏల నన్ను జిక్కుల ద్రోయజూచెదరు బాబూ! మీసంగతిజూడగ మీరారితేరినపత్తేదారులన్న నాయూహ

నిశ్చయమైనట్లు తోచుచున్నది.

ఆగ:—ఏల గాగూడదు? విధిలేక మీజనకునికడ నేనీయూర నొకధనికుడనని మాత్రమే జెప్పియుంటినిగాని పోలీసుకర్మచారియగు రామాలాల్ శర్చాదుండను నేనేయనిన మీరువిశ్వసింతురా?

నారాయణచందు మేనొక్క నిమేసమీపలుకాలించిన తోడనే మహా వాయుసంచాలనంబునందూగు కుసుమలతికవలెనే యల్లలనాడిపోయెను. ఆతని మేనెల్లను జలుచెమ్మటలగ్రమ్మెను. ఉష్ణతరంబగు నొక్క నిట్టూర్పు నాతడు విడచి "అయ్యా! క్షమింపుడు. తమ దర్శనభాగ్యమెన్నడును నాకు లభించియుండలేదు. గాన మిమ్ము నే నెన్నడెరుంగను. కాని యీహత్యావిషయమున మాత్రము నేనేమియు నెరుంగననుట కెంతయు జింతిల్లుచున్నాను."యని ప్రత్యుత్తర మొసంగెను.

శర:—మీరేమియు జెప్పదలచుకొనలేదా? అట్లయిన చందు గారూ! మీరెరింగినదేమో నేనే జెప్పెద వినుడు. ఈ చనిపోయిన మాలతి భోగముకాంత యగుట దానిని తమరు గొన్నిదినములనుండియు మీయుపపత్నిగా నుంచుకొనియున్నారు. నిశ్చయమేనా?

నారాయణచందీ పల్కులాలించి నిశ్చేష్టుడై మాన్పడియుండెను. ఆతనిముఖము గళావిహీనమై నల్లవారిపోయెను. ఆతడేమియు బలుక లేదు.

శర:—ఏమీ? మీరేమియు జెప్పదలచుకొనలేదా? నేను మీయెడ మిత్రభావమున బ్రవర్తించుచుండ, మీరు వృథాగానన్నను మానించి, గూఢముగా బ్రవర్తింపజూచుచున్నారు, గాని లాభమేమియును లేదు. అదిగాక నావద్దనిపుడు సత్యముబల్కనిరాకరించినచో, రేపు మీరే స్వయముగా న్యాయసభను సర్వమును వెలిబుచ్చక మానరు, ఈయభియోగమునకు మీరుదక్క నితరాధారమేమియు లేదు గాన సర్వమును మీవలనేవిని హంతకుల జాడలనరయుమార్గమార్గమున్వేషింప వలసియున్నది. కాన గరుణించి మీరెరింగినది

పూర్తిగ నాకు దెలిసిన నెంతోయుపకార మొనర్చిన వారలగుదురు. మీ మేలు మఱువక, మీ కెవ్విధమైన యపాయమును వాటిల్లకుండ నల్లు జూచుభారము నాయది. ఇందుమీరు నిర్దోషులని నేను బూర్తిగ నెరుంగుదును, గాని హత్యయేరీతిగ, నెప్పుడుజరిగినదో మాత్రము మీ రెరుంగుట వాస్తవము; అపుడు మీరచటనే యున్నారనికూడ నేను నిర్ధారణగ జెప్పగలను. దయయుంచి సర్వము నెరిగింపుడు.

శరశ్చంద్రుడు జెప్పుపలుకులన్నిటిని చందుజీనరహితనుగు ప్రతిమ వలెనే వినుచుండెను! మహాదాశ్చర్యాంబుధిలో మునింగినవానివలె నాతనిముఖముజూపట్టుచుండెను. "అబ్బా! ఈవరకీతనిఘనతవినియుంట యేగాని. స్వయముగ నీతని సమర్థత నెన్నడును జవిజూచియెరుంగను. నే జెప్పుటకు బూర్వమే యీతడు నాచరిత్రివంతను గ్రహించియే నన్ను బరీక్షించుటకై వచ్చియున్నవాడు. ఇంక దాచిన లాభమేమి యును లేదు. ఇంతకును నేను నిర్దోషినిగదా? నారహాస్యవర్తన మంతయు బయలుపడునను భీతిచే నేమియు బలుకజాలకున్నాడ గాని వేరుగాదు. కానిమ్మింకగత్యంతరము లేదు." అనితనమది నాలోచించి "అయ్యా! క్షమింపుడు. మీరు స్వయముగ నీవఱకే సర్వమెరింగియు నానోట వినదలచియున్నారు—అయిన, నే నెరింగినదిసర్వముబరమేశ్వరుని మ్రోల నివేదించుచున్నాను. అనుగ్రహింపుడు.

శర:—సంతోషము. చందుగారూ! నేనుమాత్రముగృతఘ్నుడ గానని యెరుంగుడు. ఇంక మీ రెరింగినది చెప్పవచ్చును.

నారా:—అయ్యా! క్షమింపుడు. ఇపుడే యైదునిముసములలో వచ్చుచున్నాను. ఇక్కడనే కూర్చునియుండుడు. ఇప్పుడే వచ్చెద" ననుచు యాతని ప్రత్యుత్తర మపేక్షింపకయే యాసనము విడచి యెదుటి గదిలోనికింబోయెను.



౮

"ఏమీ? ఈతడు సత్యము సర్వము నెరిగించెదనని చెప్పి లోనికేగి

మాయకముగా నున్నాడా? కాదు-కాదు—చూడగ పితపటిభీరువువలె గన్పడుచున్నాడే. ఏమో? లోకమున మేకవన్నె మృగములెన్ని లేవు. మేడ క్రింది కేగు సోపానములిందేయున్నవే. ఈతడెట్లు బోగలడు? ఈసౌధమున కింకను వేఱుమార్గములున్నవేమో? ఎవ్వరెరుంగుదురు. ఆయిన నీతని జాడలును, నీతని పలుకుబడిను జూడ నమాయకునివలెనే యున్నాడు. అట్లయినాతడు నావంటిపత్తేదారుని గన్నులమన్నుగొట్టి పోజాలునా? పోయి యేలోకమున డాగగలడు? అయిన నట్టిమాయోపాయమును లెక్కింకొనిసికేమిపని? ఎంతగ సాహసించినను నీతడే హంతయని మాత్రము జెప్పంగలనేనను నాకు సాహసమొదవకున్నది. ఒకవేళ నీతడు హంతకుడు గాకున్నను, హంతకులకు సహాయకారి గా వచ్చునా? ఎట్లయినను నీతని బాగుగ బరీక్షింపవలసియున్నది.” అని యాగతి బహువిధముల నాలోచింపుచు, శరచ్చంద్రుడు కుర్చీ నుండి లేచి నిశ్శబ్దముగ బచారు సేయుచు నాసౌధమునంతను బరీక్షింపుచుండెను—

నారాయణచంద్రుడిలా యెదుటి గదిలోనికి ద్వరితగమనుడై యేగ గారణము లేకపోలేదు. ఆతనిదండిరియును, శరచ్చంద్రుడును మేడపైకరుదెంచునపుడా నూతనపురుషుని వైద్యునిగా భావించి, తన భర్తగూర్చి యాతడేమిచెప్పునోయని వినగుతూహలయై, నారాయణచంద్రు భార్య యాగదికేగి ద్వారముచెంతనే నిలచి యుండుట పాఠకులు మరచియుండరు. కాని పరిస్థితులు తలక్రిందైనవి. వైద్యశిఖామణి పత్తేదారుడై, హత్యాపరాధమున దన నాథుని విచారింపవచ్చి యున్నాడు. పాపమాసాధ్వి యీప్రసంగమంతయు నాలింపుచు, గనుల నీరుగార్చుచు, నిశ్చేష్టయై, కరగిపోసినబంగరుబొమ్మచందాన ద్వారము చెంత నిలచియుండెను.

ఇంతలో నారాయణచంద్రు లోనబ్రవేశించెను. ఆతనిజూచుటతోడనే యామెకు దుఃఖము మితిమీరిపోయెను. ఆమె యాతని పాదములపైబడి, కన్నీళ్ళనాతని పదప్రక్షాళన మొనర్చుచుండెను.

ఆస్థితినిగాంచిన చంద్రునకు గూడ దుఃఖమాగకుండెను. ఎట్లో ధైర్య
చిత్తుడై యాతడామెను లేవనెత్తి "చూడుము, దుర్గా! నీవిట్లు దుఃఖించిన
ప్రయోజనమేమియును లేదు. అయినదేమో యైపోయినది. నీవు
నామాటవిని, యీమాట ప్రసంగిమేఁకిని దెలియనీయవలదని నమ్ముచున్నా
ను. తరువాత దీనికితో మనమున్న సంగతులను మాట్లాడవచ్చును.
ఇపుడాతడు నాకై వేచియున్నాడు. నీవు సాధ్యమగునంత వరకును
మాటలుకులాలింపక గ్రిందికిఁబొమ్ము. ఒకవేళ నన్నుగాదేని, యీ
మాటల మాత్రమింక రెండవ కంటివానికిందెలియ నీయగూడదు
సుమా. జాగ్రత్త. ఇంక దడయుటకు వేళ లేదు." అనుచు నాతడు వెలుపలి
శరచ్చంద్రుని కడకేగెను. పాపమామె కన్నీళ్ళతో మాటాడలేక,
వెక్కిళ్లుడక్కి యచ్చటనిలచి, యికముందు తననాథుఁడేమి చెప్పనోయని
యత్యాతురయై యాద్వారముకడనే వేచియుండెను.

శరచ్చంద్రుఁడడుగుల సవ్వడి వినవచ్చినంతనే చంద్రుడు వచ్చు
చున్నాడు గదాయని సంతసించి, తన యథాస్థానమున నుపవిశించెను.
ఇంతలో నాతడువచ్చి "అయ్యా! క్షమింపుడు. నన్నుఁగూర్చి తమ
కెంతయు జాగయ్యెనని విచారించుచున్నాను. ఇంక నే నెఱింగిన
యావద్వృత్తాంతమును జెప్పుకొనుచున్నాడను. నన్ను గరుణింతు
రనియే నమ్ముచున్నాను.

శర:—అభ్యంతరమేమి? నిన్ను హింసించునంతటి కృతఘ్నుడ
గానని యీవఱకే జెప్పియున్నాను. ఇంకనీవెఱింగినదంతయును జెప్ప
వచ్చును—

నారా:— అయ్యా! ఈజీవనాథుఁడను వాడు నేటికి గొన్ని
మాసములకు బూర్వమే తనకుమార్తెయగు మాలతినివెంటనిడుకొని,
రంగమునుండి యీపురము జేరియున్నాడట. నేను వారిని గత నాల్గు
మాసములనుండిమాత్రమెఱుంగుదును. నాపూర్వజన్మదుష్కృతఫల
మున వేశ్యాలోలుడనై యుండిదీవఱకే సంచరించుచుంటిని. తుదకొక
నాడు నాహితులలో నొకడగు రామలింగను నాతడు, యీరంగూన

యుక్తసువారకామిని యున్నదనియు, యామె నూతనముగ నిందు వచ్చినదనియు, తానొకప్పుడామెను రంగమున నెఱింగియుంటిననియు, చెప్పి నన్ను మాలతి గృహమునకుం దీసికొనిపోయెను. నాటఁగోలె నేనును యామె మోహనాంగములకు జిక్కువడి, మంత్రముగ్ధమగు భుజంగంబు చాడ్పున, నామెను విడువజాలక, సాధారణముగ సర్వకాలసర్వావస్థలయందును నామెకడనే నాకాలము వెళ్లబుచ్చుచుంటిని. నిత్యము నింటికి భోజనమునకు బోవుటయే గష్టముగా నుండెడిది. ఒక్కొక్కవేళ మోహమున్నెలనైన యామెను నొకటిరెండు దినములింటికి వచ్చుటయే కరవుగా నుండెడిది. ఇటువలెయుంట, మాగృహయజమాన్యమును, యంగడివ్యాపారమును నమ్మకస్తుఁడగు మాజనకుఁడే చూచుకొనుచుండుటచే నాకే యితర చింతలును లేక బ్రవర్తించుచుండెడివాఁడను. మాతృవిహీనుఁడనగుటచేతను, నేనే యేకపుత్రుఁడనగుటచేతను నాజనకుఁడు నాకు వలయు ధనంబొసంగుచుండెడివాఁడు.

నర:—అయ్యా! మీరు రెండు మూఁడు దినములు వరుసగా నింటికి రాకున్న మీతండ్రి మిమ్ము బశ్నించువారు గారా?

నారా:—పశ్నింపకేమి? గాని, అతఁడడిగినప్పుడెల్లను నే స్నేహితుని యింటనో నుంటినని వారికి సాకు చెప్పుచుండెడివాఁడను. ఆయన నాతఁడు నమ్మక, నేనెచటనుంటినేమోయని నన్ను మందలించుచు, యంగడి వ్యాపారము నేర్చుకొనుమనెడివాఁడు. కాని నేను వారిపలుకులంతగా లక్ష్యింపక యిచ్ఛానుసారంబుగ మెలంగుచుండెడివాఁడను. ఇట్టుండ మాలతికిని నాకును స్నేహమున్గలముగాఁ బొచ్చెను. మాయింటి పురకును సంధానకర్త యగు రామలింగపుఁడప్పుఁడు నన్నుఁ జూచి యానందించువానివలెనే నటించుచు, వలయు సొక్కమును నాకొసఁగి, కొన్ని దినముల వఱకును మాయింటఁ గానవచ్చినవాఁడు గాఁడు.

ప్రతిదినమును నేనును, మాలతియు మేడపై నొకసుందరమగు గదిలో విశ్రమించుచుండెడివారము. మాగదిముందుభాగముననే వరండాలో మాలతిపరిచారిక యగు శ్యామల గూర్చుని పనిసవరించుచుండెడిది.

మేడ క్రింద నొకహాలును, దాని కిఱుప్రక్కల రెండు పడకగదులును, యుండుట తమరు జూచియేయుందురు. అందొకగదిలో జీవనాథుడు శయనించుచుండెడివాడు. రెండవగదిలో సామానులుదక్క నెవ్వరును నిదురించుటలేదు. హాలులో మాత్రమాతని సేవకుడగు రామోజీ పండుకొనెడివాడు. ఇట్లు మాకు దినమొక లిప్తగా గాలముగడచి పోవుచుండెడిది. ఇట్లుండగా నొకనాడు, అనగా నేదినమున మాలతి వధింపబడెనో యానాడు నేను మామూలుగ భుజించి, మాలతి గృహమున కేగుచుంటిని.

శర:—ఆనాడెక్కడ భుజించితిరి?

నారా:—మాయింటనే. నాడు మాయింటికివచ్చి, తిరుగ మాలతి గృహమున కేగుచుండ త్రోవలో రామశింగు గానవచ్చి, తానాదినమంతయును భుజింప లేదనియు, నేమైనధనముగావలెననియు గోర నాతనితో మాట్లాడకయే, చేత నొకరూకనిడినాదారిని నేబోవు చుంటిని. కాని యింతలో నాతడు మరల నన్ను వెనుకకు బిలచి "బాబూ! యీరాత్రి చందననగరమున మంచినాటకమున్నదట. నేడు మీరీ మాలతి యింటికేగుటమాని, నాటకసందర్శనమునకుబోదము వత్తురా?"యని ప్రశ్నించెను. కాని నాకు నాటకముల యందంత యభిరుచిలేక పోవుటచే "సరే. యొకపరియాచటకుబోయి, వీలగుచో మేమిఱువురమును గలసియే వచ్చెదము. నీవు, గావలసిన ముందేగు" మని జెప్పి నేబోతిని.

అట్లు మాలతి గృహముజేరి నేను మామూలుగా మేడపై కేగితిని. జీవనాథుడు నేవచ్చినతోడనే వీధి ద్వారమును బంధించి వైచెను. హాలులో రామోజీ యథారీతిగ నిద్రించుచుండెను. శ్యామల నేవచ్చినపిదప తన శయ్యంజేరెను. మాలతియు నేనును, సుమారు పదునొకండుగంటలవఱకును యేవో ముచ్చటలాడుచునే యుంటిమి. ప్రసంగవశమున నామెను నాటకసందర్శనార్థము చందననగరమునకు రమ్మని బిలచితిని గాని యామె నాడస్వస్థతగా నున్నదనియు,

నాటకమున కింకొక దినమున బోవుదమనియు, చెప్పుటచే నాటికా ప్రయత్నము మానుకొంటిమి. తరువాత గొంతవరకును మాటలాడి శయ్యాగతుల మైతిమి. తోడనే యామె గాఢమగు నిద్దుర జెందెను. నేను మాత్రము నిదురరామి, కొంతవఱకటునిటు దొరలుచు, పిదప నిద్రకు లోనైతిని. ఎట్టయెదుట గోడకమర్చియున్న దీపము ప్రకాశమానముగనే వెలుంగుచుండెను. ఇట్లెంతసేపు నిదురించియుంటిమో మే మెరుంగము గాని రాత్రి సుమారు రెండున్నరగంటలపుడు, మూసియున్న మాగదితలుపతి ప్రయత్నమున దెరువబడుటచే యాశబ్దమునకు నాకించుక మెలకువవచ్చెను. కాని మత్తుగనుండుటచే గనుల విప్పజాలక పోతిని. ఇంతలో నెవడో యొకడు నా చేతుల రెంటిని గట్టిగ గూర్చి పట్టినట్లయ్యెను. నా మేన గంపముదయించెను. భీతిచేమాట్లాడజాలక బోతినిగాని దగ్గరగా నెలుపలనున్న భృత్యులనుగాని, జీవనాధుని, గాని బిలువవలెనన్న యాశమాత్రము నామది నుదయించినది. ఒకవేళ నాప్రయత్నముగూడ జేసియుంటినేమోగాని యెట్టిధ్వనియు నానోట వచ్చినట్లు లేదు. ఇంతలో నానాసిక కడ్డుగ నేదో దుర్వాసనగలయొక గుడ్డతో నెవ్వరో యదిమిపట్టిరి! తరువాత నాకు గాఢమగు నిద్ర వచ్చినది. పిదప నేమిజరిగినదో యెరుంగనుగాని, యుదయమైదుగంటల కించుక దెలివిరాగ గన్నులవిచ్చి చూచితిని. నాప్రక్క మాలతి శయనించియే యున్నదనుకొంటిని. మంచముకడ రామోజీ నిలువబడి నాముఖమును వీక్షించుచు, [illegible] ఎవ్వరో గోడవెప్పుడు మాటిమాటికి నాకు వినవచ్చుచునే యుండెను. ఒక నొక యరగంట కాలములో నాకు బాగుగ మెలకువరాగా, ప్రక్కపై నుండి లేచిచూడ నా వస్త్రములు రక్తమయములై భీతిగొల్పుచుండెను. వెంటనే మానసముడిగి క్రిందపడిపోతిని. రామోజీ నన్ను లేవనెత్తి “బాబూ! ఘోరముజరిగిపోయిన” దని భోరున నేడ్వసాగెను. నాయా పాదమస్తకమును జలించిపోయెను. కనుల బూర్తిగ విచ్చిచూడ, నా మంచముపై మాలతి, శిరః ఖండనము గావింపబడి నెత్తుటి వరదల

బొర్లాడుచుండెను తోడనే పాకనులు దిరిగిపోయెను. ప్రక్కనున్న గోడపై నల్లబడిపోతిని. నాశిరమునకించుక గాయముగూడ దగిలెను.

మఱల మెలకువగానుసరికి జీవనాధుడు నాయెదుట నిలచి ఘోరముగా నేడ్చుచు, క్లుప్తముగా సంగతులన్నియు వివరించెను. నామతి భ్రమించి పోవుచున్నది, నానోట మాట రాకున్నది. బాగుగా దెల్లవారుచున్నది. తుదకెట్లో ధైర్యమూని, యింక నందు దడయుట ప్రమాదకరమనియు, మానహానియనియు నెంచి "జీవనాధ్! ఇంక నేను నాగృహంబున కేగుచున్నాను. నీవిట్లేడ్చుచుండిన లాభమేమియును లేదు. వెంటనే రామోజీని పోలీసుస్టేషనునకనుపుము కాని యెవ్వరెన్ని విధముల బ్రశ్నించినను, రాత్రి నేనిందుంటినని యెంతమాత్రమును దెలియనీయవలదు. తరువాత నన్నిసంగతులను విచారింతము. ఒకవేళ దేనికైనను నాసహాయము వలయునేని, నీవు నేనీయుదంతమే యెఱుంగనట్లు బ్రవర్తింపుచు, రహస్యముగా నొక లేఖ నాకనుపుము. దాన వీక్షైన నేను మగుడ నిన్ను గలిసికొని, నీకు వలయు సహాయ మొనరింపగలవాడను. ఇంక నేబోవుచున్నా"నని క్షణికమైన నటదడయక, పెరటి ద్రోవంబడి, నాయిలు చేరుకొంటిని. తరువాత మధ్యాహ్నమొకగంటవేళ జీవనాధుడు, తనకు ధన సహాయము వలయుననుచు, నాకు జాబునంపనట్లే, వానిని వైద్యాలయము కడ గలిసికొని, దహనసంస్కారమైనపిదప నాతనితోనే యాతని గృహమున కేగి, యానాడు దమ యెదుటనే యుండుట జూచియే యుందురు—

శర:—అవునవును. జీవనాధుని నేను బ్రశ్నించుతరి మీరుకూడ నచటనే యుండిరి, కాని నేనావిషయమపుడంతగా గమనించియుండ లేదు. ఎవరో వాని మిత్రులో, బంధుగులో, దహనకాండకై తోడు పడ వచ్చిరనుకొంటినిగాని తరువాత మాత్రము తమ చరిత్ర దెలిసికొనగల్గితిని—

నారా:—బాబూ! ఆహత్యావిషయమైనే నెఱింగిన హంశము

లివ్వియే. నాటనుండి మఱల నేటివఱకును, నేనాగృహమున బదమిడి యుండ లేను. నాటిభయంకరపరిదర్శనావలోకనమున నేభీతావహుడనై బహుశ, నదేకారణముగ, నింతవఱకును రోగపీడితుడనై నవయు చున్నాను. బాబా! ఇంతకు మిక్కిలి నేనించుకంతయు నెరుంగను. నాపలుకులన్నియు బ్రమాణవచనములని తమరువిశ్వసించినజాలును.

శర:—అయ్యా! నీవు నిర్దోషివని యింతకుబూర్వమే జెప్పి యున్నాను. కాని హత్యాసమయమున మాత్రము నీవచటనుంటివని తెలిసికొనగలుగుటచే, నీవద్దకు రావలసివచ్చినది. ఇంతకును నహ రాధులెవ్వరో దెలిసికొనుట దుష్కరముగనే యున్నది. ఎవ్వరో నిచేతుల రెంటిని గట్టిగా బంధించితిరని జెప్పితివే, యపుడు నీవు కనులవిచ్చి వారి ముఖమైనను జూడనే లేదా?

నారా:—లేదు బాబూ! లేదు. నాకపుడు నిద్రమత్తు కనుం గడు తీవ్రముగా నుంటచే, కనులనైనను విప్పజాలకపోతిని. అదేమి చిత్రమో, యంతటినుండియు, మఱల నుదయమువరకును, జచ్చిన వానివలెనే పడియుంటినట.

శర:—ఇందు చిత్రమేమున్నది? వారు వారిపని నిరాటంక ముగా జరుపుకొనుటకై నీకు మత్తుమందునిచ్చియున్నారు. దాన నీవు జీవన్మృతుడనై పడియుంటివి.

నారా:—ఆలాగున? అమ్మో! ఆసంగతి నేనింతవఱకును గమ నింప జాలకపోతిని సుమండీ—

శర:—సరే—ఇప్పటికంతగా ముఖ్యాంశములగు విషయము లెవ్వియును దెలియుటలేదు. ఇంక నేబోయెదను. అవసరమైనచో మరల దమదర్శనము జేతును. తమకాయాసము గల్పించితి. క్షమిం పుడు. ఇంక నాకు సెలవా

శర,—మంచిదే.

అనిచెప్పి, మేడదిగి క్రిందకుబోవుచు మఱలవెనుదిరిగి వచ్చి "అయ్యా! చిన్నమనవి. తమ స్నేహితుడని చెప్పినారే, తమకును,

మాలతికిని సంధానకర్త—ఆతడెవరో చెప్పగలరా?

నారా:—చిత్రము. ఆతనినివాస మిప్పుడీయూర నట. ఈతఁడు కాతడు కొంతకాలము రంగమునందును, మఱికొంతకాలము ఆగ్రామ్మున్నగు స్థలములందును నుండెడివాడట. వానికేమియును పని లేదు. బొందిలీ (బుందేలు) బ్రాహ్మణుఁడు కాబోలును. ఆతనికిని నాకును గతమైదారు మాసములనుండి మాత్రమే పరిచయము. ఆతనిగూర్చి యంతగా నేనెరుంగను.

శర:—సరే—ఇంకను విశేషములు గావలసిన మరల వచ్చి యడిగెదను లెండు. సెలవు. అని మేఁడదిగి తనదారింబోయెను—



౧౫

"అయ్యో! ఎంత నిర్భాగ్యుడను? ఈనాటికి నాపాపపుజరిత్ర యంతయు నీరీతిగ వెలిబెట్టుకొనవలసి వచ్చెనుగదా? పాపము! నా నోటనె యీదారుణ కథనంతయు విని, నాదుర్గ యెంతగ విలపించు చున్నదో గదా. నన్నుగూర్చి యీమె యింకేమి దలపోయునో? ఎన్ని సార్లు నామనోవ్యాధికి గతమేమని యీమె తరచి, తరచి యడిగినను జెప్పలేక పోతినె. ఛీ! పాడు కథ నేమని జెప్పుకొందును? ఇప్పుడు దలచుకొన్నకొలది నాప్రవర్తన మెంతయు [illegible] నాకే [illegible] బడుచున్నది గదా? [illegible] నీతిని లేమనుకొందును [illegible]! ఇక నెవ్వరును లేరు—ఇంక నీవు రావచ్చును"

అనుచు నారాయణచంద్ [illegible], [illegible] బిలచెను. పాపమాతడు యింతవరకును తననాథుని [illegible] [illegible] [illegible], [illegible] [illegible] నిలచియున్నతరి, [illegible] బిలుపువిని, [illegible] [illegible] [illegible] బిలువ బడియెను.

నారాయణరావు చంద్రాము కరము దన కరంబున గీలించి, చేరువకుండీసి, ప్రక్కనొక ఆసనముపై గూర్చునబెట్టుకొనెను. ఆసాధ్వి యట్టె దలవంచుకొని, పొరలివచ్చు దుఃఖము నశ్రురూపంబున వెలిబుచ్చుచుండెను. చంద్రాము చుబుకంబు కరంబున బుడుకుచు. "దుర్గా! ఏల దుఃఖించుచున్నావు? ఈనాచిత్ర చరిత్రియంతయు నీకు గడు క్రూరముగా దోచుచున్నది? నీవు నన్ను నీచునిగా జూచుచున్నావా? చెప్పుము-దుర్గా! చెప్పుము. నీమనోభావమేమో జెప్పిన నాసంతాపముపశమించునేమో? మాట్లాడకట్లు జూచెదవేమి? దుర్గా!

దుర్గా:—ప్రాణపతీ! నిన్నే దైవముగానమ్మి, నిత్యమును నీపాదసేవలచే తృప్తినొందు నీదీనురాలు మిమ్ము నీచునిగా నెంచునంతటి పాపురాలుగాను. మీరుదారపురుషులు. తమచరిత్రయందలి లోపాలోపముల లెక్కించుపాటి సామర్థ్యము నాకడలేదు. ఉన్నను యద్దాని నేనెన్నడును దుర్వినియోగము జేయుదాననుగాను. కాని, ప్రియా! తమరింత కాలమును నీసంగతి నేల మరుగుపరచవలయును? నాతో జెప్పిన నేనెన్నడైనను మీయాజ్ఞ కెదురాడ సాహసింతునా? అయ్యో! తమరింతటి కష్టముల నొందుచుంటిరని నేనెరింగిన, దమ కష్టముల నేనుమాత్రము సహచరిని గాకుందునా? అధమమాధము రాలగు నొకానొక స్త్రీకై తమరొకరియింటికిబోవు టెందులకు? తమ యిచ్చవచ్చిన కాంత నెందులనే దెచ్చియుంచుకొనిన మహదానందముతో, మీయిరువురి పాదసేవల నొనర్చుచు సౌఖ్యప్రదముగ నీజీవముల మీపాదకమలముకడ నర్పింతునే. అంతకన్న నాకు గావలసినదేమున్నది? మీసౌఖ్యమే నాసౌఖ్యము. మీయానందమే నాయానందము? అట్టిచో మాకీ నిగూఢవర్తనమేల? అయ్యో! తలచుకొన్న నాగుండెలవియుచున్నవి. మీయిరోగమునకానాతియే కారణమనుకొందును. నాథా! ఇప్పుడైనను జెప్పరా?

నారా:—దుర్గా! ఏమని జెప్పుదును? నారోగమేమో నేనే యింతవరకెరుంగను. దానికి గారణమేమో యంతకన్న నెరుంగను.

ఏమి జెప్పుచుందువు? దుర్గా! నాయీరోగము మాత్రము శారీరకము గాదనియు, మానసికమేయనియు నేనే దొలుతనుండియు నెరుగుదును. ఆనాడు నీవదేవిధమున నడుగుచున్నపుడు మాత్రము నేను సహింపజాలకపోతిని. దుర్గా! ఇపుడింతగ విలపించిన నేమి లాభము. జరిగినదేమో జరిగిపోయినది. ఈనారహస్యవర్తనమే నా నాకొంప కింతవరకును దెచ్చినది. దీననింక నేనిముప్పువాటిల్లునోయని మిక్కిలి భీతిపొడముచున్నది. అయ్యో! ఈనారాక్షసచారిత్రమంతయు తుదకు పోలీసువారినోళ్ళంబడి ముందుముందు న్యాయస్థానములకు గూడ బోనున్నదిగదా. అపుడీనీచుని లోకమెంతయు నిందించునోగదా. లోక నిందలకు పాల్పడిన వానిముఖముగాంచి భార్యమాత్రమెట్లు సహింప నోర్చును? కోపమువలదు. దుర్గా! నే నిజస్థితినే జెప్పుచున్నాను.

దుర్గ:— అయ్యయ్యో! అట్లనుటదగదు. మీరెట్టివారైనను నాకు మాత్రము దైవసమానులే. మీగుణాగుణములతో నాకుపని లేదు. నాపని విమర్శింప నాకించుకంతయు నధికారములేదు, నేనెల్లపుడును మిమ్ములనే నాయిలువేల్పుగనమ్మి, మీపాదయుగళి సేవించుట దక్క, నాకితరచింతలు గలుగనేరవు. అయినను లోకమెన్నటికిని సత్యమును నిరూపింపజాలదు. పలువిధములు నోటికివచ్చినట్లెల్లను బలుకు లోకుల మాటల నేనెన్నడును గణింపబోను. సర్వావస్థల యందును మీరే నాపంచప్రాణములును. నాథా! మీరాతని కొరిగించిన దంతయును వాస్తవమే యని నమ్మెదను. ఇట్టిహత్యజరుగునని నైనను మీరెరుంగరు కదా?

నారా:—అయ్యో! అంతమాత్రము నన్ను విశ్వసింపవా? వానియెదుట జెప్పిన వన్నియును ప్రమాణవచనములు. అందొక్కయక్కరమైనను పొల్లుగాదు.

దుర్గ:—మిమ్ములను విశ్వసింపకగాదు నేనడుగుట. అయ్యో! పోలీసువారన్న నాప్రాణములట్టే యెగిరిపోవును. వారెంతవారైనను సాహసులు, వారు దలచుకొన్న నిముసములో నందిని బందిగను,

పండిని పండిగను, జేయుచాలుదురు. అందుచే భయపడుచున్నాను. అట్టియున నీహత్య నొనర్చిన వారెవరైయుందురని మీ యభిప్రాయము?—

నాథా:—ఏమో? నేనెట్లు జెప్పగలను! ఆమె కెవరైనను విరోధులున్నారేమో? నేనెరుగను. భోగమువారిని ప్రేమించువారెందరో, వారిని ద్వేషించువారుగూడ నంతకెక్కువగనుందురు. ఒకవేళ నామె యీవరకున్న రంగమున నామె కెవ్వరైనను శత్రువులుండిరేమో? వారి భయముచేతనే యామె యీయూరువిడచి యుండు లేచియుండవచ్చును.

దుర్గ:—అయియుండవచ్చును. కాని మీమాటలంబవిన్న కొలఁదిని నాకు భయమధికమగుచున్నది ఒకవేళ నామెను వలచిన యేరైనను నామె మోసగించి, వారి ధనమపహరించి, యీయూరామె చేరియున్నచో, వారువలచిన యామెను మీరు జేపట్టి యున్నారని యెంచి, దుర్మార్గులు మీపై గూడ బగసాధింప గడంగుదురేమో? అయ్యో! ఆసంగతి దలచుకొన్న నాప్రాణము లెగిరిపోవుచున్నవి.

అని యామె యేడువసాగెను.

నాథా:—దుర్గా! నీవిట్లు బేలవై యేల వృథాగా శోకింతువు? కాదు. వారు నన్నే జంపదలచుకొన్నచో నానాడే నన్నుగూడ చదముట్టించియుందురు. నేను వారియింటికుందేటివలెనే వారి చేజిక్కియుంటినిగదా. అట్టిచో వారు నాజోలికిబోక, నాకు మత్తుమందు మాత్రమొసంగి, యామెను గడతేర్చి యుండిరేగాని, నన్నేమియు జేయలేదు. దీనింబట్టిచూడ వారి యుద్దేశ్యమే వేఱుగ గానవచ్చుచున్నది. ఎందులకో వారామెనేజంప దలచుకొని, యిట్లుగావించిరి,

దుర్గా:—మీరు జెప్పినదిగూడ సత్యముగనే గానవచ్చుచున్నది. దైవము మనల రక్షించుటజేతనే వారికి మనపై బగలేదు. అందుచే బ్రతికిపోతిమి. లేకున్న నాథా! నన్నేయేట ద్రోయదలంచుకొంటిరి?— (అని పాపమామె మిగుల శోకింపుచుండెను.)

నారా:—వెఱ్ఱిదానా! గడచిన దానికై యేల నిట్లు దుఃఖింతువు. అబలవుగాన నీమనమెంత మృదులతరంబుగానున్నది. ఇంతకు నేనెంత పాపాత్ముఁడ నైనను, నెంత ద్రోహుఁడ నైనను, నీవు నన్ను మన్నించి నాయెడ నాదరము జూపుచునే యున్నావు.

అనుచు నతఁడామెను జేరదీసి, బిగ్గ కౌగిటం జేర్చి, కపోలముల దిగజారు కన్నీటిబిందువుల దనయుత్తరీయంబున దుడుచుచు, బుజ్జగింపసాగెను. ఆహా! వధూవరుల ప్రణయమెంతటి దుఃఖాగ్ని నైనను నిముసములో జల్లార్ప జాలును గదా?



౬.

కలకత్తాలో పెద్దపెద్ద వీధులని పేరుబొందిన వానిలో నెల్ల రాణీగల్లియొకటి. ఇందుసామాన్య పేదలకుటీరము మొదలు, ధనికుల మేడంతుస్తుల భవనములుగూడగలవు, సాధారణపరికరములన్నియు దొరకు బజారు లనేకములిందుగలవు. కాని యీగల్లిని మాత్రము సర్వసాధారణముగ పేదలు దుర్మార్గులు, దుంటరులు, జారిణిలును మాత్రమే యెక్కువగ నివసింతురు. అందుచేతనె సామాన్యముగ మానాభిమానములకై యాసజెందు వారెవ్వరును నిందు గాపుర ముండరు. కులటలగు జారిణిలు వసించుతావున నెంతటిద్రోహముల కైనను కొదువయుండదు. దానంజేసి యీగల్లీ నెల్లపుడును బోలీసు వారలకు పని గలుగుచునె యుండును.

పైగల్లీలోని డెబ్బదియైదవ నెంబరు గృహము చిరకాలము నుండియు నెవ్వరు వసింపకుంట చేపాడువడి, వాసమునకయోగ్యముగా నుండెను. పైన నెల్లపుడును బీగములు వేయబడియే యుండును. ఎవ్వరికి గాని దాని నద్దెకిచ్చుట కాగృహ యజమానుల కిష్టమున్నట్లు తోచదు. అయినచో వారా గేహమింతటి యపరిశుభ్రముగా నుంచి యుండరు—

రాత్రి తొలియామముదాటి రెండవ యామము జరుగుచున్నది. పట్టణమంతయు నిద్రాముద్రితమై నిశ్శబ్దత వహించియున్నది. ఇన్ని దినంబుల వరకెవ్వరును లేరనుకొన్న పైగృహంబున, నేడవైనన్న దీపపు వెలుతురు గవాక్షములగుండా గానవచ్చుచున్నది. ఇందెవ్వరు నివసించుచున్నారో తెలియదు. ఎవ్వరైనగాపురమున్నచో నింటిని పరిశుభ్రపరచుకొనియుండరా? కాని యట్లుగానరాదే. ఎప్పటివలెనే సర్వాసహ్యముగా గానవచ్చుచున్నదిగాని శుభ్రపరచినజాడలేమియు గనబడవు. మఱియు వీధిద్వారముగూడ బీగమున బంధింపబడియే యున్నదే. అట్లయిన లోనజనులెట్లు బ్రవేశింపగలిగిరి? ఈదీపమెట్లు వెలిగింపబడినది? ఇయ్యది భూతముల కృత్యమా? లేక నీఱులు జొచ్చుటకింకొక మార్గమేదైనను గలదా? ఎవ్వరెరుంగుదురు?

ఇది మూడంతస్తులసౌధము. క్రిందియంతస్తునముందు చక్కని కచేరిచావడియు దానికిరుప్రక్కల రెండుగదులును, యందొకగదిలో పైయంతస్తునకేగ సోపానపంక్తియుగలవు. దీని వెనుకనె విశాలమగు భోజనశాలయు, దానినంటి పాకశాలయుగలవు, కాని, యిపుడవి యన్నియు బాడువడి, యెలుకలకును, గబ్బిలములకును నివాసస్థానములై యున్నవి. పైయంతస్తున విశాలములగు రెండు పడకగదులును గలవు. ఇక మూడవయంతస్తున విశాలమగు నొక హాలును, దాని చుట్టు రెండుగదులు, వరాండాలును గలవు. ఇవిగూడ నట్లే పాడువడి యున్నవి—

నేడేలనో యిందు వెలుంగు గానవచ్చుచున్నది. రెండవ యంతస్తున నొక పడకగదిలో నొక కాంతామణి, విచారపూరిత హృదయముతో, నొక చాపపై శయనించియున్నది. కాని యామె మేలుకొని జూచుచునేయున్నది. ఆమెముఖము గళావిహీనమై రాహుగ్రస్త చంద్రబింబమువలెనే గానవచ్చుచున్నది. ఆమె వామకరంబు దలకుపధానంబుగా జేర్చి, దక్షిణహస్తము గటిప్రదేశమున వ్రేలవైచి యున్నది. చూడజూడ నామె నయనపద్మము లస్రుపూరితములైనట్లు

గానవచ్చుచున్నవి. ఒకటి రెండశ్రుకణంబులామె నునుజెక్కిలిపైబడి, దీపపుగాంతి నాణిముత్తెములవలె మెరయుచు, నామె ముఖమునకొక [illegible]తసోయగంబు గూర్చుచున్నవి. మాటిమాటికామె యస్సురనుచు వేడినిట్టూర్పులవిడచుచు, మృగాలోదరంబును వసివాడజేయుచుండెను ఆమె దీనాననయై ద్వారమువంక నట్టే జూచుచున్నపుడు భీతహరిణే క్షణయను పదమును సార్థకపరచుచుండెను.

అట్టియెడ మెల్లగ దలుపు దెరచుకొని యొక భీకరాకారుడా గది బ్రవేసించెను. ఆతని నల్లని దేహచ్ఛాయయు, కరకు మీసములును, నిడుదగడ్డమును, మిడిగ్రుడ్లును, వంకరపండ్లును, నాతని భీకరాకారమునకు వన్నెబెట్టుచు, మఱింతభయప్రదునిగానొనర్చుచుండెను. ఆతని యారూపము గాంచినంతనె పాపమాయబల పులిని గాంచు లేడి వడువున దిగ్గనలేచి గోడచేరువకుంబోయి, మాన్పడి నిలచి యట్టె యాతనిదెస జూడసాగెను. అంతనాపురుషుడల్లనల్లన లోనంజొచ్చి, కవాటమెప్పటియట్ల దగ్గరజేర్చి, "అబ్బా"యని పెద్దయావులింతలదీయుచు, భీకరగహ్వర సదృశాననాంతర కరాళదంష్ట్రాళిని జూపుచు, జూపరులకు వెరపుగొలుపుచుండెను. అంత మెల్లగ నచటి చాపపై నాసీనుడై, భయపడుచుంటివా? పిల్లా? ననుజూచి భయమొంద నవసరములేదులే. ఇలాకూర్చో. నిన్నుకొన్నిసంగతులడుగవలెను"యని యామె నుపవసింపుమనుగతి దనకరంబున సన్నజేసెను. పాపమీతని చేష్టలగాంచుకొలదిని యామె కడుంగడు భయమందసాగెను. అయ్యో! ఈతడెవ్వడు? ఈతడేనా నన్నీరీతి బాధించితెచ్చినది? అట్లయిన నాతో నీతని కేమిపని? నాప్రాణముల దీయుటకు గాదుకదా? అట్లయిన దానికింత కాలమేల? ఎప్పుడో నింతకు బూర్వమే యాపని నతిసులభతరంబుగా జేయజాలియుండును. అది యీతని భావముగాదు, మరినాతో నీతనికేమిపని? నాతో గొంత మాటలాడవలయునట, నన్నొకవేళ మోహించి, తెచ్చినక్రూరాత్ముడా యీతడు? అబ్బా! నాదేహము గంపమెత్తుచున్నదే. ఈతని నేనెన్న

డెరుంగనే. అట్టి నాపై నితనికింతటి పగయేల? ఈపాపు గృహమున నన్నిరీతి బంధించియుంచ గారణమేమి? బంధనమునను నన్ను నాకెట్టిలోపమును జేయక సంరక్షింపనేల? మోహమే యీతని వాంఛయా? దైవమా! ఈరాక్షసుని ముఖముజూచుకొలదిని నా ప్రాణము లెగిరి పోవుచున్నవే. ఇపుడీతడు నన్నేమి చేయునోకదా? నాకిట నెవ్వరుదిక్కు" యనుచు నీగతి నామె పలుభంగుల మదింపం బోయుచు, గోడకుజేర్పగిలబడి యట్లునిలచియుండెను. ఆమె నిలబ యున్నను, యామె కన్నీళ్ళుమాత్రము నిలునక సోనలై పారుచు మనోదుఃఖమును వెలిబుచ్చుచుండెను. ఆమూర్తి భవించినశోకావరాన తారంగాంచిన నెట్టి కఱకుగుండెకైనను జాలిగలుగకుండునా? అదృశ్య ముంగాంచిన, గుండెనీరుగాని మానవు డెవ్వడుండును? ఉన్నచో నాతడు మానవ మాతృుడుగాడు, పభీకరవన్యమృగమో, యే రాక్షసుండో యైయుండనోపును.

ఆహా! ఈపాషాణహృదయుడుగూడ నాజాతిలోని వాడేనా? ఆతడామెంగాంచి వికవికనగుచు, నిడుదగడ్డము సవరించుకొనుచున్నాడు గాని, జాలివహించి నట్లులగపడదే. వారిప్రసంగ మెట్లుండునో వినుము గాక.

పురు:—తరుణీ! నీయవస్థ జూడ పాపము నాకు చాల జాలి కలుగుచున్నది. కాని యేమిచేయను? విధివశమున నిన్నితీరున గష్ట పెట్టవలసి వచ్చినది. అయినను నీవు నీహితకోటియందే యుంటివని గ్రహింపుము. నీకేమియు భయములేదు. మాకు నీవలనగొంతకార్య ముండుటజేసి నిన్నిస్థితియందుంపవలసివచ్చినది. కాన, మాకువలయు సంగతులెఱిగింతువేని నీవు నిర్భయముగా, తోడనే విముక్తురాల వగుదువు. రమ్మిట గూర్చుండి నాయడుగు వానికెల్ల నీవెఱింగిన యుత్తరములిమ్ము.

"ఈతడెవడో? నేనెన్నడునుజూచి యెరుంగను. నావలన నీతని కేమిపని? ఈతడడుగుఅంశము లెవ్వియో? ఒకవేళ వానిని నేనెరుం

గకనో, మఱియేయితర కారణమునో బకులీయకున్న నీత డేమి సేయునోగదా? అయ్యో! దైవమా! తుదకెట్టిస్థితిని దెచ్చిపెట్టితివి? కామమ్మమిసేయుదును? నాకిందెవ్వరును దిక్కులేరుగదా—"యని యామె దలవాల్చి యోచింపుచుండెను.

పురు:—ఏమట్లాలోచించుచున్నావు? నీవేమియు భయపడ నవసరములేదని యీవఱకే జెప్పియుంటినిగదా. కాన భయముడిగి నామాటలకు బకులీయ సమ్మతింపుము. నీ వెఱుంగనివిషయములడుగ బోను. తుట్టతుదకామె ధైర్యమెట్లో యవలంబించి "అయ్యా! తమ రెవ్వరో నే నెరుంగను నన్నేల నీరీతి హింసించెదరు? దాన మీకు ఫలమేమి?

పురు:—అయ్యో! ఫలము లేకేమి? ప్రతిఫలము లేక నెవ్వ రెట్టి కార్యమైన నొనరింపరని నీ వెరుంగవా? నేనడుగు వానికెల్ల సమాధాన మిచ్చిన పిదప ఫలితమేమో, గార్యమేమో నీవే యెరుంగ గలవు.

స్త్రీ:—అయ్యా! తొలుత మీరెవ్వరో జెప్పుడు. పిమ్మట మీకువలయు నంశముల నివేదింతును.

పురు:—అయ్యయో! ఇంతకాలమెరుగనే యెరుంగవా? నేను నీకాపురనే. ఈవఱకనేకసారులు నీవు నన్ను జూచియే యుంటివి. అపుడే సర్వమును మఱచియుంటివా? ఎంత టక్కరివి?

స్త్రీ:—అయ్యా! ఏలనట్లు నను పరిభవింతురు. ప్రమాణ పూర్వకముగా మిమ్మెన్నడును నేజూచి యెరుంగను. అసత్యముగాదు మిమ్మెరింగియే యున్నచో దెలిసినవారుగదాయని ధైర్యమున నుండ కుందునా? ఇంతభయమేల? నేనుగల్లనైననుమిమ్ముగాంచియుండ లేదు.

పురు:—అబద్ధము. శుద్ధఅబద్ధము. నీవు ననుబూర్తిగా నెరు గుదువు. అది నే నెరుంగుదును. ఒకవేళ నీగడ్డముచే బోల్చికొన జాల కున్నావేమోగాని, పోనిమ్మికనైనను దెలిసికొంటివా? ఇపుడెవ్వరనో చెప్పగలవా?

అనుచు నాతఁడొకచేత నాకృత్రిమమగు నిడుదగడ్డమును బట్టి యూడబెరికెను. తోడనే యామాయగడ్డమూడివచ్చెను. స్త్రీ యాతని మోమునుగాంచి పోల్చికొనఁగానే "ఔరా! నీవా?" యనుచు మరల దెలివిదప్పి యట్లే వెనుకకు బడిపోవుచుండెను. కనుమూసి తెరచు నంతలో నామె వెనుక గోడపై బడి, తల శతధాభిన్నమైపోవలసినదే, కాని, యంతలోనే పురుషుఁడామెదరి జేరి, పదిలముగ కరయుగంబున నామెను గట్టిగబట్టి, చేరువనున్న చాపపై బఱవైచి, శీతలజలంబుల నామెమోము దడుపుచుండెను-



౭

అంతటను గొంతవరకును శీతలజలంబుల మోముపై జల్లుచు, పలుగతుల శైత్యోపచారంబులొనరించినపిదప, నామెకించుక దెలివి గలిగెను. అంతనాతఁడొక వీవనగొని హాయిగవిసరసాగెను. మంద ములమానిలమ్మున నించుక సేదదేరి, మెల్లన లేచి, గోడచేరువనూర్చుని యామె దృష్టి నాతనిముఖమండలమున నిలిపి, కొంతవడి యట్లె యాతనిజూచెను. అంత నాపూరుషుఁడు వీవనగ్రింద బార వైచి, నగుచు ఇప్పుడైనను బోల్చికొంటివా? నేనెవ్వరో దెలిసినదా? ఆ! నిశ్చయ ముగా నన్నెరుంగుదువు. అట్టయిన నేవచ్చిన కార్యముగూడ సర్వ మీపాటికే దెలిసికొనియుందువు. నే జెప్ప నేల? ఇకనైననుభయముడిగి ప్రత్యుత్తరమిత్తువా?" యనుచు వికటహాసమొనర్చుచుండెను.

స్త్రీ:—ఔరా! పాపీ! నీకు నేనేమి హాని జేసియుంటినిరా? నాకడ నీకుగల రాచకార్యమేమిరా? అంతమాత్రమునకై నన్నిరీతి నర్ధరాత్రమున బాధించి, యీపాడుగృహంబున బడవైచి, ప్రాణంబుల దీయ నెంచితివా? నీద్రోహములెంత మితిమీరుచున్నవి? దైవమే లోకమున నున్నచో, యీనీపాపకార్యములకెన్నడైనను దగిన ప్రతి

కన్నీరు గాల్వలుగట్ట విలపించుట దక్క మాఱుబల్క లేను. ఆస్థితిలో నామె దీనానన మెట్టిదియును గాంచినను, యూతని ధైర్యమంతయు, సూర్యరశ్మిచే, మంచువలె విగాలితమై జనకమానసు. కాని యూపురుషుడు మాత్రము చలింపక చిరునగవు నగుచునే యుండెను. అతడు పాషాణుడా?

కొంతవడి కామె చేలాంచలమున గన్నుల దుడిచికొనుచు, "అయ్యా! నన్నేల నిరీతి గష్టపెట్టెదవు. ఆరత్నపేటిక యెట్టిదో కలనైనను గాంచియుండలేదు. దానిచరిత్ర నేనిసుమంతయు నెఱుంగను. ఆంతధనము మాయింట నెన్నడును నేజూచియుండలేదు. నిశ్చయముగ నారాపేటిక నెవ్వరికిచ్చియుండిరో గూడ నే నెఱుంగను. ఎవ్వరైనను దాచపెట్టిన దోచుకొనను. దానినాతడింతవరకును వ్యయమొనర్పక భద్రముగనే గాపాడుచుండెను. అంతటి ధనమును వెచ్చించుపాటి సామర్థ్యమాతనికుండదు. అట్టి వ్యయమొనర్చిన సనదికి మాకీపదు నెంతో మార్పుగలిగియుండును, గాని, యట్టిదేదియును సంభవించి యుండలేదు. కొన్ని యత్యావశ్యక కార్యములపై మేమాయూరు విడచి రావలసి వచ్చినదిగాని వేఱుకాదు. శ్రీమధుసూదనబాబుగారే యా పేటిక నెవ్వరికొసంగయుండిరో నాకది కాతడే స్వయముగబోయి గాంచినచోగి బుచ్చుకొనవచ్చునుగాని యందులకైననిష్కారణముగ నన్నికతి గష్టపెట్టనేల? ఊరపాస్యవర్తనమేల? కాన నన్ను దయయుంచి విడిచిపుచ్చుము. నాప్రార్థనమంగీకరింపుము. ఆపేటికతో నాకెట్టి సంబంధమును లేదు. ఒకవేళ నింకొకవ్యక్తికిమాఱుగనన్ను భావింపుచుంటివేమో? బాగుగ యోచింపుము.

పురు:— బాగుగనే జెప్పితివి. పరమేశ్వరుడింకను నాదృష్టికి మాంద్యము గలిగింపలేదు. నాకున్మాదము ఘటింపలేదు. నేనింకను జాగ్రదావస్థలోనేయుంటిని. కనులువిచ్చి జూచుచుంటిని నీవెవ్వరో నాకుబాగుగ దెలియును. నాకెవ్వరితో కార్యమున్నదియో నే నెఱుంగుదును. ఏల నీవృథాలాపములు? నీతండ్రియే న్యాయానువర్తనైన

చో. నా వలకెనుక లేక అర్ధరాత్రిమున నాపురము విడువ వలసిన యగత్యమే లేదు. ధనాపహరణము దక్క నాతనికింకొక యపకార్యమేమియు లేదని నే రూఢిగ జెప్పగలను. ఏమైన నేమి? నీవిప్పుడు బలికినట్లుగనే యాతనికడ కేగి పేటిక నడిగి జూచెదము. సవ్యముగా నది మాచే జిక్కినసరియే, లేకున్న దను వాతనిసంగతి నాలోచింప వచ్చును. అంతవఱకుమాత్రము నీవిందే యుండవలయును, మామూలుగ నీకెల్ల సదుపాయములును జరుగుచునే యుండును.

స్త్రీ:— అయ్యో! నన్నేల నిష్కారణముగా జాగ జూచుచున్నావు. దాన నీకు లాభమిసుమంతయును లేదు. నీపాదములపై బడి మ్రొక్కుచున్నాను. నన్ను రక్షింపుము.



౮

అనుచు నామె యాతని పదములం బట్టబోయెను. పురుషుండు నిశ్చలముగా "ఛీ! ఛీ! ఏల నన్ను నిర్బంధించెదవు? నిన్నిపుడు విడుచుటకెంతమాత్రమును వీలులేదు. నాకార్యము సఫలమగుదనుక నీవిందే యుండవలయును" యనుచు నాతడు బిరబిరగ వాటముం దెరచి వెడలిపోయెను. పాపమా యబల యచ్చటచాపపై బడిపోయెను. మరల నామె వెలివిగోని జూచుసరికి కరుణాకాంతులు లోకమంతయు గ్రమ్ముకొనుట గవాక్ష మార్గమున గానవయ్యెను.

కాళీఘట్టము నందున్న జీవనాథుని మేడ యిప్పుడు మిక్కిలి పాడువడి కళావిహీనమై యుండెను. పుష్పోద్యానములన్నియు సంరక్షణ లేమి యెండి, కంటకావృతములై పోయెను. సౌధరామణీయకత యంతయును మాలతితోనే నశించిపోయెను, పై యంతస్తు తలుపులైన నెవ్వరును దీయువారు లేక బందికొక్కులకును, గబ్బిలపు మందలకును నావాసములై, గదులన్నియు దుర్గంధపూరితములై, దయ్యముల

కొంపనైపోయెను. కించిన్మాత్రము శల్యావశిష్టుఁడగు జీవనాథుని వృద్ధసేవకుఁడగు రామోజీతో నివసించుచుండెను. అతఁడు తన పడక గదిలోని కుక్కిమంచమును విడచి, యొకనాఁడైనను నీవల నడుగిడి యుండలేదు. వృద్ధరామోజీ యాతని సపర్యలన్నియు జేయుచుండెను. ఆతఁడే జీవనాథునకు బుత్రుఁడును, బుత్రికయు, సేవకుఁడును, సంరక్షకుఁడునైయుండెను. ఆతఁడు మిక్కిలి యాతని నాదరించువారెవ్వరును నాయూర లేరు. వృద్ధురాలగు పాలియారయను నామెమాత్రము, నిత్యమును రెండుపూటల నింత కలియో గంజియో గాచి, యాతనికింత బెట్టి దానింతతిని వెడలిపోవుచుండెను. ఆమె జీవనాథుఁడీయూరికి వచ్చిన నాఁటఁగోలె వారింట పాటకత్తెయై దినముల వెళ్ళబుచ్చుచుండెను. అత్యధికతరవిశ్వాసులగు నీయిరువురు సేవకులును దక్క జీవనాథుని గృహాంతరంగమున సంచరించు వారెవ్వరును లేరు. మాలతి మృతినొందిన దినము నుండియు వారెన్నఁడును సౌధోపరిభాగమునకు బోయి యుండలేదు. నిత్యమును నర్ధరాత్రమున మాలతియు, నామె ప్రియుఁడును శ్యామలయుఁగలసి, పరిహాసమాడుకొనుచున్నట్లును, కిలకిల నవ్వుచున్నట్లును నొకొక్కవేళ సన్నసన్నముగ బాటలు బాడుచున్నట్లును, వృద్ధరామోజీ వినుచు, నుదయమున వంటయింటి యరుగుమీద గూర్చుండి, తంబాకుసేవించుచు, పచనకార్యనిమగ్నయగు పాలియారకీ చిత్రకథల నన్నిటిని దన యనుభవానుసారముగ వెల్లడించియు గను జిత్రముగ వర్ణించి చెప్పుచుండును. అప్పుడామె "అన్నను. నాయనా! బలవంతాన చచ్చినోళ్లు దయ్యాలుగాక మరేమవుతారు బాబూ? నువ్వు మాత్రం జాగ్రత్తగానుండు బాబూ. ఎప్పుడైనను మేడ మీఁదికి నెక్కపోకుమీ. దయ్యాలకి రాత్రేమిటి పగలేమిటి? ఎల్లప్పుడూ అవి అక్కడనె తిరుగుతూ ఉంటాయి. జాగ్రత బాబా!" యనుచు నాతనికిబుద్ధిగరపుచుండును. అందుచే వారెవ్వరూ నెన్నఁడైనా మేడ నెట్టిదో యెఱుంగరు. అక్కడిసామానులన్నియు నెక్కడివక్కడనే బడి బూజులబట్టియుండెను. ఇంక వానితో నెవరికేమిపని?

జీవనాథుఁడు గడు వృద్ధుఁడు. పాపమాతనికి యేకపుత్రిక గలిగించిన నాలుగేండ్ల నాతఁడు మంచముబట్టి, శల్యావశిష్టుఁడై, చావలేక బ్రతికియున్నాఁడు. ఆతనికి మనోవ్యాధి యంకురించినది. మనోవ్యాధికి నగ్గాత్రమను మందు లేదు. అది మానవునితోడనె యుదయించు దీర్ఘవ్యాధి. అది యంకురించిన మానవుఁడెన్నటికిని వృద్ధిలోనికి రాజాలఁడు. ఆరోగమొలపునను నరుని వినాశనమునే గోరుచుండును. ఆస్థాన నొక్కొకవేళ మన్మథాకారస్తు గూడ సంభవించుటగలదు.

ఇప్పుడు జీవనాథుఁడా స్థితిలోనేయున్నాఁడు. ఆతఁడున్మాదునికన్న నధమునిగానున్నాఁడు. ప్రియసేవకుని సహితమాతఁడు బంధించెఁడు. ఎప్పుడును నానుక్కుమంచము దిగి యీవల నడుగుపెట్టఁడు, మనోవ్యాధిగల వారికిని నెవ్వనితోకని సహవాసమిచ్చగింపఁడు. ఆ స్త్రీమాత్రుని గూడ నెవ్వరితోడ మాటలాడఁడు. వృద్ధదాసిదక్క యీతనికి నెవ్వరునుగారు. ఆతనితో నైన నిడిమంచి, యిది చెప్పియని మొన్న ... పలుకైన నాతఁడు బలుకఁడు. ఎల్లప్పుడు మంచమునైబడి, పిచ్చివాని వలెనె చేతివ్రేళ్ళు లెక్కించుచు, దనలో దానేమో బలుకుకొనుచుండును. ఆమాటలెవ్వను మనకర్థములుగావు. అవి యొకదాని నొకటి పొందిక, గడు నసందర్భములుగానుండును. ఒక్కొకదినమంతయు నాతఁడు బిగ్గరగా యేడ్చుచునేయుండును. కాని మచ్చునకొక్క యశ్రుకణమైన నాతని కనుగొలకులరాదు. అతని కన్నీరువఱ కెన్నియో దినములకు బూర్వమే యింకిపోయినవి. మఱియొకపరి నాతఁడు సందర్భరహితముగ నదేపనిగ నెవ్వగనవ్వనవ్వుచుండును. ఇది యాతనికి సహజమైపోయినది. అతని గాలచక్రమిట్లే తిరిగిపోవుచున్నది, దాని నడ్డగొను వారెవ్వరు?

నేఁడుదయమునుండియు నాతఁడు బాలుంబితరశోకప్రవాహమున బడి, కొట్టుకొనిపోవుచుండెను. ఒక్కొకసారి నాతఁడు బిగ్గరగ బాలుని గతి యేడ్చుచుండెను. కరయుగమున్న శిరము మోదుకొనుచుండెను. అతని నోదార్చువారెవ్వరు? అతని రోదనధ్వనులతో నాము దిర

బాబా? రాత్రి! యిలా నాప్రక్కనుగూర్చుండు— ఎంతపుణ్యదినం
యిది? రా, బాబూ! నాప్రక్కరా" యనుచు నాతనికిస్థలము జూపి,
మొక్కవెసగునవ్వునవ్వెను. ఏలొకో నాపూరుషునికనుల నవిరళాశ్రు
ధారలు గారుచుండెను. అతడు జీవనాథుని ప్రక్కలాలింపని వాని
వలె నిశ్చేష్టుడై నిలచియుండెను.

అంత జీవనాథుడాతని హస్తముబట్టి చేరువకు దీసికొనవచ్చి,
తానుబోయిమరల మంచముపై గూలబడెను. రామోహన్ యాతని బట్టి
కొనెనుగాని లేకున్న నాపాపుడు నాతడు గోడపైబడి, కఠినా ఘాత
ముబొంద దిగవలసిన వాడే.

ఇంతలో నాగంతకుడు కలికిబడి, తన స్థితికొంతయు లక్షించి,
కనుల చేలాంచలమున దుడికొనుచు నాతనిప్రక్క నాసీనుడై, ఎందు
లకు పిలిపించితిరి బాబూ?"యని మెల్లగననెను.

శివ:—"చెప్పుచున్నాను బాబూ! కొంచెమోపికబట్టుము.
చాలా ఆయాసముగానున్నది. చెప్పవలసిన కధ చాలాయున్నది.
రామోహన్! పితిద్వారము బాధించితిగదూ? రా. నీవు కూడా ఇచ్చట
గూర్చొ బాబా! నీదర్శనమిచ్చుటగుట నాకెంతయో బలముచేకూర్చి
నది. నేను పుణ్యాత్ముడను తండ్రీ! నీకు నాయందెంతో ప్రేమ. ఏమి
చేయుదు? దైవఘటన. అయ్యో! కూతురా!"యని రెండుచేతుల
ముఖముగప్పుకొని యబలవలె నాతడు వలవలనేడువసాగెను.

ఆగంతకుడాతని వీపున జేయివైచి "ఏల నేడ్చెదరు బాబా!
అయినదేమో యైపోయినది. మనచిత్తముగాదు. నన్ను పిలచిన
కార్యమేమో జెప్పుడు అని బలికెను.

ఈయాగంతకుడీవరకు మనకు కృతపరిచయుడగు నారాయణ
చంద్. ఈతని చరిత్రపాఠకులీవరకెరింగిన వారే. ఈతడిట్లు బలుక
గనే జీవనాథుడు "బాబా! తొందరగా నున్నదా? అప్పుడు చీకటి
గ్రమ్ముచున్నది. నీవు మరలనింటికి బోవలయునుగదా? సవిలాసముగా
నాయింట నీవు రాత్రింబవళ్లు నిలచుకాలము గతించిపోయెను గదా!

అవ్వను. మన పెన్నిధి పోయి చాలాకాలమైనది. బాబా! మరల మన కట్టి దినములు రావుగదా, రావు-రావు. ఎట్లు వచ్చును? అయ్యో! వృథాప్రసంగములతో నిన్ను శ్రమబెట్టుచున్నాను గదా. వినుము. సావధానుడవై వినుము. నాయందు నీకు కోపమా?" అని దీనముగా బలికెను.

నారా:— లేదు బాబూ, కోపమెందులకు? చెప్పుము అంతయు జాగ్రత్తగనే వినుచున్నాను.

అంత నామె యొక వేడినిట్టూర్పు బుచ్చి "అయ్యో. ఈతనికి దినదినమునకు పిచ్చ యెక్కువై పోవుచున్నది. మాటలొకదాని కొకటి సందర్భపడవుగదా. పాపమెంతవాని కెట్టిగతి పట్టినది" యనుచు తలవాల్చి విచారింపసాగెను.

జీవనాథుడు మరల నొకసారి బిగ్గరగ నవ్వుచు "దగ్గరగా రా బాబా! నిన్నుజూడ నాతనయను జూచినట్లున్నది. నాదగ్గరగా వచ్చి నేచెప్పునది బాగుగా వినుము" యనియెను.

నారాయణచంద్రు డట్లు గావింప నావృద్ధుడిట్టుల జెప్పసాగెను.



బాబా! అతి నిగూఢతరమగు నొకానొక సంగతి నిపుడు నీకు నేను జెప్పుచున్నాను, గాన శ్రద్ధతో వినవలయునుజుమీ. నాప్రాణమగు నేక పుత్రిక మాలతి యకారణ మృత్యువాత బడెనుగదా. ఇంక నాకెందుజూచినను దిక్కెవ్వరును లేరు. నాస్థితియంతయు నీవు జూచుచునేయుంటివిగదా, ఇట్టి స్థితిలో నేనెంతయో కాలము జీవింప జాలనని దృఢముగా జెప్పగలను. నాకు గల వ్యాధియెట్టిదో నేనెరుంగనుగాని, నాశరీరముమాత్రము అనుదినమును గృశించి పోవుచున్నది. ఇంక నేనెన్నియో దినములు ప్రాణములతో నుండజాలనన్న

యధైర్యము నేడు నాకు గలిగినది.

నారా:—అయ్యో! యువతుల యధైర్యమనవలయును? చచ్చిన వారితో మనము జావగలమా? ఏదో దగిన వైద్యకొకని జూచి యౌషధము సేవించినచో వీరు దప్పక జీవించగలరు. దుఃఖముచేనిట్లు కృశించి యున్నారుగాని వేఱుగాదు.

శివ:—నిశ్చయమే తండ్రీ! నాదుఃఖమే నన్నింతకు దెచ్చినది. ఇంక నాదుఃఖసముద్రమునకు పారము లేదు. దీనికొక మృత్యువు దక్క వేఱొకమందు లేదు. ఏల వృథాప్రయాసము? ధనమునకు నాకు గొఱంత లేదు. నే జెప్పునదేమన? ఇంక నే జీవించుట దుర్లభము. కాన యున్నయొకటిసి ఇంక నీవే దిక్కనినమ్మి నాచరిత్రగొంత నీతో జెప్పదలంచుకొన్నాను వినుము. నేనియూరు జేరక బూర్వము రంగమున నుండెడి వాడను. అచట నాతనయ నొక కోటీశ్వరుని యొక్క పుత్రున కరగి ప్రాణముగాభావించి సౌఖ్యవారాశి నోలలాడించెను. ఆతనుగూడ నివతానె రత్నపరీక్షకుడనై యుంటిని. మాయదృష్టంబున మేమే యూరనున్నను, మాకు దమ్ముగోలు కుశేసుల యాత్రీలుంబులే దొరకు చున్నవి. కాని, యింతలోనే మానాటకము ముగియుచున్నది. తండ్రీ! చెప్పిన నమ్మనవో లేదో గాని నావద్ద నిప్పుడు బదివేల రూప్యములు గొక్కయున్నది. తెలిసినంత చరాస్తినంతయు నీయందులో నీవు జూచియే యున్నావు. ఇప్పుడు నేజెప్పునదేమన. నా యావదాస్తియు నింతనుండి యు నిరవంబుగా భావించుచున్నాను నీవు దానిం జేకొని నాయొక్క కోర్కెలం దీర్ప వలయును.

ఈవృద్ధుడు, రామమోహను నన్ను నమ్మినబంటు—నాయొక్క కష్టకాలమున నైతము నను వీడక, సకలవిధంబుల సంరక్షించిన వాడు. ఇంత నమ్మకముగల సేవకునింక వేయిజన్మములకైనను నే సంపాదింపజాలను. కాన నీవు నాయాస్తిలోని రెండువేల రూప్యము లితనికిచ్చి, యూన జీవము ననుభవింప మనుము. నేడు బోయినను, వృద్ధుడగు నాతని కష్టసుఖము లప్పటప్పట నీవరయుచుండ వలెనుజుమీ.

ఇంక పాలియూ యున్నది. ఆమె కూడ నాకు నచ్చిన సేవకురాలు. అమాయకురాలు. ఆమెకీలోకమున "నా" యనదగు వారెవ్వరును లేరు. అందుచేతనే భగవంతుడు మమ్మెల్లర నొక్కచో జేర్చెను. కాన యామె కొక వేయిరూప్యములిమ్ము. ఏమందువు, రామోజీ? నీకు సంతసమేనా?

రామోజీ ప్రత్యుత్తరమీయలేదు. ఆతని మనోభిప్రాయము లెల్ల నాతని యశ్రుజలంబులే వెలిబుచ్చుచున్నవి. ఇంతకన్న నాతడు జెప్పనదేమి? మరల జీవనాథుడిట్లు జెప్పదొడంగెను.

"తండ్రీ! ఇంకొక్కటి జెప్పుచున్నాను. ఏకాలమునందైన, నాయనుంగు గూతుతో సమానురాలగు శ్యామల నీకు గానవచ్చినచో యామెను జేరదీసి, నాయాస్తిలోనిదైయెదు వేల రూప్యములామెకిమ్ము. ఆమె జననియే నన్నుంబెంచి, పెద్దవానింజేసినది. నాటి నుండియు వారి సంతతి మాయింటనే గాచికొనియున్నారు. ఈశ్యామల కొక యన్న యుండెడివాడు. పాపమాతడు బసితనమందే యకాలమృత్యువాతంబడిపోయినాడు. ఈశ్యామల మాయింటనేబుట్టి, నాతనయతో సమముగ బెరిగినది. వయసున గొంచెము పెద్దదైనను, యిరువురు నక్కచెలియండ్రాయనిలోకము వెరగందుచుండెడిది. కాన నాకోర్కె ముఖ్యముగా దీర్పవలయుజుమీ.

ఇంక మిగిలినది రెండు లేల రూప్యములును జరాస్తియును గలవు. దీనిలోనే మృతినొందు తరి నీపాపికి నుచిత క్రియల జేయుతరి నెంతవెచ్చించిన న్యాయముగనుండునో, యంతయే వెచ్చింపుము.

ఇంకొకటి జేయగోరుచున్నాను. దుర్మార్గులెవ్వరో నాయనంగు బిడ్డను వధించి, శ్యామలనుహరించుకొని పోయియున్నారు, కాన నీవు తుదకు లక్షరూప్యముల వెచ్చించిననుసరే నేసంతసింతునుగాని యాహంతకుల బట్టి రూపుమాపి, యింకను జీవించియున్నచో శ్యామల నేరీతినైనను వెదకితెచ్చి. యామెకారొక్కమందింపుము! ఏమీ! లక్షరూప్యములైనను సరే వెచ్చింపుమంటినని నీవు నీలో నవ్వకొను

చున్నావా? వెఱ్ఱివాడా! ఇంకను జెప్పవలసిన ముఖ్య విషయము నీతో జెప్పనే లేను.”

అనుచు నాతడు బిగ్గరగా నొక్క-వెడగునవ్వునవ్వెను. నారాయణచంద్రునకదేమియు బోధపడక నట్లేజూచుచుండెను. విచారమనమున మునింగియున్న వృద్ధరామోజీగూడ దలనెత్తి చూడసాగెను. అంత జీవనాధుడిట్లు జెప్ప మొదలిడెను.

“బాబా! ఇంతవరకు నే జెప్పు విషయములంత విలువ గలవి గావు కాని, యికనే జెప్పునది మాత్రము నీవు ముఖ్యముగ గమనింపవలయును జుమీ. ఇదిగో విను. రంగమునుండి నే నీయూరు జేరుట కొక ముఖ్యకారణముగలదు. అచట నాతనయుకొక రత్నవర్తకుని సూనునితో స్నేహముగలవడెనని జెప్పియుంటినిగదా. ఆతడాతనితండ్రి మరణాసన్న సమయమున దాదాపునాల్గులక్షల రూప్యములకిమ్మత్తు గల యొకరత్నపేటికను దెచ్చి భద్రముగా గాపాడుమని నాచేతి కొసంగియున్నవాడు. అట్లు దాచనిచ్చుటకొక కారణముగలదు. ఆతని జనకుడు, దన భార్యగతించుటంజేసి, యొకయుపపత్నిని బరిగ్రహించి యున్నాడు. ఆకాంతకు పాలకమాతయు, నిజసోదరుడునుమాత్రము గలరు. ఆకధయంతయు నిపుడేలగాని, వారుగడుంగడు క్రూరులు. ఎపుడాతని జనకుడు గతింప సంసిద్ధుడైయుండెనో నాటరేయి వారెల్ల రాతనియింట జేరిరి. దాన వారెట్టిద్రోహంబుదలంతురో యని బెగడొంది, యాతడమూల్యమగు రత్నపేటికను మాత్రము గూఢముగ నా జేతనిడి, భద్రముగ గాపాడుమని జెప్పిపోయెను. కానిదురితాత్ముడ [illegible] నేనా పేటికంగాంచి నాతనే దాని నెట్లయిన నపహరింప నెంచి, [illegible]ము నాటిరేయి నెవ్వరి కెరుక లేకుండ రంగమువిడచి సరాసరినీయూర జేరికొంటిని. ఇట్టి పాపశీలుడనగు నాకు దగు ప్రతిఫలము బరమేశ్వరుడనుగ్రహించియేయున్నాడు. న్యాయాన్యాయములు భగవంతుని [illegible] విచారింపబడకపోవనియు, మనుజులు వారి వారి పాపపుణ్యంబుల సాఫల్యమగువరకీలోకమున యనుభవింపక దప్పదనియు

ఇపుడు నాకు బాగుగ బుద్ధి వచ్చినది. ఏమి వచ్చిన నేమి లాభము. ఆయిన దేదో యైపోయినది. నారత్నము నశించిపోయినది. నాబంగరుకొండ భ్రష్టమైపోయినది. చెయిగాలిన పిదప నాకుల బట్టుకొనుట వలన నుపయోగ మేమి? చెప్పవలసిన దేమన—ఇపుడా పేటిక మేడపై నా శయనాగారమున నినుప మందసమున క్రిందియరలో నున్నది. బాబా! నీవు దానిని బరిగ్రహింపుము. నీజనకుడు గూడ రత్నవర్తకుడగుట దాన మీకెంతయో లాభము గలుగవచ్చును. కాని, యాస్తి నంతయు నీవు జేర్చి హంతకుల జాడ లరయుటకు వెచ్చించినది పోను, మిగత ధనముతో నాయనుంగు మాలతిపేర నొక ధర్మశాలను నిర్మింపుము, ఇది నాముఖ్యప్రార్థన. బాగుగ వింటివా?"

అనుచు నాతడింక నూర్చుడజాలక మంచముపైబడి రోదన మొనరింపసాగెను.

ఆశ్చర్యభయసంభ్రమములు లోనుక్కుమ్మడిగ్రమ్ముకొన, నారాయణచందురును, వృద్ధరామోజీయు నాయుడు సలిపి పల్కులాలింపసాగిరి. వినుకొలదిని వారు నిశ్చేష్టులై, శిలాప్రతిములవలె గదలక యటే నిలచిపోయిరి. కొంతవరకును జీవనాథుడట్లేయుండి, పిదప లేచి కూర్చుని "బాబా! నామాటలన్నియు ముఖ్యముగా వింటివా? అవి యొక్కటైనను మఱువగూడదు సుమా. నాయనా! నాయీకడసారి కోర్కెలన్నియు దీర్పగల యోగ్యుడవీవొక్కడవే యని యెంచి, యీ యంత్యకాలంబున నీకై వార్త నంపియుంటిని. ఇపుడు నాతలపై భారమంతయు దిగిపోయినట్లైనది. ఇక నేస్వేచ్ఛగ మరణింపగలను. నీవు శీఘ్రముగా నా పేటికను, ధనమ్మును జేకొనుము. ఇవిగో నా రొండిన దాళములున్నవి. రామోజీ! మెల్లగ ననుబట్టి మేడపైకి గొనిపొమ్ము. త్వరపడుమని యాతడు దిగ్గన లేచి నిలువంబోవ, రామోజీ యాతని బదిలముగ బట్టి, చందురుసహాయమున నాతని సౌధోపరిభాగమున కీడ్చికొనిపోయెను.

ఇపుడా మేడ యెట్టిస్థితి యందున్నది. పాఠకు లెఱుగ

యున్నారు. మాలతి గతించిన పిదప దాని దేరిజూచిన వారెవ్వరును లేకుంటచే, జూచుటకా స్థలమంతయు ధూళిధూసరితమై, కటునసహ్యముగా నుండెను. వారెల్లో మాలతి శయనాగారముం దెరచి లోన బ్రవేశింపగనే, జీవనాథున కెక్కుడలేని దుఃఖ మొక్కసారిగ బొరలి వచ్చెను. అతడట్లుకూలబడి, కరయుగమున్నన దలదాచి కొనుచు, భోరున నేడువజొచ్చెను. అతని దీనావస్థ గాంచి రామోజీ సహితము గనుల భాష్పకణంబులు బొరలింపకయుండ నేరకపోయెను. ఇంక నారాయణచందుమాట జెప్పనక్కరయే లేదు.

ఒకానొక సమయమున నేమందిరము తన సర్వసౌఖ్యానందములకాలవాలమై, భూలోకస్వర్గమువలె వెలింగిపోయెనో, యాగృహమిపుడు, మెలుకకన్నములతోడను, గబ్బిలపుబెంటలతోడను నిండి, జూచుటకుశ్మశానవాటికం దలపించుచుండెను. ఏశయ్యాంజేరి, తానును మాలతియు నొకప్పుడత్యధికానంద కేళిసల్లాపంబున సీమలాడిరో, యాశయ్య యిపుడు మలినాచ్ఛాదితమై, యట్టె జూచువారిగుండెలవియజేయుచుండెను. ఒకవంక మాలతి సంగీతపరికరము, లింకొకవెప నొకప్పుడామె యత్యాదరమునకు బాల్పడిన ముద్దులయద్దంపు బిరువయు నిపుడెల్ల ధూళిధూసరితములై బడియుండెను. ఇవియన్నియు దిలకించుచున్న నారాయణచందు గన్నీటినాపుకొనజాలక, వెక్కి వెక్కి బాలునివలె నేడువదొడంగెను. పాపము! వారి నోదార్చు వారెవ్వరు?

కొంతవడి కెల్లో చందు దుఃఖోపశమనము గావించికొని "బాబా! ఏలనిట్లు వాపోయెదరు? ఎంత దుఃఖించినను మరల మాలతి మన కంటబడదు కదా. ఇంక నేడ్చిన బ్రయోజనమేమి? ధైర్యము వహించి కర్తవ్యమాలోచింపు" మన నెట్టకేలకు జీవనాథుడు తెప్పిరిలి "చందూ! ఇవిగో దాళపుజెవులు ఇనుపమందస మీవెరుంగుదువు కదా పదిలముగ దానిందెరచి, యాపేటికం గైకొనుము. అందే లోన నొక చిన్నయరలో గొన్ని బంగారు మోడినాణెములును, గొన్ని కాగితము

లును గలసి రమారమి బదివేల చిల్లరయున్నవి. వానింగూడ నైగోను ము. చీకట్లు గ్రమ్ముచున్నవి. త్వరపడుమన నాతడట్లు మందసముం దెరచి, జీవనాధుడు జెప్పిన యావదాస్తిని రత్నపేటికతో సహా తీసికొనెను. అదిగాంచుచున్న జీవనాధుడు మరల దుఃఖమాపుకొన జాలక గొంతివడి విలపించెను.

రామోజీ "అయ్యో! తండ్రీ! నందునంటి సంసార మీనాటికి భస్మమైపోయినదా! నాయాశాసౌధము గాధముగ గూలిపోయినదా" యని భోరున నేడ్చెను. తరువాత వారిద్దరును, నెప్పటియట్ల బీగముల బంధించి, సౌధావరోహణ మొనర్చి, జీవనాధుని పడకటింటికేగిరి. అంత నారాయణచందు "బాబా! ఇక నాకనుజ్ఞ దయచేయ వేడు చున్నాను. చీకట్లు గ్రమ్మినవి. మీరు ధైర్యముగా నుండుడు. రేపటి నుండియు నే వైద్యునౌషధము సేవింపుడు. అందులకుదగిన ప్రయత్నమే నొనరింతును. ఉదయముననే యొక వైద్యునంపగలను. మీరు నిశ్చింతగా నుండుడు. మీ యీధనమంతయు నావద్ద భద్రముగా గాపాడ గలను. మీరు త్వరలో స్వస్థతజెందగలరు. అపుడు మీకు మరల మీ పైకమంతయు నప్పగింపగలవాడను. ఇక నేబోయివచ్చెదను." యని బలికెను!

జీవ:—చందూ! నీకింక నీపిచ్చిభ్రమ వదలినేలేదా? నాకెట్టి మందులునువలదు. ఇంక నాయాయువు దినములపై నున్నదని నే నిశ్చయముగా జెప్పగలను. కాన, నాయారోగ్యమునకై నీవెట్టి ప్రయత్నములును జేయవలదు. నేనెంత త్వరితముగాబోయి నాచిన్ని మాలతిని గలిసికొందునా యని, యనుక్షణమెదురు జూచుచున్నాను. ఇంక నీవీధనమును మరల నాకీయనక్కరలేదు. కాని నాకడసారి ప్రార్థనలమాత్రము నెరవేర్ప మరలమరల బ్రార్థించుచున్నాను. నీవు మాత్రము బ్రతిదినమొకపరివచ్చి ననుజూచి పోవుచుండవలయును. ఎపుడీప్రాణవాయువు లెగిరిపోవునో జెప్పజాలను. ఇంక నాకెవ్వరును దిక్కులేరు. రామోజీకడువృద్ధుడు. ఆతడొక్కడును నేమియుజేయ

జాలము అంతగా నత్యావసరమగునేని, నేనే నీకు వ్రాసంపగలను. ఇక నీవుబోయిరమ్ము. నాతీరికసమయమున దినమొకసారి ననుజూచి పోవుట మరవవలదుసుమా. జాగ్రత్త. చీకటులలముకొనుచున్నవి. ధనముతో బోవుచున్నావు. భద్రము ఏదేని యొక గుఱ్ఱపు బండిని మాట్లాడికొనిపొమ్ము. నాపలుకులు మాత్రము మరువకుము. ఆనొప్పి అంతయు నేటితో దీరిపోయినదా?

అనుచు నాతడు గొబ్బున సెలవొసంగెను.

నారాయణుఁ డాతని నూరడించి, యనుజ్ఞగొని వెడలిపోయెను రామేశుఁ డాతని ద్వారమువఱకును సాగనంపి, కవాట మొక్కటి యొగ్గ బంధించి లోనికిఁ బోయెను.



౧౧

కాళీఘాట్ నందే నార్తత్రాణపరాయణయు, భక్తసంరక్షణియు మహాశక్తియునగు కాళికాలయమున్నది. దాననే యాఘట్టమున కా నామము గలిగినది. ఈయాలయము దాటి కొంచెము దూరమేగిన నట నాల్గుబాటలు కలియుచున్నవి. ఇందొక బస్తీదొడ్డి యందొక మూల జట్కాలును, నెద్దుబండ్లును, మోటారులును, మున్నగు వాహనములనేకము లెల్లవేళలను నిలచి, బాటసారుల ప్రయాణములకై సిద్ధములైయుండును. ఇందెల్లపుడును బండివారల కేకలతోడను, పథికుల బేరములతోడను వృషభముల రంకెలతోడను, హయహేషలతోడను భూనభోంతరాళములు మారుమ్రోగుచుండును. బండివాండ్రకొక నిముసమైనను దీరికలేక, బట్టణమున నేదేనియొక భాగమునకు బ్రయాణము గలుగుచునేయుండును. కలకత్తానుబోలు మహాపట్టణమున బాటసారులకు గొదువయేమి?

చీకట్లు దశదిశలను గ్రమ్మి యొకగంటకావచ్చినది. పురపాలిక శుద్ధసంఘము (మునిసిపల్) వారి ధర్మకార్యదీక్ష నెల్ల నందందుగల గృహదీపపుగాంతులు జాటుచున్నవి. బహుళపక్షము. ఆకసంబున తారకాగణంబు మినుకుమినుకని వెలుంగుచు, తను శక్తి కొలది తమోసంఘమును దరుముచునే యుండెను. అయినను దనకుటిల కుంతల జాలము దశదిశలను బర్వ, భయంకర వదనగహ్వరము తెరచికొని నొక్కుమ్మడిని గాలచక్రమును గబళించుచున్న యా తమోదేవత, కుటిలమార్గావరోధమును జేయు మింటి చుక్కల గనియున నెంత?

అట్టిరేయి గాసికాలయముదాటి బహిద్వారమున నొకయువకుడు జేతనొక చిన్నమూటబట్టి "బండీ—బండీ"యని రెండు కేకలు వేసెను. తోడనే పదుగురు—నలుగురు బండివాండ్రతనిజుట్టుజేరి, చేతిమూటను నొకడూడదీసికొనుచు, నాతని జేతులబట్టి కొందరీడ్చికొని పోవుచు, భుజమున నుత్తరీయము నొకడులాగుచు, "బాబూ! నాబండి—నాబండి బాబూ—నాగుఱ్ఱ మెలాగుందో చిత్తగించండి. వినుసుకు రైలు గాడీని మించిపోవాలె—అగ్గిరాం జట్కా బాబూ నాది—లోపల పరుపు వేసుంది, దయచెయ్యండి బాబూ—ఈబండి నెక్కండిస్వామీ! కిరాయి తమ చిత్తం, నేనేమి యడుగను" యనుచు నీకీడిగ బెట్టుగోలజేయ సాగిరి. వారిని వారించువారెవ్వరు? పాపమాతడెవరి బండి నెక్క గలడు? ఒకనివద్ద దనమూటయున్నది. ఇంకొకనివద్ద దనయుత్తరీయ మున్నది. కొందరాతనిబట్టి యీడ్చికొని పోవుచుండిరి. ఎవ్వరి శకట మాతడారోహింపవలయును?

ఇంతలో మోటారులు నిలచు స్థలమునుండి యొకపూరుషు డరుదెంచి "సాబ్! ఎక్కడికి దయచేస్తారు తమరు? మోటారు సిద్ధముగా నున్నది. ఈచీకటిలో సర్దంటుగాపోవుటయుత్తమము. సెలవా? కారు స్టార్టుచేస్తాను. దయచెయ్యండి"యని సవినయముగాబల్కెను.

ఆతని మేనించుక చామనచాయ గలది. నిడివిపాటిగాత్రము.

మహామ్మదీయవస్త్రముల నాతడుధరించియుండెను. రమారమి యైదడుగుల చిన్నరిపొడవుండును. చూచుటకు ముప్పదియేండ్ల యువకునివలె నుండెను. తలపై జుక్కచుక్కల పెద్దసరిగంచుపాగా యొదీక పుగాం తీంగ్ మిల మిల మెరయుచుండెను. చూచినతోడనే యాతడొక మహామ్మదీయ యువకుడని తెలియకమానదు.

ఆ బాటసారి జీవనాథుని సర్వసంపదను గ్రహియించి, చిన్న మూటగాగట్టుకొని, గృహమునకు మరలిపోవుచున్న నారాయణచంద్ర, ఎక్కేలకాకెప్లోర్ బాడివాని చేతిలోనుండి దనమూట దీసికొని, మోటారున బెట్టించి, శ్వేతముగ దాసింగాని తేర నడిపించెను. ఆమహామ్మదీయుడుగూడ నాతని యానతి ప్రకారము దనవ్వగ, గాలి చెప్పులు టకటకధ్వనిచేయుచుండ, బిరబిరదనతనటకునకు నెక్కి "భాయీ! సాహెబ్ చేస్." యని యందున్న నిక్కోననితో చెప్పెను. బహుశః నాతడితని భాగస్వామియో లేక, నితని క్రింద బనిచేయువాడో గావచ్చును.

ఆతడు గాంభీర్యముగా "మొహిందీన్! వచ్చినావా? చూచితివా నే జెప్పిన క్రమమైనది. అన్నిటి నేనుగడుజాగ్రత్తగ నెరిపి నిన్ను గాడు చెమ్మరిని జెప్పితిని. చూచితివా? ఎంతపదిలముగ, నెంత సులువుగా బనిచేసెదనో? నీయిష్టము. ఇంకొకమాట. త్వరగా రా" యని పిలచి, యొవ్వరును వినకుండ నేమో యాతని చెవిలో రహస్యముగా చెప్పి "జల్దీ—జల్దీ చేస్" యనెను.

తోడనే యాతడున్నంగాపింప నిదుర్పుగు నందాసీనుడై నారాయణచంద్రుని డెక్కా బండిని దెచ్చి నిలిపి "సాహేబ్! దయచేయుడు. ఎక్కడికి బోవలెనని యాజ్ఞ" యని ప్రశ్నించెను.

నారా:— బోబజారునకు బోవలెను. రత్నవర్తకులు-గోపాల్ చంద్ గారి మేడకు బాడుగ నేమి దీసికొనియెదవు?

ఒకడు:— బాడుగ కేమున్నది సాహెబ్? తమవంటి ప్రభువుల కడనా మా బేరములు? ఏలినవారి చిత్తానుసారమే నడచుకొందుము. లోనకు దయచెయ్యండి— భాయీ! చూస్తావే? మొగలాగ బాబూ

ఈ మూటనందుకొని గాడి తలుపు తెరువు"మని యను చోదకుడుబల్కి రెండవవాడట్లే గావించెను.

చందు బండిలో వెనుక భాగమున నాసీనుడై "మూటను నిలాతే డ్రైవర్. ఇక్కడపెట్టకు తగను. ఎంత శీఘ్రముగా బోనిచ్చెదవో? యినాం లభించునులే" యనుచు దనమూట దీసికొని ప్రక్కనిడికొనియెను. డ్రైవరు "చిత్తము ప్రభూ! అయిదునిముసములలో తమరిని యింటికడ దింపుతాను. చూడండి తమదయమాత్రం ఉండాలి. అంతే" యని బండిని విడచిపెట్టెను.

కారు వాయువేగమున వీథులదాటిపోవుచుండెను. క్రమముగా వడి వంతెతలా జేరెను. ఇది దాటినచో బోబజారునకుబోవును. కాని చోద్యము—మోటారు బోబజారుకోడునబోవుట లేదు. లోన గూర్చుండి యున్న నారాయణచందుగూడ దానిం గమనింపలేదు. అతడు దక్షిణ కరంబుపై శిరంబు నానుకొని, యేమో దీర్ఘాలోచనలో మునిగి యుండెను—

కారు వాయువేగ మనోవేగముల బోవుచు వంతెతలా నతిక్రమించి, ధర్మహాట్ వీధిగుండాబోయి, బాడన్ వీధినిగూడ దాటి, క్రమ క్రమంబుగా జోడా బాగా జేరెను. కాని యిప్పటికైన నా డ్రైవరు, తాను బోబజారునకేగుకోడ్ దాటివచ్చితినని గుర్తించియుండ లేదు. కారణ మేమి? ఆతడా పట్టణములగల మార్గము తెలియంగడా? లేక నెరింగియే నేదైన ద్రోహముందలంచి యట్లు మార్గముందప్పించెనా? ఒకవేళ నాతడు మరచినను, యాతని సహాధ్యాయుడగు నా రెండవవానికి నైన నెరుంగడా? లేక నీయిరువురుగూడ ద్రోహులేనా? ఏమో? యెట్లు దెలియును?

మోటారు క్రమక్రమంబుగా గంగయొడ్డున గల విశాలమగు బాటవెంట బోవుచుండెను. బాటకుకుడివైపుననే ముల్లోక పావనియగు గంగానది ప్రవహించుచుండెను. ఆనదినుద్భవించు భీకరతరంగమాలిక లొడ్డున రాయుచు నిశ్శబ్దముగానున్న యాస్థలమున భయం

కరనాదము లుప్పతిల జేయుచుండెను.

నారాయణ చంకీధ్వనినాలించి, త్రిశ్శిపసి యూపక్కకు జూచెను తోడనే యూతడొక్క యుదుటున నాసనమునుండి లేచి "డ్రైయివర్, డ్రైయివర్! కారునాపుము, మనము మార్గముదప్పిపోయితిమి. ఎంత పని చేసితివి? ఇంతమాత్రము జూడవలదా? ఏమిఫలబడదా?, ఇంకను బండి నాపవేల?" యని నాతనివీపుపైగట్టిగ దట్టసాగెను. కాని యా డ్రైయివరాతని పల్కులవినిపించుకొనినట్లు లేదు. బండి మాగుట లేదు. అది యెప్పటియట్లె మహావేగమున బోవుచునే యుండెను.

'ఏమి? వీరి వీపున దట్టుచున్నను నాపల్కుల వినాలించునట్లు లేదు? మీరుదప్పత్రాగియొడలెఱుంగక మైకముననుంటిరా? గాక వీరికి మైన ద్రోహముందలపెట్టిరా? అయ్యో! దైవమా! వీరెవ్వరో. నన్నెం దుల గొంపోవుచుండిరో గదా? ఇంక నాకు దిక్కెవ్వరు? ఇం కెవ్వరి సహాయము నపేక్షింతును? వీరేమి చేయనుంటిరో గదా? డ్రైవర్! డ్రైవర్! జీ డ్రైవర్ ఏమీ వీరెంతపిలచినను బలుకరేమి? నిశ్చయముగా వీరేదో ద్రోహముదలంచిరనుట నిక్కము. ఎంత ద్రాగి యున్నను నొడలిపై గొట్టుచున్నను దేనిమాడనైన జూడకుందురా? అయ్యో! అయ్యో! ఇంక నాగతి యేమి" యనుచు నాతడు బోనున జిక్కుపడిన వ్యాఘ్రమువలె, లేచుచు, కూర్చొనుచు, బిగ్గరగా వారింబిలచుచు, బరి పరి విధంబుల యాతననుభవించుచుండెను. కాని యాతని మాట వినువారెవ్వరు? ఆతని యాజ్ఞల బాలించు వారెవ్వరు?

మోటారింకను మనోవేగమున బోవుచునేయున్నది. తుదకాతడు ఓర్వజాలక "బాబూ! డ్రైవర్ సాబ్! నీకు నమస్కారము తండ్రీ! కారు నాపవేమి? మనము దారితప్పిపోతి"మనుచు నాతడు వెనుక భాగమునుండి యంత్రమున్నకడకొక్కయుదుటున లంఘించి డ్రైవర్ చేతనున్న చక్రమును గట్టిగబట్టి, యటునిటు ద్రిప్పసాగెను.

ఇదియంతయు జూచుచున్న మొహిదీనాతని నడుముదన రెండు చేతుల గట్టిగబట్టి వెనుకకొక్క త్రోపుద్రోసెను. క్షణములో రెండవ

వాడుగూడ గలసి పోయెనని నమ్మఁగూలనైచెను.

మోటారు శీఘ్రముగ వచ్చినగతి బోవుచుండెను. ఎవ్వరును దానిని సరియైనమార్గమున బెట్టలేదు. చందును లేవనీయకుండ నిరువురును గట్టిగనదిమిపట్టియుండిరి. అంత దొలుతటి మహమ్మదీయ యువకుడు జేబునుండి యొక పిస్తోలునుదీసి చందుముఖమున కెదురుగ నిలిపి "ప్రభువుగారూ! జాగ్రత. మీబలము జూప బ్రయత్నింతురేమో? ఒక్కయంగుళమైనను లేవ జూచినచో నిదిగో–యీగుండు తోడనే మీవక్షము దూసికొనిపోవుట నిశ్చయము. కదలకుడు" అనుచు పిస్తోలు నాతని వక్షమున నిలిపియుంచెను. రెండవవాడాతని తలబట్టి వెనుకకు ద్రొక్కుచుండెను.

కారే గతిని బోవుచున్నదో యెవ్వరును గమనింప లేదు. కనుల మూసి తెరచునంతలో నది యెదురుగనున్న నొక స్తంభమును ఢీకొని. యంత్రము పగిలి, వాయువేగమున వెనుకకు వంగి రోడ్డునుండి క్రిందకు కొంచెము మూడునాలుగు బారలెరలి గంగాప్రవాహమున బడిపోయెను.



౧౧

మోటారుకారుయొక్క వెనుకచెంపచక్రములును నీటమునిగి యుండెను. ముందరిభాగముమాత్రము మొగ్గున నేలవాలుగ బడియుండెను. యంత్రమాగిపోయెను. బండిరోడ్డుపైనుండి దొరలుసమయమున యందరు ముప్వురును చెరియొక ప్రక్కకు బడిపోయిరి. చందునకు శిరమున గఠినతరశిలాఘాతమొంపు దగులుటంజేసి యాతడచ్చట నేలపై బడి తెలివిదప్పిపోయెను. ద్రయివరగు నామహమ్మదీయుడొకప్రక్కకు గంతువైచినను యాతనికిగూడ గాలువిరుగకపోలేదు. మోహినిను

నీశరీరమునిండియున్నది. కాన గొంతవరకు శ్రమదీర్చుకొనిపదిలముగా నిల్లుచేరుకొనుము" అని హెచ్చరించెను. పాపమాతడట్లే కొంతవరకు మాట్లాడక బడియుండెను. అప్పటికాతనికి పూర్తిగా మెలకువ గలిగినది. కడచిన పరిస్థితులన్నియు నొక్కసారి నాతని మనమున మెరసిపోయినవి. భీతిచే నాతని యొడలెల్లను వడక సాగినది. కొంతవడి కాతడెట్లో ధైర్యమూని లేచి కూర్చుని "అయ్యలారా! మీరెవరు, నన్నేల నిరీతి నకారణముగా బాధపెట్టుచున్నారు. నేనెన్నడునుమిమ్మెరుంగనే. మీకేనేమియుపకార మొనర్చినాడను. దయయుంచి నాధనము నాకొసంగి ననువిడచిపెట్టుడు. మీపాదములకు మ్రొక్కుచున్నాను" నని కడుదీనముగా మొరవెట్టెను. కానియాతని మొరలాలించువారెవ్వరు? ద్వయివరాతనింజేరి "అయ్యా! మేమెవ్వరో దెలిసికొనుట నీకనవసరము. ఒకవేళ కాదని దెలియ బ్రయత్నింతువేని నీజన్మమున దెలిసికొనజాలవు. ఇపుడు నీవు గొనిపోవుచున్న యీధనము మాయది. ఇది కొంతకాలమొక ద్రోహి చేతంబడి మమ్మెడబాసి యున్నది. మరల మాపూర్వ పుణ్యవశమున మాచే జిక్కినది. కాననిన్ను హింసించుట గాని వధించుటగాని మాయుద్దేశమెంతమాత్రమునుగాదు. ఇకమమ్మెగూర్చి నీవెరుంగవలసినదింతియే నీవు నీయిచ్చవచ్చినరీతిని బోవచ్చును. ఒకవేళ బోలీసువారింజేరి మమ్ము గనుగొన బ్రయత్నింపకుందువు గాక మీరేగతిదప మొనర్చినను మరల మమ్ముగాంచుట దుర్లభము. అది మీతరముగానిపని. ఇక నీవు పోవచ్చును. మొహిదీన్! చూచెద వేల?" బండిని యొద్దన జేర్చి యందేమిపోయినదో శీఘ్రముగా జూడవలయును. ఆలసించిన ముప్పు దప్పదు. రమ్ము"ని వారిరువురుంజేరి, శక్తిగొలదిగ బ్రయత్నించి బండిని యొద్దన జేర్చిరి. పిమ్మట దీపమువెలిగించి, దాని సహాయమున యంత్రమున నేమి పడియెనో గనిపెట్టి తోడనే మరమ్మత్తు జేసిరి. టూమున ఢీకొనినను యంత్రమంతగా జెడకుండుటంజేసి వారంతలోనే యించుమించుగా దానిని యథారూపమునకు దేగలిగిరి. ఇం

గకును దైవము వారిపట్ల ననుకూలత జూపుచుండెను. ఇక మనుజమాత్రులెవ్వరడ్డగొనగలరు?

అంత నిరువురుంజేరి బహుళతర ప్రయాసమున నాశకటమును ద్రోసికొని గోష్ఠజేర్చిరి. యంత్రము యథారీతిగ బనిచేయుచుంటచే వారి యానందము మిన్నుముట్టెను. ఇంక క్షణములో మోటారు గదలుటకు సిద్ధముగనుండెను.

అంత నారాయణాచార్యులు కాళ్ళీడ్చుకొనుచు, బండికడజేరి, “అయ్యలారా! ఆధనము నాయదిగాదు. దయయుంచి నన్ను రక్షింపుడు. మీకు వలసిన ధనము నేనీయగలను. నాతోడ నిపుడే దయచేయుడు. ఆపేటికను మాత్రము నాకిచ్చివేయుడు. ఏలయిట్టియన్యాయమున కొడిగట్టికొనెదరు? రక్షింపుడు. మ్రొక్కుచుంటి” ననుచు బిగ్గరగా నేడువసాగెను.

మోహి:—“వెఱ్ఱివాడా! ఆధనము నీదికాదనుసంగతి మేమే జెప్పియుంటిమి. అదిమాది గనుకనే మేము దీసికొనసాహసించితిమి. అందన్యాయమేమున్నది? బాగు— బాగు. బండివిడువుము. లేకున్న నది కదలినచో మరలనీవు పడుట నిశ్చయము. ఈసారి మృత్యువు దప్పదు. పొమ్ము”

అనుచు నాతని చేయిబట్టి దూరముగా ద్రోసివైచెను. పాపమిక నాతడేమి చేయగలడు. ఆతని కష్టపడువారెవ్వరు? చుట్టుప్రక్కల నెందైనను జనసంచారములేదే. ఆనిర్జనప్రదేశమున నాతని దీనాలాపము లాలించువారెవ్వరు?

బండికదలిపోయినది. క్రమముగానది వాయువేగమున బరువులిడుచు దృష్టిపథమునుదాటి పోయినది.

చంద్రశ్లో నేలపైగూలబడిపోయెను. ఆతనికీప్రపంచమంతయు దిరిగిపోవుచున్నట్లున్నది. శిరమునుండి రక్తధార లవిచ్ఛిన్నముగా గారుచునేయున్నవి. ఆతని వస్త్రములెల్లను రక్తసిక్తములైపోయినవి. తల వేయివ్రక్కలగు చున్నట్లున్నది. ఆయాసమంతకంత కధికమగు

చున్నది! కనులు జీకట్లు గ్రమ్ముచున్నవి. ఇట్టికష్టకాలమున, నిర్జన ప్రదేశమున, నిశాసమయమున నాతనికిందోడ్పడు వారెవ్వరు?" హా పరమేశ్వరా! ఎంతటికష్టము సంభవించినది? ఈదుష్టులెవ్వరో గదా? మరణాసన్నుఁడగు నానిర్జీవ జీవనాధుఁడు దన యావదాస్తిని నాచేత నేలపెట్టెను? ఇంతధనమును గాపాడ నేనేల బూనుకొంటిని? అయ్యయ్యో! ఈహంతకులు మాకార్యక్రమము నంతను ముందుగా నెఱింగియే యిట్టిమారణోపాయముగావించియున్నారు. నేనాధనమును గొని బాంకికై యటుకనుదెంతునని వారు ముందుగనే నిశ్చయించుకొని యున్నారు. అయ్యో! ఎంత ఘోరము సంభవించినది? అంత్యకాలమున నాముదుసలి కోరికకోర్కెలింకెట్లు దీర్చగలను? వందలుగావు, వేలుగావే? నాసంపదనంతను ధారవోసినను వాని ఋణముదీరునా? కేవాతడారోగ్యవంతుఁడై నాధనము నాకిమ్మని యడిగిన నేమి సేయగలను? అబ్బా! యీగాయముల బాధసహింప నాతరముగాకున్నదే ఇక నాజీవితావస్థయే సందేహముగానున్నదే. అయ్యో! ఎట్లయిన నిలుసేరిన బాగుగనుండునుగదా? ఒక్కయడుగైనను బెట్టశక్తి లేదు. ఇంకెట్లింటికి బోగలను? ఇక నాకెవ్వరుదిక్కు? పరమేశ్వరా! ఒక రక్షకభటుఁడైన నీదారిని రాఁడే, వచ్చిన నాతనికీచరిత్రనంతయు జెప్పి నిశ్చింతగా బ్రాణముల విడచియుందునే. అయ్యో! ఈదుర్మార్గులెవ్వరో? యేయూరి వారలోగదా? అందొకనిపేరు మొహిదీనని వారి సంభాషణవలన దెలియుచున్నది. అతఁడు మహమ్మదీయుఁడై యుండును. రెండవవాని వేషభాషలఁజూడ నాతఁడుగూడ మహమ్మదీయుని వలెనేయున్నాఁడు. కాని యాతనిపేరేమో దెలియుటలేదు. మొహిదీనాతని "గురూ" యని యొకటిరెండు సార్లుబిలచుటవింటిని. ఆతనిపేరు. గురునాథుఁడా? గురుకులుఁడా? గురుచంద్రుఁడా? ఎవ్వరో? తెలిసికొనజాలను. లేక నీదొంగకావోపిడిగాఁడు గురుఁడేమో? అయినగావచ్చును. వారెవ్వరని జెప్పగలను? బండ్లదొడ్డికడ దీపపుగాంతిని జూచునపుడు, కారు నంబరు "M 0026" యని జూచి యున్నాను.

ఓహో! యీసంగతిముఖ్యమైనది. దీనిని మరువకూడదు. ఎంతమాత్రము మరువకూడదు.

"M 0026— M 0026— M 0026"యనుచునాతఁడక్కడ రోడ్డుపై బడిపోయెను—



౧౨

తెల తెలవారుచున్నది. చెట్లపై గూండ్ల పక్షులెల్లను "కిచ కిచ" కిచ్చులఁ గొట్టుకొనుచు, మేలుకొని మృదుమధుర కంఠములెత్తి కలస్వనంబుల బ్రభాతగీతముల బాడుచు, బురజనుల మేలుకొల్పుచున్నవి. గంగాతరంగంబులందూగుచు, నవవికసితకుసుమ సౌరభంబులం గొని, మలయసమీరకుమారుఁడల్లనల్లనరుదెంచుచు, రేయెల్లను దన కదనమున నలసి, యొకరినొకరెడబాయక, హాయిగసయ్యాల వీడక, నిదురించు మిథునంబుల మేనికెంతో సౌఖ్యమొనగూర్చుచుండెను. భుజముల నాగళ్ళవైచికొని, యెడ్లజతల దోలికొనుచు, పొలముల కేగు సేద్యగాండ్రును, యుదయమాదిగ సాయంతనము వరకును మేనువంచి, పలుగష్టములకు లోనయి పొట్టకూటికై పాటుపడనేగు కూలీలును, నక్షత్రముల దృశ్యముగాకుండగనే సంధ్యావందనాది క్రియలనిర్వర్తించుకొని, యర్ఘ్యపాద్యాది విధులం భాస్కరుబూజింప నలవాటుపడిన శ్రోత్రియజనంబులుందక్క తదితరు లెవ్వరును బురమున మేల్కాంచియుండలేదు. అపుడపుడే యంత్రాలయములన్నియు భోరున ఘోషింపుచు, కూలీల నాహ్వానించుచున్నవి. వృద్ధులగు స్త్రీపురుషులు గొందరపుడపుడే శాత్రస్తవముల నేకరువుబెట్టుచు, చేతుల నిత్తడి, తామ్రపాత్రల నిడికొని, ప్రాతస్స్నానార్థము గంగాఘట్టముదరి జేరుచుండిరి.

పరులేరైన దమ్ముంజూతురను సిగ్గున దలల మేలిముసుంగుల

విడి విటులెల్లరును వడివడిసందులబడి జనుచుండిరి "మేనికొక్కింతయు గష్టములజెందనీయక పితార్జితధనంబుల నిచ్ఛానుసారంబుగ వెచ్చింపుచు, మదమున విహరింపుచు, మైకమున నొడలెఱుంగక నిద్రించునో మందమతులారా! ఇకనైనను మేలుకొనుడు, మేలుకొను"డను గతి నందందు గృకవాకంబులెలుగెత్తి గూయుచునే యున్నవి.

అట్టియెడ గంగాఘట్టమున నొక వృద్ధమారువాడీ గంగాస్తోత్రమును బఠింపుచు, ప్రాతస్స్నానార్థమేగుచుండెను. అంతనాతనిపదమున కేదో మెత్తనివస్తువొండు దగులుటంజేసి యాతడు రెండడుగులు వెనుకకువైచి, మరల ముందున కరుగెంచి యేమిపడియున్నదేమో యని పరికింపసాగెను. రాత్రిహంతకులచే వంచింపబడి, మోటారు నుండి పడునపుడు కఠినతర ఘాతములు మేనదగులుటంజేసి, యపస్మారకుడైన నారాయణచందే యాగతిబాటపైబడియుండెను. ఆ తెరువరిపాద మాతని మేన బడినను యాతడు దెలివొందలేదు. ఆతడు చాలగడస్సి యుండెను. శిరమునుండి రక్తమింకను స్రవించుచునేయుండెను. దాన నాతడు గడు బలహీనుడై యిపుడు గాఢతర నిద్రావస్థందగిలి యుండెను—

అట్లా మార్వాడి కొంతవడి యాతని పరికించి, తనపాదముసోకిన దొక మానవకళేబరమని గ్రహించెను. అయిన నీతడెవ్వడు? ఇందేల నిట్లు బడియున్నాడు? ఏత్రాగుబోతో మైకముననొడలెఱుంగక నీతీరున బడియుండునా? అయినంగావచ్చును. లేక హంతకు లేరైన నీతని దుదముట్టించి యుండిరా? ఈతడు జీవించియే యుండెనో లేదో?" ఈకడపటి యాలోచనమాతనికి దట్టుసరికాతని ప్రాణములు నిలువున నెగిరిపోయి నట్లయ్యెను. ఆతని యాపాదమస్తకమును గడగడవడంక జొచ్చెను. "బాబా! ఇది నాకంటనేలబడినది? పోలీసువారిది గాంచిన నాకొంప కేమిదెత్తురో గదా? వారెంతకైన దగినవారలే. తొలుత నీతడు జీవములతో నున్నాడో లేదో గనుగొనవలెను." అనుచు నాతడాతని మేన జేయివైచి చూచెను. శరీరముష్ణముగనేయున్నది.

ఆతఁడు ధరించిన వస్త్రములన్నియు రక్తసిక్తములై యించుక నార్ద్రములైయున్నవి. "అయ్యో! పాపమీతని నెవ్వరో జంపదలచి యీ రీతిగ గొట్టియున్నారు. కాని దైవకృపచే నీతఁడుమరణించియుండలేదు ఇంకను గొనప్రాణమున్నది. ప్రయత్నమొనర్చిన జీవింపవచ్చును." అని యించుక ధైర్యమంది, యాతఁడు తన భుజమునగల యంగ వస్త్రమున నాతని ముఖమున మెల్లగ వీవసాగెను.

ఇంతలో బాగుగ దెల్లవారినది. సూర్యోదయ సమయము గానచ్చినది. శాలలన్నియు క్రమక్రమంబుగ జనసంకులములైనవి. అనేకులాదారివెంట వచ్చుచుఁబోవుచున్నారు. వచ్చెడివారెల్ల గ్రముముగ నీచిత్రముగాంచుచు యటజేరి యాసేవలొనర్చుచున్న పాంథుని గని సంగతులేమనుచు ప్రశ్నల గురిపింపసాగిరి ఆతఁడు దాగాంచిన దెల్లయు వారికిం దెలియజేయ నెల్లరాతనిఁగైవగచి, శక్తికొలదిదోడ్పడ జొచ్చిరి. వారి సపర్యలవలన చందుగొంతవడికించుక దెలివిరాలేచి కూర్చొనెను. కాని యాతనినోట మాటరాకున్నది. కనులు జీకట్లు గ్రమ్ముచున్నవి"దాహము—దాహ"మనియాతఁడు సంజ్ఞమాత్రమొనర్చి యథారీతిని వెనుకకు బడిపోయెను. అందొకఁడుపరువులిడుచు నీరముం గొని దెచ్చి, కొంతయాతని నోటబోసి, రక్తసిక్తమగు యాతని ముఖమును గుడిచివైచెను. చందునకించుక యూపిరియాడసాగెను. మరల నాతఁడు గూర్చుని, అయ్యలారా! ఆసుపత్రి—బండి—తీసుకొనిపొండు-నమస్కారములు వేగము."యనిమాత్రముచెప్పెను. అంతదయామయుఁడగు నొకపాంథుడు సత్వరమ శకటము నొకదానింగొనిదెచ్చి, యందతని బడవైచి, వేగముగ హారిజన్‌రోడ్డుననున్న వైద్యాలయమునకాతనింగొంపోయెను.

అప్పటికింకను డాక్టరుగారు వచ్చియుండలేదు. కాని యచటి సేవకునొకనిబిలచి "అయ్యా! గంగాతీరమున రాత్రి ఖూనీయొకటి జరిగినది. యీబండిలోని యాతఁడు జావసింసిద్ధముగానున్నాఁడు. వేగముగా డాక్టరుబాబుగారినిదీసికొనిరావలెను. మంచియినాం ముట్టును

పో యని హెచ్చరింపనాతడు "యీనా" మను పల్కు వినగానే, యుదయమున దామేల్కొనిన వేళావిశేషము మంచిదనిదలంచి, పరుగున డాక్టరునకైబోయి సంగతి నాతని కెఱిగించెను. ఆతడు గూడ సత్వరమరుదెంచి, రోగిని బరీక్షించి "బలముగుగాయములే దగిలినవి. కాని ప్రాణాపాయముగలుగక పోవచ్చును. లోనికి దీసికొని రండు. వేగముగమందువేయవలె"నని చెప్ప, వారట్లుగావించిరి. చందు నొక మంచముపై బరుండబెట్టసరికాతడు గనువిచ్చి "దాహ"మని యడిగెను. డాక్టరు వేడిపాలందెప్పించియిచ్చెను. దాన నాతని కించుక బలముగలుగ లేవబోయెను, కాని డాక్టరాతని వారించి "నీవు లేవగూడదు. ఇంచుకైనను గదలక యట్లే పరుండవలయును. జాగ్రత" యని చెప్పెను—

చందుహీనస్వరంబున "చిత్తము. ఆయాసమెక్కుడుగానున్నది తలబాధ యధికముగానున్నది. బహుకాలజీవింపను. చెప్పవలసిన సంగతులు చాలాయున్నవి. డిటెక్టివ్—శరశ్చంద్రబాబూ—అర్జంటు—వార్తనంపుడు" అని, తన్ను వైద్యాలయమునకుంగొని వచ్చిన యాతనిదిక్కు మొగంబడి "బాబా! నమస్కారములు. నారక్షకుడవు. నీఋణము దీర్పజాలను. అంతే" యనెను. ఆతడు "బాబూ! ఇపుడు నీవేమయు మాట్లాడవలదు. కొంతవఱకును విశ్రమింపుడు. లేకున్న వ్యాధిహెచ్చును నేను మఱల సాయంతనమరుదెంతును. సెలవు" యని యాతడు డాక్టరువద్దను గూడ శెలవుగొని మఱలసాయంతనము దర్శింతునని జెప్పి వెడలిపోయెను. డాక్టరు చందునకు గాయములయందెల్లను మందువైచి, కట్లుగట్టి, భయములేదు. హాయిగ నిదురింపుము. సాయంత్రము శరశ్చంద్రుని రప్పింతును. అంతవరకేతోడను మాట్లాడక విశ్రాంతి గొను"మని జెప్పి వెడలిపోయెను.

చందట్లే నిదురించెను—



౧౩

డాక్టరుగారు మధ్యాహ్నము మూడుగంటలకే రోగివృత్తాంతమంతయు నొక సేవకునిద్వారా శరశ్చంద్రునకు దెలియజేసి, యాతని నొకపరి యారోగిచూడగోరుచున్నాడనియు, యాతనితో జెప్పవలసిన సంగతులేమో యున్నవనియు, హంతకులచే దనకీదుస్థితిబట్టినదని యాతడు జెప్పుటచే వెంటనే రావలసినదనియుగోరెను. అట్లేయని యంత శరచ్చంద్రుడు వైద్యాలయముంజేరి, డాక్టరుంగూడి రోగిని జూడనేగెను. నారాయణచందప్పటికి మంచముపై గనులమూసికొని మెలకువగనే మూల్గుచుబడియుండెను. శరశ్చంద్రుడాతని ముఖముం జూచినతోడనే "అయ్యో! ఇదేమిపాపమీతడు బోబజారున ప్రసిద్ధ రత్నవర్తకుడగు గోపాల్ చందున కేకపుత్రుడు. ఎట్లీతనికీగతిపట్టినదో గదా? పాపము!" యనుచు మిక్కిలి విచారింపసాగెను.

డాక్టరుగారాతనింగాంచి "ఏమీ? మీరీతని నెరుంగుదురా? ఉదయముననే యెవరో యొకతగుమనుష్యుడీతని బండిపైగొని తెచ్చి రాత్రియెవ్వరో దుర్మార్గులు, పాపమీతనికీదుస్థితి గల్పించి యుండిరనియు, దానుదయమా బాటనే బోవుచుండ కొందరీతని జుట్టుం జేరుటచే దానుగూడబోయి వీనింగాంచి, యితడు మెలకువగొని వైద్యశాలకు దన్నుగొనిపొమ్మన దానట్లే జేసితినని యెరిగించి మఱల నిపుడు వత్తునని బోయెను."

శర:—ఆతడెవరో మీరు దెలిసికొనలేదా?

డాక్టరు:—లేదు. ఈతనికింక ప్రాణాపాయమేమియు లేదు. కాన మనము సర్వమీతని మూలముననే తెలిసికొనవచ్చును.

శర:—సరే. ఇపుడీతనితో మాట్లాడవచ్చునా?

డాక్టరు:—ఆ—ఈసరికీతని బడలిక చాలవరకు దీఱి యుండవచ్చును. గాయములంత యపాయకరములైనవిగావు. కాని హంతకు

లీతని నేదేనియొక యెత్తైనస్థలమునుండి క్రిందకు ద్రోసినట్లున్నది. అంతియేగాని చేతితోగాని యాయుధములతోగాని కొట్టినట్లాగనబడదు. ఆతడేమి చెప్పునో విందము రండు.

అంత వారిరువురును రోగిమంచముకడనే రెండుకుర్చీలపై నాసీనులైరి. డాక్టరుగారు రోగిహస్తమునుబట్టి పరీక్షింపసాగెను. దాన నాతడు కనులవిచ్చి ప్రక్కనే యాసీనుడైయున్న శరశ్చంద్రుని గూచిగాంచి, యబ్బురమందుచు లేవబోయెను. కాని శరశ్చంద్రాతని బట్టి "లేవవలదు. పరుండుము. నీ బాధయిపుడెట్లున్న"దనియడిగెను.

నారా:—తలపై గాయముమాత్రము కొంత బాధాకరముగా నున్నది. బాబూ! మీరుదయచేయుటచే నాబాధలన్నియు బూర్తిగా వదలి పోయినట్లున్నవి. బాబా! నాకథనంతయు మీరు సావధానముగా వినవలయును.

శర:—నేను వినుటకుసిద్ధముగనేయున్నాను, గాని నీవాయాసము నొందకుండ జెప్పగలవా? ఒకవేళ మఱల వేదనవృద్ధినొందునేమో? తొందర లేదు.

నారా:—ఆ-భయము లేదు బాబా! నిమ్మలముగా జెప్పెదను. వినుడు. భయము లేదు.

శర:—సరే—అట్లయిన జెప్పుము.

నారాయణచందు గడచిన సాయంసమయమున దాను జీవనాథుని యింటికేగుటయు, వారిరువురి సంభాషణమును, యాతని ధనమీతడు గైకొనివచ్చుచు మార్గమున బాడిపైకె యాహంతకులవలలో బడుటయు, వారొనర్చిన మాయోపాయమును, దనకాగాయములెట్లు దగిలినవియు, వారి పలాయనమును, బాటపై దనపతనమును మున్నగు సంగతులెల్లను బూసగుచ్చినట్లుగ జెప్పి యేడువసాగెను. "బాబూ! ఒకటిగాదు రెండుగాదు, లక్షలకొలది ధనము. ఇంక నాకేమిగతి? మీ పాదమేదక్కనితరము నను రక్షింపనేరదు, బాబూ! ఆధనమంతయు దోచుకొనిన యాదుద్మార్గులు ననుగూడ జంపివైచినను జాలగ సంత

సించెడివాఁడను. అట్లు సర్వక వారు నన్ను జీవచ్ఛవముగా జేసి వెడలి పోయిరి—"

శర:—ఏమువకుము. భయమేమియును లేదు. గాకున్న రేపైనను వారు దొరుకక పోరు. చూడగా మాలతి హత్యకును నేటి యీ క్రౌర్యమునకును నేదేనియొక యవాచ్యసంబాధముండి తీరవలయునని నాయంతరాత్మ యేలొకో జెప్పక జెప్పుచున్నది. వారునువీరునుగూడ నొకరేగాఁ యుండవలెననిగూడ సందేహించుచున్నాను. సరే—వారి పేరు లేవైన దెలిసికొంటివా?

నారా:—అందొకఁడు మొహిదినట. అతఁడు రెండవ వానిని "గురూ" యని మాత్రము బిలువగావింటిని. ఇరువురును మహామ్మదీయులవలెనే యున్నారు. చామనచాయవారు. రమారమి ముప్పదియేండ్ల వయస్సుగలవారు. ఒకనికి పెద్దబారుగ గడ్డమున్నది. రెండవ వానికి సాధారణ గడ్డమున్నది.

శర:—సరే-వేషములకేమి? యెన్నిటినైనను వేయవచ్చును. అంతమాత్రమున నదియే వాని నిజరూపమని యెంచదగదు. కాని, భోగము వాఁడగు జీవనాథునకిట్టి యమూల్యములగు రత్నములెక్కడి నుండివచ్చెనో? తరతరములనుండిగూడ బెట్టినను, యింతటి యమూల్యమణులు చేకూరుట కష్టము. ఇది యసంభవముగదా? లేక, నీవుగూడ రత్నవర్తకుని తనయుఁడవే యగుట నొకవేళ నీయనుగ్రహమున నే సంపాదింప గల్గెనా?

నారా:—రామ—రామ. అట్లెన్నటికినిగాదు. ఈరత్నపేటిక కొక విచిత్రకథ నాతడెఱింగించియున్నాఁడు. చెప్పెదవినుఁడు. పూర్వ మాతఁడు రంగపురవాసియట.

శర:—అవునాసంగతి నేనెరుంగుదును.

నారా:—అచటగూడ నాతని తనయ నొకరత్నవర్తకుని సూనుకే యుంచుకొనెడి వాఁడట.

శర:—విచిత్రమే. ఎక్కడికు బోయినను యాతని తనయకు

రత్నములే లభించుచున్నవి. ఎంత పుణ్యమో? తరువాత.

నారా:—ఆతడాతని జనకుని మరణాసన్న సమయమున నా పేటికంగొని వచ్చి భద్రముగ గాపాడుమని యీజీవనాథుని వేడికొనెనట.

శర:—జనకుని తదనంతరము సర్వమాతని దేగద, రత్నపేటికనపుడే యీతని కేల నిచ్చెనో?

నారా:—అతని తండ్రికి భార్యలేమి నొకయుంపుడు కత్తె యుండెడిదట. ఆమెయు నామెజననియు, సోదరుడును గడుక్రూరులట. జనకుని మరణకాలమున వారాయింటనే యుంటంజేసి వారేమి ద్రోహము దలంతురో యని..........

శరచ్చంద్రుడాతని మాటలకడ్డువచ్చి "ఏమి ద్రోహమోనర్తురో యని యీరత్నపేటిక దెచ్చి యీహరిశ్చంద్రుని జేత బెట్టినాడు. దానిని చేజిక్కించుకొని యీప్రభువువారీ పట్టణము జేరుకొన్నారు, అంతేనా నీవు జెప్పునది. విచిత్ర కథయే. చాతుర్గ్రహకూటము బలే"యనెను

నారా:—అట్లే జరిగినది. పాపము జీవనాథుడిపుడకార్యమునకై మిగులబరితపించుచు, దానిక నెంతగానో కాలము జీవింపనసయు దనకింక నెవ్వరుదిక్కులేరనియు జెప్పి నాకా ధనమంతయునప్పగించి కొన్ని కార్యముల జేయుమని జెప్పినాడు.

శర:—ధర్మకార్యములేనా? అబ్బా! ఏమి పరితాపము? ఏమి త్యాగము? ఏయే కార్యములకై ధనము వెచ్చింపు మన్నాడో?

నారా:—తన సేవకులకు కొంతధనమును, మాలతి హత్యాపరాధవిషయమున హంతకుల జాడలరయుటకై కొంతయు, నొకవేళ శ్యామల దిరిగివచ్చినచో గొంతయును, మాలతిపేరనొక ధర్మశాల నిర్మించుటకై కొంతధనమును వెచ్చింపుమని జెప్పియున్నాడు.

శర:—ద్రోహి—ఆహంతకుల కన్న నీతడే హంతకాధముడు. మాలతి హత్యారహస్యమంతయు నీతని చరిత్రలో నేయిమిడియున్నది అందులకు సందేహమేమియును లేదు. సరే, రంగమునమాలతినుంచి

కొని యున్న యాతని పేరేమో, యాతని చరిత్రయేమో జెప్పి యున్నాడా?

నారా:— లేదు. అది నా కెఱిగింప లేదు. అవశ్యము గాకుంటచే నే నద్దానిని బ్రశ్నింపను గూడ లేదు.

శర:— సరే, మించినది లేదు. తొలుత నా మనసులిదొంగ నీ విషయమున బ్రశ్నింపవలసియున్నది. ఆరత్నపేటిక యధికారియే యీనాటకమునకు నాయకుడు. అందుచేతనే వారు నిన్న నీతో "యీధనము మాయది"యని జెప్పియున్నారు. దానిగూఢార్థమిదియే సరే, ఇంకొక సంగతి. మీరు మోటారులో బోతిరిగదా. ఎప్పుడైనను నా మోటారు నెంబరేమో గమనించియుంటిరా?

నారాయణచంద్రుడుత్సాహమున లేచి "ఆ—ఆ—చూచినాను. బాబా! చెప్పెదనుండుడు. అయ్యో! అయ్యో! ఏమది? మఱచితినే" యనుచు నోట వ్రేలిడి కరచుకొనుచు, ఒక్కనిముసమూగుడు. జ్ఞప్తికి దెచ్చుకొని పునవిజేయుచున్నాను. రాత్రి యదేపలుసార్లు కంఠస్థము గావించుకొన్నాడను గాని నిద్రలో మఱచిపోతిని. ఆ—ఆ—జ్ఞప్తికి వచ్చినది. M-0026-ఆ-ఆదే బాబా, అదే, యనియొక్కయునుటున లేచెను—

శరశ్చంద్రుడు నిశ్చేష్టుడైపోయెను. ఏలొకో జూచుచుండగనే యాతని మేనెల్ల స్వేదసిక్తమైపోయెను. బెబ్బులివలె నాతడొక్క సారిగ కుర్చీనుండిలేచి "ఏమనుచున్నావు? 0026 యా? బాగుగా నాలోచించుకొనుము. నీకు మఱిపోయియుండవచ్చును" అని యుఱుముచు బలికెను.

నారా:— లేదు బాబా! లేదు. నాకు మఱిపోయిన నింకొక నంబరు జెప్పగూడదా? బాగుగా జ్ఞప్తియున్నది. హంతకుల జాడ లరయుటకై బనికివచ్చు సూత్రమని యెంచి యానంబరు వేయితడవులు కంఠస్థముగావించుకొన్నాను. ఎంతజ్ఞప్తి లేకున్న నీవిషయమున మాత్రమించుకైన వ్యత్యాసము లేదని దృఢముగా జెప్పగలను.

శర:—అయినచో గొంప మునిగి పోయినది. వారెవ్వరో యఖండపు ప్రజ్ఞానిధులవలె గన్పట్టుచున్నారే. నేనెంత మందమతినై సంచరించుచున్నాను.

అనుచు నాతడటునిటు విసువుతో బచారుచేయసాగెను. అతని యబ్బురపాటుగాంచిన డాక్టరుగారు కూడ నిశ్చేష్టులై కొంతవడికి "ఏమండీ ఇపుడేమైనది ఆనంబరున గల మాహాత్మ్యమేమి? మీరంత కంగారు? పడుచుంటిరేల?"యనెను.

శర:—ఇంక కంగారున కేమున్నది? ఆమోసగాండ్రు నాపేర్లనే దుమ్ముజల్లుచున్నారు, M-0026 నంబరు గల కారు నాయది. మొన్న సాయంత్రము మాసూపరెంటుగారి కారున కేదో మరమ్మత్తులుంటచేతను యెందో తొందరగ బోవలసి నాకారునకై వారొక నౌకరుతోడనే నాడ్రయివరు ద్వారా దానిని వారికంపి యున్నాను. నాకారు బంపినందులకై సంతసించితిననియు, మరల మఱునాటి దినమే దానిని బంపివేతుననియు వారు వ్రాసిపంపిన చీటియిదిగో. ఇప్పుడా కారు వారికడనే యుండవలెను. అది యీదుర్మార్గులకేరీతి దొరకినదో యాశ్చర్యకరముగా నున్నది."

డాక్టరు:—ఒకవేళ వారింకొక కారునకు లోకమును మోసగించుటకై యీమీనంబరు వేసి యుండరాదా? నంబరు మీదై యుండవచ్చునుగాని కారు మీదే యని యెట్లు తెలియుట?

శర:—అయిన నదియునుగావచ్చును. ఏసంగతియు నిపుడే బోయి విచారింపవలెను. తమరు కటాక్షించి యీరోగిని మాత్రము ప్రత్యేకశ్రద్ధతో జూడవయును జుడి. ఈతడొక గొప్పయింటిబిడ్డడు. పాపమీతని వృద్ధజనకుడును భార్యయు నెంతగా గుందుచుందురో గదా? వారికీస్థితి యెట్లు దెలియును. ఇంక నాకు సెలవొసంగుడు. మఱల దీరిక గల్గుతరి దర్శింతును. సెలవు"

అనుచు నాతడు బిరబిరవీధికింజనుదెంచి యొకగుఱ్ఱపుబండిపై శీఘ్రగమనమున సరాసరి సూపరెంటుగారి బంగాళాకేబోయెను.



౧౮

సూపరెంటుగారు బంగాళాలో వరండాపై నటునిటు బచారు సేయుచుండెను. అచట మదనసింగుగూడ నొకయాసనమునగూర్చొని యుండెను. వారిరువురు నేమో మాట్లాడుకొనుచున్న సమయమున శరశ్చంద్రుడు వడివడి బండిదిగి లోనికరుదెంచి సూపరెంటుగారికి సవినయముగా నభివాదన మొనర్చి యాతని యనుమతి నొకయాసన మలంకరించెను. దొరగారుగూడ నొకచో నధివసించిరి.

సూప:—ఏమి? శరశ్చంద్రబాబూ! మీ ప్రయత్నములెంత వఱకు వచ్చినవి?

శర:—ప్రయత్నలోపము లేమియు లేవు. కాని హంతకు లింత వఱకును బట్టువడలేదు. వారి యాగడములంతకంతకును మితిమీఱు చున్నవి. ఇప్పుడు మనకండ్లలోనే దుమ్ముగొట్టుచున్నారు.

సూప:—ఏమీ? ఏమి జేసినారు? విశేషము లేమి?

శర:— చేయుట కేమున్నది, కాని నామోటారిప్పుడెక్కడ నున్నది—?

సూప:—ఏమీ? మోటారెక్కడ నున్నదను చుంటివేమి? నావద్ద ప్రశ్నజూపించుకొనుటకు వచ్చితిరా? నాకు ప్రశ్నశాస్త్ర మంతగా తెలియదు. దానియందు నాకు నమ్మకము లేకపోవుటయే దానికి గారణము. (అని నవ్వుచు బల్కెను.)

శర:—తమ పరిహాసముల కేమిగాని యది యెక్కడనున్నదో యిపుడవశ్యముగా దెలియవలెను.

సూప:—అన్నా! నీవునన్ను విడచునట్లు లేదే! అయిన జెప్పెద వినుము. అయ్యది యిపుడు నీశకటాలయముననున్నదని నాయూహ.

శర:—అయ్యయో! నేననుకొనినట్లే కొంపమునిగిపోయినది.

సూప:—ఏమట్లనుచున్నావు? అదియిపుడు నీకడ లేదా?

శర:—నాకడ కెట్లువచ్చును? దానికై మీరు వార్తనంప మీ యధీనముగావించి యుంటినిగదా?

సూపరెంటుగారాశ్చర్యచకితులై "శరశ్చంద్రబాబూ! మీరేల పరిహాసములాడుచు మఱల నేనే హాస్యమొనరించుచుంటినందురేల? నిన్నసాయంతనమేగద తిరిగి మీకడనుండి వార్తవచ్చుటచే మీ సేవకు ద్వారానే కారు నంపియుంటిని. అదిమీకు చేరలేదా?

శర:—అదియే ఇపుడువచ్చినచిక్కు. నిన్నసాయంత్రమెవరో ద్రోహులిద్దఱొక పూరుషుని యీకారునగొంపోయి యాతనికడనున్న నాల్గులక్షలవిలువగల యొకరత్నపేటికను, కొంతనొక్కమును, దోచుకొని వానినివిడచిరి. వారాధనమునకై పోట్లాడుసమయమున కారొక టూమునకు ఢీకొని, రెండుమూడు పల్లటీలగొట్టి, తుదకు గంగలో బడినదట. ఆపూరుషునకు బలకరములగు గాయములు దగుల నిపుడాతడు హాఃజన్ గోడ్ వైద్యశాలలో చావసిద్ధముగానున్నాడు.

సూప:—ఏమీ కథ విచిత్రముగనే యున్నది. ఆహంతకులెవరో యేమైన నాపూరుషుని వలన దెలిసినదా?

శర:—ఆపూరుషుడెవ్వడోగాడు. మాలతీ హత్యాసందర్భమున నీవరకు మనకు బరిచితుడగు గోపాల్‌చంద్‌గారి పుత్రుడు నారాయణచంద్. ఆధనమంతయు మాలతి జనకుడగు జీవనాథునిదట. ఆతడిపుడు శుష్కించి రోగపీడితుడై మరణశయ్యనుంటచే నాధనమంతయు చందధీనముగావించికొన్నిధర్మకార్యములొనర్పుమనియెనట. కాని, యిందు చిత్రమేమన? ఆరత్నపేటిక జీవనాథుని యన్యాయార్జితము. దానికొక చిత్రకథ గలదట.

అని యాతడు నారాయణచందువలన విన్న యావద్వృత్తాంతము సవిస్తరముగా నాతని కెఱిగించెను. దొరగారదివిని యాశ్చర్యమానసులై "అట్లయిన మాలతి హత్యకును నీకథకును దృఢతరసంబంధముండితీరవలెను. ఆతడింకను జీవించియే యున్నాడుగదా. మీరిపుడేబోయి యతడెవనికడ నారత్నపేటికనపహరించెనోయాతని

వృత్తాంతమంతయు బూర్తిగ సంగ్రహించిరావలయును. దాన మన మార్గము గడుంగడు సులభతరమగును. అంత సాహంతకులు మనచే జిక్కగలరు. అయ్యది నిక్కము. వెంటనే బోయి యాసంగతి విచారించి రావలయును. జాగు సేయరాదు. ఒకవేళ నావృద్ధ మర్కటము గతించిననుఁ గతింపవచ్చును. అపుడాసంగతి నెఱుంగుటకై మనకంతగా నాధారములు లభింపక బోవచ్చును. ప్రయాసపడి, మఱల రంగమునకేగి యచట ప్రయత్నింప వలసియుండును. అపుడు మనపనియంతయు మొదలిడిన చోటికే వచ్చును. ఏమందువు?" యని పలికెను.

శర:—నిశ్చయమే. నేనుగూడ నదే యాలోచించుచున్నాను కారు విషయమై దెలిసికొన నింత త్వరగా తమదర్శనము జేయవలసి వచ్చినది గాని లేకున్న నేనక్లైదోలుత జీవనాథునిజూచి వత్తమనియే యోచించి యుంటిని.

మదన:—ఆలోచింపగా మాలతిహత్యకు రెండు కారణములు గనబడుచున్నవి. మొదటిదిధనము. హంతకుడొక్కసారిగ నీజీవనాథునిచే మోసబోయి యమూల్య రత్నముల గోల్పోయెను:

సూప:—అదియే కారణమైనచో యమాయికయగు మాలతిని వధింపనేల?

మధు:—అదియే జెప్పుచున్నాను. రెండవకారణమేమన? ఈర్ష్య. తాను వలచియున్న యొకానొకతరుణీమణి తన్నిగతి మోసగించి తనయావదాస్తిని త్రుటిలో చేజిక్కించుకొని, పలాయనమై, యెవ్వరినోగూడి హాయిగ సుఖించుట. హంతయామెను వధించుటకు పూర్వము కొంతకాలమామె వృత్తాంతమంతయు సంగ్రహించియుండవలయును. దాన నాతని మతిచెడియుండబోలును. యీర్ష్యానలము హెచ్చిపోయి యుండును. ఈర్ష్యగొన్నమానవుడెట్టి యకార్యమైనను జేయనోడడు గదా?

సూప:—సరియే. నీవు చెప్పినది యొకదానికొకటిసరిపోవుట లేదు. ఏలనన హంతకుడుధనముగూర్చియే ప్రయత్నించియుండినచో

మాలతి వధయేయనసరము. అకారణముగా మాలతిని బట్టి వధించు టంజేసిధనమెట్లాతనికింజిక్కును? ఆతఁడుదొలుతధనమునకే ప్రయత్నించియుండవలయునుగానిచో నిట్టిదుష్కార్య మొనరింపఁడు. లేక రెండవ విధమున నీర్ష్యచే నామెను వధించెనన్నచో నదియొకటియే యాతని యాశయమై యుండనోపును గాని ధనము ప్రధానముగాదు. ధన మాశించినవాఁడు దన్ను మోసగించిన జీవనాథునితొలుత ఖండఖండ ములుగాఁజేసి యుండునుగాని, యట్లుగాక క్రిందియంతస్తుననే దనచేత వంటయింటి కుందేటివలెనే జిక్కిన జీవనాథుని విడచి ప్రత్యేకముగా మేడపైనున్న మాలతినే సంహరించెను. ఇంకను నాలోచింపగా తొలుదొల్త హంతకునకు ధనముపైనాస లేదు. అపుడాతనికి ధనము కన్నను గామపిశాచావేశితుఁడగుటంజేసి, యీర్ష్యానల జ్వాలలే యెక్కువగ బ్రజ్వలింప సాగెను. దాననాతఁడు దొలుత నెట్లైనను మాలతివధ్యాక్రమమే యుత్తమమని యోచించెను. అట్లేజరిగి పోయెను. తరువాత నాతనికి ధనాశగలిగినది. దానింగూర్చి ప్రశ్నించుట కాతఁడు జీవనాథునిదరకేగు సమయమునకే యాతఁడు దన యాస్తి నంతయు నారాయణచంద్రున కొసంగుచుండుట గమనించియుండును. దాన నాతఁడు లోనికింబోక నారాయణచందెట్లయినను దనగృహమునకేగ బండిని జూచుకొనునని గ్రహించి యీమాయ గావించి యుండును—

మధు:—ఆతనికి శరశ్చంద్రుని కారు తమవద్దనున్నదని యెట్లు దెలియును?

సూప:—పిచ్చివాఁడా! ఇది తెలిసికొనుటే కష్టమైనపనియా? ఆతఁడంతమూర్ఖుఁడుగాఁడు. ఎపుడు దానొక హత్యగావించియున్నాఁడో, నాటినుండియు బోలీసువారిపోకడలగనిపెట్టుటకై మనలవెన్నాడుచునే యున్నాఁడు. కాన యీయొకకారుసంగతియేగాదు, వానికి బ్రతి నిముసము మన మొనర్చు బ్రయత్నములన్నియు బూర్తిగ దెలియునని యే నానమ్మకము.

శర:—తమరు సెలవిచ్చినదంతయు సత్యమేగాని, యీహత్యలు నీబందిపోటుందనముగూడ నారత్నపేటికయొక్క కారిచేతనే గావింపబడి యుండవు. ఆతడొకధనికుడు. కాంతాలోలుడు. నీతిబాహ్యుడు, గాని మృదులహృదయుడై యుండవలెనని నానమ్మకము. ఇప్పుడీనాటకమున నింకను గ్రూరతర హృదయులగు వేఱొక రెండుపాత్రలున్నవని మాఱు వకుడు. ఆతని జనకుడు, భార్యావియోగియగుట నొకయుంపుడుకత్తె నుంచుకొని యున్నవాడట. ఆమెకొక బాలికమాత్రయు నొక నిజ సోదరుడును గలరని వినియున్నాము గదా. ఇప్పుడీకధనంతయు వారే సాగింపగూడదా? ఎట్టయినను వారినామములను, చరిత్రలను దెలిసి కొనునంతవఱకును నేమియు మనము నిశ్చయింపజాలము. తొలుత భువననాథుని జూడవలయును. సెలవైన మేమిఱ్ఱుపురమును బోయి వచ్చెదము.

సూప:—శీఘ్రముగా బోయి రండు.



౧౫

శరచ్చంద్రుడు మదనసింగునుగూడి కాశీఘట్టమున భువననాథు నింటికిబోవుచుండెను. మార్గమధ్యమున నుదయము నారాయణచం ద్రును గంగాతీరమునుండి బండిపై వైద్యాలయమునకు గొంపోయిన యాతడు వారికెదురై నమస్కరించి "చిత్తము. తమరేనా బాబా! శరచ్చంద్రబాబుగారు." అన్నాడు.

శరశ్చంద్రుడు దట్టె వాని ముఖము నిదానించి చూడసాగెను. తానానూతనవ్యక్తి నెందునుజూచినట్లాతనికిజ్ఞాపకమునకువచ్చుట లేదు గాని బదులిడకుండుట భావ్యముగాదనియెంచి "చిత్తము. నన్నే శరశ్చంద్రుడందురు. తమరెవ్వరో నేనెఱుంగ వచ్చునా?" యని పలికెను.—

నూతి:—ఉదయము నారాయణచంద్రుగారు గంగాతీరమున హంతకులచే గొట్టబడి పడియున్నతఱి వైద్యశాలకానని నేనే గొని పోయినాఁడ. అపుడు వారు తమ్మొకపరిజూడఁగోరినారు. తమరచట కేగి యుంటిరా?

శర:—ఆ—పోయి వచ్చితిని. మీరాతని నుదయ మేప్పిటిలో జూచియున్నారు?

నూతి:—ఉదయముననే వాయు సేవనముకై నేగంగాతీరమున బోవుచుండ కొందరు మనుజులటగుమిగూడి యుండుటజూచి నేను గూడ నదియేమోయని జూడఁబోతిని. మామునసరి కాతఁడాసతిలోఁ నొంపై తెలియంగక బడియున్నాఁడు. శీఘ్రోపచారముల గొంతవరకు జేసి మేల్కొంచి తన్ను వైద్యశాలకుం గొంపొమ్మని చెప్ప నట్లే చేసితిని. ఏమైనను పరోపకారము గదా?

శర:—అయ్యా! ఎంతటిమాట? తమ్ముబోలు కనికరముగు పరుల కష్టములజూచి యోర్తురా? తమనామమేమో సెలవిచ్చి నారు కారు—

నూతి:—తమరట్లు సెలవిచ్చుట పాడిగాదు. ఇంతనే జేసిన దేమిగలదు? బాబా! దైవమే యాతనికిందోడ్పడినాఁడు. నరులమగు మన మెంత?

శరచ్చంద్రుఁ డెన్నిగతుల బ్రశ్నించినను మాపూర్వపురుషుఁడు దన నామమేలాకో యెఱిఁగింపక నింకొక త్రోవద్రొక్కుచుండుటఁజూచి యించుక యనుమానించెనుగాని, తోడనే యాతఁడు "కొందఱుత్తములు దమంతట దమనామమెఱింగింపరు. ఇది కొందఱి యాచారము. ఆతని వేషభాషలజూడ నాతఁడొకసంపన్న గృహస్థువలె గన్పట్టుచున్నాఁడు. పోనిమ్మింతమాత్రమునకై యాతని నిర్బంధింపనేల?" యని యూరకుండెను.

మదనసింగు వారి ప్రసంగమాలింపుచు నవ్వుకొనుచుండెను. శరచ్చంద్రుఁడు చీకట్లు గ్రమ్ముకొని వచ్చుచుంటచే "అయ్యా! మాకింక

జీవనాథుఁడు వ్యాధి పీడితుండై చెప్పలేని యాతనఁ బొందుచుండెను. నిన్నటినుండియు నాతనికేలొకొ నిద్రాహారములు సైతము గట్టు వడి పోయెను. ఆతని శరీరము మిక్కిలి శుష్కించిపోయెను. ఇంక నెంతయో కాలమాతఁడు జీవించుననునాశ లేదు. శరచ్చంద్రుఁడు మదన సింగులాతని మంచముకడ నిలచి యాతని దీనావస్థ విలోకించుచుండిరి. ఆదృశ్యముఁ గాంచిన శరచ్చంద్రుని మనసు నీరైపోవుచుండెను. అతఁ డప్రయత్నముగ "పాపము"అని యొక్కనిట్టూర్పు విడచెను.

శరచ్చంద్రుఁ డీవరకొకపరి జూచియున్నను జీవనాథుఁ డిపుడాతని నానవాలుపట్టియుండ లేదు. అయినప్పటికెవ్వరో నూతనులని దలచి వెఱ్ఱివానివలె నాతఁ డట్టె జూచుచుండెను. తుదకాతఁ డెట్లో నోరుదెరచి "ఎవరు బాబూ? మీరు—వైద్యులా? నారాయణచంద్రుఁడు మిమ్ము బంపి నాఁడా? ఆతఁడు చాల దయాళుఁడు. కాని, నాకు మందేమియు వలదు బాబా. మీకు నమస్కారము. ఇపుడు నా బ్రదుకు మందులు దిను నవస్థలో లేదు బాబూ. గడియో—క్షణమో—అంతకన్న నెక్కువ లేదు. అంతే-దయచేసి కూర్చుండుఁడి. రామోజీ—చాప వెయ్యి నాయనా' అనుచు నేమో యేకరువు బెట్టుచుండెను.

శరచ్చంద్రుఁ డాతని స్థితినంతయు బాగుగ గ్రహించి యాతఁడు మనోవ్యాధిచే బూర్ణముగనున్మాదావస్థలోనున్నాఁడని తెలిసికొనెను. ఇట్టివానినోట నా రత్నపేటిక రహస్యమెట్లు బయలు వడునా యని యాతఁడు తొలుత సందేహించెను. అయిన నొకసారి యూఁపి చూతమని యెంచి "జీవనాథుగారూ! నన్ను మీరు మఱచిపోతిరా? నేను పత్తేదారు శరచ్చంద్రుఁడను. నాఁడు..."అని పలుకు చుండగనే జీవనాథుఁ డొక్కసారి యదాటున మంచమునుండి లేవనుంకించియు నట్లు జేయఁజాలక, మరల పరుండియే "శరచ్చంద్ర బాబా? తండ్రీ! నా మాలతిని, నా ముద్దు కూతును వధించిన యారాక్షసుని బట్టుకొంటివా? మీ ప్రజ్ఞ యసాధారణము. నేనీవఱకే విని యుంటిని బాబా. ఈసంగతి జెప్పుటకేనా తమరు దయచేసినది? బాబా! నా దుఃఖమంతయు జూచుచుంటిరిగదా.

ఆహంతకుల నెట్లు శిక్షింతురో మీదే భారము. అబ్బా! ఇప్పటికి ప్రాణము కుదివచ్చినది, ఇంక మరణించినను సంతోషమే" అనుచు నాతఁడొక్కపెట్టున నేడువ దొడంగెను.

అదిగాంచి శరశ్చంద్రుఁడు "ఓహో! యీతనియున్మాదమునకు మాలతి మరుచుటయే ముఖ్యకారణము. ఈతనికెల్లవేళల నదేచింత. పాపమీతనిపోషణనేమంచము బట్టియున్నాడు. దైవవిధి"యని మనమున దలపోసి "అయ్యా! హంతకులు ద్వరలో బట్టువడనైయున్నారు. కాని మీయొక్క సమ్మతి నిపుడు మాకెఱింగింపవలయును. కొంచెము శ్రద్ధ వహించి మా ప్రశ్నల కెల్లను సమత్తరములీయవలయును. ఏమందురు" యనెను.—

జీవ:— అయ్యయ్యో! హంతకులు జిక్కినారనుకొన్నాను. ఇంకను ప్రశ్నలు—ఉత్తరములతోనేయున్నది వ్యవహారము? పోలీసు వారి వ్యాపారమేయిది. ఇట్లుగొంతకాలముగడపి, తుదకు కేసుపూర్తి చేయుట కెవనినో యొక యనామధేయుని ప్రాణముల బుచ్చుకొని పరిసమాప్తిగావింతురు. మీరు యమదూతలు. అడిగిన ప్రశ్నలకు బదులు జెప్పినదప్పు—చెప్పకున్న నంతకంటెనుదప్పు—ఏమైనను జెప్పక దప్పదుగదా? బాబూ! అడగండి మీయిష్టం—ఏమడుగుతారో అడగండి. నే నెఱిగినదేదో యీవఱకే చెప్పివేసినాను. ఇంకను జెప్పవలసిన దేమున్నది? నాపిండం—బాబూ! ఇన్నిప్రశ్నలడుగుటకన్న వెయ్యో, రెండువేలో రొక్కముకుగ గూడదూ? నిముసములో బారవేతును.

శర:—అయ్యా! మీధనమంతయు నారాయణచంద్రుగారి కప్పగించి వేసినారే. యింక మీకడ ధనమెమున్నది?

జీవ:—ఓహో మీరు త్రిలోకాంతర్యాములవలె నున్నారే! ఇంతవేగముగ మీకీసంగతిగూడ యెక్కడదెలిసినది. బాబూ?

శర:—జీవనాథుగారూ! సాధారణముగ మాకు దెలియని విషయములు లోకములోనుండవని తొలుత దెలిసికొనుడు. ఎల్లపుడును

మాపనియే యది. ఇప్పుడుమాకుగా ... బలిగొన్ని
మీరు వేగమొలింగింపవలయును. అ... తో మాకు
బలిలేదు. చాలారాత్రి గావచ్చుచున్న ... నారాయణ
చందునకు మీయావదాస్తిని యొసంగు ... నొక్కముతో
గూడ నొక యమూల్యరత్నపేటికసహా ... గియుంటిరి.
అంతటి విలువగల యాపేటిక మీకెట్లు ... తెలుప
వలయును——

జీవ:—ఓహో! గవాక్షమా! రామో ... కిటికీబాగుగా దెరచివేయుము. నామొహలు మంటలెత్తుచున్నది. ఇంచుకగాలి రావలయును. బాబూ! మీరు నిలువబడియే మాట్లాడుచున్నారు. అచట గూర్చున్నచో మీకుగావలసిన సంగతులన్నియు బాగుగా జెప్పగలను. నాకీ లోకములో నుండుటకింక బాగుగా ఋణముతీరి పోవుచున్నది. అట్టియెడ నేనెన్ని అంశములనైనను సత్యముగామీకు దెలుపగలను, దాన నాకేమియు నష్టములేదు. నాపాపములన్నియు భగవంతుడే గొలది కాలములో విచారింపనున్నాడు, గానమీవలన నాకెట్టి భయమును లేదు. నేజెప్పునదంతయు బ్రమాణపూర్వకమని మాత్రము మీరు విశ్వసింపవలయును. అబ్బా! ఏమి యాయాసముగా నున్నది——?

రామోజీ గవాక్షము బాగుగా దెరచివైచెను. లోనన్న సన్నని దీపకాంతులు గవాక్షమార్గమున రోడ్డుపై బడుచు, మార్గమున బోవువారి లీలలు మాత్రము గానవచ్చుచుండెను. శరశ్చంద్ర మదన సింగు లిరువురును జీవనాథుని మంచమునకించుక దూరమున జాపపై నాసీనులైరి. అంతజీవనాథుడిట్లు జెప్పదొడంగెను.

“బాబూ! నేను జాల పాపాత్ముడను. దుర్మార్గుడను. నాపాపములకుందగిన ప్రతిఫలమీలోకముననే జాలవఱకనుభవించియున్నాను. ఇంకను యనుభవింపుచునేయున్నాను. పరలోకమునగూడ ద్వరలో ననుభవింపనున్నాను. ధనమునకై యెట్టి యకార్యములనైనను

జయ నించుకంతయు వెనుదీసినవాడనుగాను. ఇపుడు పశ్చాత్తాపము నొందిన లాభమేమి? నాగృహమంతయు బూర్తిగ దగులబడిపోయినది. ఇంకగాలిన ప్రమోదమునకు నేను మాత్రము జీవించియున్నాను, అయ్యో—!”

అనుచుండ నాతనిమాటలకడ్డుకచ్చి శరచ్చంద్రుడు “అయ్యా! మీరు లేనిపోని దుఃఖములతో గథ బెంచివేయుచున్నారు. రాత్రివేళ మించుచున్నది.” అని, తన జేబుగడియారము దెసజూచి “చూచితివా? తొమ్మిదిగానచ్చుచున్నది. మాకింకను జేయవలసిన పనులనేకము లున్నవి, గాన, మేమడిగిన సంగతి త్వరలో ముగింపుడ”ని యాతని హెచ్చరించెను. ఆపలుకులకు జీవనాథుడు విసివికొనుచు “అబ్బా! చెప్పనీయరుగదా? ఇపుడు నే జెప్పుచున్నది మాత్రము కథకు సంబంధించినది కాదా? ఏమో—దుఃఖోద్రేకము వలన రెండు మాటల జెప్పియున్నాను. నా బ్రదుకు దుఃఖముగాక సంతోషమా? అదిగాక యనుతాపమున గొంత దుఃఖముపశమిల్లును. పెద్దలు మీ తెరుంగని దేమిగలదు? ఇంకవినుడు, రత్నపేటిక వృత్తాంతమే జెప్పుచున్నాను. అయ్యో! నాకు మతిబోయినది. అడుగమఱచినాను క్షమింపుడు. నేను నా యూపదాస్తిని నారాయణచందునకొసంగినట్లు దమకెట్లు దెలిసినది—?

శర:—నేడాతని నొకానొకపనికై గలిసికొనవలసివచ్చినది. అపుడు ప్రసంగవశమున మీస్థితియు, మీ యేర్పాటులను జెప్పి యాతడా పేటికను దెచ్చి మాకుజూపించెను. అదిగాంచి మేము విభ్రాంతులమై, యింతటి యమూల్య పేటిక నాతడెట్లు సంపాదింప గల్గెనోగదా యను విషయమెఱుంగుటకై మీవద్దకే రావలసివచ్చినది.

జీవ:—నావద్దకేలను? పేటిక నాతని కొసంగునపుడద్దాని నెట్లు సంపాదింప గల్గితినో గూడ నాతనికిం జెప్పి యుంటినే. ఆతడాకథ మీ కెఱిగింప లేదా?

శర.—లేదు. ఏకారణముననో యాతడేమియు జెప్పలేదు.

లేకున్న మేమిద్దఱల రావలయును.

జీవ:—ఆతనికి నామీద జాలప్రేమ. అందుచే దెలిసియుండియు నాపరువు బయటబెట్టనెంచక దాచియుంచినాడు. సత్పురుషుడు ఎట్లయిన నాకథమీరు దెలిసికొనవలసినదే. అబ్బో! మీరు పోలీసు వారు. ఇట్టి రహస్యవృత్తాంతముల గనిపెట్టుటయే మీపని. అందుచే మీరేల విడతురు? ఆయిన జెప్పెదవినుడు. నేనీకలకత్తా నగరము జేరక పూర్వము రంగమున నుండెడివాడను. అచ్చట నాముద్దుల మాలతికొక రత్నవర్తకుని కుమారునితో స్నేహము గుదిరినది. ఆపేటిక యాతనిదే. ద్రోహినగు నేనాతనివంచించి దానిం గైకొంటిని.

శర:—మీరింత మాత్రము స్పష్టముగా జెప్పినజాలదు. ఆరత్నవర్తకుడెవ్వడో? ఆతని కుమారుని పేరేమో? ఆపేటిక మీకడకేల, నెట్లువచ్చినదో? మీరెట్లాతని వంచింపగల్గితిరో? మున్నగు విషయములన్నియు విపులముగ జెప్పితీరవలయును. ఈయంశములన్నియు మేము విలాసార్థమెఱుంగగోరి మీకడకు రాలేము. మాలతిని జుదముట్టించినయపరాధులబట్టుకొనుటకు, మీరిపుడెఱింగించుకథయే ముఖ్యసూత్రమని దెలిసికొనుడు. దానకి దీనికిని యజ్ఞాతమగు నొకానొక సంబాధ మేర్పడియున్నది.

జీవ:—ఆలాగునా? బాబూ! నామందబుద్ధి యంతదూరము పోలేదు. అంతముఖ్యకరమగు విషయము నేనేల దాచవలయును? చెప్పెదను. చాలాఆయాసముగానున్నది. రామోజీ! పదిలముగనన్ను లేవనెత్తి పక్కపై గూర్చుండబెట్టుము.

రామోజీయట్లగోడకొక మెత్తనిదిండు జేరవైచి, జీవనాథునా డెందు నానుకొనులాగున గూర్చుండబెట్టి, తాను ప్రక్కనే నిలచి వీవనతో వీచుచుండెను. జీవనాథుడించుక జలమడిగి పుచ్చుకొని త్రావి "అబ్బా! ఇపుడించుక సౌఖ్యకరముగానున్నది బాబా! మీ కంతయు విశదముగా నిపుడు జెప్పగలను. సావధానముగా వినుడు, వలయుచో నేజెప్పుదాని నొక కాగితమున వ్రాసికొనుడు. పోలీసు

వారెంత చిన్న సంగతినైనను మఱువరు. జ్ఞాపకశక్తి హెచ్చు. అందారి తేలిన మీకు జెప్పవలయునా? హ్వా—హ్వా—"

శర:—అదిగో మఱల ననవసరగాథలోబడి పోవుచున్నారు. అసలు సంగతిని మఱచిపోవుచున్నారు.

జీవ:—లేదు, బాబా! లేదు. కోపపడకుము నేను మీ జాగ్రత్త కొఱకై వ్రాసికొనుడంటిని. అంతమాత్రమునకోపమా? మీ యిష్టము చెప్పుచున్నాను వినుము. రంగములో పేరుపొందిన రత్నవర్తకుడు, సత్పురుషుడునగు రఘునాథపండితుడను దగు మనుష్యుడొకడుండెడి వాడు. ఆతనికొక పుత్రుడు మధు........

అనుచుండగనే గదిలో "ఢాం" మను శబ్దమొకటి గలిగెను. గదియంతయు బొగతో నిండిపోయెను. అచట వెలుగుచున్న చిన్న దీపముగూడ నారిపోయెను. గదియంతయు గాఢాంధకారావృతమై పోయెను. శరశ్చంద్రమదనశింగు లత్యాశ్చర్యభయ విషాదముల మునింగిపోయిరి. కొంతవఱకును వారెవ్వరినోటను మాటరాలేదు. ఎట్టకేలకు శరశ్చంద్రుడు చెలివొంది "రామోజీ! దీపము—దీపము—వేగము—వేగము"యని బిగ్గరగా గేకవైచెను. మదనశింగు దన జేబున నున్న నిప్పుపెట్టెదీసి యచటి దీపమును వెలిగించెను.

ఆశ్చర్యము—పరమాశ్చర్యము. మంచముపైగోడకు జేరపడి యున్న జీవనాథునిమేను రక్తసిక్తమై యట్లే బొన్నుపై బడిపోయెను.



౧౬

ఆతనివక్షమువ నొకపెద్దగాయమునుండి యవిరళరక్తధారలు గారుచుండెను. నిముసములో బొన్నుగొంతవఱకును దడిసి ముద్దయై పోయెను. రామోజీ భీతిచే వడకిపోవుచు నొకమూలబడియుండెను. శరశ్చంద్రుడు వడివడిబరుగులిడుచు వీధితలుపుం దెరచికొని రోడ్డుపై

నటునిటు బరుగిడసాగెను. మదనసింగాతని వెంబడించి తానుగూడ నటునిటు వెదుకసాగెను. ఆమార్గమున బోవు బాటసారులనేకులు వారికింగానవచ్చిరి. ఎవ్వరిసాహసకార్యముగావించియుందురు ఎవ్వరిని వారనుమానించిపట్టుకొనుట? శరశ్చంద్రుని మతిచలించిపోయెను. ఆతడపరాధపరిశోధకవృత్తి బ్రారంభించిన నాటనుండియు నేటివఱ కెన్నడిట్టి యమానుష సాహసముం గిలకించి యుండలేదు. కలకత్తా నగరమున నపరాధపరిశోధకాధికారంబున బ్రసిద్ధివహించిన యీ యిరువురి పత్తేదారులను నేఁడు తృణప్రాయులుగా, మట్టిబొమ్మలుగా జేసినదెవరు? వారికల్పనాతీతము, నమానుషంబును, నవాచ్యంబును నగు నొకానొకఘనతరసాహసికప్రదర్శనమును గావించివైచిరి.

ఎంతయోచించినను శరశ్చంద్రునకేమియు బోధపడుటలేదు. మార్గమున సహస్రసహస్రజనంబులు దరలిపోవుచుండిరి. అందెవ్వరి ననుమానించి బంధించుట, ఒకవేళ నెవ్వరికడ నైనను దుపాకి, రివాల్వరు మున్నగు నాయుధంబులేవైన నుండునేమోయని, బాటజనులఁగొందఱి నాపి యాతడు బరీక్షించెనేగాని, యాతనిబుద్ధిహీనత నాతడు నేనే గ్రహించుకొని యాపని విరమించెను. పోలీసువారియెదుటనే యిట్టి సాహసికకార్యమొనరించినవాఁడింకను నందే "నన్ను బట్టుకొనుఁడు— ఇదిగో నాకడ రివాల్వరున్నది" యనుచు వారియెదుటనే తిరుగాడు చుండునా? కల్ల—కల్ల. ఒకవేళయున్నను, నెవరో—యెవరో? ఎందఱో కాలినడకనుబోవుచుండిరి. అనేక శకటములు పరువెత్తుచున్నవి. మోటారులసంఖ్య లెక్కింపశక్యమేగాదు. ఇందుదేనిని బట్టుకొనుట. ఇది పిచ్చితలంపుగాదా?

మదనసింగు నిశ్చేష్టుఁడై ద్వారముకడ నిలచియుండెను. లోన రామోజీ తెలివితెచ్చుకొని, యచటి ఘోరతరప్రదర్శనమాలోకించి, భోరున నేడ్చుచుండెను. శరశ్చంద్రుఁడు లోనికరుదెంచెను. మదనసింగాతని ననుగమించెను. వారికేమియుదోచుటలేదు. శరశ్చంద్రుఁడనేక గతుల నాలోచించిచూచెను. కాని, యీముసలిబుడుగు నిట్టికారణ

హముగ నింత క్రూరతరముగ వధించుట కేమి హేతువో యెంత యోచించినను యాతనికిందప్పటలేదు, ఆతని మెదడిప్పుడు శూన్యమైపోయెను ఇంక నందు నిలచుటకుగూడ నాతనికి విసువుజనించెను. అంత నాతడు మదనసింగుతో "నయ్యా! ఇంక నిట మనముండుట యనావశ్యము. మనమువచ్చినపని తుదకీరీతిబూర్తియైనది. దీనికిగారణమేమో యెంతని యాలోచించినను నాకిసుమంతయు దెలియుటలేదు. ఇంక మనమింటికింబోయి యుదయముననే దక్కుంగల కర్మాంతరంతయు జరిపింపవలయును. పదుము పోదము. రామోజీ! నీవుమాత్రము జాగరూకుడవై యీరాత్రి నిందే నిలచియుండుము."

అనుచుండగ రామోజీ "బాబో! నాతరమా? ఇంకొక నిట నొక్కనిముసమైనను నిలువజాలను. నాకిక నిందేమిపనియున్నది?" యని గుండెల బాదికొనుచు బల్కెను.

శర.—రామోజీ! నీవొక్కడు నుండవలయు నను నవసరము లేదు. మేమేగి నలుగురు రక్షకభటుల నిపుడే బంపుదుము. వారు వచ్చువఱకుగూడ నిందే కావలి గాచికొనియుండుము. నీవుకూడ వారితో నిందుండవలయును. శివనాథుడు గతించినను, యాతని వస్తువులన్నియు గూడ నిందే యున్నవిగదా? కాన, నీరాత్రి కెట్లో వేగించిన నుదయముననే తక్కిన యేర్పాటులన్నియు మేమే గావింతుము.

రామోజీ:—బాబూ! మీకు నమస్కారము. రక్షకభటులు వచ్చువఱకైన నేనొక్కడ నిందుండజాలను. ఈ దృశ్యము గాంచుకొలది నా ప్రాణములు నిలువున నెగిరిపోవుచున్నవి. బాబూ! మీలో నొక్క రేగి భటుల రప్పింపుడు. లేక, సెలవైన నేనే పోయి వారిం గొని వత్తును—

శరశ్చంద్రుడాలోచించి రామోజీతో గొంతవఱకు సింగుగారి నుండనియమించి, తాను వడివడి బోలీసుస్టేషనునకేగి, యందుండు నిరువుర ద్వారకగమనమున శివనాథుని గృహమునకేగొనియుంచి రాత్రి సహరానొసంగ వలసినదిగా నుత్తరవుచేసి యింటికేగెను.

రాత్రి పదిగావచ్చినది. శరశ్చంద్రుడు భుజించి, తన శయనాగారమున మంచముపైఁగూర్చుని, జరిగిన విచిత్రసంఘటనమును మనోవీధిందిలకింపుచు, నేమియు నిశ్చయింపనేఱక నట్లే నిద్రాముద్రితుడయ్యెను. మామూలుగా నుదయమైదుగంటలకే యాతనికి మెలకువవచ్చెను. తోడనేయాతడు పడివడి దనముఖప్రక్షాళనాది నిత్యకృత్యముల ముగించుకొని, కాఫీనిద్రావి, దుస్తులదాల్చి ముందు సూపరెంటుగారింటి కేగెను.

దొరగారింకను మేల్కాంచియుండలేదు. కాన, నాతడుగొంతవఱకందే వేచియుండవలసినవాడయ్యెను. పిమ్మటదొరగారు మేల్కాంచినతోడనే తన యాగమనము వారికిందెలిసి, వారి యనుమతిని గొనికరిగి, రాత్రిజరిగిన విచిత్రచర్యలన్నియు నామూలాగ్రముగానాతడాతని కెరుంగజెప్పెను. దొరగారాకథనాలించి యత్యాశ్చర్య భయసంభ్రమములకు లోనైరన్న నొకవింతగాదు.

"శరశ్చంద్రబాబూ! ఇపుడేమందువు? దీనికి గారణమేమో యోచించితివా?"యని యాతడు దీనముగ బ్రశ్నించెను.

శర:—యోచించియున్నాడగాని, సరియైనకారణమింతవరకును నూహింపజాలనైతిని. కాని, ఎట్లైనను, యీహత్యలన్నిటికిని మూలకారకుడొక డేయని యనుకొనుచున్నాను.

దొర:—సందేహమేమి? ఇంకొకరికీవృద్ధుని నంత మొందింపబనియుండదు. నాకీవిషయమున నొక్కయవశ్యకారణము గానవచ్చుచున్నది—

శర:— ఏమది? నాకేమియుదోచుటలేదు. ఈదుష్కర్ముని విపరీతచర్యల గనుగొనుగొలది నామతిబూర్తిగ జలించిపోవుచున్నది కొంతవిశ్రాంతి నైకొనినగాని యీసంగతి గూర్చినిశ్చయింపజాలను.

దొర:— దీనికంతయాలోచన మనావశ్యము. జీవనాథుడు వృద్ధుడు. ఆతనికింకెవ్వరును బంధుగులులేరు. ఆతని తనయ నీవఱకే కొంతకుడు బరిమార్చియున్నాడు. దానితోనాతని యీార్జానలము

జల్లారిపోయినది. రెండవది, యాతడు కోల్పోయిన విత్తమునుగూడ నాతడీవఱకే సంపాదింపగల్గినాడు. దానితో ధనాశగూడ వదలి పోయినది. ఇంకమిగిలినది క్రోధము—ప్రతిహింస— తన్నువంచించిన వాని దెగటార్చుట— తన్నిడుముల గుడిపినవాని బరిమార్చుట. అంతటగాని వాని క్రోధముపశమింపదు. వానికినూర్కు రాదు. ఆహారము బోదు. దానికైయాతడు వేచియుండి నేడుబగదీర్చికొన్నాడు. ఇదియే ముఖ్యకారణ మనుకొందును.

శర:— ఈవిషయమున నీవఱకే శింగుగారితో దర్కించి యున్నాము. హంతకునకు జీవనాథునిపై బగయేసాధింపవలయుననుకోర్కెయేయున్నచో, అది యాతడేనాడు మాలతిని సంహరించియుండెనో, యానాడే, యంతకుబూర్వమే- యానిశితకరవాలముననే దొలుతొలుతనీవృద్ధుని దెగటార్చియుండును. నిర్దాక్షిణ్యచిత్తముతో, భయంకరఖడ్గముజేబూని యెప్పుడాతడు యనదయగు నొకస్త్రీని బరిహరింపసమకట్టియుండెనో, ఆక్షణముననే, దన్నుమోసపుచ్చి తన కీఇడుములగూర్చిన మానవుని మాత్రమాతడు గనికరించి యుపేక్షించునా? అదిగల్ల. రెండుగాదుకదా, యాతడు దలచుకొన్న నారేయి బదిహత్యలైనను జేయగలడుగాని, యెన్నడును వెనుదీయువాడుగాడు. చేజిక్కనతఱి విడచి, దీనుడగు నొకవృద్ధ శత్రువునకై యాతడిన్ని దినములు గాచికొని యుండవలెనా? కాన, యిది కారణము గాదు—

దార:— అదియును నిశ్చయమే. అట్లయిన నీతని వధించిన వాడు వేఱొకడైయుండునా?

శర:— అట్లెన్నటికిగాదు. ఎవ్వడుమాలతిని సమయించెనో, యాతడే బందిపోటుగొంగయై నారాయణచంద్రు కడ ధనాపహారణ మొనర్చినాడు. ఎవ్వడాధనము సంగ్రహించెనో యాతడే నేడీజీవనాథునిగూడ దెగటార్చినాడు. ఇందు సంశయింపవలసినదించుకంత యును లేదు. ఈమూటికిని యొకేసంబంధసూత్రము గట్టబడియున్నది.

నిశ్చయము. ఇపుడు నాకంతయు నవగతమగుచున్నది. నాబుద్ధికించుక పదను గలిగినది—

నారా:—అట్లయిన నీవిషయమున నింకొక కారణము నీవేమి చెప్పగలవో నాలోచింపుము చూతము.

శర.—ఇదిగో చెప్పెదవినుము, ఆ! ఇపుడు బూర్తిగా దెలిసినది. మాలతి హత్యారహస్యము రత్నపేటికయందిమిడియున్నదని యొప్పుకొందురుగదా? రత్నపేటిక నెవ్వరినిమోసగించి జీవనాథుడు దెచ్చెనో యాతని చరిత్రమును దెలిసికొన్నచో హంతకుని బట్టుకొనుట కంత వ్యవధియుండదు గదా?

నారా:—ఆ—ఆ—ఇదియా? తెలిసికొంటిని. తెలిసికొంటిని. ఎంతచమత్కారము. బలే! చెప్పు—చెప్పు.

అనుచు నాతడపరిమితానందమున గుర్చీనుండిలేచి యటునిటు దిరుగసాగెను. శరశ్చంద్రుడుగూడ నాతనివెనుకనే దిరుగుచునిట్లు చెప్పుచుండెను. "కాని, నారాయణచంద్రుసహితము మనకాపేటిక యధికారి నామాంకుల నెరిగింపజాలకపోయెను. అందుచే మనము జీవనాథునికడకే బోవలసివచ్చినది. అట్లే యొనర్చితిమి. కాని, ఎవ్వడో యననేల హంతకుడు, మహానీయుడగు రత్నపేటిక యధికారి స్వయముగనో, సహకారులవలననో, మన రహస్యము[illegible] గనిపెట్టి మన వెనుకనే జీవనాథునియిల్లు జేరుకొనియెను. మేము లోన జీవనాథుని చరిత్రము వినుచుంటిమి. దానినాతడుగూడ వినియున్నాడు. జీవనాథుడింక నాపేటిక హక్కుదారుని చరిత్రనంతను జెప్పనున్నాడు. ఇంక సర్వము బట్టబయలుగానున్నది. ఈఅంశములన్నియు సవిస్తరముగా జెప్పగలవాడా జీవనాథుడొక్కడే. ఇంక నెవ్వరీసంగతి నెరుంగరు. కొద్దియోగొప్పయో యెరింగిన నారాయణచంద్రునకు వారి నామములు దెలియవు. అట్లయినచో మన [illegible] జీవనాథునికి
యగత్యమేయుండకబోయెడిది. హంతకుడీ యావద్వృ[illegible]
పెట్టి, తనచరిత్రను జెప్పబోవు జీవనాథుని దుదముట్టించెనిల్లా.

చరిత్ర గనుసిగూఢమైపోవును. అల్లి
గోర్కె యిప్పటికి ఫలించినది.

దొర:—నిశ్చయము. నీవు జెప్పిన
ము—ఇంతత్వరగా నాతనికి మనప్రయత్నము.

శర:—ఎట్లయిన నేమి? ఆతడు సర్వము.
డు. చూడగా నాతడు మనలను సర్వదా వెన్నాడుచు

దొర:—సందేహమేమి? లేకున్న నాతడేగి ద్రెం

శర:—ఇంక మనము బోయి యాశవమును బరీక్షింపవలసి యున్నది. తనురుగూడ దయచేయవలయును.

దొర:—శవపరీక్షలో విశేషము లేమైన దెలిసికొనవచ్చునా?

శర:—ఏమో? చెప్పజాలను. ఆతడు గుండు దెబ్బచే మరణించి యున్నాడు. ఆతని వక్షమున దుపాకి గుండు నాటియుండును. అది మనకు ముఖ్యకరమగు వస్తువుగాన. పోయి చూతమురండు.

"సరియే"యని దొరగారు దుస్తులనుదాల్చి,
శరచ్చంద్రునితోగూడ వైద్యశాలకేగి, డాక్టరుగా
నాథుని గృహము జేరెను.

అప్పటికపుడే మదన్ సింగుగూడవ
శవమునుజూచిరి. అటునిటునిల్ల
నేమున్నది. హంతకుడు పిస్తో
తుపాకితో జీవనాథుని
యేగాని, యింటిలో
బాదమిడుట కాతడ

డాక్టరుగా
గాముగా నెటుజ

ు క.

ే చూతము." అని దానినందికొని,
ు భాగమున "ఆర్నాల్డు కంపెనీవారి
ుచి.



# ్వితీయ ఖండము.

సంపూర్ణము.



అతిభయంకరుడు. జగద్విద్రావణుడు

# భయంకరుడు

ఆ)

ుముడిగి స్తంభీభూతుడు
ేయములు హృద్గోచర
ుల గల్పించుచు
రెండు భాగము
౧ ౧

# రత్నపేటిక



## చతుర్థఖండము.



### శత్రువిజయము

నవకుమారబాబు శరచ్చంద్రుని బావమరది. భార్యసోదరుడు. రమారమి యిరువదేండ్ల ప్రాయమువాడు. సుందరమూర్తి. ఇంతవరకును బ్రహ్మచారి. ఈతని తలిదండ్రులు గతించి చాలా కాలమైనది. వారింతవరకు బొంబాయినగరమున నుండెడివారు. జననీజనకులు గతించిన నాటి కాఱువత్సరముల ప్రాయంపు నవకుమారుని శరచ్చంద్రుడే చేరదీసి, విద్యాబుద్ధులగరపి, పెద్దవానిగా నొనర్చెను. ఇంకను నాతని విద్య పూర్తిగాలేదు. కలకత్తానగరమున దనకారోగ్యము చెడుటంజేసి యాతని శరచ్చంద్రుడిపు డాగ్రానగర పాఠశాల ప్రవేశపెట్టెను. గత వత్సరమునుండియు నవకుమారు డందే విద్యనభ్యసించుచుండెను. వేసవి కాలమగుటచే రెండుమాసములవరకును పాఠశాలలన్నియును మూసి వేసిరి. అందుచే నవకుమారుడిపు డక్కగారి యింటికరుదెంచి యుండెను. పరీక్షలుగూడ బూర్తియగుటచే నాతనికిపు డెట్టి యలజడియును లేదు. పరీక్షాఫలిత మెప్పుడు వచ్చునో యను చింతదక్క నాతని కేయితర విచారమును లేదు. రెండవవత్సరపు పరీక్ష కాతడు మొన్ననే పోయి యున్నాడు. బాల్యమునుండియు నాతడెన్నడు నేతరగతి యందును విఫలుడుగా లేడు. ఆతని తెలివిదేటలు శ్లాఘనీయములు. అందుచే శరచ్చంద్రుని కాతడనిన బహుప్రాణము.

నవకుమారుఁడు కోటీశ్వరుఁడు గాకపోయినను ధనవంతుఁడనిగఁ జెప్పవచ్చును. ఇపుడాతని యాస్తినంతయు శరశ్చంద్రుఁడే భద్రముగా గాపాడుచు, ప్రతిసంవత్సరమును మూలధనమును వృద్ధిఁబొందించుచుండెను. నవకుమారుని విద్యకగు వ్యయమంతయు దానేభరించుచు, నాతని రాబడినుండి కాసైనను వెచ్చింపక మూలధనమున జేర్చుచుంటచే నది యనునిత్య మపరిమితవృద్ధి గాంచుచుండెను.

ఇందులకొక కారణముగలదు. శరశ్చంద్రునకు బుత్రసంతాన మింతవరకును బరమేశ్వరుఁడనుగ్రహింపలేదు. లలితకుమారి యాతని యేక పుత్రిక. ఇప్పుడు పదునాఱువత్సరముల ప్రాయంపుటీడునాఁగ. సౌందర్యఖని. సుగుణపేటిక. విద్వన్మణి. ఇంతకన్న నామె చక్కఁదనమును గాని, సుగుణగణంబులఁగాని వర్ణింపఁబూనుట హాస్యాస్పదము. ఈవిషయమున నీమాలేఖిని నెంతబతిమాలినను నొకపదమైన నడనని పట్టుబట్టి కూర్చునియున్నది. ఒకవేళ నిర్బంధింతుమనుకొందము. అయిన బ్రయోజనమేమి? ఈవరకెందరో మహానుభావులు పీల్చి పిప్పిజేసినను పదముల నన్వయించి సమకూర్చుకొని పదుపులిడునేగాని నూతనమార్గముల ద్రొక్కఁజాలదు. ఈమాత్రమునకై మాలేఖినిని నిందింపఁజాలము. సుందరీమణుల భూషణంబగు లలితకుమారి వర్ణనావిషయమున నొక్కమాలేఖినియేగాదు, శతసహస్రలేఖినులొకచోఁ గూడినను నూతనశ్లేషాలంకారములచే పాఠక హృదయముల రంజింపజేయ నేరవని నిశ్చయముగాఁ జెప్పగలము.

కాన, పాఠకా! లలితకుమారి శృంగారాభివర్ణన నీవు వినఁగోరితివో—ఆమె సుగుణగణంబుల నీవు బేర్కొనఁనెంచినచో,—ఆమె విద్యాపాటవము నీవు బరీక్షింపఁదలఁచినచో—నీవే కవివై—నీవే చిత్రకారుఁడవై—నీమనోఫలకమున—నీవాంఛనీయమగు నొకానొక సుందరతర విగ్రహమును జిత్రించికొనుము. దానినీయిచ్చవచ్చినట్లభివర్ణించుకొనుము. అంతియేగాని, మేమాపనిని బూనికొనినచో జగంబున మాబోంట్లవిమర్శకశిలాఘాతంబులచే మాతలలు వాచిపోవుట నిశ్చ

యము, గాన, మాకానిందయేల?

నవకుమారున కెనిమిదేండ్ల ప్రాయమున లలిత జన్మించినది. బాల్యము నుండియు వారిద్దరకును బ్రాణమైత్రి యలవడినది. “మామా—మామా” యనుచు లలిత యాతని నొక్కనిమిషమైనను విడువజాలకుండెడిది. కలకత్తాలో నున్నంత కాలమును నవకుమారుడామెకు విద్యాగురుడై యుండెను. అయిన నాతనికడ లలితకు జనువే గాని భీతి యెన్నడును లేదు. వారొక్క కంచమునదిని, యొక్క మంచమున బండెడివారు. ఒక్కక్షణమెడబాయుటయన్న వారికొక యుగము వలె గానవచ్చెడిది. నవకుమారుడెట్టో పాఠశాలకేగు సమయమున మాత్రము లలితను విడువక తప్పెడిది కాదు. ఆయెడబాటుసైతము వారికెంతో యసహనమైయుండెడిదన్న వింతకాదు. తుదకు నవకుమారుడు కలకత్తావిడచి యాగ్రాకేగినపుడు లలిత నెలదినముల వరకును దిగులొంది నిద్రాహారముల వర్జించి మంచముబట్టిపోయినది. ఒకనాడపాయస్థితికిగూడ వచ్చినది. అంత శరచ్చంద్రుడు వెంటనే నవకుమారుని రావించి, యొక నెలవరకందేయుంచినగాని లలితకారోగ్యములవడలేదు. రానురాను జ్ఞానములవడుటచే లలిత నవకుమారుయెడబాటున కెట్లో సమ్మతించినది వారిస్నేహపాశమంత సుదృఢమైనది.

ఇన్నిదినాలకు మరల నవకుమారుడు గంటబడుటచే లలితకు బ్రాణములు లేచివచ్చినవి. ఆమె బాల్యావస్థ యించుమించుగ గతించుచున్నను, నవకుమారునికడ మాత్రమామె బాలయే. తలిదండ్రుల యెదుటనే మామయొడిలో జంటిబిడ్డవలె నేగూర్చుని, లలిత లలిత వాక్కుల జననీజనకుల కానందముగూర్చుచున్నది. ఆమె ప్రేమ నిష్కళంకము—నిరుపమానము. అట్టిదివ్యప్రేమ యనుభవైకవేద్యమే గాని వర్ణింబనలవిగానిది.

నవకుమార లలితాకుమారి కల మూలమున శరచ్చంద్రుడును యాతని భార్యయగు రాధామాయియు మాత్రమే యిపుడట్టి ప్రేమాబ్ధితరంగమాలికాడోలికలనూగుచున్నారు. అది దైవదత్తము

పరప్రాసాదము. నవకుమారుని యాగమనదినము నుండియు దమ గృహము సర్వసంపదల కాలవాలముగుటం జేసి యాదంపతులాతని దమ కన్నకుమారునివలెనే ప్రేమించుచున్నారు. ఆతడు శుభకరుడని వారినమ్మకము. రాధామాయికిగూడ సోదరునిపై నమితప్రేమ. వేయేల నాగృహ ప్రేమనిలయము.

శరశ్చంద్రుని గృహోత్తరభాగమున బాకశాలనుగలిసియే యొక చక్కని పూదోటగలదు. అందనేకజాతుల ఫలవృక్షములు, పుష్పలతలును గలవు. నవకుమారుడాగ్రామమున నున్నంతకాలమును లలితయే యావనమును సంరక్షించుచుండును. ఆమెకా వనమన్న ప్రాణప్రదము. కలకత్తానుండి వచ్చినంత కాలమును వనమును నవకుమారుడే పెంచెను. ఇపుడు లలిత దానిని బోషించుచున్నది. ఆగ్రా నుండి యెన్నడు నవకుమారుడు కలకత్తా యరుదెంచినను ముందుగ నాతడు బూదోటజూచి సంతసించుట యాతని యలవాటు.

నేడాతడక్కడ లలితం గూడి యాతోటనంతను బరీక్షింపుచుండెను. లలిత యాతనికి బ్రత్యేకముగా బ్రతివృక్షమునుం జూపుచు, దాని యభివృద్ధికై తానెంత పాటుబడెనో, యాతడు లేనితరి నామొక్క యెన్నితడవులు బుష్పించెనో, యాపుష్పములగోసికొని తానెంతగ శృంగారించుకొనెనో, దానిచే దీమళ మెంతటి మనోహరముగానుండెనో మున్నగు యమాయికపు బలుకుల బలుకుచు నవకుమారు నలరించుచుండెను. ఆతడాబాల బేలతనంబునకు జాలినొందుచు, ఆమె వాక్కుల మాధుర్యమున జొక్కి పారవశ్యమందుచుండెను. తుదకు వారొక యంటుమామిడి గున్నక్రింద నాసీనులై, వారి యెడబాటు సమయమున జరిగిన వింతలన్నియు జెప్పుకొనుచుండిరి.

నవకుమారుడు లలితవాక్కుల నాలించి యలరుచుండెనే గాని, తానేమియు విశేషముల జెప్పుచుంటలేదు. కాని, లలితమాత్రము మామా వచ్చినతోడనే సంతోషముగ ముచ్చటలాడుట కెన్నియో సంగతుల జ్ఞప్తియందుంచుకొనియెను. ఆమె నవకుమారుని తొడపై

తలనిడికొని చెప్పినసంగతి జెప్పక నెన్నియో అంశములు జెప్పుచుం డెను. "మామా! నీవు ఆగ్రా యేలపోయెదవు? ఇక్కడ నీకు గావలసిన చదువులు లేవా? ఇక్కడ నీవున్నచో, మనమీ పూదోట లోనే యొకగది గట్టించుకొని హాయిగా జదువుకొనవచ్చునుగదా? అపుడు నాబొమ్మలన్నియు దెచ్చి మనగది చక్కగా ముస్తాబు జేస్తాను. నిత్యమూ! గులాబీ,- మల్లెపూవులు దొరుకుచునే యుంటవిగదా! అంటుమామిడిచెట్లు చూచేవా యేలాపూచేయో! మామా! నీవు గనుసువాడివేసువమా! ఉత్తప్పునల్లా ఆగ్రాలోనేయుండి పళ్ళకాలం రాగానే సరిగా యిక్కడ దిగుతావు. అంతవరకూ నేను రెక్కలు విరిగేటట్లు నీళ్ళుపోసి పీటిని పెంచాలిగదా! పాపం—అమ్మకూడా చాలాసార్లీ చెట్లకన్నింటికీ నీళ్ళుతోడేది. అదిచూసి నాన్నగారుకూడా యొక్కొకపుడు సాయంచేసేవారు. అయితే వారికి దీరికెక్కడ? మామా! చెపితే భయంవేస్తుంది. ఈమధ్య నాన్నగారు, ఏవో కూని కేసులట. అవిచేసిన దొంగలనిపట్టుకోడానికిరాత్రీపగలూ అనకుండా తిరుగుచున్నారు. ఒక్కొక్కప్పుడు రెండుమూడురోజులవరకూ గూడ యింటికిరారు. అమ్మకునాకు ఎంతోభయం. ఏం చెయ్యను? పాపం— ప్రతిరోజూ యిద్దరుపోలీసువాళ్ళు మనయింటిదగ్గర పడుకుంటారు. అదేమిటో. ఎంతమందియున్నా నాన్నగారు లేకపోతే మాకు ఎంతో భయంవేస్తుంది. అన్నంకూడా సహించదు. కానీ, మామా! నాకు ఆగ్రానుండి ఏమీ తెచ్చావుకావుగదా? పోనీలే. నాపైనీకు మునుపటి వలె ప్రేమలేదు, ఆగ్రాలో మంచిమంచిముత్యాలబొమ్మలుంటాయట కదూ? ఏం—ఏం—పోనీ, మామా! మాటాడవూ? కోపంవచ్చిందా? ఎందుకూ కోపం? చెప్పు—చెప్పుమతీ" అనుచు నామె యాతని చుబుకమునుబట్టి యటునిటునాడించుచు, బ్రశ్నించుచుండెను. ఆముద్దరాలి యమాయిక ప్రవర్తనముంగాంచి నవకుమారుడపరిమితానందము నందుచుండెను. ఎంతటివారికట్టి సౌఖ్యము లభించును?

మోమున చిఱునగవంకురింప నాతడు "లలితా! నాచిట్టీ! నీకు

గావలసినన్ని బొమ్మలు తీసుకొనివస్తాను. ఇంతస్వల్పానికేనా విచారము? లలీ! నీకుగావలసిన యాటవస్తువులు, నీయిష్టంవచ్చిన బొమ్మ సామానులు, యిక్కడదొరుకవా? రేపునీకు యేరకం బొమ్మలు కావాలో చెప్పు. నిముసంలో తీసుకొని రాకపోతే నన్ను మామా అని పిలువకు. సరేనా? వెర్రిదానా! ఆగ్రాలోయున్న వస్తువులీపట్నంలో మాత్రంలేవా? ఎంతమయాకురాలివి!" యని బలికి యాతడామె న్నును జెక్కుల బలుగతుల ముద్దుల ముద్రించెను.

లలిత:—సరేగాని, మామా! ఆబొమ్మల పేరేమో నేనిచటం జెప్పలేనుగాని నన్నుకూడా రేపునీతో బజారునకు దీసికొనిపోతావా? చెప్పు. అలాగైతే నాయిష్టం వచ్చినవేవో అక్కడే యెంచుకు తీసుకొను ఆలాగేలా? అన్నట్లు మనపొరుగునేయున్న శారదారాయినికూడా తీసికొనిపోదాం. నాన్నగారిని అడిగి మోటారులో వెళదాం. ఏమంటావు. కలకత్తా అంతా చూడాలని నాకెన్నాళ్లనుండో యుంది. నాన్నగారిని ఎన్నిసారులడిగినా యెక్కడికీతసికెళ్లను వారిపనేవారిది.

అనుచు నామె యప్పుడే మామాతోను, శారదతోను మోటారులోగూర్చుని బజారునకేగుచున్నట్లు సంతసించి నవకుమారుని కంఠము గౌగలించుకొని యానందవార్ధినోలలాడసాగెను. నవకుమారుడామె బేలతనముగాంచి మిగులసంతసింపుచు, నడుమనడుమ యామె చంద్రవదనమును ముద్దాడుచునేయుండెను. ఆహా! యెట్టి నిష్కల్మష ప్రేమ—?

అట్లు వారెంతతడవుముచ్చటించిరో వారేయెఱుంగరు. అరుణుడస్తాద్రిజేరనింకెంతయోవేళలేదు. అరవిడినమల్లెల సౌరభంబులగొల్లగొని మందపవనాంకురంబులు మేనికి జల్లగ వీచుచుండెను. గండుకోయిలల రసాలవృక్షాగ్రభాగంబుననిలచి కుహూకుహూ ధ్వని యొనరింపుచు శ్రోతలకు గర్ణానంద మొనగూర్చుచుండెను.

ఆసమయమున నవోత్తరద్వారమెవ్వరో దెరచుటచే "కిఱ్ఱు" మను ధ్వని వినిపించెను. లలిత నవకుమారునియంకముపీడి ద్వారము

వాక దృష్టినిగుడించెను. నవకుమారుడంతకుమున్నే యాసవ్వడినాలించి యెవ్వరో యీవచ్చెడివారని శంకించుచుండెను. అంతట లలిత “మామా! ప్రొద్దుపోవుచున్నది. తోటలో పురుగో పుట్రయో యుండును. లే—యింటికి బోద”మని యాతని హెచ్చరించుచుండెను. ఆతడు “లలితా! మనము ద్వారము మూయుట మరచితిమి. ఒకవేళ నాన్నగారే యీత్రోవను వచ్చుచున్నారేమో? వారిని గలిసికొని బోవుద”మని బల్కుచుండగనే యొకవ్యక్తి తలుపునించుక తెరచి, దానిగుండా దల నివలబెట్టి నలుదిశలబరికించుచుండెను. నవకుమారుడది గాంచి “ఎవరువా”రని బిగ్గరగ గేకవైచెను. తోడనే యావ్యక్తి తలుపు బూర్తిగ దెరచుకొని సరాసరి వీరికడ జేరి “నీవు శరశ్చంద్రుని మరదివా? అవును. నీవే. అటయిన నీలేఖ భద్రముగ మీ బావగారికొసంగుము. అంతియే-జరుగురు” యనుచు నాతడొక లేఖను దనయంగీనుండి దీసి నవకుమారుని హస్తమునబెట్టి, లలితముఖమువైపు నొక్కక్షణమాత్రం దిలకించి గిఱ్ఱున వెనుదిరిగి పోవుచుండెను.

ఆతని వాడిచూపుల కోర్వజాలక పాపము, లలిత నవకుమారుని జాటున కేగెను. అంత నవకుమారుడు “అయ్యా! మీరెవ్వరు? ఇట్లు దొంగత్రోవ నరుదెంచితిరేల? ఒకవేళ మా బావగారు వీధిలోనే యున్నారేమో? వారికి స్వయముగా మీరే యీలేఖ నొసంగి, వలయు సంగతుల మాట్లాడుకొనవచ్చునుగదా?” యనెను.

ఆవ్యక్తి—“అక్కర లేదు. ఇపుడు వారినిజూడ నక్కర లేదు. ఈత్రోవనే బోవుచు నీద్వారము దెరచియుంటచే నిందుబ్రవేశించితిని. క్షమింపుడు” యనుచు నిలువకయే దనదారింబోయెను. నవకుమారు డాతని వేషభాషల బరికింపుచు, నాతడేగిన కొంతవడికి ద్వారము భద్రముగ బాధించి, లలితకరము దనకరమునబూని గృహోన్ముఖుడై పోవుచుండెను. మార్గమున లలిత “మామా! ఆతడెవ్వడోగాని, యాతనిముఖముజూచిన నాకేలొకో మిక్కిలి భయముగల్గినది. ఆదుర్మార్గుడు—చూచితివా? యెట్లు నాముఖము నిదానించిచూచెనో!

అపుడు నేను నీచాటున కేగితిని. ఆతడెవ్వడు మామా?" యని సాశ్చర్యముగ బ్రశ్నించెను.

నవ:—లలితా! ఎవ్వడైన నేమి? ఏదో జాబు నొసంగుటకై మనమాద్వారమును దెరచి యుంటంజేసి యాత్రోవనే వచ్చినాడు. లోకమున నందరును నీవలెనే సౌందర్యవంతులుండరు. కొందరి ముఖములు భీతిగొల్పుచుండును. అట్లువారిసృష్టించిన పరమేశ్వరునిదాలోపము గాని వారిది గాదు. (ఇంతలో వారిల్లు సేరిరి.)



ఆర్నాల్డు కంపెనీవారు ప్రసిద్ధిపొందిన తుపాకిమందుగుండు వర్తకులు. వీరికర్మాగారము జోడాశాంకువీధిలోనున్నది. ఈకంపెనీలో బనిచేయు వారందరును మూడుపాళ్ళు ఫ్రెంచిదేశస్థులు. వీరు తుపాకిగుండ్లు—రవలు—తూటాలు—రివాల్వర్లు మున్నగునాయుధములు వేనకువేలు దయారుచేసి, ప్రపంచమున సాధారణముగా నన్నిభాగములకును నెగుమతిజేయుచుందురు. అందుచే నొక్క కలకత్తానగరముననే గాక ననేకదేశముల నీకంపెనీవారిపేరు మారుమ్రోగుచున్నది. తుపాకీపరిచయమున్న ప్రతిమనుజుడును వీరిపేరెఱుంగకుండ నుండడు—

జోడాశాంకు పెద్దబజారువీధి. ఇందనేకరకములగు దుకాణములు గలవు. బాలుడైననునావీధినిజనునపుడు "W. C- ఆర్నాల్డు కంపెనీ తుపాకి—మందు—గుండువర్తకులు—"యని తాటికాయలంతటి యక్కరములతో జెక్కిన వారిబల్లనుగాంచకుండుట దుర్లభము. ఈవీధిని పేరొందిన యితర కంపెనీలనేకములు గలవు.

ఆర్నాల్డువారి కర్మాగారము రమారమి యొక చదరపుమైలు విస్తీర్ణముండును. అందు ముందరిభాగము మూడంతస్థులమేడ. ఇందలి

చిత్రవిచిత్ర పరికరములు, వాటినెల్లనుంచినతీరును, గాంచిన, చక్ర వర్తుల యాయుధాగారములు దలంపునకు వచ్చుట సహజము. ఈ సౌధమున ననేకగదులుగలవు. సౌధము వెనుక భాగమున యంత్రముల సహాయమున నాయాయుధములన్నియు దయారగుచుండును. సౌధ మున మొదటిద్వారము దాటినతోడనే పెద్దహాలొకటుగలదు. అందే కంపెనీ యజమానియగు ఆర్మ్‌స్ట్రాంగుదొరగారు సమున్నతాసనముపై నధిష్ఠించి, వస్తువులగొని జనువారొసంగు ధనమును జమకట్టికొను చుండును. ఇతనికిక్రింద ననేకగుమాస్తాలు, లేఖకులును బనిచేయుచుందురు. ఆగంతకులకు నలయు బరికరముల జూపించుటకొందరిపని. వాటివాటి ధరల నెఱుంగజేయుటకొందరిపని. వానింజీసియొసంగుట మరికొందరి పని. ఇచ్చినవస్తువులకు రశీదులిచ్చుట దక్కఁగలవారిపని. ఇట్లు నచటిజనమంతయు నెవనిపని వాతడు జూచికొనుచు, క్షణమైనను వ్యర్థముగ మాటాడదీరికగలిగియుండరు. అట్టితరి వారిచాకచక్యముల జూచి తీరవలసినదే—

నిన్నటిదినమున శరశ్చంద్రునకు జీవనాథుని హృదయకోశము నుండి వైద్యుడు గోసితీసి యొసంగిన యగ్నిగోళముపై నీయార్మ్‌స్ట్రాంగు కంపెనీవారి ముద్రాక్షరములే యున్నవి. దానింగూర్చియాకంపెనీలో విచారించిన నేమైన క్రొత్తసంగతులు తెలియునేమోయని శరశ్చం ద్రుడాగోళమును జేబునందిడికొని కంపెనీకరుదెంచెను. నాయకుడగు నార్మ్‌స్ట్రాంగుదొరగారాతని గాంచినంతనే, తనప్రక్కనున్న యాసన మాతనికిజూపి "దయచేయు"డనిగోరెను. శరశ్చంద్రుడందు వసించెను.

ఆర్మ్:— అయ్యా! తమరు దయచేసిన పని యేమో నెఱింగింతురా?

అని సవినయముగా బ్రశ్నించెను. శరశ్చంద్రుడుతన జేబునుండి యాగుండునుదీసి దొరగారి బల్లపైనునిచి "అయ్యా యీగుండుపై తమ కంపెనీముద్రాక్షరములున్నవి. దీనినేతుపాకికిగాని, రివాల్వరు నకుగాని, జేసితిరో? అట్టితుపాకుల నీవరకెన్నిటి నెవ్వరెవ్వరికిచ్చి

యుంటినో దయచేసి చెప్పవలయు"నని కోరెను.

నారగారు దానిందీసి, యటునిటు ద్రిప్పి చాలవరకు బరీక్షించి "అవును. ఇది మా పెట్టెలోనే దయారయినది. నిజమేగాని, యిదేదో తుపాకికి సరిపోవునో మున్నగు విషయము లాలోచించుటకు యిప్పుడు మాకు దీరిక లేదు. దయయుంచి యింకొకసారి దర్శనమిప్పించుడు." అనుచు నాగుంపును మటలబట్టిపై బడవైచెను.

శర:—అయ్యా! దయయుంచి మాకీవ్యాపారమిపుడే తెలియజేసినచో సంతసించెదను. దాన మాకెంతయో ప్రయోజనముగలదు. ఆలస్యమైన ననేకానర్థములు గలుగవచ్చును.

ఆర్మ్‌స్ట్రాంగ్:—ఓహో సరే! ఇదెక్కడిసనయ్యా మాకు! మాకిప్పుడెంతమాత్రమును దీరిక లేదు. గుండును జూచి దాని చరిత్ర చెప్పుచు గూర్చున్నచో మా వ్యాపారము లేమికావలయును? అంతే యగత్యమైనచో సభ నొక గంటవఱకైనను వేచియుండవలెను. అంతవఱకేమాత్రమును దీరిక లేదు.

శర:—అయ్యా! తమకంతకోపమేలకు? ఇది నాసొంతగారి పనిగాదు. పోలీసువారి వ్యవహారము. ఒకానొకహత్యకేసు సందర్భమున నీవిషయము అగత్యముగ గావలయును. ఏమందురు?

నారగారీమాటలవిని తుల్లిపడియెను. ఆతని యాపాదమస్తకపర్యంతమొక్కసారి కంపించిపోయెను. శరీరమంతయు స్వేదసిక్తమయ్యెను. నోటనడిమారెను. తుదకెట్లో "పోలీసులా? హత్యయా?" యని మాత్రమనియెను.

శర:—అవును హత్యసందర్భముననే. మీరిపుడు మాటాడుచున్నది యపరాధపరిశోధకుండగు రామాలాల్ శరశ్చంద్రునితోనని తెలిసికొనుడు—

శరశ్చంద్రునిపేరార్మ్‌స్ట్రాంగుదొర యిప్పటికెన్నియోసార్లు విని యున్నాడు. ఆతని ప్రతాపము స్వయముగా గనుగొనకపోయినను, కర్ణాకర్ణిగ నిత్యమును వినుచునేయున్నాడు. అట్టిధీశాలి నెఱుంగక

ముగ నాతని కౌఁగిలించి, కొంతవడి హంతకుని జాడలరయు మార్గముల ముచ్చటించి, యికముందు దానొనరింపఁబోవు ప్రయత్నముల దెలిపి, పిదప దన గృహాభిముఖుఁడయ్యెను—



3

పాఠకా! రాణీగల్లీలోని డెబ్బదియెదవ నంబరు గృహమునకిపుడు మనము బోవలసియున్నది, అచటివిశేషము లెఱింగి చాలకాలమైనది. కాన, నిపుడచటి పరిస్థితులఁగొంత జూడవలసియున్నది.

ఈగృహము మూడంతస్థులమేడ యని యీవరకే జెప్పియున్నాము. క్రిందియంతస్థున ద్వారములన్నియు నెప్పటివలెనే బంధింపబడియున్నవి. అందీవఱకు సంచరించు జనులైనను దాని సమీపించి యుండలేదు. ఏలొకో కారణము దెలియదు. కాని, లోనవారెప్పటి రీతిగనే నిగూఢముగ సంచరించుచునేయున్నారు. మూడవయంతస్థున రెండు పెద్దగదులును, వాని నడుమనొక హాలునుగలవు. ఇవిగూడ వీధివంక కిటికీలును ద్వారములును మూయబడియేయున్నవి. లోన హాలులో నిద్దఱు పురుషులును, నొక స్త్రీయును నేమోమంతనము లాడుచున్నారు. స్త్రీ నేలనొక తివాసీపై నర్ధశాయినియై వారికుత్తర కును ప్రత్యుత్తరములిచ్చుచున్నది. పురుషులామె ప్రక్కనేకూర్చుని వాదోపవాదములు జేయుచున్నారు. అందొకని నాడు మనమీమేడ లోనే రెండవయంతస్థున నొక స్త్రీతో ప్రసంగించుచుండగ గాంచి యుంటిమి. రెండవవాడెవ్వడో యెఱుంగము. కాని, వారి కథాసందర్భమునుబట్టి మనకు వారలగుర్తింప ననువుపడునేమో చూతము.

అందు మొదటివాడు రెండవయాతనిగాంచి "స్వామీ! ఇంకను నెంతకాలమీ బంధమున నన్నుంచెదరు? మనకార్యములన్నియును చక్కబడినవి. ఇంక మనము గోరదగినదేదియును లేదు. ఇపుడామెను

జూచినచో నెట్టితొందరయును గలుగనేరదని నాయభిప్రాయము. కాన, నాకీనాడే యామెను వీక్షింప శలవొసంగవలయును. తప్పదు. ఇందు నష్టమేమియును లేదు.

రెండ:—మధూ! నీకంతకంతకును మతిపోవుచున్నట్లున్నది. నీకామాగ్ని నీయుక్తాయుక్త పరిజ్ఞానమును దహించివేసినటులున్నది. లేకున్న ననునిత్యమును నీవిట్లు నన్ను నిర్బంధింపవు. తుచ్ఛమగు నీసౌఖ్యము కొఱకాసించి మనప్రయత్నములన్నియు మంటగలుప జూచుచున్నావు. ఈమాత్రపు టూహ నీమదికేల దోచకున్నదో యాశ్చర్యకరముగానున్నది. ఇకముందామెయెక్కడికేగును నీవెక్కడికేగెదవు. అపుడు మేమెవ్వరమును నీకు గనబడము సరి కదా మము నీగుమ్మమైనను ద్రొక్కనీయవు. అంతమాత్రమున కింతతొందర యేల? నీవన్నట్లు మననాటకమింకను బూర్తికాలేదు. అందులకింకను రెండు మూడంకములున్నవి. ఇల్లలుకగానే పండుగ కానేరదు. ఇపుడుమనము నడిసముద్రమున నున్నామని తెలియదా? సాహసించి మన పడవను నట్టేట ద్రోసితిమి, ఇంకను తీరము జేర లేదు. మననావను దీరము జేర నీకుండ ననుమనే తుఫానియలుగావింపవలెనని భీకరతరంగములెన్నియో గాచికొని యున్నవనుసంగతి మఱువకుము. ఇట్టి యాపత్సమయమున నా నీకిట్టి కోర్కెగలుగుట.

మధు:—స్వామీ! మీగంభీరోపన్యాసము వినుకొలది నాకు నవ్వువచ్చుచున్నది. నారికేళమునకును దూడగడ్డికిని ముడివెట్టి మీరు సాకు జెప్పుచున్నారుగాని, యీనాకోర్కెకును, మన ప్రయత్నములకును సంబధమించుకేనిగలదా? అట్లుంటెనని మీరొకవేళ నన్ను గామాంధుడని దూషించిన దూషింపవచ్చును గాని, నాపల్కుల బాగుగ నాలోచింపుడు నేజూడదలచిన కాంత మన యధీనమందే బాధింపబడియున్నదిగదా? అట్టిదాని నొకపరి గాంచినంతమాత్రమున నామె యొనర్చెడిదేమి?

రెండవ:—ఆహా! నీవు మూర్ఖుడవు. నిన్నా బ్రహ్మయైనను

మఱల్పజాలను. "ఇంతను మునింగినదేమా?"యని యడుగుచున్నావా? ఇంతమాత్రమెఱుంగజాలవా? ఆమె నీప్రియురాలు—నీమనోహారిణి—నీముద్దులమూట. మాకొంపగాల్పుటకింకేమిగావలయు? మీయిఱువుర సమాగమమే మాచేతికి దప్పక చిప్పనిచ్చును. మాకంతమున కుటుంబము దగల్చును, ఇంకేమి కావవలెను? ఇంతకన్న ముప్పేమున్నది—

మధు:—గురూ! మీరు విపరీతముగా బెంగగొనుచున్నారు. నన్నంత కృతఘ్నునిగా నేలజూచుచున్నారో నేనెఱుంగను. నేటివఱకును మీయాజ్ఞనతిగలనైనను జవదాటియెఱుంగను. అట్టిచో నాతుచ్ఛురాలిని, యామాయావిని. యాద్రోహురాలింగాంచినంత మాత్రమున, నామె మాయాజాలగుళికలోన జిక్కుకొని సమయభంగము గావింతుననుకొన్నారా? ఇన్నిదినంబులు నన్నెఱింగియు—నాగుణాగుణములజూచుచుండియు మఱలనన్నీతీరు సందేహింప న్యాయమా? మీకిష్టములేక జూచుచుంటినిగాని, లేకున్న నీపాటికా పాపాత్మురాలి సంపర్కమునుండి యూపివేయకుందునా? నాకొనర్చిన ద్రోహమీ జన్మమున మఱువగలనా?

రెండ:—ఆమె నీకేమి నష్టముగలిగించినది? ఆవిషయమున నామె యపరాయకురాలే గదా?

మధు:—అదెట్లు?

రెండ:—అంతయు జేసినదామె జనకుఁడుగాని యామె యెన్నటికిని గాదు—

మధు:—అయినమాత్రమామె యాసంగతి నెఱుంగదా? ఎఱింగియు నిట్లు చేయదగునా?

రెండ:—అందామెకధికారము లేదు. తప్పైనను యొప్పైనను యింకొకని బలవంతమున నామె యనుసరింపవలసివచ్చినది గాని వేఱుకాదు. అందుచేతనే నిన్నామె యిప్పుడు గాంచినచో నీసమ్ముఖమున దన నిరపరాధిత్వము నీప్రకారముగా వెల్లడిజేసికొని, కల్లబొల్లి

మాటల నన్నానందింపజేసి, ప్రేమపాశమున నన్ను మరల బంధించి, తన వలం జిక్కించుకొని, పలాయనసూత్రమును బఠించుట నిశ్చయము. అప్పుడు మేమగ్నిగుండమున నుఱుకుటకన్న వేఱుగతి లేదు. ఏమందువు?

అంత నాశయనించిన స్త్రీ లేచి, వాని భుజము దట్టుచు "బళే. జగత్—బాగుగా జెప్పితివి. నీవన్నది ముమ్మాటికి సత్యము. అందొక్క-యక్షరమైనను దప్పు లేదు. నిజముగ నట్లు జరిగితీరును. ఈవిషయమును నాకు మీకన్న నెక్కుడనుభవము గలదు" యనెను.

మధు,—అమ్మా! నీవుగూడ నట్లే వాదింతువా? నేనంత మోహాంధుడననుకొంటివా? మోహమే నాయాశయమైనచో, వెదికి, వెదికి మఱల నీతుచ్ఛురాలినే మెడకు గట్టికొందునా? ఆమె మాయమాటలకు లొంగిపోవుటకు నేనంత వివేకహీనుడనా? నన్ను నీ వెఱుంగవా?

స్త్రీ:—నిశ్చయమే గాని, అది యిప్పటి గార్యకారి కాదు. నీ వెంతగ నామెను బహిష్కరింపజూచినను యామె మాత్రము నిన్ను వీడదు. ఇపుడామె విముక్తికి నీవే యాధారభూతుడవు. ఈ యకామె మోహావృత్తము గొంతిపట్టకు జపిచూచిన నీవిపుడామెకు లొంగక తీరదు. ఆమెకట్టి చాతుర్యమున్నది. ఆమె జన్మమట్టిది. తరువాత నీవామెను తెరదీసినను, దిగద్రోసినను సరే యామె లక్షింపదు గాని, పరిస్థితము నీవామెకు జోహారొనర్చితీరెదవు. కాన నీవింకను యోపిక బట్టవలసియున్నది. అయినను నైరాశ్యము ప్రయత్నము లెట్లున్నను యెఱుంగకుండ మాత్రము నీకోర్కె చెల్లింపబడనేరదని నేనుగూడ జెప్పవలసియున్నది. కాన, విచారింపకుము.

మధు:—విచారమెందులకు? ఇంతమాత్రమునకు బోయెడిదేమో మీ రెంత చెప్పినను నాకు బోధపడుట లేదు. ఇంతకును మీరు స్వతంత్రులు. నేనస్వతంత్రుడను. మీరు చెట్టిన దేబిక్కసరి లెండు, మీ యాజ్ఞానుసారమే నడిచికొందును. ఇంక నాయాలోచన మెందులకు.

అనుచు రోషమున ముఖమెఱ్ఱవడ నాతడాస్థలమును విడచి

వడివడి సోపానావరోహణావరోహణ మొనర్చి క్రిందకుబోయెను. ఆతనియా దుడుకుతనమున కాస్వామియు, స్త్రీయును మదిలో జాలనొచ్చుకొని నట్లు వారిముఖములే చెల్పుచున్నవి. వారాబోవునాతనిం జుర చుర జూచిరి. ఆచూపులే వానిని భస్మమొనరింపజాలును.



౮

అట్లాతడు వెడలిపోయినపిదప నాస్త్రీ యాపూరుషునింబిలచి "జగత్! మనము కొంతరహస్యముగా మాట్లాడవలసియున్నది. మన మాగదిలోనికి బోవుదమురమ్ము" అనుచు నాతని దోడ్కొని యా హాలును విడచి యొకగదిలోనికిబోయి లోనదలుపు మూసికొనెను. వారిట్లు మాట్లాడుకొనుచుండిరి.

స్త్రీ:—జగత్! యీాతడుజూడ వట్టిమూర్ఖునివలెనున్నాడు. కాకున్న, నిపుడారాక్షసిబజూడ వీనికింతతొందరయేల? అందు వీని యుద్దేశ్యమేమో దెలియకున్నది. మనచేత జిక్కియున్నదిగదా, యెందుబోగలదనియెంచి, యిపుడీతని నామెకడకు విడచితిమేని యొక వేళ నీవు జెప్పినట్లుగ జరిగితీరునని యే నానమ్మకము. ఏమందువు?

జగ:—నిశ్చయమే. నేనంతమాత్రము గ్రహింపకుండనట్లు బలికియుండలేను. నాకీతని యవివేకమును మనోనిశ్చలత్వమును సంపూర్ణముగా దెలియును. ఈతడు మోహాంధుడనుటకు సందేహము లేదు. వీని నడచుట యొతిపనిగాని, మనవాడీవేళ వత్తునని జెప్పి యున్నాడే. ఇంకను రాలేదేమి చెపుమా?

స్త్రీ:—తొందరెందుకు మాటలు జెప్పునంతచుల్కనగా బనుల జరుపుట గష్టము. మనవలెగాక నాతడు రెండుపాత్రముల ధరించి నాటకమాడవలయును. అందిసుమంతయైన ననుమానాస్పదుడైనచో, తనకొంప గూల్చికొనుటయేగాక, నిముసములో మనలనెల్ల మహా

దున్నాడుగదా యని జాలిదలచి, దిక్కుమాలినవాడని చూడజాలక మనవు బూనికొని, కార్యమీరీతి సాధింపగలిగితిమిగదా యన్న సంతసమీతనికానంతమైననున్నదా? పైగా మనకేదుగాడసాహసించినాడు. ఇపుడీతనికి బాగుగ కోపము వచ్చినట్లున్నది. అనుభవింపకపోడు.

జగ:—రానిమ్ము. ఇట్టి యల్పప్రయోజకునకు కోపమువచ్చిననేంత? రాకున్ననేంత? ఇప్పట్టున నీతనికికోపమువచ్చిన, దన్నుదానే జెరచుకొనునుగాని, మనల జేయునదేమి? ఇపుడు సర్వము నాతని ప్రాణముల సహితముగ మనచేతనున్నవని యెఱుంగడు గాబోలు? నిదురించుపులిమీాపములలాగ సాహసించుచున్నాడు. ప్రతిఫలమొక్క క్షణములో బొందగలడు. తలచిన నది యెంతయోసేపా? హ్వా—హ్వా

స్త్రీ:—తప్పు—తప్పు—జగత్! అట్టి దురుద్దేశ్యము మనకెన్నడునుగూడదు. మనలో మనకంతఃకలహములు జనించిన మనమే నశింతుము. కాక, మనకపరిమిత సహాయమొనగూర్చుచున్న యొకానొక యుపాయకుని నిష్కారణముగ జక్కులదోఁయవలసివచ్చును. ఈ నీచునిపై గక్షబూని యింతపనిజేయుట హానికరము. నీకీనియమమునను, భయమునను మనమే బుద్ధిజెప్పవలెగాని, భయమొందగూడదు. ఇంతకును నీ నన్నట్లానినిసర్వస్వమిపుడు మనచేతజిక్కియున్నది. కాన, నాతనికెంత కోపమువచ్చినను మనతోగలహింపజాలడు. నీవుమాత్రమెన్నడును దొందరపడక నిదానింపుము.

జగ:—అమ్మా! ఏమో కోపమున నోడలెరుంగక నట్లంటినిగాని "ఆరుమాసముల సాముజేసి మూలనున్న ముసలి బసుగునాబొడుచుట"? చాలుజాలు. ఇదిమన వంటయింటి కుందేలు. ఎక్కడికబోగలడు?

అనుచు నాతడు "ఎవరువారు? అమ్మా! ఎవ్వరో దలుపు సందున నుండి చూచుచున్నారు." యనెను.

స్త్రీ:—తలుపుతీయుము. బహుశామనవాడు వచ్చెనేమో?

జగత్సింహుడు దలుపుకేసెనుగాని, హాలులో నెవ్వరు నాతని గంటబడుటలేదు. ఆతడు నలుమూలల బరికించెను. అచ్చటగూడ నెవ్వరును లేరు. స్త్రీగూడ బయటికివచ్చి పరీక్షించెను గాని, యామెగూడ నెవ్వరిగనుగొనజాలకపోయెను. "ఊరకే భ్రమించి యుందు"మని బల్కుచు నామె మరల గదిజొచ్చెను.

జగత్సింహునకిందను యనుమానము విడుటలేదు. ఆతడు వడి వడి మెట్లదిగి, రెండవయంతస్తును వెదకి, యటనేదియుగానక, క్రింది భాగము గ్రిందకుపోయెను. అందుగూడ నెవ్వరాతని గనబడుటలేదు. ఒకగదిలో మాత్రమొకతని హింతుపడు మధుశాలిందాక నాతనిపై గోడమూలనిచ్చి యొకమంచముపై మేనువాల్చి పొస్తమునొకదాని జూచుకొనుచుండెను. ఆగదిద్వారము తెరువబడియుండెను. ఆతని ముఖముజూడ నలసినవానివలె జెమ్మటగ్రమ్మియుండెను. ఉచ్ఛ్వాస నిశ్వాసములు వడివడి నడచుచుండెను. అయినదాతడేయు దొంచి తమపల్కులాలించి, తామది గ్రహించుటకై జనువెంచి, యిదియు నెటుంగనివానివలె నిద్రనభినయించియుండునా? ఎట్లయినను జగత్సింహుడాతని ననుమానించెను. కాని వానికిట్లు గూఢముగ దమపల్కుల విన గారణమేమి? ఏమో? యెవ్వరెరుంగుదురు? అయినదిదిగనుగొన నెంచి "వధూ ఇప్పుడెవ్వరైన నీదారిని మేడపైనుండి వచ్చుట గాంచితివా?" యని యడిగెను.

ఆతడు జురచురజూచుచు, చేతినున్న పొస్తమూనలబడవైచి "ఏమో? నేనెవ్వరినిజూడలేదు. ఈమేడపైకి పరులెవ్వరెట్లురాగలరు? నీప్రశ్న యెంతయసందర్భముగానున్నదో నీవేయాలోచించుకొనుము మనకుదక్క పరులెవ్వరైనను మనమిందుంటిమనియైనను యెరుంగరే! ఇదికాపురములేక పాడువడిన గృహమనిలోకమెఱుంగదా? ద్వారము లన్నియు మూసియేయున్నవికదా? అట్టియెడ నిందెవ్వరు బ్రవేశింపజాలుదురు? నేడు నీకిట్టిభ్రమ యేల గల్గినదో తెలియకున్నది. ఎంతవిపరీతము" అని తీక్ష్ణముగా బలికెను.

జగత్సింహుఁడు నిశ్చేష్టితుఁడయ్యెను. ఒకవేళ నాతఁడే పొరబడి యుండవచ్చునని భావించెను కాని యీపల్కు లాలింపఁగనే యొకవేళ నతఁడే యిట్లు వచ్చియుండునా యని దలపోసెను. ఇందేదో మోస మున్నదని యాతఁడు గ్రహించెను. ఇంక నాతఁడేమియు మాట్లాడక వెనుదిరిగి మేడపైకరిగి యాయువతికీయుదంతమెఱింగించెను. "జగత్! అయిన నేమాయె? ఆతఁడన్నట్లుగనే పదులేఁకిని నీగృహముం బ్రవేశింప వలసిగాను. నీవే భ్రమసియుండవచ్చును. లేకున్న నాతఁడే బొంచి మన పలుకులాలించి యుండవచ్చును. రెండవదియే సత్యముగావచ్చును. ఏలనన నాతఁడు మనపైఁగోపించి పోవునుగదా? అట్లే మనముగూడ నాతనిపైఁగోపించి, యాతనిగూర్చి యేమి చెప్పుకొనుచుంటిమో విన వలెనన్న కుతూహలమాతనికి గలిగియుండవచ్చును. అది సహజమే. అయిన గానిమ్ము. అంతమాత్రమున బోయెడిదేమియును లే"దని యామె బల్కెను—

జగ:—ఎట్లయినను వ్యవహారము మించివచ్చుచున్నట్లున్నది. మనలో మనకు భేదాభిప్రాయములు గలుగుచున్నట్లున్నవి. ఇంకమనము గడు మెలకువతో బ్రవర్తించుచుండవలయును. ఏవేళ కెట్టి యూహలు పొడమునో చెప్పజాలము. నాకింకొక యోచన దట్టుచున్నది. మన వానితో బాగుగ యోచించి యీవ్యాపారముగొంతవఱకును జక్కబడుదాక నీతనిగూడ నుపేక్షసేయక నొకవిధముగా బాధించి యుంచుటయే మేలనితోచుచున్నది. అట్లని యాతనికి హానిజేయు సంకల్పము నాకు గలిగెనని భావింపవలదు. ఏమందువు?

స్త్రీ:—నిజమేగాని, యిప్పుడంతగా మునిగివచ్చిన దేమియును లేదు. విధిలేనపుడట్లే జేయవచ్చును. మనమిప్పుడు బయటిసంగతులెట్లున్నవియో దెలిసికొనినగాని, యేమార్గమును ద్రొక్కజాలము. అందులకు మనవాడు రావలయును, నేడెట్లయిన నాతఁడు దప్పక గలిసికొందునని జెప్పియున్నాడు. చీకటిపడుచున్నది. ఇంక నాతఁడు

రావచ్చును. నీవుపోయి యాతనిరాకకై యాద్వారముకడనే గాచి కొని యుండుము. పొమ్ము.



౫

చీకటి జగమెల్లనావరించెను. రాజవీథులలోని యంగళ్లన్నియును నింకను జనసమ్మర్దములుగనే యున్నవి. అట్టియెడ నామార్గమున నొకభీకరాకారుడు, కృష్ణవసనాచ్ఛాదితుడై యరుగుచుండెను. నల్లని బారుగడ్డమాతనికి భీకరత్వమలవడ జేయుచుండెను. ఇంచుకేనియు ధ్వనియొనర్పజాలని పాదరక్షల నాతడుదొడిగి, క్రమముగా డెబ్బదిమొదవనంబరు గృహమునకు జనుదెంచెను. ఈగృహమున ద్వారములన్నియు నెప్పటివలెనే మూసియేయున్నవి. ఆతడాగృహము వెనుదిరిగి, యొకసన్నని మార్గమునబోయి పోయి, పెరటింగల యొక తోటంజేరెను. ఈతోట చుట్టుప్రక్కల నెందునుదగ్గరగా గృహములు లేవు. ఆతడట్లు పోయిపోయి, దొడ్డిగుమ్మముంజేరి, నిమ్మళముగ దానిపై దట్టనారంభించెను. కొంతవడికెవ్వరో దానిందెరచిరి, ఆతడు లోనకేగి యెప్పటియట్లు దానిని మూసివైచెను. ద్వారముదెఱచినవాడు జగత్సింహుడే. ఆయువతి యాజ్ఞానుసారమాతడందే యాగంతకునికై వేచియుండెను. ఇరువురువును లోనికేగిరి. ఎప్పటియట్లు వారు మూడవయంతస్తున హాలులో జేరిరి. అది వారికి చేరిచావడి. ఆగంతకుని గాంచి స్త్రీసంభ్రమమున "వచ్చితివా? నీవు నేడు రావేమో యని భయపడితిని" యనెను.

ఆగ:—ఏలనమ్మా? మాధవీ! అంతభయమేల గలిగినది?

మాధ:—అబ్బే, ఏమియును లేదు. వచ్చుటకు జిక్కులేమైన గలిగినవో యని యనుమానించితిని గాని, మరేమియును లేదు.

ఆగ:—ఓహో! ఈచిక్కులు మనకెల్లప్పుడు నున్నవే. వీని కంతమెక్కడ? కాని, విశేషము లేమి?

మాధ:—అవియే నిన్నడుగఁబోవుచున్నాను. వింతలు విశేషములు నీవు చెప్పవలెగాని, మేమే మెఱుంగుదుము?

ఆగ:—ఇపుడంతగా జెప్పవలసిన విశేషము లేమియు లేవు. పూర్వమేవిధముగ నున్నదో, నిపుడుగూడ వారి ప్రయత్నముల ట్లే యున్నవి. ఈనాటకమున కాద్యంతములు గనుగొనలేక పాపము, శరశ్చంద్రుఁడు విలవిలదన్నుకొనుచున్నాఁడు. కడచిన సంగతులన్నియు నీవెఱుంగుదువు గదా? క్రొత్త విశేషము లేమన, నిన్న శరశ్చంద్రుడు, జీవనాథుని మేనినుండి దీసిన గుండు బరీక్షించి, యందున్న యాయా కంపెనీవారి ముద్రిజూచి, వారి కంపెనీ కేగి, దానిగూర్చి విచారించినాడట. ఆదారకము గుండుగొన్న వారి నామముల దెలిసికొన్నాడు. అందు శ్రీశ్రీశ్రీ జగత్సింహబాబుగారు గొన్నట్టుగ మొన్ననే యా గుండ్లను దుపాకితో సహాగొనియున్నట్లు వారెఱింగించిరట.

మాధ:—అయ్యో! కొంపమునిగినదే. ఆతఁడు మన పేర్లగూడ గనుగొనినాఁడు? నీడొంతటిబుద్ధిహీనుఁడో జూచితివిగదా? స్వవిషయముల వీని మతి మంట గలిసిపోవును. ఛీ! ఛీ! ఎంతటి తెలివితక్కువ? ఇట్టిసమయముల నెవ్వరైనను దనపేరే జెప్పుకొందురా? ఆమాత్రపు టాలోచనమైనను జేయవలదా?

జగ:—ఆ! ఇప్పుడు మునిగిపోయినదేమియును లేదు. నీ కెందు లకింతభయము? ఆ మూర్ఖుఁడాయూరక జగత్సింహుని గనుగొనుటకు నేఁకొక జన్మమెత్త వలయునుగాని, యీజన్మమున నదిసాధ్యముగాదు. పరమేశ్వరుని కృపవలన నాకుగావలసినన్ని పేర్లున్నవి. అందు కేమియును గొదువ లేదు. ఇంక నీవు ధైర్యపడుము.

ఆగ:— అట్లనుటకు వీలు లేదు. ఆతఁడు మాత్రమంత యవివేకియనుకొంటివా? ఆతని సంగతి నీకింకను బాగుగ ననుభవము లేదు. ఆయినను మించినది లేదు లే. నేను బ్రతికియున్నంత కాలమాతని

నీప్రకత్నమైనను జెంసీయకుండ జేయగలను. ఆపని నాపైబెట్టి నీవు నిశ్చింతగా నుండవచ్చును. సరే, యిప్పటికేమియును భయములేదు గాని ముందాలోచనయేమి? మధు వేడీ?

మాధ:—ఆసంగతియే జెప్పబోవుచున్నాను. అందులకే నీవు నేడువత్తువో రావోయని బెంగపడ్డాను. ఇంక మనలో మనకంతః కలహములు ప్రాప్తించునట్లున్నది.

ఆగ:—ఆ! ఆ! అంతఃకలహములే—కారణము? వేగముచెప్పు చెప్పు.

అనుచు నాతడొక చుట్టదీసి, నిప్పంటించి, ధూమమున జిన్న చిన్న మేఘములగల్పించుచు, నాతురతతో మాధవి ముఖము వంక జూడసాగెను. మాధవి యిట్లుజెప్ప మొదలిడెను.

"నాయనా! చెప్పుటకేమున్నది? ఆ బుద్ధిహీనుడానగలాడిని జూచుటకై మిక్కిలి తొందరపడుచున్నాడు. అదికూడదనియు, దాన ననేకానర్థములుగలుగుననియు రెండుదినము లోపికబట్టుమనియు, మే మెంత ప్రార్థించుచున్నను వినకున్నవాడు. నేడు బరుషవాక్కులతో మమ్ముగూడ నొప్పించి, మాపైకోపించి, క్రిందికు బోయినాడు. ఇం కొకసంగతి—అట్లు వాడుబోయినపిదప మేమేమో మాట్లాడికొను చుండగా నాతడు జాటుననిలచి మాపలుకుల వినుచున్నట్లుగా 'జగత్ కని పెట్టినాడుగాని, వెంటనే దలుపుదీసికొని పరీక్షింపగ నాతడు గ్రిందగదిలో మంచముపైననే యున్నాడట—విచిత్రముగానున్నది. ఈతనికిట్టి బుద్ధులేల బుట్టుచున్నవో తెలియదు. అందుచే భయము గానున్నది.

ఆగ:—ఏమో? జగత్ పొరబడియుండగూడదా? ఆతడెటు గకుండ మీరుమాత్రమే మీరహస్యములమాట్లాడుకొందురు. ఆతడు వినరానిసంగతులు మనకేమున్నవి? అదికల్ల.

జగ:—ఛీ! ఛీ! నేనుపొరబడుటేగల్ల—ఆతడో, యెవ్వరోగాని నేచెప్పజాలనుగాని, తలుపుమాటున నిలచి మాపలుకుల నెవ్వరో

వినియుంట స్పష్టము. నిశ్చయము. ఇంద సత్యమేమియును లేదు.

అగ:—మఱి యాతడు రాకున్న నింకెవ్వరువత్తురు? ఇందు బోతుటకీగనైనను జొచ్చుటకవకాశము లేదే. అట్లయిన నాతని నే యనుమానింతునా?

ఇట్లు బలుకుచుండగనే మధుగృహమందు బ్రవేసించెను. అతడు వారిని సమీపించి "ఇంక మీముప్పురును గూడిన వెనుక ననుమానముల కేమిలోపము లెండు—ఎంతవారినైనను మీరాను లరునగా నముగనే జూచుచుందురు. మీజన్మమే యనుమానము. మీప్రవర్తనములంతకన్న ననుమానములు. ఇంక ననుమానముల కేమిలోపము? అనుమానమే మీపుట్టినిల్లు. చాలు—చాలు—ఇన్నిదినముల స్నేహమును తుదకిట్టి యనుమానముల కిచ్చినదా? బళే—ఎంతగొప్పవారలు?" యని సకోపముగ బలికి, కూర్చునక యట్లు నిలచియుండెను.

అగు మధూ! కోపమేలకు? జగత్ చేసినది మంచిపనిగదా. నమ్ముము-ఏమి? కాదందువా? ఎవ్వరైనను మనజాడలరసి, చాటుగ వినుచున్నచో మనకొంప మునుగుట కింకేమైన దడవున్నదా? అందుచే నాతడు మెలకువగనే బ్రవర్తించినాడు. మనలో నెవ్వరు బయటబడినను, సంఘమంతయు నాశనమొందుట తప్పదుగదా? ఆమాత్రమాలోచింపక కోపపడుటయేనా?

మధు:—ఆహా! ఏమిచాకచక్యము? అయిన నిప్పుడు జాటుననుండి వినినవారెవ్వరందువు? ఇందితరులెవ్వరును బ్రవేసింపజాలరా? వారిరువురును మాట్లాడికొనుచుండిరా? ఇంక మిగిలినవారెవ్వరు? నేనొకడనేగదా? ఇంక మీయనుమానమెవ్వరని—ఎవ్వరోవచ్చుట మాత్రము నిశ్చయమనిజగత్ చెప్పుచునే యున్నాడుగదా?

అగ:—సరే-మధూ! ఇపుడే వితండవాదమేలకు? ఎవ్వరైనను, మనమింక ముందు జాగ్రత్తగానుండవలెను. అదియే మన తీర్మానము. ఇంక నేనుబోవలెను. రాత్రిచాలయైనది. చాలాం పను లున్నవి?

జగ:—మధూ! నీకోపము, నీపట్టుదలయు మితిమీఱి పోవు చున్నవి. ఈ టెక్కము నీవెచ్చటినుండి తెచ్చెదవు?...ఇంటికి బోయియు చాలు—జాలు—ఇక్కడినుండి నీవెంతమాత్రమును గదలవీలులేదు? కొంపమునిగిపోవుగాన, మాధవి చెప్పినదే నిశ్చయము. అట్లే జరిగి తీర వలయును. అదిగాక నదిమనకడనున్నచో నెన్నటికైనను మనకుహాని దప్పదు. కాన, దానిని వెచ్చించివేసినచో గడిగిన ముత్తియములవలె మనము నిర్మలముగానుండవచ్చును. ఎందఱెన్ని గతుల మనల బరీక్షించినను, దలకిందుగ దపమాచరించినను మననేరముల ఋజువునకు దేజాలరుగాన, నీవు మాఱుమాట జెప్పక దీనికి సమ్మతించి తీరవలయును.

మధు:—మీకుగావలసిన నాప్రాణములనైన నిచ్చెదగాని, దీనికి మాత్రమేననుమతింపజాలను. ఇంక మీయిష్టము.

మాధ:—చూచితివిగదా? యీతని మూర్ఖత—తుదకెంత తల కెక్కినదో? ఇట్టివానింబట్టుకొని మననాటకము బ్రారంభించితిమి. ఇది తుదముట్టువఱకు నాకునమ్మకములేదు. ఎపుడేగతి బ్రాణముల పైకివచ్చునో యని భయముగా గూడనున్నది. ఏ యాలోచనమున కైన నాతడేయడ్డంకిగా నున్నాడు. నాకేమియు దోచకున్నది.

జగ:—మధూ! నీవుజాలపొరబడుచున్నావుసుమీ! మేమెన్న డైనను నిన్ను బాధచేయు దలంపుతో నుంటిమనుకుంటివేమో? అట్లయినచో నడుముల బిగించుకొని, యింతటి సాహసమునకై యొడంబడుదుమని నీవు దలంతువా? అగ్నిగుండమున దుముకుట కెవ్వడు సాహసించును? ఇంతకష్టమెవ్వరికొఱకు? నిను బాధచేయు టకేనా? ఇంతమాత్రమాలోచింప వలదా?

మధు:—సరే— మీయిష్టము వచ్చినట్లు జేయుడు. నాయడ్డంకి మీకేల? ఏమో దెలియక వెఱ్ఱివాడనై, ముందువెనుక లాలోచింపక బలుకు నాపలుకుల బాటించుటేల? ఇంక మీరేమి చేసినను సరే. నేనేమియు నడుగు వాడనుగాను.

ఆగ:—భేష్ భాయీ! నీవుమాత్రము విలాసార్థము మమ్మొక పరియాయాపి జూతువుగాని, యింత మాత్రము దెలియనివాడవా? మాపైకోపమా? కష్టనష్టములాలోచింపవా? జగత్! యింక నీ యిష్టము. సర్వాధికారమును నీచేత బెట్టినాను—మధూ—ఇంక నీట ముంచినను, పాలముంచినను నీదే భారము సుమా" చెప్పు—ఇంక నీయాలోచన లేమి?

జగ:—ఆలోచనకేమున్నది? అమ్మగారెలా శలవిస్తే. ఆలా నడచు కోనడమే. ఆమె చిత్తము.

మాధవి:—జగత్! రేపు చాలామంచిది. తగినముస్తాబుతో పోయి పెరమామకొని రా. ఇంక చెప్పవలసిన దేమున్నది? ఇదిగో! రత్నవర్తకులలో గొప్పవాడిని యెఱుగుదువా? మన స్నేహితుని మాట మరచిపోకుమా!

జగ:—అమ్మయ్యా! ఎంతమాట? కుబేరుడు. ఆతని మరచి పోవుటయే? ఇపుడాతని నే మాత్రి యుంపవలెను. లేకున్న దానిని బుచ్చుకొనునటటి వాడేడీ యీయూర?

ఆగ:— నాకు ఆలోచనలు మితిమీరి పోవుచున్నాయి. హ్వా—హ్వా—హ్వా. జగత్! ఇంకో యుపాయం తోచిందినాకు. సాహసించగలవా?

జగ:—గురూ! నీదయయుండాలిగాని, సాహసానికేం లోపం? వస్త్రంలాగ కుదిపిస్తాను. చెప్పు—చెప్పు—ఏదీ? ఏదీ? నీవు బంగారు పిచ్చుకవు. తొందరీ!

ఆగ:—అయితే విను-మాధవీ! ప్రియా! కాదు—కాదు పొర పాటు. అది పూరపుమాట. బి. సి నాటి కథ. ఈవిషయంలో మాత్రం నాబుద్ధి గడ్డితింటూంది. పాపమది. ఛీ—హుంషాక్—వింటు న్నావా? కునికిపాట్లు పడకు. కోపం లేదుగద? ఇప్పుడు మన ఆట రాజుపదహారుమీాదఉంది. మనంపెట్టిందిబిక్షు. చేతికిప్పుడుఅడ్డు లేదు.

మాధవి:—అబ్బా! మాటలపోగు. అసలుసంగతిచెప్పవుగదా'

ఆగ:—తొందరపడకు మఱి. మీకు పనిచెయ్యడం యెంత కష్టమో! ఆలోచన చెప్పడం నాకంత కష్టం. తెలివితక్కువవాళ్ళు చెప్పడం సులభం. చెయ్యడం కష్టం అంటారు. వెర్రిభ్రమ. స్త్రీహత్యకి ఊరికేనా వేలకొలదీ పోసేస్తారు? ఒక్కమాటకే—సమయోచితమైన యొక్కయాలోచనకే—ఏమంటావు?

మాధవి:—అవునులే—చెప్పకు. ఊరుకుందావు.

ఆగ:—అదే వెర్రియంటాను. పోనీ— ఈమెయిలు యేలా పోతుందో చూస్తూయుండు. ఎంతలాభం కొడతానో చూడు. నా తడాఖా. ఇంక మన మధూ మనల్ని దగ్గరకైనా చేరనిస్తాడా? తానూ తానూ పిల్లా-తొడమీద తొడా ఏం మధూ! ఏం మాట్లాడవు?

జగ:—పిల్ల యెవరోనా? చెప్పేవుకావు.

ఆగ:—తెలియనే తెలియదు. నీవు తెచ్చినప్పీస్ నీకే యెరుగవా? ఎంత నంగినాచివి?

మాధవి:—అయితే, అసలు సంగతిలోకి వస్తావా, రావా?

ఆగ:—ఇదిగో, వస్తున్నానువిను. జగత్! భయపడకు. విను "ధైర్యం, పురుష లక్షణం" అన్నాడు. పిరికితనం విడచిపెట్టు. జాగత్రి రేపు నీవు పేటికను చేరమాడి, యేలాగైతేనేం ముసలాడికే అంటగట్టు. వింటున్నావా? తరువాత చెప్పవలసినదేమున్నది? ఇది వరకు రెండు అయేయికదా. ఇంక త్రికరణశుద్ధిగా మూడవదికూడా కానీ, నీవు మాత్రం వెళ్ళకుమా. రాత్రి, వాడు కొట్టుకట్టే వేళప్పుడు చేరంపెట్టి, లోపలనెవ్వరినీ యుండనీయకు. జాగ్రిత. కారులో మాత్రం వెళ్ళు. కావలసిన పరికరాలు మాత్రం మరచిపోకు. పని కానిచ్చేయ్. పెట్టెను యిలావాడిచేతిలో పెట్టి మరలనలా అందుకో వక్షంక్రింద నక్కడనున్న రొక్కాన్ని చూసుకో. సరిపోతుంది, దానితో యిక్కడ మనమకాం యెత్తేదాం. ఏం? మాధవీ నీయాలోచన నచ్చిందా? ధైర్యం మాత్రం యుండాలి. లేకపోతే లాభంలేదు. జగత్! నీవు అది ముగించేయ్. తరువాత నేను యేంవచ్చినా కాః

కు టాకు ఫరవాలేదు. బాగా యీరాత్రి మీరుకూడా నాలోచించండి. రేపు పగలే బహుశా నేను మరలమిమ్ము గలిసికొంటాను.- నేను వచ్చేదాకా మాత్రం తొందరపడవద్దు. రేపుకూడా బాగావీలు చేసికొని యెల్లుండి పని జరిగించవచ్చును. ఇంక నే వెళ్ళాలి... జగత్సింహా_తలుపు వేశేయ్.

అనుచు నాతడు వెడలిపోయెను. మధుసూదను డిదియంతయు నాలోచించుకొనుచు దన గదిలోనికిం బోయెను. జగత్సింహు డెప్పటి యట్లు ద్వారము జాగరూకతతో బాధించివైచి మాధవికడ కేగెను.



౬.

సూపరెంటుగారి యిల్లువిడచి కొంతవరకును శరశ్చంద్రుడందందు దిరిగి, తిరిగి, గృహమును జేరికొనియెను. వచ్చుసరికి నవకుమారుడును, లలితాకుమారియును ముందరిహాలులో గూర్చొని, యేమో ముచ్చటించుకొనుచుండిరి. లలిత నవకుమారుడు దన్ను విడచి యాగ్రాకేగినది మొదలు ఆమె సంపాదించిన బొమ్మలన్నిటిని యాతనికిం జూపుచు, వానిని దానెప్పుడెప్పుడెంతెంతకుం గొనియెనో దెలుపుచు, వాని శృంగారమెల్లను గవయిత్రీమణిబోలె నభివర్ణించుచుండెను. నవకుమారుడా బాల ముగ్ధాలాపములకుం జొక్కి యపుడపుడు పారవశ్యత నందుచుండెను. సంపూర్ణమందహాస రుచులిరువురి ముఖాబ్జములందును దోలుకాడుచుండెను. ఇట్టిసంతోష సమయముననే శరశ్చంద్రుడందు బ్రవేశించెను. వానింగాంచినతోడనే లలిత "అప్పా! అప్పా! వచ్చితివా? ఇంతరాత్రివరకెక్కడ దిరుగుచుంటివప్పా? చెప్పవూ? భోనీ_ఒక్కనాడైన వేళకింటికి రావుగదా? అదేమి యుద్యోగమో? అమ్మ యొక్కరిత వంటయింట గనిపెట్టుకొని యున్నది. పద. అప్పా! నేను కూడా యీవేళ నింకా నన్నం తినడం లేదు. మామా, నీవు

నేనుగలసి యిప్పుడుభోజనంచేదాము. వేగంలే. మరిగట్టికో. అప్పా" యని ముద్దులొలుకఁ బలుకుచు, నాతనిబిగ్గఁగవుంగలించుకొని యాతని ముఖమట్టె జూచుచు నిలచియుండెను. శరశ్చంద్రుఁడామెంజేరదీసి చెక్కిలిముద్దాడి "చూడు, లలీ! నీవుఅల్లరిచేస్తున్నావట, మామయ్య, చెప్పేడు. పాఠాలు చదువుకోనే లేదట. ఈలాగైతే మామకి కోపం వచ్చి వెళ్ళిపోతాడట. ఏం? వెళ్ళిపోమన్నావూ?" యని నగుచు బలికెను.

పాపము లలిత ముఖకళలొక్కనిముసములో మారిపోయెను. ఇంకొక నిముసమునకా యమాయికబాల నేడ్చునట్లుండెను. ఆమె కనుకొలకులప్పుడే యశ్రుపూరితములగుచుండెను. ఆమె యీ మార్పుంగాంచి నవకుమారుడు నవ్వుకొనుచుండెను. శరశ్చంద్రుడు గూడ పెదమొగముజేసికొని నవ్వుచుండెను. అంత నామె జనకునిం జుట్టిన బాహుబంధముం దీసివైచి, నవకుమారుని దరికేగి, యాతని యొడిలో గూర్చొని, చిగురుగేల నాతని చుబుకముం బట్టి ద్రిప్పుచు, "మామా! చెప్పు—నిజం చెప్పు నేనల్లరి చేస్తున్నానా? పాఠాలు చదువుకోలేదూ? ఉదయాన్నే నీవు నాకు తోటలో మల్లెపొదదగ్గర కూర్చొని "సత్యము" గురించి పాఠం చెప్పలేదూ? అబద్ధం ఆడకు చెప్పు-చెప్పు—మరీ" యని దీనముగా బల్కెను.

నవకుమారుడామె మోమున నొకముద్దువెట్టి, బుజ్జగింపుచు "లేదు చిట్టీ! లేదే నాన్నగారు ఊరికే అలాఅంటారు. అలా అంటే నీకు మరింతబుద్ధివచ్చి బాగాచదువుకుంటావు గదాయని. అంతేగాని నేనలాయెప్పుడైనా చెప్పానా? నీవు యెఱుగవూ?"యనెను.

లలిత:—అలాగైతే, మరినీకు నామీద కోపంయెందుకూ? ఇప్పుడాగాని వెళ్ళిపోతానన్నావట కదూ?

నవ:—లేదమ్మా—నీమీద నాకుకోపంలేదు చిట్టీ. ఇంకా రెండు నెలలదాకా యిక్కడనే నీవద్దనే యుంటాను. అన్నిపాఠాలూ చెప్పుతాను. అంతేగాని వెళ్ళిపోనమ్మా. ఇప్పుడు శలవులుగావూ

సె

సగ

యు

రుని

గున ది

తే, అప్పా

మామా ఏవ

మామా చాలు

అమ్మతో చెప్పు

ఆమె మాట

లలిత యానందముగా

తండ్రి జేబులన్నియుండడు.

సంగ్రహించెను. దానికిశగశ్చ

బెన్నిధిగజూచుకొను నాశనికి ఆ

సుగుణాలవాలయగు ముగ్గులబాలిక.

కతను దైవ్యముడును. లలిత యేమొనర్చినను

అట్లని యామె కలనైన నొకవంకరపనినైనను

సుశిక్షితయగు బాలిక.

ఇట్లు గొంతవఱకానందించిన పిదపవారెల్లరును భుజింప బాకశాల కేగిరి. అందు రాధామాయి సర్వమును సంసిద్ధము గావించి వారి యాగమనమునకై యెదురుజూచుచుండెను. వారువచ్చినతోడనే యామె దన విధికృత్యమెట్లో యట్లే నెఱవేర్చెనన్న జాలును. వడ్డన భోజనాది వర్ణనలతో విసివించుటేల? ఇది యెవ్వరెఱుంగనిది గాదు. భోజనసమయమున మాత్రము రాధామాయి "నీవు బావగారికా స్తోత్రమేదో జూచింపితివా?" యని ప్రశ్నించెను.

రమేశ

దోచుట
...దాకమ్మ
...యి, శేఖ
...ని పిప్పి యిల్లు

నే జేసియుండ లేదు. కాని,
...నాలించియున్నాను. తమతో
మాట్లాడదలచికొంటిని. అవి
...రాజకీయములు—నిగూఢములు. అం
యెందును రానగత్యము లేదు. నేనేన్వయు
...పాదసన్నిధినెల్ల సంగతుల విన్నవించుకొందును
...యి దమకెట్టి యగత్యకార్యమున్నను విడచి, యేకాం
తముగ దమమందిరముననే దర్శనమొసంగ బ్రార్థించుచున్నాను.

రాత్రి పదునొకండుగంటలకు సరిగ, నొకబండి తమవాకిటి వచ్చినిలచును. అపుడుదయయుంచి, తమరు గవాటముందెరువవలయును. నామాటలనమ్మకముంచి, నన్ను శత్రువునిగ దలంపక పుత్రి భావము వహింపగోరెదను.

ఇంకనాపై దమకు నమ్మకముగుదురనిచో, దమయిచ్చవచ్చినటులస్వీయరక్షణార్థమై జాగరూకులరై యుండవచ్చునుగాని, యె

మాట. ఆసమయమున మనమిరువురమేదక్క నన్యులెవ్వరునుండ గూడదని మాత్రమింకొకపరి హెచ్చరించుచున్నాను. వ్యవహారమంతటిని గూఢతరమని గ్రహియింతురుగాక.

శత్రుమధ్యమున నుంటచే బహిరంగముగా తమదర్శన మొనర్పజాల నందుకు జింతిలుచున్నాను. అయిన నేమాయె నేనొక్కవ్యక్తినే వచ్చెదగాని, నాకితర సహాయులెవరునుండరు. హానిదలచుట నామతము గాదని ప్రమాణపూర్వకముగా శపథమొనర్చుచున్నాను గాన, నన్నుశంకించి దర్శనమిప్పింపకపోకుఁడు—

తమ విధేయురాలు,

యోగిని.

ఆసియున్న యీలేఖఁ జూచి మాలతీదేవి విస్మయసాగరమగ్నమానసయా యెను. దాని యర్థమామెకించుకంతయు బోధపడుటలేదు. దానిం గూర్చి యామె పలుగతుల దలపోయసాగెను. "ఇది మిక్కిలి మాయగ నున్నదే! ఈయోగిని యెవ్వరు? ఇదివరకు నేగాంచిన యోగానంద యోగియెవ్వడు? వానికి నిమెకు నేమైన సంబంధమున్నదేమో? లేక, యిరువురునుగూడ నొకేవ్యక్తియో? ఇదియంతయు మాయకూల వేషమా? ఏమియుండునో తోచకున్నదే. ఈమె నాతో నగత్యములగు సంగతుల జెప్పవలయునట. పైగానవి రాజకీయములట. ఆసంగతులేమై యుండునో? ఎంత యోచించినను బోధపడకున్నది. ఇంతకు నీమె యే వ్యవహారముతో సంబంధించియున్నదో? ఒకవేళ నన్ను వంచింప నెంతకులేనైన బన్నిన పన్నుగడయేమో యిది. తన్ను మిత్రభావమున గాంచవలయుననియు, దనపలుకుల నమ్మకముంచవలయుననియు వ్రాసియున్నది. ఏమియుండునో తోచకున్నది. ఎట్లయినను నీసంగతి బూర్ణముగ బరీక్షించి తీరవలయును. ఇందేదో మోసమో, లేక, నిగూఢతర రహస్యమో యిమిడియున్నదనుటకు సందియము లేదు. ఒకవేళ యీసంయోగము మాలతీహత్యాపరాధ పరిశోధకవిషయముననే జేయు [illegible] యత్నములకు దోడుజూపినను జూపవచ్చును. కాన, నామెకోర్కె

నిరాకరింపదగదు." అనుచు నాతఁడు గోడపై గడియారమునుజూచి, పదిగావచ్చుచున్నదని తెలిసికొనియెను. ఇకనొక గంటలో నామె రాఁగలదు. తోడనే యాతఁడు, నవకుమారుని, లలితను, మేడపై శయనాగారమునకనిపి, తాను రాత్రిదుస్తుల ధరియించెను. సమయమునకు బనికివచ్చుగదా యని తన రివాల్వరును గూడ సిద్ధముజేసికొనియెను. అంత నాతఁడొకపరిపోయి గృహముఖద్వారమును దిగిగివచ్చి, తలుపులన్నిటిని జాగ్రతగా స్వహస్తములతో బంధించి, పైనుండి యెవరిని క్రిందకుదిగిరావలదని యాజ్ఞాపించి, హాలులోనొకదివ్వెనుంచి యోగిని రాకకై నిమిషముల లెక్కింపుచు ముందరిహాలులో వేచియుండెను—



౭

రాత్రి పదునొకండు గంటలుగావచ్చినది. శరచ్చంద్రుఁడట్లే మాటిమాటికిని గడియారము దిలకింపుచు, యోగినిరాకకై యత్యాతురత నయనంబుల వీక్షింపుచుండెను. చాలవఱకును బట్టణమునగల సందడియంతయు నణగిపోయెను. శకటముల రాకపోకలంతగ లేవు. క్రమక్రమముగ బాటలన్నియును నిర్మానుష్యములగుచుండెను. అట్టి యెడ నెంతటి చిన్నశబ్దమైనను వీనులకు బరిస్ఫుటముగా వినవచ్చుచుండెను. ఒకకుర్చీలో జేరబడి మాటిమాటికిని శరచ్చంద్రుఁడు బండియేదైన దనవాటిట నాగినదేమోయని చెవులనిగుడించివినుచుండెను. కాని యంతలోనే నాతనికాశాభంగమగుచుండెను. సాధారణముగ నాబాటను బండ్లేయంతగ వచ్చుట లేదు. వచ్చిన యేయొకటిరెండైన నందాగక వడివడి దరలిపోవుచుండెను. గడియారపు "టిక్కు-టక్కు" మను శబ్దముదక్క నాతఁడింకేదియు వినుచుంట లేదు.

ఇట్లుండ, గడియారమాసన్నబ్రకాళరాత్రిని భేదించుకొనుచు "టంగు—టంగున" పదునొకండు గంటలగొట్టెను. కుర్చీలో దూగుచు, గునికిపాట్లుపడుచున్న శరచ్చంద్రుని వీనులకామోత భీకరశతఘ్ని నినదముంబోలె వినవచ్చుటతోడనే నదరిపడి, యాతడొక్కసారిగ కుర్చీనివిడచి నిలువబడెను. మఱల నాతడు గడియారముందిలకించెను. ఆతడు బొరబడలేదు. అపుడాతడు విన్నది పదునొకండుగంటలే. ఆతని హృదయము దడదడగొట్టుకొనసాగెను. ఆతనిజీవిత మధ్యమున నాతడెన్నడిట్టి యాతన ననుభవించియుండలేదు. నేడేలొకో నాతనిమనము బహువిధాలోచనలలో మునింగి తేలుచున్నది. "ఏమిచేతునో? యోగిని యింకను రాలేదు. సరిగ పదునొకండు గంటలకేగద యొకబండివచ్చి వాకిటనిలుచునని యామె వ్రాసియున్నది. బండినాలేదే. నేను నిదురించియుంటినా? లేదు—లేదు. ఇంతవఱకును, మేల్కొనియేయున్నాను. పదునొకండు గంటలిపుడిపుడేకద కొట్టినది. ఒకవేళ బండివచ్చియున్నదేమో? వీధితలుపుదెరచి పరికింతునా? ఎందులకంతతొందర? వీధివఱకును వచ్చినవారు ద్వారముగడకు రాకుందురా? రాకున్న నష్టమేమియును లేదు. ఆమె శత్రుమధ్యమున నున్నట్లువ్రాసియున్నది. ఒకవేళ నామె రాకకు వారి యాటంకమేమైన గలిగినదేమో? ఇంక నొక గంటమాత్రము జూచి శయనింతు"నని మఱలనాతడు కుర్చీలో చేరగిలబడెను.

ఇట్లొక పదినిముసముల కాలమేగినది. వీధిలో నొకబండి పోవుచు దనవాకిట నిలచినట్లాతనికి వినవచ్చినది. తోడనే యాతడు లేచి, ద్వారమువరకునుబోయి, యేమొకో వెనుదిరిగివచ్చికుర్చీకడనే నిలువబడెను మఱల బండి పరుగిడిపోవు శబ్దమాతని వీనులబడెను. తత్క్షణమే వీధిద్వారము కడ నెవ్వరో నిలచి మెల్లగ దలుపుపై గొట్టుట యాతనికి వినవచ్చెను. ఒకపరి నాతడు దన రివాల్వరును జూచికొని, దానిని యథాస్థానమునను౦చి కవాటముందెరచెను.

అంత నొకవ్యక్తి యాపాదశిరఃపర్యంతమును కాషాయాంబర

మున గప్పికొని, కనులకడ మాత్రమించుక దెరచి, లోనజొచ్చెను. శరశ్చంద్రుడెప్పటియట్ల ద్వారమును బంధించివైచెను. ఆమె వడివడి హాలులో నొకమూలకుంజని, ముఖాచ్ఛాదనమైన వొలగింపకయే "తమరేనా? గామాలాల్ శరశ్చంద్ర మహాశయు"లని ప్రశ్నించెను. ఆకోకిల స్వరమాలకించినతోడనే యావ్యక్తి స్త్రీయే యనియు, విశేషించి సుందరియనియు నాతడు దెలిసికొనగలిగెను. ఆతడు "అవును. నన్నే శరశ్చంద్రుడందు"రని యుత్తరమొసంగెను.

స్త్రీ:— అట్లయిన సిది రహస్య ప్రదేశమనియే నేనమ్మవచ్చునా—?

శర:— ఆ—నీవు జెప్పదలచిన సంగతులన్నిటిని నిస్సంకోచముగా నిందే యెఱింగింపవచ్చును. ఇందుపరులెవ్వరును లేరు. ఎవ్వరును బ్రవేశింపనేరరు. మనకెట్టి యంతరాయమును గలుగదు.

స్త్రీ యొక్క వేడినిట్టూర్పువిడచి "అమ్మయ్యా! బ్రతికితి బయటబడితిని దైవమా" యనుచు దలనుండి కొంగుదిగజాఱగ సంతసింపుచు, తన ముసుంగడలించెను.

ప్రకాశమానములగు దీపశిఖలామె ముఖాంబుజము నంతను నిముసములో గాంతిపుంజమున గప్పివైచెను. జలదవిముక్త శీతకరుని భాతినామె పూర్ణచంద్రవదన మాకాంతులలో మెరసిపోవుచుండెను ఆమె నిండుజవ్వని. లావణ్యరాశి—అపరరతి. కుసుమకోమలి—బాలాగుణ ప్రభావిభవాభిరామమగు నామె నెమ్మోని కాంతికా కాషాయాంబర మెంతయు వన్నెబెట్టుచుండెను. ఫాలాక్షునికై దపంబొనరించు గిరికన్యం దలపించు నబ్బాలయోగిని విశాలఫాలతలము శాంతరసమయంబై, వెడందకన్నులపారకృపాపారస ప్రపూర్ణములై దనరారుచుండెను. దీపపుగాంతులతో రదనచ్ఛటలు వియ్యమందుచున్నవోయనునట్లుండెను. ఇట్టియెలనాగకీ లేబ్రాయమున నేయీయాశ్రమస్వీకారమేల గలిగెనో? పరమేశ్వరునిలీల లత్యద్భుతములు. అమోఘంబులు. అగ్రాహ్యంబులు. ఆతని కృత్యము లొక్కొకతరి నాతడే

యెరుంగను. ఇంక నరుడన నెంత?

శరశ్చంద్రుడాతన్వంగి యనూన సౌందర్యాకృతిం గొంతవరకును గాంచి యబ్బురపడసాగెను. ఆరూపము—దానికెంతయు వ్యతిరేకభావముం దెలుపు నామె వేషముం జూచి నాతనికామె చరిత రవ్వంతయు గోచరింపలేదు. కొంతవరకిరువురును మౌనముద్రాంకితులై యట్లే నిలచిపోయిరి. అంత శరశ్చంద్రుడు ప్రకృతము నెఱింగి "అమ్మా! నీవెవ్వరో? ఎన్నడును నీదర్శనమైనను జేసినవాడనుగాను. నేడు నీవు విరచించిన యీ లేఖయందుంటి విగూఢములగు కొన్ని రహస్యవృత్తాంతముల నాతో మాటాడవలయునని కోరితివి. దయయుంచి యదేమో నెఱిగింతువా?" యని యడిగెను. ఆతని కామెయందొకరీతి భక్తిభావ ముదయించి యుండనోపు. లేకున్న నాతడంతటి వినయముగా గరయుగము మోడ్చి పల్కునా?

యోగిని కొంతవరకును మాటాడక రెండుచేతులం ముఖము గప్పుకొన్నది. కొంతనడికామె చేతుల యుసరికి సరోజపత్రముల ధిక్కరించు నామె నయనద్వయ మశ్రుజలపూరితమైనట్లుగానవచ్చెను. సహపుకాంతులలో నాకన్నీటి బిందువు లానీముత్తెములబోలి మిలమిల మెరసిపోవుచున్నవి. ఎట్టకేల కామె కనుల జేలాంచలమున దుడిచికొనుచు "ప్రభూ! నీవే నారక్షకుడవు. రక్షింపవలయు"ననుచు నామె యాతని పాదములంటబోయెను.

శరశ్చంద్రునకదియేమియు బోధపడుట లేదు. ఆతడింతక వెనుకకరిగి, "ఈమె వర్తన మతిచిత్రముగనున్నదే. యోగిని రూపొందిన కామిని కాదుగదా యీమె? ఛీ! ఛీ! సంగతి సందర్భము తెలుసుకక నిట్లాలోచింప న్యాయముగాదుగా"దనుచు "అమ్మా! ఇపుడు నీకు గలిగిన యాపదయెట్టిది? నావలననీకు గావలయు సహాయమే"మని యడిగెను.

యోగిని:—అయ్యా! క్షమింపుడు. నాచరిత్రనంతను దమమ్రోల విన్నవించుకొనుటకే వచ్చియున్నాను. నన్ను మీరు గాపాడవలయును

సమయము మఱిది దెచో సర్వమును దనంత దానే బయలువడ కుండునా—?

అట్లు రహస్యముగనే వారిరువురును రెండుగంటల కాలము మాట్లాడిరి. అంతశరశ్చంద్రుడు "ఆహా! నేడెంతటి సుదినము? తల్లీ! నీదర్శనభాగ్యమున నేను నేనెంతటి యానంద మొందగలిగితిని? నీవాక్యామృత కిరణజాలమున నెంతటి నిగూఢతర విషమసమస్యాంధకార మొక్కసారిగ బటాపంచలై పోయినది? ధన్యోస్మి—ధన్యోస్మి" యనుచు నానందానంద పిచ్ఛిలదేలి యాడుచు, యాసనమువీడి, యటునిటు దిరుగుచు బల్కెను.

యోగినికూడ నప్పుడు నాసనమునుండి లేచి, యాతని వెనుకనే దిరుగుచు "కాని, నేనే నిరాశ్రయయత్నము గాని పనలయును. ఆతని చిత్రమాత్రములు. తుంటరుల సహవాసమునను నాతడింకిని పోవు చున్నాడు. నిరాబోరుల సహాయమిప్పుడాతని కత్యావశ్యకము. ఆతని మీరల్లయిన గలిసికొని మీయుద్దేశ్యములాతని కెరిగించినచో నతడు దప్పక నశ్యుడుగాగలడు. ఇది నిశ్చయము. పిదప సర్వము ననుకూలింపగలదు. ఆక్రూరుల మూలమున నిష్కారణముగ నెందరో యామాయకులు హానిబొందియున్నారు. ఇంకను బొందగలరు. ముఖ్యముగ నాతడు సర్వనాసన మొందితీరును. ఇయ్యది ముమ్మాటికిని నిశ్చయము. కాన, నిపుడాతని వేఱుబరచినచో నందరును సుఖింపగలరు" యని విన్నవించెను.

శర:—నిశ్చయమే. నీవన్నది సత్యము. తప్పక నట్టే గావించి తీరుదును. ఇంక నేమాత్రమును జాగుసేయుట కెడము లేదు. ఇంతవర కిట్టి సత్యమార్గము గోచరింపక బోవుటం జేసి, నాగమనమున కించుక యడ్డుగలిగినది గాని, నేటితో నాసంశయములెల్లను పరిపూర్ణవిచ్ఛేదన మొందినవి. ఇంక నీవు జూపిన యీరాచబాట నెట్లు చరింతునో నీవే గనుగొనియెదవుగాక. ఒక్కసంగతి. నీవుమాత్రము గొంకక న్యాయస్థానమున నీచరిత్రనంతయు జెప్పవలసి యుండునుసుమా!

యోగిని:—సందేహమేమి? అట్లేగావింతును. కాని, ప్రభూ! ఎంతచెడినను నాతడు నాసోదరుడు. ఆమె నాపాలకమాత. ఎట్లు దరి జేర్చి రక్షింతువో? నీదే భారము. ఎంతటి దుష్కర్మలంపటులైనను వారిపై నాప్రేముడి మాత్రము దెగగోయజాలకున్నాను. ననుజూచి యైనను వారల గాపాడవలయు జుమీ!

అనుచు నామె చేలాంచలమున నయనయుగళమద్దికొనుచు వెక్కి వెక్కి యేడువసాగెను. ఆమెదీనస్థితింగాంచి పాపము శరశ్చంద్రు డెంతయో జాలినొందెనన నాశ్చర్యముగాదు. ఆతడు "ఇంతమాత్రమున కేల విచారింతువు? నేనొనర్పగల సాయమంతయు నాయావచ్ఛక్తిని వినియోగించి నీకొరకు జేయగలవాడను. ఇంక విచారముదక్కి యుండుము. ఉదయమెల్లసంగతులను విచారింతము. రమ్ము నీవు బండుకొనుట కేర్పాటు గావింతును"

అనుచు నాతడామెను సౌధాంతరమునకుం గొనిపోయి, రాధామాయికామె చరిత జెప్పవలసినంతవరకును జెప్పి, యామెకు వలయు సౌకర్యములన్నియు గూర్పుమని యామెకాజ్ఞాపించి, తనశయనాగారమున కేగెను.



౮

సాంధ్యరాగము దిశలనలముకొనుచుండెను. పద్మబాంధవుడపరవార్నిధి మునింగిపోయెను. విహంగసంతతులు దమతమకులాయముల జేరుకొనుచుండెను. లోకమంతయు బంగరునీటముంచి యెత్తిన వడువున వింతకాంతులీనుచుండెను. "దినరాజెంతట నస్తంగతుడగునా? ఎంతటజగమెల్ల నాక్రమింతునా?" యని యోచింపుచు, తమోదేవత మూలమూలల వేచియుండెను. కలకత్తానగరమంతయు దివ్యజ్యోతి

ర్మయమై, పరిభావంతమై వెలింగిపోవుచుండెను. కటిక చీకటులందం దలము కొనుచుండెనేగాని, దీపపుగాంతులున్న తావులంజేర వెరచును గదా? కుత్సితులు లెన్నడును సత్పురుషులడాయ వెనుకంజలిడుట సహజము. ప్రభునిముందలి బంటులనలె దారకలందాకసమున వెలుంగుచు, సాధ్యమగునంతవరకాచీకటిగముల దరిమివేయుచుండును.

ఆజానుబాహుండు—నిడుద గడ్డమువాడు. నల్లని దుస్తులవాడు, నగునొక మహామ్మదీయుడొక పెద్దకూజానొకదాని జంకనిడుకొని, వడివడి రాజవీథింబడి, పోవుచుండెను. ఆతని తలపాగా యాతని కన్న రెండుమూరల పొడవై, యించుమించుగ భూమిని జీరాడుచుండెను. ఆతడు వక్కుకుతింబోలె గంతులిడుచు, రెండుచేతుల గట్టిగనా కూజానుబట్టి, మధ్యమధ్య నేమో కూనిరాగములు తీయుచు, నెవ్వరి వంకను దిరిగిచూడక దనదారింబోవుచుండెను. కాని, యాతని వేషముం గాంచినవారు మాత్రమస్పష్టమగు దానిని యాతని జనుడనుకొంతగ నాతనిం జూచుచు, వారిలో వారు నవ్వుకొనకపోలేదు. వారి నవ్వులం బాటించు పాటి తీరిక యాతని కెక్కడ?

ఆతడట్లేపోవుచు, గొన్ని సందులదిరిగితుదకు నెం 75 వ గృహాంగణముం జొచ్చెను. అతడా తోటంబడి పోయిపోయి, యాగృహద్వారమందరియంజని, పదిలముగ దలుపు దట్టసాగెను. కొంతవడి కాతని కెవ్వరును బదులిడలేదు. తలుపు నెవ్వరును దెరువలేదు. అంతమాత్రమున విసువొందక నాతడట్టె దలుపున గొట్టుచుండెను. తుదకు లోననుండి "ఎవరువా"రను ప్రశ్న మాతనికి వినవచ్చెను. దాన నపరిమితానందభరితుడైన పోలిక నాతడు మరింత గంతులువైచుచు "తలుపుదీయుడు. తలుపు యుడు. మిత్రులమే. అమృతము. అమృతము. యీవేళ పండుగ"యని బకులిడుచు నాతడదేపనిగ దలుపు గొట్టుచుండెను. లోనివారు విసివిగాబోలు, తుదకు ద్వారముందెరచి యాదీర్ఘకాయుని. యాతని వేషమునుంబరికించి, "నీవెవ్వరు? ఇచ్చట నేమిపని?" యని ద్వారమున కడ్డగ నిలచి ప్రశ్నించెను.

ఆగ:—ఎందులకింతభయము? అడ్డములే. లోపలికిపద. సంగతి తెలిసికొందువుగాని. ఈవాళ విమానాలెక్కాలి. సముద్రాలమధ్య ప్రయాణము. జాగ్రత. కళ్ళుమూసుకో. లేకపోతే కళ్ళు తిరగగలవు. అడ్డం లేవవేం?

ద్వారముదెరచినయామె స్త్రీ. పాఠకులామెను మాధవిగా గ్రహింపకపోరు. ఆతడెవ్వడో వెఱ్ఱివాడనియు, దనమిత్రులెవ్వరో బంపిన వార్తావహుడనియు, నాతని చంకనేమో యుండుటచే దాని నెవ్వరో దనకంపియుందురనియు, నామె గ్రహించి, లోనికాతని విడచి, మరల ద్వారము నెప్పటియట్ల బంధించివైచెను. ఆమెయాతని నేమియు బ్రశ్నింపక దిన్నగ మాధవయాతస్థునకుఁగొంపోయెను.

అచట జగన్మోహనాకారుఁడొక యాసనమున నధిష్ఠించియుండెను క్రిందతివాసీపై గోడకునానికొని మధుసూదనుఁడు గూర్చుండియుండెను వారు నాగంతకుని వేషమాద్యంతమును బరిశీలించి, నిశ్చలులై, యట్టె యాతని ముఖముననే దృక్కులనిలిపియుండిరి. మాధవికూడ నొక కుర్చీపై జేరగిలబడెను. ఆగంతకుఁడంత "అబ్బా!! ఎంతబారమున్నాడుదేవుడు? దిగుస్వామీ! మెల్లగ చంకదిగు. హ్వా—హ్వా—హ్వా" యనుచు నాకూజాను గ్రిందబెట్టి యొక్కగంతువైచెను. అదిగాంచి వారెల్లరొక్కపెట్టున నవ్వదొడంగిరి.

మాధవి:—ఓయీ! నీవెవ్వరు? ఈకూజాయేమి? నీవిందేల వచ్చితివి—?

ఆగ:—నేనెవ్వరా? ఎవ్వరిలాగున్నాను? తురకబిడ్డడిని. తెలిసిందా. తెలకపిండి. కూజా యేమంటావా? హ్వా—హ్వా—హ్వా, పిచ్చి దానా! నీముక్కు మూసుకుపోయిందా? రొంపచేసిందా నీకు? గుప్ఫ్‌నవాసన—సంపెంగపూవు వాసన విరజిమ్ముతూయుంటే. కూజా యేమని అడుగుతావా? బాబూ! మీకు తెలియనే లేదా? మీరు పోల్చుకున్నారు. ఓ—పశిపట్టేశారు. ప్రభువులు. ఈపిచ్చితల్లిమాత్రం పోల్చుకోలేకపోయింది. హ్వా-హ్వా—హ్వా—చూడు—ఇప్పుడుచూడు—

ఏమో తెలిసిందా?" అనుచు నాతఁడాకూజాను దెరచి, తన తర్జన్యాగ్ర ముందు, ముంచి యామె నాశికకడఁ బెట్టెను. ఏలొకో నావాసనకామె ముఖమింపుమిక వికసించెను. అందేమియున్నది. మనవంటివారి కసహ్యమును, దుర్గంధపూరితమునునగు సుర—వారికమందానందప్రదాయిని సంతతసౌఖ్యదాయిని. బంధురసుగంధ పరిపూర్ణమగు నమృతమే యందుగలదు.

అదిగాంచి తోడనే వారిమేను లొక్క-సారిగ బులకరించెను. జగత్సింహుడు జిత్తమును బట్టజాలక, కూజాకడకేగి, యది యెంత వరకును నిండియున్నదో బరీక్షించెను. మధుసూదనునకీ ప్రసక్తి యేమియును లేదు. అతడు వారిచేష్టలగాంచి యానందించుచుండెను. అంత మాధవి సరే—బోధపడినదిగాని, దీని నెవ్వరంబంపిరి? అంపినవారు నీకెందుగానబడిరి? వారితో నీకేమి సంబంధము" అని యడిగెను.

అగ:—ఎవ్వరా? మామనుషమామలకే [illegible] పూర్తిగా తెలియును. మావాడే యొక మహమ్మదీయుడు [illegible] మాయంగడికి వచుచట దీనిని బూర్తిగా సేవించి, యీకూజాను దమకిచ్చి రమ్మనెనని, ఆనవాళ్ళు చెప్పుటచే నిందువచ్చియున్నాను. లేకున్న నాకేల నింత కష్టము?

మాధ:—అట్లయిన నీవాదుకాణదారుడవా?

అగ:—హ్వా—హ్వా—హ్వా—అంత అదృష్టమా నాకు? అల్లా! నేనే దుకాణదారుడనైతేనా? నాక్రింద వందమంది సేవకులుండాలి. దనానికి నాలుగు పీపాలుండాలి. ఇంకేం చెప్పను? అప్పుడునాషోక్—నాసీటు—నాదర్జా—ఎందుకు? అల్లా అంత అదృష్టం రాశేదుకాదు నాముఖాన్న.

మాధ:—అయితే నీవెవరోయ్? అసిరమ్మా! వెధవగోల.

అగ:—హ్వా—హ్వా—హ్వా. నేనే అసిరమ్మనైతే యీపీపా నీవరకూ గానిస్తానూ? కర్మ—కర్మం నేనెక్కడ సేవకుడను.

మాధ:—సరే—ఇంతేనా? ఇంకా వాకేమైనా చెప్పేరా?

ఆగ:—ఓ—చెప్పకే? చెప్పేరు.

మాధ:—ఏమని? వేగం చెప్పు.

ఆగ:—నీవు చూడగా పిచ్చిదానిలా కనబడతావు. ఏం చెప్పేరని అడుగుతావు. ఆమాత్రం తెలిసికోలేవూ? అమాయకురాలా!

మాధ:— బాగుగనే యున్నది. నీతో వారేమి చెప్పేరో నాకెలా తెలుస్తుంది? నాకు కర్ణపిశాచమైనా లేదు.

ఆగ:—అబ్బో! అబ్బో! పిశాచాలే? పిశాచాలే? నీకాళ్లకు మ్రొక్కుతాను. తల్లీ! పిశాచాలని, భూతాలనీ మాత్రం పిలవకు. దండం—దండం—దండం—

మాధ:—ఏడిశావులే. వారేమి చెప్పేరో వేగం చెప్పు.

ఆగ:—సరే—మొదటి కొచ్చింది. వ్యాపారం, విను ఇంకేం చెప్పేరు? ఈకూజాడు పాలా, కిస్మిస్సు, వీటిని చూడకుండా గడగడ గొంతుకలో పోసుకోమన్నాడు. ఉత్తే ఏమైనా ఫలహారం చెయ్యమన్నాడు. లేకపోతే నాలుక చప్పగా ఇష్టం వచ్చినట్లెల్లా మనస్సులో యింకొకం అంతా యేలుకోమన్నాడు. ఇంకేం చెప్పాలి. ఇంత కన్నా.

మాధ:—ఛీ! ఛీ! తాగుబోతా! ఇదా నీవు చెప్పేసంగతి? మరేమీ చెప్పలేదూ?

ఆగ:—బలే మాటన్నావు. నేను తాగుబోతును. బలే—నీవో? నీవు తిండిపోతువు. హ్హా—హ్హా—హా—సరిపోయింది.

అనుచు నాతడొక పాటను బాడుచు, కరతాళముల వైచుచు, గంతుల వేయసాగెను. వారాతని వర్తనమున కెంతయు నవ్వుకొనుచుండిరి. జగత్సింహుడు వడివడి గదిలోనికేగి, యొక కాచపాత్రిను దెచ్చెను. మాధవి జగత్సింహులిరువురును ద్రాగుట మొదలిడిరి. పాత్రివెనుక బాత్ర వారికంఠనాళముల దిగజారిపోవుచుండెను. వారి యానందము మిన్నుముట్టిపోవుచుండెను. "అమ్మా! నాకేమైనా ఉంచండి. మీకు దండాలు" అనుచు నయ్యాగంతకుడరచుచుండెను.

మధుసూదనుఁడీవిచిత్రప్రదర్శనమును నిశ్చేష్టుఁడై కనుఁగొనుచుండెను. మాధవీ జగత్సింహులు సంపూర్ణముగా నాసురాపాన మహాత్మ్యమున విలీనులరై, క్రమక్రమంబుగా మేనుల మఱచుచుండిరి. వారెంత త్రాగుచుండిరో, యెంతవఱకు త్రాగినవారికాయాసము గలుగకుండునో, వారెంతమాత్రమును గమనింపలేదు. వారి శరీరములాబ్రహ్మానందామృతప్రవాహమున గొట్టుకొనిపోవుచున్నవి. ఇంక నీలోకమే మైపోవుచున్నదో వారెఱుంగరు.

ఆహా! సురాపానమెట్టి విచిత్రవ్యసనము? వారింతకు బూర్వమొక్క నిమేసమున్నస్థితిలో నిపుడు లేరుగదా? క్షణకాలములో వారి జీవితమునందెంతటిమార్పు సంభవించినది? ఆహా! సురాదేవీ! నీయందెంతటి నిగూఢతర మహాత్మ్యమిమిడియున్నదో మాబోంట్లకెట్లు నగతమగును? తల్లీ! జన్మజన్మాంతరములకైనను నీకటాక్షవీక్షణముల మాపై బ్రసరింపకుందువుగాక. నీకొక నమస్కారము.

మాధవీజగత్సింహులింకను నట్లు త్రాగుచుండిరి. వారి బాహ్యప్రపంచమునంతను సంపూర్ణముగా మఱచిపోయిరి. అదియొక చిత్రముగాదు. దానియందంతటి శక్తియున్నది. అట్టితరి సదనుగాంచి, మాయాగంతకుఁడొక లేఖను దన యుష్ణీషమునుండి దీసి, వారెరుక నడకుండ, పదిలముగ మధుసూదనున కందిచ్చెను. ఆశ్చర్య భయ సంభ్రమంబులొక్కుమ్మడి బెనగొన మధుసూదను డద్దానింగైకొని, యచట దెరచి, చూచుట యపాయకరమని యెఱింగి, మెల్లన దన జేబునదిఁకొని యాస్థలమువీడి జనుచుండెను.

జగత్సింహుఁడాపోవువాని కరముబట్టి, యిటునటు గుంజుచు, "మధూ! ఒకే—మధూ! వింటావూ? నామాట—విను. ఒక్క—గ్లాసు. ఒక్క—గ్లాసు పుచ్చుకో—తమాషాచూడు—కైలాసం—కళ్ళకి-కట్టినట్లు అదిగో—అదిగో-ఛీ! కనబడకపోతే—నాచెవి కోసెయ్యి—కోసెయ్యి—ఏం? రా—భాయ్ రా—ఇ-ది-గో—పు-చ్చు-కో"యనుచు, దూలుచు, వాతనిబట్టి లాగుచుండెను,

మధుసూదనుడట్లో యాతనిపట్టువిడిపించుకొని, నీకునమస్కారము. జగత్! అదివిూరే యానందించండి. నాకుపడదు. నాసంగతి నీవెరుగవా? వలదు. నాకదియేల"దని వెడలిపోయెను.

జగత్సింహుఁడాతని దెసనట్లే దృష్టినిలిపి యట్లేనిలచిపోయెను

మాధవియాతనిగూర్చుండఁబెట్టి "బాదుషా—పోనీ—వాడిని బ్రతిమాలేదేం? కుక్కకుకుక్కకు నెయ్యబ్బుతుందా? పిల్లిపుట్టాలి. పోయే వాడికి బలవంతమేమిటి? వాడుకూడా గయ్యాళైతే మనకూను పడిపోతుంది, ఇంక కొస్తుంది. రా. బనాయించేదాం" అనుచు మరల పాత్రనుబూరించి, సంపూర్ణమొనరించి వైచిరి.

ఆగంతకుఁడు గూజానుజూచుకొని "అయ్యో! బాబూ! మీరెక్కడ? గురుదేవుల్లాగ కనబడుతున్నారు. నాయనా! ఇంతమందిని చూచేనుగాని, ఇంతటి మహానుభావుల్ని యెక్కడా యీజన్మంలో చూడలేదు బాబో! కూజా వాసనకూడా నాకేనాఁడు. నాయనా! ఎంతటి విద్యావంతులు? గురూ! నమస్కారాలు. ఇంక నేనెందుకు? ఇక్కడ? ఏమైనా దొరుకుతుందని ఆశపడ్డాను. అబ్బా నావరకూ రావడమే? గురువులు పూనుకుంటే. ఇంకవచ్చినపని అయిపోయింది అమ్మా! మహాకాళీ! తల్లీ! శలవా? ఇంక నాకనుజ్ఞ దయచేయ్యి. దాసుడు శలవుతీసుకుంటాడు. అల్లా, నిన్ను పొరపాటున యిలా పుట్టించేడుగాని, నీవే యేరాజ్యానికో రాణివైతే, తల్లీ! ఆరాజ్యాన్ని అందులో ప్రజలనీ — కోటలనీ — పేటలనీ — అన్నింటినీ ఒక్క గుక్కకే తాగేస్తావు. తల్లీ. నమస్కారము. సెలవా? ఎవ్వరేనా వచ్చి తలుపువేసుకోండి. లేకపోతే కొంపమునిగిపోతుంది." యనుచు నాతఁడు వశీవడి మేడమెట్లుదిగి, తనదారిని బోయెను.

"తలుపుతీసియున్న గొంపమునిగిపోవు"నన్న యాగంతకుని పలుకులు చెవులకు శతఘ్ని నినదమువలె వినవచ్చుటదోడనే మాధవి మెట్లో మెలకువవహించి, తూలుచుదూలుచుబోయి, యాద్వారము నెప్పటియట్లు బంధించి, మరల బహుప్రయాసమున జగత్సింహుని

గలిసికొనెను.

ఇంక వారి ప్రవర్తనమును వర్ణించుట గడు హేయము. అట్టి నీచాతినీచ వర్తనమును వర్ణనరూపమున బెట్టి, యీమాలేఖిని కప యశస్సునొనగూర్ప జాలముగాన, బుద్ధికుశలురగు పాఠకులే యద్దానిని మనోవీధి నవగతము గావించుకొందురుగాక—



నారాయణీజగత్సింహులవిడచి, మధుసూదనుడు గ్రిందియంతస్తున దనగదిం బ్రవేశించెను. అతని మనము నేకాలోచనములలోనై, తుట్టతుదకెద్దానిని నిర్ణయింపజాలకపోయెను. ఆతని కా లేఖయందేమి యున్నదో గాంచవలెనన్న కుతూహలమగ్గలమై పోయెను. తోడనే యాతడు దన గదిద్వారమును లోనదిట్టముగ బంధించి, దీపమును వెలిగించెను. జేబునుండి లేఖందీసి చదువబోవుసరికాతని కరయుగము వడవడ వడంకిపోవుచుండెను. కారణ మాతని కావంతయును బోధపడుట లేదు,

మధుసూదనా!

నేను నీకు గొత్తవాడనైనను, నీవుమాత్రము నాకు జిరపరిచితుడవే. ఈవఱకనేకసారులు నాపేరు నీవాలకించియుందువు. కాని, యిపుడు నా నామమెఱింగించిన నీవించుక సంశయమునకు లోనుగా వచ్చును. అది ముందుముందు నీవే దెలిసికొనగలవు.

నేనిపుడీలేఖను నీకందించుటలో బరమార్థమెంతయో నిమిడియున్నది. నేను నీకెన్నటికిని శత్రుడగాను. నీచరిత్రనంతయు సంపూర్ణముగా నాలించినాడను. కొంతవఱకును గనులార గాంచినాడను. ఇప్పటి నీ దీనావస్థనుగూడ గుర్తెఱింగితిని. ఇపుడు నాహితవాక్యము

లాలింపక చెడదారిం బట్టినచో, యింతకన్నను హైన్యామునకు నీవు బాల్పడవలసి వచ్చుననుటకు సందియమిసుమంతయును లేదు—నాప్రార్థనలాలింపుము. నాముఖ్యోద్దేశ్యమును గమనింపుము—నామార్గమునను శోధింపుము. దాన సత్కీర్తిహానియు, ననర్థమును గలుగనేరదని, యింకొకసారి నొక్కినొక్కి చెప్పుచున్నాను. వినకున్న నీపాట్లుగుక్కలైనను బడనేరవు. ధైర్యమవలంబింపుము.

నీసిగూఢ చరిత్రనంతను వినియున్నాడనని యీవఱకే జెప్పియున్నాను. కుత్సితులు—క్రూరులు—మాయావులునగు సోదరి ప్రోత్సాహంబున నీగోయి నీవే త్రవ్వుకొంటివి—ఇంకను ద్రవ్వుకొనుచున్నావు. ఇంకనైనను మేల్కొనుము—కనులవిచ్చి దివ్యజ్యోతి ప్రభావంబున నీయజ్ఞానతమఃపటలంబును బాగద్రోలుము—ధైర్యకవచమును దాల్చి-సుజ్ఞాన వజ్రాయుధంబును జేబూని, వైరిభూధర పక్షసంహారమొనర్పుము—సన్మార్గ గామివై రణరంగమున బ్రవేశింపుము—నీకేల జయముబ్బకుండునో జూచెదగాక.

నీకై నేనిట్టివేస మూనితిననిన నీవు విశ్వసింతువా? ఇపుడైనను క్షేమనమున సంశయంబుల కెడము లేకుండ జేసితివా నేను నీ హితచింతకుడనను నమ్మకము నీకుగలదా? నీవికనైనను బాగుపడ నభిలషింతువా?

నీవు సంరక్షింప బడదలంచితివేని—హత్యాపరాధాది నిందల దొలంగించుకొన గోరితివేని—క్రూరసహవాసముద్యజింపజూతువేని—స్వపూర్వ వైభవాంబుధి నోలలాడనిచ్చగింతువేని-నేటిరాత్రి పదునొకండుగంటల కాలమున—ధైర్యమూని—యీ భవనప్రాంతవనమున నీవు నన్ను గలిసికొనవలయును—అందుకొఱకై యీశాన్యమూల వేచి యుందును—తప్పక రాగలవని నమ్ముచున్నాను—భయము విడువుము నిన్నడ్డుకొనువారెవ్వరును లేరు—మాధవీ జగత్సింహులు లోడ తెరుంగక ద్రాగిపడియుండుట నీకనులార గాంచియేయున్నావు. ఇట్టితరుణమింక జిక్కబోదు. దీనిని వ్యర్థపోనీయకుము.

నేను నీవట్లురా నుపేక్షించినను—యించుకేనియు సంశయించి నను—యేకారణముచేనైననేమి యన్యథావర్తించినను, నీమెడకు నీవే స్వయముగ నురిని దగిలించుకొనుచున్నాడవని నిశ్చయముగ జెప్పుచున్నాను. ఈ పలుకులు నిన్ను భయపెట్టుట కెంతమాత్రమునుగావు. నీవలన బ్రత్యుపకారమును బొందుట కంతకన్నను గాదు. ఈవఱకే మీ చరిత్రలు—మీ ప్రవర్తనములు—మీ దురంతములు—మీ హత్యలు వేయేల మీ జీవిత పాఠమంతయు బూర్తిగా జదివియే యున్నాడనని గ్రహింపుము—దాన మీకు లాభమో? నష్టమో? బాగుగ నాలోచింపుము. ఇంతకన్న నధికము వ్రాయ నగత్యముండదని తలంతును. నీవు వచ్చునప్పుడీ లేఖను నీతో గొనిరమ్ము. తప్పక నీకై వేచియుందును.

ఇట్లు,

నీహితైషి [illegible]కుడు.

అనియున్న యాయుత్తర మాద్యంతమును జదువుకొలది మధుసూదనున కాశ్చర్య మినుమడించుచుండెను. అది వ్రాసినవారెవ్వరో నాతడెంత యోచించినను గ్రహింపజాలకపోయెను. అందలివిషయములెల్ల జదువుకొలది నాతని మేను స్వేదసిక్తమైపోవుచుండెను. భయాతిరేకంబున నొడలు గంపించిపోవుచుండెను. ఇంతవఱకెంతయో గూఢతరంబుగ జరిగిపోవుచున్న వారి కృత్యముల నన్నిటి నిపుడు లోకమంతయు దెలిసికొన్నట్లాతడు గ్రహించెను. పిల్లి కనులమూసికొని పాలు ద్రావిన జగమంతయు జీకటిగ్రమ్మెనని భావించురీతి నాతడు దలపోసెను. కాని యిపుడీ లేఖాంశములు దవతలంపులన్నిటిని దలక్రిందు జేసివైచెను. ఆతనిమనమనేకాలోచనలకులోనై తుదకు గర్తవ్యమేమో నిర్ణయింపజాలకపోయెను. ఆతని మేధాశక్తి నశించిపోయెను! తుట్టతుదకాతడన్ని యాలోచనలను విడచి, యిపుడాతనిజూడనేగుటా! మానుటా? యను నాలోచనకువచ్చెను. "ఈతడు వ్రాసినరీతిగ నా హితచింతకుడా? లేక ననువంచింప బన్నిన వలయా యిది? మేమపరాధులమని యాతడెట్లో యెఱింగెను. అది నిశ్చయము. స్వయముగా

నేనే హంతకుడగాకున్నను ద్రోహులకు బ్రోత్సాహకుడ నగుదును గదా! అట్టియెడ నన్ను బోలీసులు పట్టి, నామగాలమున నేరస్థుల జాడ లరసి, తుదకు మమ్మెల్లర నాశనమొనర్ప నీయుక్తి బన్నెనేమో? ఏమిచేయవలయును? ముందునూయి, వెనుకగోయిగ నున్నదే నా బ్రతుకు. ఏమైనను నన్ను రక్షింతునని వాగ్దాన మొనర్చియున్నాడు. ఆతని వార్తనుబట్టిచూడ నాతడుత్తమునివలెనే గానవచ్చెడిని. ఏమో? లోకమున నెన్ని గోముఖ వ్యాఘ్రములు లేవు. ఏమైనను పోయి చూచెదను. పైన దైవమేతోడు."

అని పలుగితుల దలపోసి, తుదకాతనిజూడ నేగ నిశ్చయించు కొనెను. అప్పటికి రాత్రి తొమ్మిదిగంటలు దాటిపోయినవి. కొంత వరకును నగరమున నిశ్శబ్దత నెలకొనినది. నిముసముల లెక్కించుచు నాతడట్లె మంచమునబడి, యనేకగతుల నాలోచించుచుండెను.

కాల మొక్కరికొఱకునాగదు. అది రాజు నైనను లెక్కింపదు. సృష్టికర్తనే లక్ష్యింపదు. అందుచే నది నిలుకడ లేని చక్రమని లోకు లందురు. దానికి గష్టసుఖములు సమానములు. రాత్రింబవళ్లు సమానములు. సర్వదేశములును సమానములు. సర్వలోకములును సమానములు. సర్వప్రాణులును సమానములు. ప్రియతముడగు భర్తపోవ శవముకడ బడియేడ్చు నబలకడ నది యొకరీతి పరిభ్రమించును. ప్రియురాలి కౌగిట నిష్టాగోష్ఠి విహరించు పూరుషునికడ నొకరీతి బరిభ్రమించును. పవలెట్లు గడచిపోవునో, రాత్రిగూడ నట్లేగడచి పోవును. దాని పరివర్తనమున కీదేశమనిగాని, యీలోకమనిగాని వ్యత్యాసములేదు: ఈతడు చక్రవర్తియనియుగాని యీతడు నిఱుపేద యనిగాని యది లెక్కింపదు. కాని, మానవుడు దనప్రకృతికనుగుణ్యముగ కాలమును విభాగించుకొనుచుండును. కష్టసమయముల నాతడు దినమున కెన్నివేల యామములనో లెక్కించును. సుఖమయదివసంబుల క్షణించును. ఇయ్యది మానవుని సహజప్రకృతి. ఇది యెల్లరకును ననుభవైకవేద్యమే.

మధుసూదనుడిట్లు మంచమునవ్రాలియుండి "ఎంతట పదునొకండు గంటలగునా? యెంతట నానూతన పురుషుని గాంచి యాతని మనోభావముల గ్రహింతునా" యనుచు నిముసముల లెక్కించుకొనుచుండెను.

క్రమముగ బదిదాటిపోయెను. ఇంకనొక యరగంటగూడ గడచిపోయెను. ఆతడు బదిలముగ లేచి, తన దుస్తులధరించి గదిబైట నొక్కైను వైచి, పైయంతస్తున కొకపరి బోయెను. అందుడీపమైనను లేదు. దీపముదు వెలిగించువారెవ్వరు? పైనున్న వారిరువురును, మాధవీజగత్సింహులు. వారు కంఠగతముగ ప్రాణి, యణుమాత్రమైన మెలిపి యున్నంతవరకు నిష్టానుసారంబుగ గంతులిడి, నిగూఢ జీవన మొసరించుమంటివైన దలంపక నింటికి దెచ్చికొనిపోవునట్లుగ గాన వర్షము గురిపించి, మైకముదలకెక్కిన తోడనె యొరాపిప్పి లోకముతో మనకేమి సంబంధమని శరీరముల మరచియుండిరి. వారి కింతలో మెలకువ వచ్చునట్లుగ లేదు. మధుసూదనుడెప్పటి యట్లు క్రిందకు దిగి, వాకిటిద్వారము జేరి, రవంతయు ధ్వనికానీయక దాని దెరచి, తలుపువద్దగ వైచి, తోటలో బడి యదృశ్యుడాయెను. కాని యతనిపదములుమాత్రము గంపించిపోవుచుండెను. ఒకవంక మాధవీ జగత్సింహులు లేచైన మేల్కొనినచో దనకాయువు మూడినదన్న మాటయే. ఇంకొకవంక నాపురుషుడెట్టివాడో? ఆతని మనోభావ మేమో? తనకేమి హానిరానున్నదో యనుశంక.



౧౧

సాయంసమయమున సారాయముగొనివచ్చి మాధవీ జగత్సింహుల కొసగిన యాతురకయే మధుసూదనున కాయుత్తరము వ్రాసి యుండెను, ఇపుడాతడాతని రాకకై నియమితస్థానమున వేచియుండెను.

ఆతడు నల్లనిహస్తుల దాల్చియుండెను. వనాంతరమగుటచేతను గాఢముగ జీకటులలముకొని యుండుటచేతను, ఆతడు కృష్ణవసన ధారుడగుటచేతను, అందు మాటిసియున్నట్లెవ్వరును దెలిసికొనజాలరు. క్రమముగ బదునొకండుగంటలాయెను. ఒకదెసనుండిమధుసూదనుడు మెల్లగ బదములిడుచు, దనయీకృత్యమెవ్వరైన గాంచుచుంటిరేమో యని మాటిమాటికిని వెనుదిరిగి చూచుచు, యేవృక్షముకడ నించుక శబ్దమైనను భీతిచే వెనుకకు రెండడుగుల నిడుచు, నెట్టకే నియమిత స్థానమును జేరికొనియెను. కాని, యట నాతనికెవ్వరునుగానరారైరి. "ఇదేమి చిత్రము? నన్నిటరమ్మని యంతగ నమ్మించి యాతడు రాకుండునా? అయిననాతడువంచకుడా? ఇట్లెందులకు జేసియుండును" అని దలపోయుచు నటునిటుజూచుచుండెను అంత "ఇటు—ఇటు"యను పల్కులాతని కర్ణములబడియెను. తోడనే నున్మత్తబద్ధబగుభుజంగంబుగతి నాతడాసవ్వడియరుదెంచినదెసకరిగెను. అపుడొకడెదురుగవచ్చి, మధుసూదనుని కరమొకచేతబట్టి, "వచ్చితివా? మంచిది. ఆవృక్షమూలమునకు బోదము ర"మ్మనుచు నాతని దీసికొనిపోవుచుండెను. మధుసూదనుడేమియు బలుకక నాతని వెనువెంటనే జనుచుండెను. కడకు వారు దట్టముగ బొదరింటిమాడ్కి బెరిగిన యొకవటవృక్షము క్రిందజేరి యాసీనులైరి.

ఆగ:—మంచిది నీకు నాపైనమ్మకముదయించినదా? సందేహమేమియును లేదా?

మధు:—చిత్తము. సందేహమేమియును లేదు. మీరు మిత్రులని నాభావము.

ఆగ:—అవును. మిత్రుడనే. నావలననీకు సాధ్యమగు నంతవరకు నుపకారమే గలుగవచ్చును. సందేహింపకుము.

మధు:— లేదు. సంశయమేమియును లేదు. కాని, తమరెవ్వరో నాపై నీయకారణ వాత్సల్యమేల కలిగెనో? ఇపుడు జేయబోవు నుపకారమేమో దెలిపెదరా?

ఆగ:—అంతయు జెప్పుటకే మనమిందు సమావేశమైతిమి. ఇపుడు నాయడుగువానికెల్లను సత్యముగ సమాధానము లీయవలయును, ఒక్కయక్షరమైనను దాచితివా, ప్రమాదము వచ్చుట నిశ్చయము,

మధు:—చిత్తము. అన్నిటిని జెప్పెదగాని, తొలుత దమ రెవ్వరో మాత్రము జెప్పవలయును. క్షమింపుడు ఏలనో నాకు భయమగుచున్నది.

ఆగ:—భయ మెందులకు?

మధు:—ఒకవేళ మీరు పోలీసువారేమో యని.

ఆగ:— పోలీసు వారైన భయ మెందులకు? నీవు నిరపరాధివి గదా—?

మధు:—అవును. కొంతవరకును.

ఆగ:—పోలీసు వారైనను, నీకు నేమి చేయుదురో?

మధు:—సంతసింతును.

ఆగ:—అట్లయిన నీవొనర్చిన నేరము లేమి?

మధు:—నేనెట్టి నేరములను గావించి యుండలేదు.

ఆగ:—అయిన నీకు బోలీసువారికడ నట్టి భయమేల?

మధు:—ద్రోహులతో గలసి యుంటినే.

ఆగ:—అందు ద్రోహ మొనరించిన వారెవరు?

మధు:—తొలుత దమ రెవ్వరో జెప్పవలయునని కోరితిని గదా—?

ఆగ:—భయపడకుము. నీకుమిత్రుడను. నా పేరు రామలాల్ శరశ్చంద్రుడు.

మధుసూదనుని స్థితి యెట్లున్నదో వర్ణింపనలవిగాదు. ఆతని శరీరమాపాదమస్తకమును గంపించిపోవుచుండెననియు, సర్వాంగములును స్వేదసిక్తములయ్యెననియు జెప్పినచాలును. కొంతవడి కాతడు బ్రకృతము నెరింగి “అట్లయినమీరు నాకు సహాయ మొనరింపనేల?

ఈరీతిగ నను శేరదీసిగుట్టంతయు దెలిసికొనుటకా? అదిమీకు సహజము. మీవృత్తి" యని బల్కెను.

శర:—అట్లుగాదు. నీవు సంపూర్ణముగ నిర్దోషివని నేనెరుంగుదును. మీ చరిత్రలన్నియు నెరుంగుదునని వ్రాసియేయున్నాను. కాని, యిపుడు నీవు విరళముగ ద్రోహులెవ్వరో జెప్పవలయును.

మధు:—మీరు అభయహస్త మిచ్చినచో,

శర:—భయపడకుమని మున్నే జెప్పలేదా?

మధు:—అట్లయిన మీకే విషయములు గావలయును?

శర:—మాలతి నేనవధించినట్లు నటింపుచు, శ్యామలను బలి మార్చిన వారెవ్వరు?

మధు:—మీరు మహానుభావులు. మీప్రజ్ఞ నీవరకే విని యుంటిని. ఈసంగతి బ్రహ్మయైన నెరుంగడు. మాలతిగతించినదని యీ లోకమాడుకొనునని దలంచియుంటిని.

శర:—అది కల్ల, మీరు లోకము నెంతేని మాయజాలరు. సత్యమెన్నడును దాగ నేరదు.

మధు:—నిశ్చయమే. శ్యామలను జగత్సింహుడును, మొహిదీనును.........

శర:—మొహిదీనెవ్వడు?

మధు:—ఆతడెవ్వడో నేనెరుంగను, కొంతకాల మాతడు నగరమున నివసించునపుడు మాధవికిని, తన్మూలమున జగత్సింహునకును మిత్రుడట. ఇపుడీయూరనేయుండి, యపుడపుడిటకు వచ్చుచు బోవుచుండును.

శర:—సరే. నారాయణచంద్రుని మోటారున గొంపోయి, రత్నపేటికను హరించిన వారెవ్వరు?

మధు:—వారిరువురే.

శర:—జీవనాథుని గుండు దెబ్బచే బలిమార్చిన వారెవ్వరు?

మధు:—అది నేనెరుంగను. నాడు జగత్సింహుడు మాత్ర

మింటనేయున్నాను. కొంతరాత్రియగుసరికి మొహిదీనరుదెంచి, ముసలి పక్షికథ జెప్పకుండగనే యంతమొందిన" దని మాత్రము జెప్పెను. అందుచే నాపనియొనర్చిన వాడాతడేయని నాసందేహము.

శర:— బాగుగనేయున్నది, ఆ మొహిదీన్ మటల నెప్పుడిటకు వచ్చును?

మధు:— రేపు రాత్రి యేడు గంటల ప్రాంతమున.

శర:— ఏల? మటల రేపే మైన విశేషమున్నదా?

మధు:— ఇప్పటికి నిన్నియు బూర్తిమైనవి. ఇంక మిగిలిన దొక్కటే. అది మీరు వ్రాసినట్లుగనే నన్ను గొంతద్రోయుట.

అనుచు నాతడొక్క నిట్టూర్పును విడచెను.

శర:— ఏమది? పూర్తిగ జెప్పుము. భయపడకుము. కడచిన వేవో గడచిపోయినవిగాని, యింక నాకు [illegible] దురంతమైనను జేయుక మ్మొబ్బగలను. విచారింపకుము.

మధు:— రేపురాత్రి నారత్నపేటికను నారాయణానందు తంత్రికి విక్రయింప వారేగెదరు. అప్పుడింకొక ఘోరముగూడ వారు దలపెట్టియున్నారు.

శర:— అదేమి. చెప్పు. చెప్పు.

మధు:— రేపు జగత్సింహుడును, మొహిదీనును. షౌక్తాలీమ్ఖాను వారి మిత్రుడింకొకడును గలసి వేషాంతరమున నాతని యంగడికేగి, పేటికను విక్రయింప బేరమాడి, రొక్కము చేజిక్కించుకొని, యావృద్ధుని సహితము తుదముట్టించి, పేటికనుగూడ చేజిక్కించుకొనిన తోడనే యాపురమును విడుతురట. ఇంకేమున్నది. ఇంత కథయును నాపేటికమూలముననే జరిగిపోయినది. ఆపాడు పేటిక మూలముననే నేడో, రేపో, వారు నాప్రాణముల సహితము బుచ్చుకొందురు. సందేహము లేదు. కాలవశమున నే వీరిచేతులబడితిని. ఈ విధముగా నాజీవితములకును నాకథకునుగూడ మంగళము గాగలదు నిశ్చయము. నిశ్చయము.

అనుచు నాతఁడు బాలునివలె వలవల నేడువసాగెను.

శర:—మధుసూదనా! ఆఁడుదానివలె నీవేడ్చుచుండిన లాభ మేమియును లేదు. ఇప్పుడు మించిపోయినదిగూడ యేమియును లేదు, వారి ప్రయత్నములకు మనమిప్పుడే మేలుకొని ప్రతిక్రియ గావింప గలము. ఇంకను జాలనవకాశమున్నది. నేనా యేర్పాటు లన్నియు గావింతును. నీవు భయపడవలదు. కాని, మీ కాశీవాస్తను వాఁ డెవ్వఁడు? ఇంతవఱకు నాతనిగూర్చి యేమియును జెప్పలేదు. పైయప రాధములతో వానికి నైక్య మేమియును లేదా.

మధు:—ఉన్నదిగాని, యాతఁడు స్వతంత్రముగ నే కార్యమును జేయఁడు. అపరాధుల కాతఁడు సహాయకారి. ఊరిలోనికి వేషములనెత్తి నడిసివచ్చి యాతఁడు వారల కెఱింగించుచుండును. పలనోగాని యాతఁ డెప్పుడిటకు వచ్చినను, వేషాంతరముననే వచ్చి పోవుచుండును. ఇంత వరకాతని నిజరూప మెట్టులుండునో, యాతని జన్మమేమో, నేనించు కంతయు నెఱుంగను. ఆతఁడెప్పుడు వచ్చినను నాపై సత్యాభిమాని యగు హితచింతకునిబోలె సన్మానించుచుండును. కారణమే నెఱుంగను.

శర:— సరే—వేషాంతరముల కేమి? యెన్నియైనను దాల్ప వచ్చును. అదిలోకమును గనుమూసి బ్రవర్తించుటకొక గొప్ప సూత్రము. ఇంక నీపై ప్రేమయా? అది వట్టిబూటకము. నిన్ను బికా రును జేసి వెడలగొట్టునంతవరకును వారట్లు నటించుచుందురు. నీ ధనముపై ప్రేమకాని, నీపై నెన్నఁడును గాదు.

మధు:—నేను నట్లు దలపోసియుంటిని. తండ్రీ! నేటికిదైవమే నన్ను మీపాదములకడ ద్రోసియున్నాఁడు. ఇంక నన్ను రక్షించు భారము మీయది.

శర:—నీవు నిరపరాధవని యే నానమ్మకము. ఎట్టయిన నీయభి యోగము త్వరలో ముగియనున్నది. ఇంక వారి యుచ్చగ్రహములు దిగిపోయినవని దలంపుము. సాధ్యమగునంతవరకును నేనే వారి

వినాశమును దలపెట్టజూతును. ఆపైని దైవయత్నమెట్లున్నదో, దెలి యదు. చాలరాత్రికావచ్చినది. ఇంకనీవుబొమ్ము. ఒకవేళ నాదుష్టులు మేలుకొనినచో నీకు హాని సంభవింపగలదు. కాని, వారీదినమున మేలుకొనుట కల్ల. వారు బొట్టలు బగులునట్లుగ సురాపానియున్నా రు. అది యంతయు బూర్తిగ జీర్ణించినగాని వారికి మెలకువరాదు. ఇంక మనము మాట్లాడుసంగతులుగూడ లేవు గాన, నీవికబొమ్ము.

మధు:—చిత్తము. నన్నురక్షించుభారము తనదేయని మరల మాటలు జెప్పనవసరము లేదని దలంచెను.

శర:—నీవంతగ జెప్పవలెనా? నిరపరాధులకు సాయపడు టయు, సపరాధులనుశిక్షించుటయు నాకీధర్మము. దానికింతటి బాగ్రహన లగత్యములు గావు. పొమ్ము.

మధుసూదనుడు "చిత్త"మనుచు, నాతనికి సెలవొంది, తన దారిం బోవుచుండెను. శరశ్చంద్రుడాతని మరల మరల వెనుకకుబిలచి "అనుగ మరచినాను. కథానాయకి యెందున్న"దని ప్రశ్నించెను.

మధు:—తమరడుగునది మాధవిగూర్చియా?

శర:—అయ్యో! వెఱ్ఱివాడా! మాధవిగూర్చికాదు. ఆమెం గనులార జూచియు నేలనట్లు బ్రశ్నింతును? ఇంతమాత్రమెరుంగవా? నేనడుగునది మాలతి గూర్చి.

మధు:—ఓహో! చెప్పమరచినాను. ఆమెయుందే బాధింప బడియున్నది. ఇంకొక సంగతి నీవిషయమున జెప్పవలయును. వారే లొకొ నేనెన్నిసార్లు కోరినను యామెంజూడ ననుమతింపలేదు. కడ కామె గుమ్మము గడపైనను నను జేరనీయలేదు.

శర:—అవును. దానన నేకానర్థములు గలుగవచ్చును. అపుడు వారికొంప మునుంగకుండునా?

మధు:—నేనామెను జూచినంత మాత్రమున వారికెట్లు హాని గలుగగలదు?

శర:—మీరు బూర్వప్రియులు. సరే. యీయోచన లిపు

డనావశ్యకములు. పొమ్ము.

మధుసూదనుడు వెడలిపోయెను. ఆనాఁడింటఁ బ్రవేశించి, ద్వారవు బాధించుదనుక శరశ్చంద్రుఁడాదే వేచియుండి, తుదకా వినీల తమోసాగరమునఁబడి యదృశ్యుఁడయ్యెను.



౧౧

రాత్రి యెనిమిది గంటలు కావచ్చినది. బౌబజారులోని గోపాల్ చందు దనయంగడియందే కూర్చుని, లెక్కలసరి జూచుకొనుచుండెను. ఆ భవనమిదివరకే జనువరులు గాంచియున్నను ముందరి భాగమున పెద్దహాలొకటియున్నది. అందు గొన్ని కుర్చీలును బల్లలునుమాత్రమే గలవు. అది దాటిన విశాలమగు నొకగదికలదు. ఇందే గోపాల్ చందు తన రత్నవ్యాపారమును, వడ్డీలెక్కలను గొనసాగించుకొనుచుండెను. ఇందు రెండు పెద్దయినుపమందసములు గలవు. గోపాల్ చంద్రార్జించిన రొక్కమున గొంతవరకే. మాత్రమిందుండును. రొక్క మెక్కుడగు దోడనే నాతడద్దానిని హుండీలుగామార్చి వేయుచుండును. అందుచే నాతనికడ నెప్పుడుజూచిన నయిదారువేలకు మించిన రొక్కముండదు బేంకులో నాతని యావదాస్తియు నిలువయుండును.

ఆతడు గ్రిందనొక మెత్తనిపాన్పుపై నాసీనుడై తన లెక్కల జూచుకొనుచుండెను. వెనుక జేరబడుటకు మృదులతరంబులగు దిండ్లు రెండుగోడలనానుకొనియుండెను. ఇది వారికులపద్ధతి. ఆతని కెదురుగ నాతనిగుమాస్తాయొకడాతనికి వలయుసంగతులెరుంగజేయుచు, కొన్ని కాగితముల నరుగవేయుచుండెను. ఇపుడు వారిని దొందరబెట్టు వేరెవ్వరునులేరు, గుమాస్తా మాటిమాటికిని గడియారము దెస జూచుచు "ఇంక నేనింటికేగెద"నని" యాతని సెలవుగోరుచుండెను. "ఒక్క నిముసమాగు"మని యాతడు సన్నజేయుచుండెను.

ఇంతలో వాయువేగమున మోటారొకటి వచ్చి వారిగుమ్మ
మున కెదురుగ నాగెను. తోడనే మువ్వురు మహమ్మదీయులాశకటా
వరోహణ మొనర్చి యాగృహముం బ్రవేశించి "గోపాల్ చందుగారి
యింగడియిదేనా?" యని ప్రశ్నించిరి. హాలులో గుమ్మమున కూర్చున్న
చందు సేవకుడు వారింగాంచి, సవినయముముగా లేచి "చిత్తము
బాబూ! ఇదే వారి దుకాణము. లోనకు దయచెయ్యండి"యనెను.

ఆమువ్వురిలో నొకడొక మాటను జెప్పకుండా దర్జాంగల
వాడాతని తోడనే లోనప్రవేశించిరి. అందొక వృద్ధసేవకునిగాంచి
"వారిపుడెక్కడనున్నారు?"యని సగర్వముగా ప్రశ్నించెను.

సేవ:—బాబుగారు లోపలనేయున్నారు. తమరు దయచేసి
నారని వారికి మనవిజేతునా? బాబూ తమ పేరేమండీ?

ఒక:—అక్కరలేదు. మేమే పోయి వారిని జూడగలము. నీవు
శ్రమపడ నవసరము.

సేవ:—ఎంతమాట బాబయ్యా? ప్రభువులపని చెయ్యడం
నాకు శ్రమా? ఎంతమాట సెలవిచ్చేరు?

ఇంతలో వృద్ధగోపాల్ చందు వారిసంభాషణమాలించి, తనకొర
కెవ్వరో వచ్చియున్నారని గ్రహించి, చూచుకొనుచున్న లెక్కల
పత్రే విడచి, చేతనున్న ఫౌంటెను కలమును జేబిసందున నిడి, వడి
వడి హాలులోనికరుదెంచెను. వానింగాంచి యాగంతకులు మువ్వురును
నిలచి, యందొకడు "తమరేనా? గోపాల్ చందుగారు" యని
యడిగెను.

గోపాల్:—చిత్తము నేనే గోపాల్ చందును. తమ రెవ్వరు?
ఏమిపనిపై నిట్లు దయచేసి యున్నారు.

అని యాతడు గద్గదస్వరమున బ్రశ్నించెను.

ఒక:—తమతో నొక వ్యవహారవిషయమున మాట్లాడవలసి
యున్నది. లోనకు రావచ్చునా?

గోపాల్:—దయచేయుడు. అగత్యమగు విషయమా?

రెండవ:—అవును—అత్యగత్యమే.

అనుచు నాముగ్గురును గోపాల్‌చందురుందు గంపితపాద యుగళితో ద్రోవచూప వెనుకనే గదిబ్రవేశించిరి. అట్లుబోవు నా ముగ్గురంగాంచి సేవకుడేలనో యించుక దల వంకించి, వారిపల్కుల వినగోరి కాబోలు, గది ద్వారమున కించుక దూరమున నాసీను డయ్యెను.

చందు లోనకేగిన తోడనే దన గుమాస్తానుగాంచి "నీవిక బోవచ్చును. ఉదయముననే మిగిలిన లెక్కల సరిచూచికొందు"మని యెను. ఆతడు బ్రతుకుజీవుడాయని, పాత్రముల నన్నిటి నావల ద్రోసి, తనదారింబోయెను. అంత చందావచ్చిన వారితో నిట్లు బలికెను.

"అయ్యా! తమరు వచ్చినకార్యమేమో సెలవిచ్చెదరా?

ఒక:—చిత్తము.

అనుచు దనకడనున్న మూటను గైకొని పదిలముగ దానిని చందుముంగిట బెట్టి కట్టునువిప్పెను. అందొక సుందరతరము పేటిక యుండెను. దానిని జూచుటతోడనే చందుగుండియ లేలనో "దడదడ" గొట్టుకొనజొచ్చెను. ఆతని చూపులతి భయంకరములుగ నుండెను. పులిగన్న మేకబోలె నాతడువడికిపోవుచుండెను. అందొకడా పేటికం జూపుచు "అయ్యా! ఇదియొక రత్నపేటిక. ఇందమూల్యములగు రత్నముల నేకములున్నవి. ఇది మాపితార్జితము. వారుగూడ రత్న వ్యాపారులగుటంజేసి, యీయమూల్యమణుల మావశముగావించి నారీలోకమును విడచిపోయిరి. చెప్పుకొనుటకు సిగ్గగుచున్నది. మే మప్రయోజకులమగుటచే నావృత్తిని గొనసాగించుకొన నేరమైతిమి అయ్యో! ఏమని చెప్పను, మాకర్మము నేటికి మయీగతికిదెచ్చినది."

అనుచు నాతడు జేలాంచలమున ముఖము గప్పుకొని యేడువ సాగెను. పరులకైన నాతని స్థితిగాంచిన నెంత రాతిగుండె వైనను నీరుగాక తప్పదు. కాని చందేలనో జలింపక నాతనినట్లే జూచుచు

"చెప్పు-బాబా! చెప్పు— కాలగతి నెవ్వరడ్డుకొనగలరు? నీయుద్దేశ్య మేమో తెలియజేయుము"యని బలికెను. కాని, యా మొదటివాడే మియు బలుకాడక నధోముఖుడై యా పేటికం జూచుచుండెను. అంత రెండవవాడు "బాబూ! చెప్పుటకేమున్నది. మాసంసారము నిస్సారమై పోయినది. ఇంక మాయాస్తి కంతకును మిగిలినదీయొక్క పేటిక మాత్రమే, మేము మువ్వురమిపుడు దీనిని బంచికొని జీవింపవలసి యున్నది. గాన, దీనిని దగువారలకు గ్రియమొనర్పదలచి, తమ్ముం గూర్చి యీవఱకే వినియుండుటచే నిటువచ్చినా"మని బల్కెను.

ఇంతలో హోటలులోని సేవకుడు లోనికరుదెంచి. యామువ్వుర ముఖముల నొకపరి గాంచుచు, నింకొకపరి నాపేటిక నదిలకింపుచు "పాపము! ఎంతటి వారికైనను గష్టములు దప్పవు. బాబా! మీరింత వరకెంత సుఖముగ జీవించియుంటిరో యిపుడింత బంగాలుపడ వలసి వచ్చినది. కర్మగతి" యని సవిచారముగ గష్టమును సవరించుకొనుచు బల్కెను. ఆపలుకులాలించి, తొలుత నేడ్చుచున్న మాతృముఖ మెత్తి యాసేవకునిం గాంచి, మఱల ముఖము ద్రిప్పికొనియెను.

రెండవ:—బాబూ! దయచేసి రత్నముల బరీక్షింతురా?

గోపాల్:—సరే, గాని, మీమువ్వ రేమగుదురు?

మొద:—ఏమో యైన మాకీపంపకముల బాధలేల బాబూ! మేమున్నదమ్ములము. అందుచే నీకఱియ ధనము మాకు సమాన భాగములు.

గోపాల్:—మంచిది. ఇపుడు రాత్రి జాలాయైనదే. ఇది రత్న పరీక్షకు వేళగాదు. ఏమందురు?

రెండవ:—అయ్యో! తమరట్లు శెలవిచ్చుట న్యాయముగాదు. మాకు వీలైనచో రేపే రాకుందుమా? ఇపుడింత యగత్యమేమి వచ్చినది?

గోపాల్:—చీకటికితోడు వృద్ధుడనగుట నాకుదృష్టియానదు బాబూ! అందులకే యింతసంకోచము.

గోపాల్:—క్షమింపుడు. మామూలు ఆచారమున కడిగితిని గాని వేఱుకాదు. చెప్పుటకు ప్రతిబంధకమున్నచో నగత్యము లేదు.

రోజ:—పేరు జెప్పుట కాటంకము లేమి? మీ మావని కాలస్యమగు ననియు, తొందరమున్నదను వార్తవిన కుతూహలము జేత నిప్పుడు జెప్పలేదు పోయిరండు. మాకింకను బనులున్నవి.

గోపాల్ చందు "చిత్త"మని పోవుచు సేవకునిబిలచి, వాని చెవిలో నేమో జెప్పి వెడలిపోయెను. సేవకుడా ద్వారముకడ నేనిలచి, తలుపొకచేతబట్టి "బాబూ! తమదీయూరేనా?" యని యడిగెను.

రోజవ:—నీకెందుకురా గోడవ? సరవి నీవు జూచికో.

సేవ:—చిత్తము. బాబయ్యా! ఏదో ప్రభువులొచ్చారు గదా! ఇనాం దయచేస్తారని.

మొదటి:—ఇనామా? ఎందులకు? మీ యింగడికి వచ్చిపోవు బేరగాండ్రకు నీకినాముగూడ నిచ్చెదరా? ఏమి వింత?

సేవ:—అలాగుకాదు బాబయ్యా! తమురాగి... చెప్పలేను. ఏదో ప్రభువులొచ్చారు. బేరం పెద్దదని.

అనుచు నాతడు బదిలముగ దలుపును జేరవైచు చుండెను. కాని, యాముప్పురిలో నెవ్వరు నాసంగతి గమనించియుండలేదు. అందొకడుదున్న యినుపముందసముదరి జేరి, దానిని బరీక్షింపు చుండెను. తక్కిన యిద్దరు నేమో గుసగుసలాడుచుండిరి. సేవకుడు దలుపును గ్రమక్రమముగ జేరవైచుచు నేయుండెను. ఆతడు బాబూ! పెట్టెచూస్తున్నారు. తమరటువంటిది కొంటారండీ? యీ యూళ్ళో మంచివే దొరుకుతాయండీ" యనెను.

పెట్టెనుజూచుచున్న వాడు కోపముతో "నీకెందులకా వెధవ గోల? పెట్టెకొంటానో పేడకొంటానో నీకెందుకు? అనవసర ప్రసంగము. నోరుమూసికొని యావలకు బో"మ్మని గద్దించెను.

సేవ:— చిత్తం బాబయ్యా! పొరపాటు. పొరపాటయి పోతున్నాను.

కుల దురంతములెల్ల దెలిసికొని, నేడీరీతిబ్రతిక్రియగావించియున్నాడు ఇప్పటికపరాధులెల్లరును జేజిక్కినట్టే. రాణీగల్లీలో డెబ్బదిమొదవ నెంబరు గృహమున నింక మాధవియొక్కతె యున్నది. ఈవార్త నగరమున నల్లుకొనక బూర్వమే యారాక్షసినిగూడి బట్టి తేరవలయునని సంకల్పించి, శరశ్చంద్రుడిందు సాయుధులగు రక్షకభటుల గాపునిచి, మఱికొందఱిఁగూడి తానువాయు గమనమున రాణీగల్లీ బోవుచు, నొకభటునంపి మదనసింగుగారికే సంగతులెల్లను దక్షణమే దెలియజెప్పి, యాతని దోడ్కొని తన్మాగృహంబున గలియవలసినదని యాజ్ఞాపించెను,

శరశ్చంద్రుఁడాగృహమును జేరెను. మదనసింగుగారి కొఱకనిపిన భటుఁడుదగివచ్చి, సింగుగారింట లేరియును, యెందేగిరో దనకెవ్వరు నెరిగింపజాలకపోయిరనియు, జెప్పెను. భటులెల్లరును ఖడ్గాద్యాయుధములబూనివొడ్డి త్రోవనుగుమ్మముం జేరిరి. ఆద్వారమిప్పటియట్లె బంధింపబడియుంటచే వారద్దానిపై నుఱికి నవిగ్రహించుచుండిరి. అంతటలోననుండి "వచ్చుచున్నాను. అబ్బా! అంతతొందరేమలకు? కొంచెమైనను యోచనవలదా? మతులుబూర్తిగ బోయినట్లున్న" వనుచునొక స్త్రీమూర్తి వచ్చి, భటులకెట్టి శ్రమనీయకయే ద్వారమును దెరచెను. కాని, ఏమనిజెప్పను? కృష్ణవసనాచ్ఛాదితులు—ఖడ్గాద్యాయుధపాణులు—దశ్యుదళకుత్సిత మార్గలిచ్ఛేదకులు—తస్కరమానస ప్రకంపమాన భయదశృంఖలపాణులునగు యెఱ్ఱతలగుడ్డల పిండుఁగాంచి యానరరూపదానవి—యానోముఖవ్యాఘ్రము—యాయపరతాటకి— యామాయావిని—యాహంతకియట్లే నిలువుగాగొరడు వాఱిపోయినదననక్కజమా?

పాపము! జగత్సింహాదులు గార్యఫల్యమొనరించుకొని, యానందాతిరేకమునమై మరది యట్లుదలుపునెయ్యులుగొట్టుచుంటిరని, యెదురేగి యామెద్వారముదెరచినదిగాని, తనమెడకుగాలపాశము దగిల్చి యీడ్చికొనిపోవ యమభటులేవచ్చియున్నారని యామె

ఎఱుఁగవుగదా? ఆమె మాధవియని వేఱె చెప్పవలయునా?

రక్షకభటాళిలోనం బ్రవేశించి యామెం జుట్టినది. కాని, యామె యించుకంతయు జలింపలేదు. "ఎవరుమీరు? ఇందేల నీరాత్రిమున బ్రవేశించుచున్నారు?" యని మాత్రమామె గద్దించుచు బ్రశ్నింపగలిగెను. ఎంతధైర్యవతియైననునబల యంగనను మాంతకి. ఎదుటబ్రత్యక్షమైనవారు మాంతకాంతకులు. వారేదొంగలైనను, యామె యంతగ లక్ష్యింపకుండెడిదేమో? గాని, రక్షకభటులు సకరమట్లు దనయెదుటనావిర్భవించినతోడనే, యామె గతజీవితచారిత్రమంతయు నొక్కత్రుటికాలమా మెకనులయెదుట మెరపువలె మెరసినట్లయ్యెను. ఆపదలు తన్నావరించుకొనుచున్నవని తోడనే యామె గ్రహించుకొనియెను. ఈవిపదంబుధిలోబడి తనజీవనౌకమునుంగుటకు కెంతమో నాలస్యము లేదని యామె భావించుకొనియెను. ఆమె నోటనిక మాటరాకపోయెను. కనులు జీకట్లు గ్రమ్మసాగెను. శరీరమాపాదమస్తకమును వడంకిపోవుచుండెను. వారియెదుట నిలచుటయే యామెకు గష్టతరమని దోచెను. కాని, విధిలేదు. తుదకెట్లో ధైర్యమూని యేమైనంగాని మ్మని యామె నాతియయ్యును పౌరుషము వహించెను.

శరశ్చంద్రుడామె యెదుట బ్రత్యక్షమాయెను. ఇతర భటనికాయమువలె గాక నాతని వేసము మాఱుగనుండెను. ఇంతకు మున్నాతడు దాల్చిన సేవకపాత్రనందే విడచివచ్చెను. ఇపుడీతడపరాధపరిశోధకాధికారి. ఆతడు మాధవింగాంచి యిట్లుపల్కెను. తల్లీ నీదర్శనమున నేడు కృతార్థుడనైతిని. నీపున్నెమున నేడు మాసుఖమయదినములు ప్రారంభించినవి. దయయుంచి ఇంక నీవు మాతో దయసేయవలయును. ఈచాతుర్గ్రహకూట మీయవని యెన్నిదినముల నుండియో బ్రపీడించుచున్నది. నేడీగ్రహములొక్కసారిగ దిరిగిపోవుచున్నవి. ఇంక దయసేతువా?"

మాధవికాగ్రహము మిన్నుముట్టెను. దండతాడితభుజంగివోలె నామె బుసగొట్టుచు "మీరెవ్వరు? ఈయర్ధరాత్రమున నాతో

శరశ్చంద్రుఁడు మధుసూదనుని జేరఁబిలచి "నీవు నాతో రావలయును. విచారణపూర్తియై, హంతకులు శిక్షింపఁబడు వరకును, నీవు నాయధీనముననే యుండవలయును. అట్లని నిన్ను బంధించుచుంటినని గాదు. విచారణసమయమున వాఙ్మూలమిచ్చినపిదప నీవు పోవచ్చును." యనుచు, భటులఁబిలచి "మాధవుని బంధించి కారాగారమునకు గొంపోరండు, ఈ కాంతను, మధుసూదనుని బదిలముగా మాగృహమునకు గొనిపొండ"ని యాజ్ఞాపించెను.

తోడనే యిరువురు భటులు శృంఖలంబుల మాధవుని కరయుగ్మంబును బంధింపఁబోయిరి. అతఁడు ధైర్యమున వారల నావలకుం ద్రోసివైచి "శరచ్చంద్రా! నీప్రయత్నములన్నియు జేసినవరకే వినుచుంటిని. నేను గమనింపక నిన్నుఁ గాంచియు నీకుం బ్రజగిల్లు హానుల నీవిననికే బాధించియుంటివని నానమ్మకము. నీకుం స్పష్టి యధార్థాంశము నీవు నన్ను బంధింపసాహసింపవు గాని, నా మా ప్రయత్నమింతశ్రేష్ఠముగ నీచెవినెట్లుబడినదో యత్యాశ్చర్యముగానున్నది. అయినదేదో యైపోయినది, గడచినదానికై విచారించినఫలితము లేదు. ఇంతటితో మానాటకము ముగిసినది. ఇంతవరకును పాలాక్షునకై నను వెరువక స్వచ్ఛందజీవన మొనర్చజాలిన నేను, విధివశమున నేఁడు నీచే బడితిని. ఈమాస్థితికి మాలో నెవ్వరో విద్రోహులున్నారనుటకు సందియ మిసుమంతయు లేదు. ఆలోచింపగ నొక్కఁ డీమధుసూదనుఁడు దక్క మాలో నితరులెవ్వరును నాకెవరాడి యెరుంగరు. ఈతడనను, మాలతి విషయమునను, రత్నపేటికనుగూర్చియు మాతో వాదమాడియున్నాఁడు. ఇపుడీసాహసమున కాతఁడే యొడిగట్టియున్నాడని నానమ్మకము. మొన్న నీవే సారాయముదెచ్చిన వాఁడవైన నానాఁడే మాయింటమేము మైకమునఁబడియున్నతరి మధుసూదనుని నీవశ మొనర్చుకొని, మాగుట్టు దెలిసికొని యుందువని నానమ్మకము. అంతకుమున్ను బోతుటీగయైనను మాగృహము జొచ్చియుండ లేదు. ఎట్లయిన నేమి? కాలచక్రము దిరిగిపోవుచున్నది. మాగ్రహములుగూడ

సది. ఇంక నీపగ దీరినది.

శరశ్చంద్రా! ఇదిగో. ఇదియేమో జూచితివా? ఇదియొక విషఘుటిక. నిముసములో నాప్రాణములహరింపగలదు. దయయుం"చు మనుచు నామె కంచుకాంతరమునుండి యొకపొట్లమునుదీసి, పొట్లా చునే గనుమూసి దెరచునంతలో నోటనిడికొనియెను.

శరశ్చంద్రుడుతత్క్షణముననే యామె కరయుగ్మమును బట్టి కొనియెను. కాని, ప్రయోజనమేమి? ఆదారుణవిషమంతకుబూర్వమే యామె నాభిప్రదేశమాక్రమించు కొనియెను. అందేమి మహాత్మ్యమున్నదోగాని, యామె మరుక్షణముననే వెర్రిదానివలె నొక్క కేక వైచి "ఆ"యని నాలుకంజాపుచు, నేలబడిపోయెను. ప్రతిమలంబోలి భటవర్గమంతయు నావిచిత్రదృశ్యముంగాంచుచుండెను. ఏలొకో? మధుసూదనుని కనులు గిఱ్ఱున దిరుగ "హా"యని యాతడొక్క వేడినిట్టూర్పు బుచ్చెను.

మఱుక్షణముననే మాధవి ప్రాణవాయువులా యనంతవాయుగోళమున లీనములై పోయెను.

మాలతీమధుసూదన సహితుడై, శరశ్చంద్రుడా శవమునకు గొందఱి భటుల గాపునిచ్చి, విచారపూరితహృదయముతో నాప్రదేశమును విడిచిపోయెను.



౧౩

శరశ్చంద్రుడు మాలతీమధుసూదనుల దనయింటికిగొనిపొమ్మని భటులకానతిడి, తాను గోపాల్‌చందు గృహమునకేగెను. అచట రక్షకభటులు జాగరూకులై పహరా నొసంగుచుండిరి. గోపాల్‌చందును, నారాయణచందును నావిచిత్రనాటకప్రదర్శనముగాంచుచు

భయాశ్చర్య చకితులై యొకచో నిలచియుండిరి. పాపము నారాయణ చంద్రానాటికింకను సంపూర్ణారోగ్యమును బొందియుండలేదు. మాలతీ హంతకులును, తన్నానాడు వంచించిన మాయదారులును నేడు బట్టువడి తిరిగ దాయుని యానందానుదించుచుండెనేగాని, మాలతీవృత్తాంత మాతని కావంతయు దెలియదు. శరచ్చంద్రుడుగూడ నద్దాని కెరింగింపలేదు. ఈసంగతి యప్పటికపుడే బోబజారంతను గ్రమ్ముకొనిపోయెను హంతకుల ముఖావలోకన కుతూహలంబున లెక్కకుమీరిన ప్రేక్షకులందఱేరి, యొకరినొకరు త్రోసికొనుచు, హాలునిండ జొచ్చుచుండిరిగాన, భటులెల్లవారిరాక నాటంకపరచుచుండిరి. శరచ్చంద్రుని రాకంగాంచి వారెల్లరొకప్రక్కకొదిగి యాతనికిమార్గమొసంగిరి. ఆతఁడు ద్రోహుల బంధించిన గదిద్వారముకడకేగి, "ఇపుడే ద్వారముదెరచి, హంతకుల శృంఖలాబద్ధులగావించవలయును. మీరు సాయుధులై జాగరూకులై యుండుడు. రివాల్వరుల గుండ్లనింపి సిద్ధముగా నుండుడు. ఒకవేళ నా ద్రోహులు మిమ్మెదిర్చి పారఁజూచినచో తోడనే నిరాటంకముగ వారిం గాల్చివేయుడు. జాగ్రత. తేజోమయములగు మఱి రెండు దీపికలంగొని తెండు. మీలో మువ్వురు సంకెలలదాల్చి వారిని బంధింప సిద్ధముగానుండుడు. వారికి సహాయముగ నార్వురు సాయుధులై నలుప్రక్కల గాచియుండుడు. ఇంక ద్వారముందెరచుచున్నాను"

అనుచు నాతఁడా భటవర్గమును హెచ్చరించి వలయు సన్నాహము గొనర్చెను. హాలులో నితరులెవ్వరు నుండకుండ బంపివైచి దాని తలుపుల దిట్టముగ బంధించివైచిరి. గోపాల్ చందు నారాయణ చంద్రుల సహితము వెలికంపిరి అచట నిపుడు రక్షకభటపరివేష్టితుడగు శరచ్చంద్రుడు దక్క నితరులెవ్వరును లేరు. హాలంతయు నఖండ ప్రభాభాసమానజ్యోతిర్మయంబై, క్రిందబడిన నల్లపూసయైనను గనుగొన జాలునంతటి కాంతివంతమైయుండెను. భటులప్రమత్తులై గది ద్వారముకడనే గాచికొని యుండిరి.

అంత శరచ్చంద్రుడు ముందునకేగి గది ద్వారమును దెరచి

నైచెను. లోన ముప్వురు బేరగాండ్రును, గాను, హంతకులును కొయ్యవారి నిలచియుండిరి. ఈసరికే వారి ప్రాణవాయువులెగసిపోయి నవో యున వారు బొమ్మలపోల్కి గానవచ్చుచుండిరి. తలుపుదెరచు సవ్వడి వారి చెవుఁబడినతోడనే వారి యాపాదమస్తకమును గంపించిపోసాగెను. ఏమిచేయుటకును వారికి దోచుటలేదు. భటులు వారి వక్షముల కెదురుగ రివాల్వరుల గురిపెట్టి నిలచియుండిరి. సంకెలలతో ముప్వురుభటులు వారిదరిఁజేరిరి. ఆహంతకులలో నొకఁడు "మీరిట్లు వ్యవహరించుట న్యాయవిరుద్ధముగా నున్నది. మేమెట్టి ద్రోహము నొనరించియుండలేదు. పౌరపాటున మీరు మము బట్టుకొనుచుండిరేమో గుర్తింపుడు. నిష్కారణముగా మమ్ము బాధింప జూతురేని మేమెదిరింపవలసివచ్చును. మాప్రాణములు బోయినను సరియే మమ్ము మీరు స్పృశింపఁగూడదు. వినుఁడు. మేము నేరస్థులముగా"నని, భయోద్ద గర్జితరవంబున గర్జించెను. కాని, మేరు ధీరుండగు శరచ్చంద్రుఁడా, పలుకుల లెక్కించువాఁడు. ఆతఁడుబల్కిన వానివద్దకుఁజని, తన రివాల్వరు నాతని వక్షమున కొక్కయంగుళమెడముగ నిలిపి, "ఇదిగో! నీవించుకైనను మమ్మెదిరింప సాహసింతువేని, యొక్కయడుగైన గదల్ప బ్రయత్నింతువేని, నీవింక బ్రదుక దలచుకొనవేని, తోడనే యీయగ్ని గోళము నీవక్షవిదారము గావించు ననుట నిక్కవము. నాపలుకులాలించి మీరు మాకిపుడులొంగి తీరవలయును. ఒకవేళ న్యాయస్థానమున సహేతుకముగ మీరలు నిర్దోషులని నిర్ణయింప బడినచో, తక్షణమే మీరు విముక్తినొందగలరు. సందేహములేదు. ప్రస్తుతము మీరు బందీలైయుండవలెను.

అని భటులవంకదిరిగి "చూచెదరేల. సంకెలల దగుల్పుడు" యని గంభీరముగ బల్కెను.

ప్రాణములపై నెవరికి దీపియుండదు? పిపీలికాదిబ్రహ్మపర్యంతమును స్వప్రాణరక్షణార్థమై పాటుపడని జీవరాశి యీలోకమున గలదా? బ్రదికి యుండిన బలుసాకు దినవచ్చును, మేనజీవములున్న

నిపుడుగాకున్న నింకొకతరి నైనను సౌఖ్యమందవచ్చును. కష్టములు గాపురములు సేయవు. కాన, ప్రాణ రక్షణోద్యోగమే యుత్త మోత్తమము.

ఇపుడాముగ్వురి యవస్థయు నట్లేవచ్చినది. దలవంతులు, సాయుధులునగు నందరి నెదిరించి వారేమిసేయగలరు? ఒకవేళ నెట్లో వారి కన్యకాపురి కాలికిబుద్ధి జెప్పుదమన్న నాగదికది యొక్కటియే మార్గము. ఆమార్గమిపుడుశత్రుసైన్యముచేనరికట్టబడియున్నది. వారింక దప్పించుకొనుటెట్లు? విధిలేక వారు శత్రుహస్తగతము గావలసివచ్చినది. వారి యుచ్ఛగ్రహములిపుడు నీచస్థములైనవి. వంకర దినములు సంప్రాప్తించినవి. నేటితో వారి యేకచ్ఛత్రాధిపత్యము నశింపగలసినది. వారి నిరంకుశ ప్రభుత్వము క్షీణమైనది. కాలచక్రము వారికభిముఖముగా దిరిగిపోయినది. దాని నాటకపరచుటెట్లు? అది యెవ్వరికి సాధ్యమగును? వారేమిసేయగలరు? వారి తలవ్రాత యట్లున్నది.

భటులమందానందమున నాపీఠాధి పీఠుల కిరయుగళంబుల కాయసకంకణధారణంబుగావించి, వారి నుచితరీతి సన్మానించిరి. "హా" యను వేడినిట్టూర్పుల నవిచుచు, గనుకొలకుల భాష్పాంబువులు జాలువార వారలట్టి శిరముల వ్రేలవైచిరి.

స్వానుభవమైనగాని తత్వము బోధపడనేరదు. లావణ్యరాశి అబలామణి—అమాయిక-లతాతన్వి—కుసుమకోమలి యగు నొకానొక రమణీమణి యుత్తమాంగమును, నిర్దాక్షిణ్య చిత్తమున—నిష్కారణవైరమూని, కరకుదురకలై, కరమున గలవాలమూని కరుకున గత్తిరించినవేళ నిట్లొక్కయశ్రుకణమైన నేలరాల్చియుండిరా? జాలిగొలుపు నొక్కపలుకైన నోటబలికిరా? పాపమయ్యో యని యొక్క వేడినిట్టూర్పునైనవిడచియుండిరా? ఎంతపని గావించితిమని యించుకైన బశ్చాత్తాపదావానల దగ్ధమానసులైరా? మన్నుమిన్ను గానక, యౌవనమదంబున గన్నులుమూసికొని పోవ, నొనరించిన

దుష్కార్యముల నొకపరినైనను దలంచుకొని, దలల వంచుకొని, జీవించిరా? "ఈయావనమే శాశ్వతము. ఈకవోష్ణరక్తధార లెప్పుడిట్లే మాశరీరముల బ్రవహించుచుండును. ఈమానిరంకుశాధికారము నెదురించి జీవింపగల మానవుడింతవరకు నీలోకమున బుట్టియుండ లేదు ఇంక ముందు నైతము బుట్టబోడు. మాయాటలెన్నటికి నిట్లేసాగును. బ్రహ్మ మమ్మిట్లే స్వేచ్ఛాతరముగ జీవింపమని మానొసళ్ళ వ్రాసియున్నా"డనుచు, దలపోసి, విర్రవీగిన దినసము లిపుడెందేగినవో గద. తమకిట్టి దుస్థితి కలిగినగాని తమకంత్తదసి గలుగుట లేదు. నేడిట్టి సంకటము బ్రాప్తించినగానితమకిట్టిహృదయవిదారముగా లేదు. ఎన్నొక్కప్రక్కనే బ్రాదుకొనదు. వెన్నెల లెల్లప్పుడును గాయవు. ఆ జన్మాంతమును మానవుడు సౌఖ్యములనే యనుభవింపడు. శుక్లకృష్ణములవలెనే కష్టసుఖములు సమముగ మారుచుండును. అది యీశ్వరేచ్ఛ. పరమేశ్వరాజ్ఞలకింక బ్రతిక్రియలు లేవు.

శరశ్చంద్రుని కష్టములు గట్టెక్కినవి. అతనిప్రేమ ఫలించినది. ఇంక నాతని యశశ్చంద్రికలు బూర్వముకన్న వేయిరెట్లధికముగ దివ్యతేజోమయములై లోకమున బ్రాకిపోనున్నవి. హంతకులిపుడాతనిచే శృంఖలాబద్ధులైయున్నారు. అయిన వారెవ్వరో కన్నుల కరవు దీర నొకపరిజూడవలదా? చూచి యానందింపవలదా?

ఇంతలో హాలుతలుపులుదెరువ నారాయణచంద్రుడును, గోపాల్ చంద్రుడును, హంతకుల జూచువేడ్కనందు బ్రవేశించిరి. భటుడొకడు దీపిక జేతబూని యాద్రోహుల ముఖములం జూపింప, శరశ్చంద్రుడు వారి యాకారముల బరీక్షింపుచుండెను.

వారు కృష్ణవసనధారులు. అందొకడు మూరెడుగడ్డమువాడు తక్కిన యిరువురునుగూడ నంతపొడవుపాటివిగాకున్నను, సాధారణములగు పీచుగడ్డముతారలు. వారి యాగడ్డములజూచినంతనే యవి కృత్రిమములని శరశ్చంద్రుడుగనిపెట్టెను. అందొకనిగడ్డముబట్టి యాతడటునిటు యూపిజూచెను. తోడనే యాతడు దలంచినట్లదియూడి

వచ్చెను. ఇపుడాతని ముఖమతని నిజస్థితిని దెలియజేయుచుండెను. ఆతడెవ్వడు? అది జెప్పవలయునా? శ్యామలహంతకుడు. బాదిపోటు. మాధవి ముద్దుపట్టియగు జగత్సింహ మహాశయుడు.

పాపమాతడు సిగ్గుచే దలవంచుకొనియెను. శరశ్చంద్రు డాతని మోమొకచేత నెత్తి "ఓహో! జగత్సింహమహాశయులా?" యని వికటముగ బలుకరించెను. ఆపలుకొక్కటి చాలదా? ఆతని వక్షమును దూసికొనిపోవుటకు.

రెండవవాని గడ్డముగూడ నూడదీసిరి భటులు తమకప్పిన ముసుగుకట్టి యాతని మోముకడ బెట్టెను. తోడనే నారాయణచందు "రామశింగు రామశింగు—ఔరా! పాపీ!" యని కెవ్వున గేకవైచెను. హంతకు డొకపరి నారాయణచందును గ్రేగంటజూచి, తలవాల్చికొనియెను. శరచ్చంద్రుడు చందును గాంచి "ఓహో! ఈ మహానుభావుడేనా? తాము కును మాలతికిని సంధానకర్తలు. యోగ్యులు. ఇంతకు నిట్టి పుణ్యపురుషుల స్నేహమున దమ జన్మ తరించినది. నేడు నేనెంతపుణ్యాత్ముడను. ఆ మహాత్ములెవ్వరో దర్శింపనిండు. అంతతో నీ త్రిమూర్తుల దర్శనభాగ్యమున మనజననములు సాఫల్యములగు" ననెను.

నారాయణ చందాతనిదరి జేరి "శరశ్చంద్రబాబూ! మాతండ్రిగారున్నారు. నమస్కారము. ఆసంగతినిపుడు దేవల" దని మెల్లగ నెరింగించెను—వృద్ధగోపాల్ చందేమి యోచింపుచుండెనోగాని శరచ్చంద్రుని పల్కుబూర్తిగ వినినట్లుగ లేదు. లేకున్న నెట్లుండెడిదో?

శరచ్చంద్రుడంత "నేడు నాకీగడ్డములపనిపూర్తిగ దగిలిన" దనుచు నామూడవవాని గడ్డమునుగూడ నూడబెరికెను. పాపమాతని యాపాదమస్తకమును ఝుఝామారుతమున దూలులతకూనవ లెగంపించిపోవుచుండెను. ఆతడు దనరెండుచేతుల ముఖమునుగప్పికొనియెను. ఎంతసిగ్గు? ఆతడెవ్వడు? శరచ్చంద్రుడాతని కరయుగ్మంబునుబట్టి ముందునకీడ్చెను. ప్రేక్షకులెల్లనాతనముఖమునుగాంచి "అబ్బో ఇది యేమి?" యనియరచిరి— రక్షకభటవర్గమంతయు "ఎవ్వడు?"

అనుచునాశ్చర్యమందెను. శరశ్చంద్రుడు భయాశ్చర్యములుట్టిపడ "నీ—వా? యనుచు, బట్టిన కరయుగమ్మట్టె విడచి రెండడుగులు వెనుక వెనుకకుబోయెను.

తొలియిద్దరికన్న నీమూడవవ్యక్తింగాంచి యాశ్చర్యాంబుధి మునుంగని వారందు లేరు. వారెల్ల దాముగలగనుచుంటిమేమో యని భ్రమసి—కాబోలు నొకపరిగనులదుడిచికొని మఱలమఱల నాతని ముఖము జూచి యచ్చెరువొందుచుండిరి?

ఆయన నాతడెవ్వడు?



౧౮

కొంతకాలమునకు బూర్వమున గాంఘాట్టన జరిగినవిచిత్ర హత్యాపరాధమున హంతకులెల్లరును బట్టువడిరనియు. నేడు వారిని న్యాయస్థానమున విచారింతురనియు, నూరెల్లబ్రాకిపోవుటచే, జనులు తండోపతండములుగవచ్చి న్యాయస్థానమును జుట్టుముట్టిరి. పట్టణమెల్లనొక్కచో జేరినదాయనునట్లున్న యా జనసంఘమెంత యల్లకల్లోలముగనుండునో వేఱుగవర్ణింప ననావశ్యము.

సరిగ బదునొకండుగంటలకు హంతకుల ముగ్గురను న్యాయాధిపతి కెదురుగనిలువబెట్టిరి. శరశ్చంద్ర మధుసూదనాదులుగూడ న్యాయస్థానము నలంకరించియుండిరని వేఱుగ జెప్పనక్కఱలేదు. నారాయణచందునకింకను శరీరమున స్వస్థత లేకుంటచే నాతడు మాత్రము రాజాలకపోయెను. శరశ్చంద్రుడాతని వాఙ్మూలమును వ్రాతపూర్వకముగగొనివచ్చి న్యాయాధిపతికర్పించెను.

విచారణీయాంశములన్నిటిని వర్ణించి జాగొనరించుటనుచితము. మామూలుగ నిట్టిసందర్భముల నపరాధులెట్లు విచారింపబడుదురో

యట్లు జరిగిపోయెను. ఆసమయమున వారిచ్చిన వాఙ్మూలముల
మాత్రము వ్రాయకదప్పదు.

మొదటియపరాధి జగత్సింహుడు. అతడు దనచరిత్రము
నిట్లుచెప్పదొడగెను.

"నాతలిదండ్రులు నేను బహుచిన్నదినముల బాలుడనైయున్న
తఱినే బరలోకమునకేగిరి. అంతనాదుర్దశంగాంచి, పుత్రసంతానవి
హీనయగు నాపినతల్లి నన్ను బెంచి పెద్దవానిం జేసినది. నా పండ్రెండవ
సంవత్సరమువరకును నేను ఫిరాపురముననే తిరిగితిని. అప్పుడు నా
పేరు షరీఫ్‌ఖాను. అంత నాపినతండ్రి కారణాంతరములచే నాయూ
రువిడచి, భార్యయు, బంచవర్షప్రాయయగు మిహిరయు, నేనును
వెంటరా, లోకయాత్రకై వెడలి, యొకనాడు రంగమున మాధవియను
నామెయింట బసగావించితిమి. మేము యవనులమగుట జేసి, యప్ప
టికి యవనమతస్వీకారమొనర్చిన మాధవి మాకుసపూర్ణానురాగ
మున స్వాగతమొసంగెను. మఱునాడు నాచెలియగు మిహిరను,
నన్నునువింట మాధవి కడవిడచి, మాజననీజనకులు సముద్రస్నానము
నకేగి, విధివశమున నేటివఱకును గానరారైరి. పిమ్మట మాధవియే
మాకిరువురకును పాలకమాతయై, యత్యాదరానురాగములమము
బెంచి, పెద్దవారిం జేసినది. ఆమెయే నాకు జగత్సింహుడను నామ
ముంచినది. నేను విద్యావిహీనుడను. రంగమున బ్రవేశించిన దాది
తుంటరిసహవాసమున బ్రొద్దుపుచ్చుచుండెడివాడను. ఎట్టిసాహస
కార్యమునకైనను వెనుదీయువాడగాను. ఇట్లుండ గొంతకాలమునకు
మిహిర జవ్వనియైనతోడనే, మాధవి సహాయమున నాయూరరత్న
వర్తకుడగు రఘునాథపండితునితో నామెకు స్నేహమలవడినది.
అట్లు కొంతకాలముగడచినపిదప రఘునాథుడు మృత్యువాతంబడి
యెను. అతనియేకపుత్రుడే యీమధుసూదనుడు. ఈతనికివివాహము
లేదు. తండ్రివోలెనీతడుగూడ బరస్త్రీవాంఛచే వేశ్యాలంపటుడై
మాలతి చెలిమిగావించెను. దినదినమునకు వారిప్రణయమగాధమై

పోయినదట. ఆరఘునాథుని యంత్యకాలమున జేతనైనంతవరకాతని ధనము జిక్కబట్టుకొను నుద్దేశ్యమున, నేనును, మా చెలియలును, మాధవియు, నాతని గృహమున నేయుంటిమి. అంత మాప్రవర్తనవల యందనుమానించి యీమధుసూదనుడొక యమూల్య రత్నపేటిక నాఱాత్రియే గొనిపోయి, మాలతిజనకునకొసంగి, దానినిభద్రముగ గాపాడుమనికోరెను. కాని ధనము పాపాల వాలము......"

శర:—అబ్బా! ఎంత వేదాంతివి?

జగన్మోహనుడా పలుకుల జెవినిబెట్టక, శ్రీకంఠనాతని తేరి జూచి, మరల నిట్లని చెప్పనారంభించెను.

"జీవనాథుడా పేటికంగాంచి, దాని నెట్లయిన నపహరింప నెంచి, యామరుసటి దినమే రంగమునువిడచి, యీయూరు జేరికొనియెను. పిదప నాతని పలాయనమును మధుసూదనుడెఱింగి, కొంప పోయిన దని గుండె బాదికొనుచు, నెట్లైన రక్షింపుడని మము వేడికొనియెను. అందులకు మేము సమ్మతించి, మాఱువేసమున నానందయోగియను నామముందాల్చి, యీ మొహిదీన్ సహాయమున నీనాటకమంతయు నాడించి, తుదకీరీతిని మంగళము బాడుచుంటిమి."

న్యాయ:—సరే—మాలతిని వధించినట్లు ప్రచురించుటలో మీయుద్దేశ్యమేమి?

జగ:—మధుసూదనుడు, మాలతి తనకట్టిమోస మొనర్చినను యది జీవనాథుని ప్రేరేపణమునదక్క నిరతమునగాదనియు, నామె స్వాభావికముగ సాధుశీలయనియు, గాన, నెట్లైన నామె యనురాగమునే తిరిగి సంపాదింప వలయుననియు, గోరుటచే, శ్యామలను వధించి మాలతి స్థానమునను౦చి, లోకమునకట్లు దెలియజేయ గలిగితిమి.

న్యాయ:—దానికంత గూఢమేల? మధుసూదనుడే స్వయముగ బోయి యడిగినచో నామె యిష్టపడకుండునా?

జగ:—ఆమె యిష్టపడనచ్చును, గాని, జీవనాథుని కడనుండి

రత్నపేటిక తనకు రానేరదు. ఒక్కదెబ్బకు రెండుపిట్టలు బడవల యును గదా?

న్యాయా:—శబాష్. మంచిపని జేసితివి. ఇంక నీవేమియు జెప్పనక్కర లేదు.

రెండవ నేరస్థుడు మొహిదీన్ ఆతనిట్లు చెప్పెను.

"నా పేరు మొహిదీన్. నాది యొక గ్రామమని చెప్పుకొనుటకు వీలు లేదు. ఎచ్చటను నాకిల్లుగాని, యెవ్విధమగు నాస్తిగాని లేదు. నాజీవితమున చాలభాగము రంగమున గడిపితిని. అందునను దినము లలో నీమాధవిభర్తయు, నేను నొకే యంత్రాలయమున బని సేయు చుండెడివారము. దాననే నాతనియింటికిదరుచుగ బోవుచు మాధవితో బరిచయ మొనర్చుకొంటిని. అప్పటికామె హిందూవనిత. నేను మహ మ్మదీయుడను. హితునిబోలె నామె భర్త నన్నాదరించు చున్నను, దిన్నయింటికి జేటుగోరు నాస్వభావమాతని భార్యాంగని మోహింప జేసినది. ఒకనాడు నాకోర్కె నామెకెరుకబరచితిని. కాని, యామె యందుల కియ్యకొనక హితవాక్యముల నాబుద్ధి మరల్పజూచినది. నాకోర్కె యప్పటికుపశమించినదేగాని, దినములు గడచుకొలదిని మరల నది చిగుర్పసాగెను. పిదప నొకనాడామెకడకేనేగి, యెట్లయిన నన్నాశ్లేషనజేర్పవలయునని బలుగతుల బ్రార్థించితిని. అంతకు నామె సరకుగొనలేదు. ఇంకనామె ముఖముజూడనొల్లక నెవ్వరి కొరకీ ధనార్జనమని దలపోసి, యారాత్రియే రంగమును విడచి యీపట్ట ణము జేరికొంటిని. నాటిమొదలు నేనిందే జీవించుచుంటిని. కాని, నాయునికి మాత్రము మాధవికి దెలియజేసి యామె క్షేమోదంత మెరుంగు దలంపున నామె భర్త పేరజాబులవ్రాయుచుంటిని. ఇట్లుండ గొంతకాలమునకీ జగత్సింహ మధుసూదనులీపురమున నను గలసి, మాధవి యొసంగిన యొకజాబుమూలమున నాకు బరిచితులైరి. నాటి గోలె వారికేను సహకారినై వారికార్యములకెల్ల దోడ్పడుచుంటిని. అహోరాత్రములు మారువేసమున నీశరశ్చంద్రుని దాచికొని దిరు

గుచు నాతని ప్రయత్నము లెప్పటికపుడు మాధవి కెరిగించుటయే నాపని—?

న్యాయ:—శ్యాములను మీలో నెవ్వరు తుదముట్టించిరి?

మోహి:—నేను సహాయకుడగా జగత్సింహుడే యాపనిని బూర్తిగావించెను.

న్యాయ:—నీవు రామలింగను నామాంతరమేల దాల్చితివి.

మోహి:—రంగమున యంత్రాలయమున బని చేయునపుడు నేను కొన్ని నేరముల గావించియుంటిని. అదిగాక నేను వెడలివచ్చునప్పుడేరికిని దెలియనీయక యంత్రాలయమునుండి కొన్ని సామగ్రుల గొనివచ్చి నాయిచ్చవచ్చిన వారికి బంచిపెట్టితిని. యంత్రాలయాధికారులు నన్ను నమ్మి కొంత సొక్కము గూడ నాకీలనుక్రింద ముందే యొసంగిరి. ఆనేరములకై నన్ను బట్టుకొన భటులు ప్రయత్నింతురని యెంచి నానానువేషముల మార్చికొంటిని. మరియు నేను రంగమున నున్నప్పుడే యీజీవనాథుని మాలతినిగూడ నెరుగుదును. వారి నీయూరగాంచి యాశ్చర్యమంది వారేల రంగమును విడచివచ్చిరో యోయి ప్రశ్నించితిని. దానికి జీవనాథుడేమో నాకుం జెప్పెను. కాని వారు నాకుబూర్వపరిచితులగుటచే నను బూర్వనామముననే బిలతురేమో యను భయంబున రామలింగని బిలువ వారిని బ్రార్థింప వ దులకియ్యకొనిరి. ఆనామముననే నేను నారాయణచందుతో బ నము గావించుకొని యాతనికిని మాలతికిని సంధానకర్తనై, ద నాతనికడ ధనసంగ్రహణము గావించుకొనుచు నుదరపోషణ మొ చుండెడి వాడను.

న్యాయ:—సరే, నారాయణచంద్రును మోసగించి, పేటికను ?ంచిన వారెవ్వరు?

మోహి:—జగత్సింహుడు నాడు జీవనాథుని రత్నపేటిక విషయమై ?నుగొనదలంచి యందేగుసరికి లోన జీవనాథుడీచంద్రునకు దనయావదా?ని యప్పగించుచుండెను. ఆడబోయినతీర్థమెదురైనదని

యాతడు సంతసించి, పరుగునవచ్చి నాకా యుదంత మెఱిగింప, నేనందులకు బ్రీతి కియగావింప నెంచి, శరశ్చంద్రుని మోటారు దొర గారి యింట నున్నదనుసంగతి నెరింగినవాడనౌట, శరశ్చని స్త్రీవరు వేషమున దొరగారికడనుండి కారును హరించి, యందే నారాయణ చందును గూర్చొనబెట్టుకొని గంగాతీరమునకు బోయి, పేటికను కరగతముగావించుకొంటిమి. ఆతని హింసించునూహ మాకెన్నటికిని లేదు. కాని పేటికకై తగవులాడునపుడు కాలొకతూముడుకొనుటచే వది గంగయొడ్డున దిరుగబడెను. దాన మాకెల్లరకును గాయములు దగిలినవి.

న్యాయా:—పాపము! ధర్మరాజులు. ఇంకొకసంగతి జీవనా థుని జంపిన దెవ్వరు.

మొహి:—నారాయణచందునకు గాయములు దగిలిన మరు నటి యుదయమున నేను గంగాతీరమునకేగి, యొడలెరుంగక యందు బడియున్నయాతని బదిలముగ వైద్యాలయముం జేర్చితిని. అప్పుడతడు శరశ్చంద్రుని బిలువగోరెను. ఆతడు తన చరిత్రనంతయు శరశ్చంద్రున కెరింగించుననియు, దాన నా పేటిక నిగూఢచారిత్రము బయలువడు ననియు, శరశ్చంద్రుడంత నా పేటిక యధికారి నామమును జీవనాథుని వలన దెలిసికొననేగుననియు, దలచి మధ్యాహ్నము నేను ం బోవుచుంటిని. నేదలంచినట్లేయైనది. ఈమూడవయపరా ం ద్రునితో గలసి జీవనాథుని యింటికేగుచుండెను. నేను పి చందునుగూర్చి సానుకంపవచనముల శరశ్చంద్రునితో బల్ సి. ఆక డేమని దలంచెనో నేనెరుంగను గాని, యీాతడు దేగు చున్నది నాకు సన్నయొనర్చెను. అదినేగ్రహించి వారిని డించి వారు లోనజొచ్చినతరి, రివాల్వరుతో సిద్ధముగ బయ కిటికీకడ వేచియుండి సమయమునకాజీవనాథుని గాల్చివేసితిని. దాన మా నామము బైటబడక బోయెనుగాని, పాపము పండిన నది దాగునా? తుదకీరీతి నైనది.

న్యాయ:—మంచిపని చేసితివి. చాతుర్యహాకూటము. ఇంక లోపమేది?

అప్పటికే కాలాతీతమగుట దక్కిన సంగతుల మఱునాడు విచారింతుననుచు న్యాయాధిపతి యాసనమును విడచెను.



౧౫

మహానాశ్చర్యపడునట్లు ప్రేక్షకులచే న్యాయస్థానము నిండి పోయెను. మాధవ యపరాధ న్యాయాధికారి యాజ్ఞనొసంగి చెప్ప సాగెను—?

"నేను రంగమున జాలకాలమునుండి. ఒక చిన్న పెంకుటింటికి గృహ ముగలను. కాని, తదితరాస్తి యేమియును లేదు. నాపేరు షక్ కాసిమ్. మాధవి నివసించు యింటిపక్కనే మాయిల్లు. నాకు దలిదండ్రులు గాని, యితరబంధువులుగాని, యెవ్వరును లేరు. జూదముల జేర్చియు, దాగుబోతుల సహవాసము జేసియు నాపిత్రార్జిత ధనమంతయు వెచ్చించితిని. సాధారణముగా దినమంతయును జూదము నందే గడపుచుండెడివాడను. కాని, నాతలిదండ్రులు జీవించిన కాలమున నన్నొకమాత్రము విద్యావంతునిగ జేసియుండిరి. దాన నా యాస్తియంతయు జెల్లిపోయినను, యొందేని యుద్యోగ మొనరించుకొని నాయుదరపోషణ మొనరించుకొనజాలకపోదునా యని దలంచెడి వాడను. కాని యాస్తి పూర్తిగ జెల్లువరకును నేట్టి యుద్యోగము లభించినను లక్ష్యముంచ లేదు.

ఈమాధవి భర్త నామిత్రకోటిలోనొకడు. నాప్రక్క-యింటి కాపురస్థుడు. ఈమాధవి కాపురమున కరుదెంచిన నాటనుండియు నామె యన్న నాప్రాణముగ నుండెడిది. కాని, యానాపాపపుటాలో

చనతో నామె మనస్సెన్నడును బాధించియెఱుఁగను. ఆమె హిందూ వనితయు నేను మహమ్మదీయుఁడ నగుటయే యందులకు గల కారణము.

ఇట్లుండఁ గొంత కాలమునకామె భర్త దురదృష్టవశంబున యంత్ర మధ్యమున బడి మరణించెను. దాన నామె దిక్కుమాలిన పక్కియై పోయెను. అంత నదే సమయముగ నేనామెను జేరదీసి, నాకోర్కె నెఱింగించితిని. విధి లేకనో, లేక మోహవశంబుననోగాని, యామెను యద్దాని కనుమతించినది. అట్లు మాజీవితములు ప్రేమసాగరంబున బడి, పదివత్సరములపాటు ప్రేమమయసౌధాంతరముల విచ్చలవిడిగా విహరించినవి.

కాని, యప్పటికే నేను బూర్తిగ నిర్ధనుఁడ నైతిని. ఇంక నామెను గూడ బోషించుట బహుళతరకష్టమని దలంచితిని. అట్టని యీసంగతి నామె కెఱిఁగించిన యామె దుఃఖించుటకు దక్క జేయునదేమియును లేదు. తుదకెట్లో ధైర్యమూని, కఠినతవహించి, దైవమే యామెను రక్షింపగలఁడని యెంచి, యామెనొంటిగ విడచి యొక యర్ధరాత్రమున నీయూరు జేరుకొంటిని. కాని, యామెకు నాయీగడ దెలియకుండుటకై నేనిందు నానామమును మార్చి సంచరింపసాగితిని. దృఢకాయుఁడనగుటచేతను, గొంతవరకు విద్యావంతుఁడనగుటచేతను, నేనీశ్వరచంద్రు నాశ్రయించి కొంతకాలమునకీ పోలీసు యుద్యోగమున బ్రవేశించితిని. అధికారుల దయవలన గ్రమముగ నీయున్నత పదవికిగూడ రాఁగలిగితిని.

ఇట్లుండ గొంతకాలమునకీమాధవి యొకనాటి రేయి నను మా యింటికడ నేగలిసికొని, కొంతవరకునుదుఃఖించి, తానీయూరు వచ్చినకార్యమును, నను గనుంగొనిన తెఱంగును జెప్పి, యీయాపత్కాలమున దన్ను రక్షింపవలయునని వేడుకొనసాగెను. పూర్వ మోహమున నేనామెమాటను ద్రోసివేయజాలక, నాయుద్యోగమునకు భంగము గలుగకుండ వారికేహానియు రాకుండ రక్షింతునని వాగ్దానమొనర్చితిని. నాటినుండియు నేదినమున కాదినమే మాకు

వేసమున నామెను జూచుచు, పోలీసువారి ప్రయత్నముల వారి కెరిగింపుచు, దానికి బ్రతిక్రియల జేయించుచుంటిని. కాని, వారొనర్చు యొకార్యమునన్నైనను నేను బాగ్గానక పైనుండియే కథ నడిపించుచు వచ్చితిని. అందుచేతనే శరశ్చంద్రుని యాసీధివంకసహితము గన్నెత్తి జూడకుండ జేయగల్గితిని. తరువాతి మాచరిత్రనంతను నీ మొహిదీన్ చెప్పి జూయున్నాడు. మోహకూపమునబడి యిట్టి క్రౌర్యమునకు గడంగిన నన్నేవిధి శిక్షించినను సమ్మతమే. కాని, యొక్కమనవి. ఈసితియందున్న నెట్టిమానవుడైనను సాధారణము నీతోవనే పోవును, పిదప శాపమని విచారించిన లాభమేమి? ఎట్లయినను నేను మాత్రిము గృతఘ్నురాలననియు, స్వామిద్రోహిననియు నీసభ నొకట నిశ్చలముగా నొప్పుకొనుచున్నాడను విధివశమున కేమి చేయగలను? ఇంక నే జెప్పవలసిన దేమియును లేదు!

అనుచు నాతడు రెండుచేతుల ముఖమును గప్పికొని కొంత వడి దుఃఖించెను.

శరశ్చంద్రుడాతని నొకపరిగాంచి, తలవాల్చికొని యొక్క వేడినిట్టూర్పును మాత్రము విడచెను.

న్యాయాధిపతి యాతని నింకేమియు బ్రశ్నింపలేదు.

పిదప శరశ్చంద్రుడనుమతిని మధుసూదనుడును, తరువాత మాలతియు గ్రమముగా వారి చరిత్రలన్నిటిని సంపూర్ణముగా జెప్పి వైచిరి, అందీవరకు మన మెఱింగిన విషయములు దక్క విశేషాంశము లెవ్వియును లేవు.

కడపటి న్యాయాధిపతి యనుజ్ఞగొని యొకస్త్రీమూర్తి యాతని కెదుట నిలచి యిట్లని చెప్పదొడంగెను. ఆమె కాషాయాంబరధారిణి పరిపూర్ణయౌవన ప్రాదుర్భావమందున్నను యామె యంగములించుక వసివాడి విచారమనోభారములను సూచింపుచున్నవి. ఎట్లైన నామె సురూపసి. సుకుమారియని చెప్పక దప్పదు.

ఆమె యిట్లని చెప్పెను.

న్యాయాధిపా! ఎంతటి దుర్మార్గుడైనను. ఎంతటి కఠినకర్ముడైనను, ఎంతటి బుద్ధిహీనుడైనను, యీమీయెదుటనున్న యపరాధి యీజగత్సింహుని నాసోదరుడని చెప్పకొనక తప్పదు. ఈతడు నాకనిష్ఠమాతృపుత్రుడు. మాజననీ జనకులెట్లుబోయిరో, మాధవి మమ్మేరీతిని బెంచెనో, యామె యేర్పాటుల కతమున రఘునాథ పండితుని స్నేహభాగ్యమెట్లు గావించితినో, మున్నగు విషయములెల్ల నీతడీవరకే యెరిగించియున్నాడు. నేటివరకును, మిగిలిన కథాభాగమాతయు నీయపరాధుల మూలమున మీయెదుట దినసత్యస్వరూపమును బ్రకటించియే యున్నది. కాని యీనడుమనే చెప్పనవొక్క చిత్రకథ తమరాలింపవలయును. ఇంతవరకును నేను మృతినొందినదానిగనే లోకమెరుంగును. అట్టే మాధవికూడ ప్రకటించినది. కాని, దైవోపహతనగు నాకంతటి యదృష్టము లేకపోయినది.

ఇంతవరకును శృంఖలాబద్ధుడై యున్మత్తునివలె జూచుచున్న జగత్సింహుడు "మిహిర. అదిగో. మిహిరా! జీవించియేయుంటివా?" యనుచు బిగ్గరగ కేకలిడసాగెను. కాని శరచ్చంద్రుడాతని నేమియు బలుకవలదని వారించెను. ఆమె యిట్లు చెప్పసాగెను

రఘునాథుడు గతించునాడు శోకమున నేనును ధనాశచే నాయమ్మ—కాదు, మాధవియు నాతనియింట జేరుకొంటిమి. కాని, విధివశమున నాకామె కోర్కెలీడేర లేదు. తరువాత నాదాసి యొక్కతె నను మధుసూదనుని తుదముట్టింపవలయుననియు, దాన నాయాస్తి యంతయు నాకే జెందగలదనియు, నామూలమున దానేకచ్ఛత్రాధిపత్యమున మెలంగవచ్చుననియు దలంచి నన్నందుల కొడంబడుమని పలుగతుల నిర్బంధించినది కాని,- నేను నాజీవితమధ్యమున నట్టిపని కీయకొనననియు, వలయునేని నాకుగల ధనమునంతయు ధారవోసి విరాగినై యెందేని బోయెదననియు జెప్పితిని. తుద కయ్యదియే ఫలించినది.

ఒకనాటిరేయి నామె నన్నల్లారుముద్దుగ జేరదీసి, తొలుతనను

తుదముట్టించిగాని యీమె కార్యసాఫల్యము గాదని యెంచి గాబోలు, నాకు విషమిళిత క్షీరములొసంగినది. నేనంతసత్వ్చలమతినై, యెఱుంగజాలక మాతృప్రేమామృతమువోలె నాక్షీరపానమొనర్చి వైచితిని. ఇయ్యది రాత్రి రెండుగంటల సమయమున జరగినకథ. ఇంకనొక్క-యరగంటకాలమున కేమయ్యెనో నాకించుకంతయు జ్ఞప్తియుండు లేదు. పిదప నొకదినము గడిచెగాబోలు, మరుసటినాటి నడిరేయిని నాకించుక మెలకువరాగినుల విచ్చిజూడ నాప్రక్క-నిరువురు పూరుషులు గూర్చుని నాకు సపర్యలొనరించుచుండిరి. కొంతవడికి నాకు సంపూర్ణముగా మెలకువవచ్చినది. కాని, నడువనించుకయుశక్తి చాలదయ్యె. అంత నాయిరువురును నన్ను భుజములవైచుకొని యెటో నేగిరి.

పిదప సూర్యోదయమగుసరికి నాకదీనమున కించుక బలము గూడ గలిగెను. అంతఁబోలి నేయు పూరుషులిరువురును మరల నాకడ కరుదెంచి నాచరిత్రనంతను గుచ్చి గుచ్చి యడుగసాగిరి. నేనెట్లో వారికి నాకథనంతనుమార్చి చెప్పి, యానాటిమధ్యాహ్నము వారింట లేని సమయమున నాయిలు దాటి యీవలబడి, యీయోగిని వేసమును ధరించితిని. ఆపూరుషులుగూడ నాతో నంతగ సంబంధము లేకుంటచే గాబోలు నాకొరకై వెదకినట్లు గనబడెను.

పిదప నేనీవేసమున నేమాయింటికరిగి విచారింపనచటి మావారెల్లరును గలకత్తాకేగిరని యొక్కరి మూలమునను దెలియవచ్చినది. నేనించుకయు గారణమూహింపజాలక పోతిని.

మాయమ్మ మధుసూదనునిగూర్చి యోచించిన పద్ధతిని ముందుగ నాతనికెరిగించు దలంపున నాతనికై పోవ నాతడెందును గానరాడయ్యె. మాలతి యింటికడగూడ బరికించి యేరిజాడను బరికింపజాలకపోతిని. ఒకవేళ మాధవి తన కార్యక్రమమిందు సాగించిన ననుమానాస్పదయగునని యెంచి, మధుసూదనునిదనవలవైచుకొని, ప్రియవచనముల నాతనిగూడ గలకత్తాదీసికొనిపోయియుండుననిదలంచితిని అట్లే యైనది.

అంత నేనుగూడ నీయూరు జేరికొని వారికైవిచారింపగడంగితిని కొంతవరకును ప్రయోజన మేమియును లేకపోయినది.

పిదప నొకనాడట్లే యూరద్రిమ్మరుచుండ నీజగన్మోహనుడు మారువేసమున నాకంటబడియెను. ఆతడు నన్ను గుర్తించినట్లుగ దోచదుగాని, నేనాతని నానవాలిడి యతనివెనుక నేజని వారి గృహా మరసితిని. అయినను లోనికేగి నిజానిజముల గనుగొనుటెట్లు?

నేనుప్రాపయత్నమును విడక నట్లే వేచియుండ లోన నెవ్వరు ద్వారమును బంధింపకుండుటగాంచి యేమైనంగానిమ్మని లోన జొచ్చితిని. ఇంట నాకెవ్వరును గానవచ్చుటలేదు. పైయంతస్తునకేగి చూడ నందొకగదిలో జగన్మోహనుడును, మాధవియు దీవ్రముగ మధుసూదనుని విషయమై చర్చించుచుండుట నాకువినవచ్చెను. కాని, యంతలో నే జగన్మోహనుడనుమానించి. తలుపు దెరచినను నే బడింపనుంటచే నేరకెంగానరాక వడిననీ నాయిలువిడి వచ్చితిని.

మాలతిని నేనీవరకే రంగమున నెరింగియుంటిని. నేనిక్కడకు దెంచు సరికే యామెహత్య పలుగతుల నగరమంతను వ్యాపించెను నేనపుడే యామెపని మావారివలననే దీరియుండునని తలంచితిని కాని, యాహత్యాభియోగమున బనిచేయుచున్న నీశరశ్చంద్రునకద్దానిని నివేదింప దగిన నిదర్శనములు నాకు లభింపకుంటచే నట్లొనర్పలేదు. తుదకు వారి యీగతి దెలియగనే నరుగున శరశ్చంద్రునిజేరి, తక్కిన నాటకమీ విధముగా ముగింపజేసితిని.

నేనెరింగినంతవరకీ మధుసూదనుడు, హంతకుల మాయామాయాగుడిలో జిక్కుటంజేసి కాని, లేకున్న నమాయకుడని ధారాళముగా జెప్పగలను. తక్కిన సంగతులన్నియు న్యాయాధిపు లెరింగియే యుంటచే నింక జెప్పవలసిన దేమియును లేదు.

అనుచునామె వెనుక కరుగుచుండ “అయ్యయో! వృద్ధుడను, బాబూ! రక్షింపుడు—రక్షింపుడు. ప్రభువులు నాపై జాలివహించి యొక్కపరి నాతనయను జూడనిండు. ఈప్రజాసమూహమును దాటి

లోనికి రాజాలకున్నాను. ఈద్వారపాలకులు నను లోనికి విడువకున్నారు. రక్షింపు" మనుచు నొక పెద్ద యెలుఁగు సభ నంతయు నాక్రమించెను.

ఆతనిగాంచి కొందరున్మత్తుఁడని కసరి పొమ్మనుచుండిరి. కొందఱు వెనుకకు ద్రోసివైచుచుండిరి. ఆతఁడు దన యావచ్ఛక్తిని విని, యోగించి ముందునకు రాఁబ్రయత్నించుచుండెను.

ఇంతలో శరచ్చంద్రునాజ్ఞ నాబక్కముసలి విప్రుని రక్షకభటులు జనసంఘమునుండి తప్పించి భవనాంతరమున బ్రవేశపెట్టిరి.

నెఱసిన సుదీర్ఘగడ్డమును, ముడుతలుబడ్డ దేహమును వంగిన నడుమును జరాభారమును దెలుపుచుండ, పదములు తొట్రుపడ నావృద్ధుఁడు "అమ్మా! రా—రా—నాతల్లీ! మిహిరా! అమ్మా! రా"యనుచు, కరయుగ్మమునుజాచికొని, కనుల నశ్రువులు రాల నెట్టనటె నాయోగిని దెస బరువులిడుటజూచి జనులెల్లరును "ఈతఁడు వెఱ్ఱివాఁడు. నిత్యమును వీధుల దిమ్మరుచు పసిబిడ్డల నెత్తికొని పోవుచుండును. ఈతని నిందేల రానిచ్చిరి. కొట్టుడు—వెడలఁగొట్టుఁ" డనుచు గోలసేయ జొచ్చిరి.

మిహిర నాభ్రాంతుని గాంచి భయభ్రాంతయై, నిశ్చేష్టయై నిలచిపోయెను. శరచ్చంద్రుఁడాతని కెదురేగి యొకచేత నాతనిబట్టికొని "నిలువుము. ఓయీ! నీవెవ్వరు? నీకీమెతో నేమిపని?"యని యడిగెను.

దాని కాతఁడు "అయ్యో! ఈతనితో నాకేమిపనియా? ఈమె నాప్రియపుత్రిక మిహిర. ఏమి? చిట్టీ! మాట్లాడవేమి? నన్ను భయపడుచుంటివా? నీవు నాతనయవు కావా? రా—తల్లీ! యిటు—రా" యనుచు నామెదెస కేగుచుండెను.

మిహిర యించుక ధైర్యమూని "అయ్యా! నాతలిదండ్రులు గతించిరి. నీవెవ్వరో నేనెఱుఁగజాలకున్నాను"యని పలికెను.

వృద్ధుఁడు:—లేదు తల్లీ. లేదు. నీజనని గతించినమాట వాస్తవమే. కాని, కఠినుఁడగు యీనీజనకుఁడు మాత్రమింకను బ్రాణముల

విడువజాలకపోయెను. నీవు నన్ను సంపూర్ణముగా మరచినట్లున్నది, నేను ప్రేతమునుగాను. నాచరిత్రను జెప్పుదునువా? చెప్పిన నీవు నను గుర్తింపగలవు. ఆ! నిశ్చయముగా గుర్తింపగలవు. వినుము-

శరశ్చంద్రుడు మిహిరంగాంచి "అమ్మా! నీవీతని నెరుంగుదువా" యని యడిగెను.

మిహి:—ఏమో? చెప్పజాలను. ఆతనికథ యేమోవిననిమ్ము.

వృద్ధుడు:— మంచిది. రంగపురమున మాధవియను నామె యుంట విన్నాను, పరీక్షను విడచి, నీజననియు నేనును సముద్రస్నానమున కేగుట నీకు జ్ఞప్తియందున్నదా?

మిహిర:— అవును నాటినుండియు వారు గానవచ్చుట లేదు వారు మరణించిరని తలంచుచున్నాము.

వృద్ధుడు:— చెప్పుచున్నానుగదా. ఈపాపిష్ఠ మనుజునకు మృత్యువెట్లు వచ్చును తల్లీ! మేమిరువురమును సముద్రముపై గొంత దూరమేగ నెంచి యొకనావ నద్దెకుగొని చాలదూరమేగితిమి. అంత విధి వశమున నాయోడ మునుగజొచ్చెను. నీజనని యొక ప్రక్క మునింగిపోయెను. పురుషుడ నగుటచే నేనీదికొనుచు యామెకై వెనుకజొచ్చితిని. ఎంత వెదికినను ప్రయోజనమేమియు లేకపోయినది.

అంత గొంత సేపటికి నేనవశుడనైపోతిని. మేన చైతన్యముదప్పి పోయెను. మరల నాకు దెలివివచ్చి చూచునప్పటికొక యోడలో నొకయపరిచితుడు నాకుపచారమొనరించుచుండెను. ఆతని నా భార్య విషయమై యడుగ దనకాసంగతి దెలియదనియు, నీటిపై దేలుచు మునుగుచున్న నన్నాతడు దీసి యీయోడ యందిడెననియు, యీ యోడ యప్పుడు గలకత్తా కేగుచున్నదనియు నెరిగించెను. ఆమెకై నేను బలుగతుల నేడ్చి చేయునది లేక నీయూరు జేరితిని. ఏమిచేయును? నేను నిర్ధనుడను. రంగమైనను జేరి మీజాడగనుగొందమని ప్రతి దినమును రేవుకడజేరి యచటి ప్రయాణీకుల నన్ను రంగము జేర్చుడని వారికి నాపై దయగలుగుగతి నాదీనచారిత్రమును దెలుపుచు

పలువిధముల బ్రతిమాలఁజొచ్చితిని. కొంతకాలము వరకును నన్నొక యున్మత్తునిగ భావించి నాపలుకులాలించు వారే లేకపోయిరి.

ఒకనాఁడొక వర్తకుఁడు నా మొరలకు జాలిగదుర దనవెంట వచ్చినచో రంగమును జేర్తునని నమ్మించి నా కావ్యయమంతయు దానే భరించి, నను మోసగించి తుదకు బర్మాతేయాకుతోటలలో కూలీగా గొనిపోయెను. దైవగతికి జింతింపుచు జేయునది లేక నేనందు పదివత్సరములు పనిచేసితిని. కాని నాతలపులెల్ల నాలుబిడ్డలపైనుండుటచే నప్పటికి నేను సంపూర్ణోన్మాదుఁడనై పోతిని. ఇంక నేనందు సేవల కనుపయోగ్యుఁడనని యెంచి యచటి యధికారి నన్నొక సంఘముతో నిక్కడకు జేర్చెను. నేనుకూడ బిచ్చినై యీపురవీధుల ద్రిమ్మరుచుంటిని. పసిబిడ్డలగాంచిన నామిహిరయని యెంచి వారి నెత్తుకొనుచుంటిని. దాననే యీజనులిట్లనుచున్నారు. నేనిందు నీకుమారుని గాంచిన తోడనే యితనే నాతనయుఁడని యూహించి, నీకిష్టమైనను విని యానందమున లోనికిరానిట్టి యవస్థనొందితిని. తల్లీ! ఇంతేకదా నాచరిత్ర. నేనే నీజనకుఁడను. ఇంకనైన నన్ను విశ్వసించి గుర్తించితివా? రమ్ము తల్లీ! నన్నొకపరి నాలింగనమొనర్పుము.

అనుచు బాష్పాకులలోచనుఁడై యాతఁడామె దెస కరిగెను. మోగిని—కాదు, మిహిరయు నశ్రుజలముల నాతని పదప్రక్షాళన మొనర్చుచు, రుద్ధకంఠమున "తండ్రి"యని యాతని పాదయుగళిని బ్రాలెను.

సంకెలలనున్న జగత్సింహుఁడుగూడ దుఃఖోద్రేకమున "బాబా! నాదెసకొకపరి జూడుము. నీతనయుఁడను, క్రూరాత్ముఁడను, షరీఫ్ నిందేయున్నా"డనని యఱచెను.

వృద్ధుఁడు వెనుదిరిగిచూచెను. తోడనే యాతఁడు పరుగున నాతనికడకేగి "అయ్యో! నీవెవ్వరో జగత్సింహుఁడవని దలచితిని. బాబా! నీకే యిట్టి గతిపట్టెనా?" యని నాతని నాలింగనమొనర్చుకొని శోకింప నారంభించెను.

సభవారెల్ల రత్నాశ్చర్య మగ్నమానసులై యీ విచిత్ర ప్రదర్శనమును గాంచుచుండిరి.

విచారణయంతయు బరిపూర్తి యయ్యెను. శరచ్చంద్రుని హస్తము దలచే జగత్సింహ మొహిదీనులకు మరణదండన దప్పి "చావుదప్పి కన్ను లొట్టవోయె" నన్నట్లు యావజ్జీవ ద్వీపాంతరవాస శిక్ష విధింపబడెను—

మదన్‌సింగు రూపాంతరుడగు షేక్‌కాశిమ్‌నకు దగుశిక్షగా కారాగారవాసము ప్రాప్తించెను.

శరచ్చంద్రుం డొసంగిన రత్నపేటికను న్యాయాధిపతి మధుసూదనుని కైవసమొనరించి యాతని విడిచివైచెను. ఎల్లరును సంతసమున సభ జాలించి చనిరి.



## చతుర్థ ఖండము.

### సంపూర్ణము.



# ఉపసంహారము.



నారాయణచంద్రుడు మేడపై నొకకుర్చీలో గూర్చుని దుర్గతో సవ్యాజానురాగమున బ్రసంగించుచుండెను. ఇంతలో శరశ్చంద్ర మధుసూదనులును, నిఖుపురు స్త్రీయును వారియెదుట సాక్షాత్కరించిరి. చంద్రు వారికి సగౌరవముగా స్వాగతసత్కారము లొనర్చెను. వారి రాక గాంచి దుర్గ యవ్వలి గదిలోనికేగెను. శరశ్చంద్రుడాతని గాంచి "నన్ను నెఱుంగుదువా?" యని ప్రశ్నించెను.

నారాయణచంద్రుడు వారి ముఖములు బరీక్షాదృష్టి జూచుచు వారెవ్వరిని దానెఱుంగనని చెప్పెను.

శరశ్చంద్రుడాశ్చర్యమును జూపుచు "ఎఱుగవా? ఒక్కరినైన నెఱుంగవా? నిజసత్యమాడుచున్నావు" అని పలికెను.

నారా:—ఎఱుగను. నేనెవ్వరి నెఱుంగను. తెలియక యసత్యమేల నాడవలయును?

శర:—సరియే—మాలతీ హత్యాభియోగము నిన్నటితో ముగిసినది. చంద్రు ససంభ్రమముగ "ఏమీ? అభియోగము ముగిసినదా? హంతకులెవ్వరు?" అని యడిగెను.

శర:—మాలతి హంతకులెవ్వరీ లోకమున లేరు.

నారా:—ఏమీ? వారుకూడా మరణించిరా?

శర:—పిచ్చివాడ! నాయభిప్రాయమది కాదు, మాలతిని జంపిన వారెవ్వరును లేరు. ఆమె సజీవియే యైనచో.........

నారా:—ఏమీ? మీరిట్లు వ్యత్యాసముగా బల్కుచుంటిరేల? చచ్చిన మాలతి—నాకనుల యెదుటనే మరణించిన మాలతి, సజీవి యెట్లు కాగలదు? మీరీకల్పితగాధ నేల వచింపబూనుకొంటిరి?

ఎల్లరు నాతని పలుకులాలించి నవ్వుకొనుచుండిరి.

శర:—అట్లు కాదు. ఆమె జీవించియే యున్నదో మరల దమ రనుగ్రహింతురా?

నారాయణచంద్ర పలుగతుల నాలోచింపసాగెను. ఆతడు జాగ్రదావస్థనందుచుండెను. మాలతి ప్రేతరూపమాతని యెదుట నిలచి నగుమొగంబున దన్ను ప్రణయభిక్ష నర్థింపుచున్నది. ఆతని దన భార్యనంక దీనముగా జూచుచున్నాడు. ఆమెయు "మీరు కీడు యొనరించినను నాకు సమ్మతమే" యనురీతి సకరుణముగా దనవంక జూచుచున్నది. ఆతడు మరల నాప్రేతమూర్తిని బిలకించెను. ఆమె తన పాదములు కౌగిలించి బట్టి, తన శిరోపరిభాగంబున బెట్టుకొని "ప్రాణపదమా! నన్ను మన్నించి యనుగ్రహింపరా?" యని దీనాలాపములాడుచున్నది. ఎట్లో యీపలుకులధ్వని యాతని వీనుల జేరినది. అంత నాతనికి మరల జాగ్రదావస్థ ప్రాప్తించినది. నిశ్చయముగనే తన పాదయుగళ మొక సుందరి శిరోపరిభాగంబుననున్నది. ఆశ్చర్యభయ, సంభ్రమంబులొక్కుమ్మడి గ్రమ్ముకొన "ఎవరు? ఎవరు? ఆ! విడువుము-విడువు"మనుచు నాతడు దన యాసనమునుండి లేవబోయెను. శరచ్చంద్రుడాతని బట్టుకొని "చందుగారూ! భయపడకుడు. ఈమె ప్రేతముగాదు. పిశాచముగాదు. ఈమె మీప్రేమమయి—మాలతి—మాలతి మరణింపలేదు."యనుచు నాతడాతని స్వస్థచిత్తునిగావించి సవిస్తరముగా నెల్లకథ నెరిగించెను. అంత నాతడు మిహిరా మధుసూదనుల బరిచయముగూడ నాతనికి గలిగించెను.

చందు మేల్కాంచెను. తన గత చారిత్రమంతయు నాతనికనుల యెదుట నొక్కత్రుటికాలము మెరసిపోయెను. భావాతీతమగు సుఖమయసాగరంబున బడి యాతడు గొట్టుకొనుచుండెను.

ఇంతలో మధుసూదనుడాతని కరమును దన కరమున గీలించి "మిత్రమా! నీపరిచయమున నేకృతార్థుడనైతిని. ఈమాలతి నిర్మల ప్రేమ వల్లిక నీయవలంబనమును గోరుచున్నది. ఇది లోకసమ్మతము ఈకుసుమము దేవతాపూజ్యము. ఈ తేజోమయ వినిర్మల మణిని

దుర్గ పరుగుపరుగునవచ్చి మాలతిని దన బాహుమధ్యమున బంధించి వైచెను. ఆవిమలవర్తిని, యాయుదార సుగుణాలవాల, యాదుర్గ చేష్టలగాంచుచు, నారాయణచంద్రుఁడధికాశ్చర్యమున మునింగిపోయెనన మన కబ్బురము గానేరదు.

భర్తృసుఖైక మాత్రజీవినులగు పతివ్రతాశిరోమణుల కింత కన్నను బరమావధి యేముండును.

దుర్గామాలతీసహచరుండై నారాయణచంద్రుఁడు సరదానంద వార్ధిన్దోలలాడుచు, సద్గుణగరిష్ఠుండని పేరుగాంచెను.

అనురాగోత్సాహములు నిండిన మనుకొర్కకెనరి "నాథా! నేను చేరితమునుగానుసుశి" యను మాలతీపలుకులు కర్ణరసాయనములుగా దుర్గానారాయణచంద్రుల హాస్యధ్వనితోఁగూడ సమకూడినవచ్చుచుండును.

ఇక గొలదికాలమునకే పాపము! వృద్ధుండగు గోపాల్ చంద్రుఁడు పరమపదించెను.

ఆవత్సరమే సర్వోత్సవమున శుభదినంబున లలితాననకుమారులకు వైభవోపేతముగా శరచ్చంద్రుఁడు కల్యాణ మొనరించెను. ప్రథమ శుభముహూర్తమునకు నారాయణచంద్రుఁడు మాలతీద్వితీయుఁడై జని మధుసూదనదత్తమగు నయ్యమూల్య రత్నపేటికను వధూవరులకు సమర్పించి విఖ్యాతిగాంచెను.

మిహిర వృద్ధజనకునితోఁగూడ, మధుసూదనుఁడెంత ప్రార్థించినను వినక యోగినీరూపమున నే తీర్థయాత్రల సేవించుకొనుచు, లోక సంచారమునకై వెడలిపోయెను.

త్వరలోనే శరచ్చంద్రుఁడుద్యోగమును జాలించుకొని లలితా ప్రియతనూజుఁడగు విజయకుమారునితోఁ బాటలాడుకొనుచు నిజ భవనమున నే సంతసంబున దినముల వెచ్చించుచుండెను.

రత్నపేటిక, సమాప్తము.

ఓం

శాంతిః శాంతిః శాంతిః